ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# గర్గ భాగవతము - కృష్ణ కథామృతము

- డా॥ జంధ్యాల సుమన్‌బాబు

# గర్గ భాగవతము
# కృష్ణ కథామృతము



యాదవ వంశ పురోహితుడైన "గర్గ మహర్షి" రచించిన
"గర్గ సంహిత"కు తెనుగుసేత

డాక్టర్ జంధ్యాల సుమన్‌బాబు, ఎం.ఏ., పిహెచ్.డి.

# గర్గ భాగవతము
# కృష్ణ కథామృతము

యదువంశపురోహితుడు గర్గమహర్షి సంస్కృతములో రచించిన

గర్గసంహితకు తెనుగుసేత




డాక్టర్ జంధ్యాల సుమన్‌బాబు, ఎం.ఏ., పి.హెచ్.డి.

ఆంధ్రోపన్యాసకుడు

పీఠికాపురాధీశ్వర ప్రభుత్వ కళాశాల, కాకినాడ

# అమృత బిందువులు

# శ్రీ కృష్ణాష్టకము

1. వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనమ్
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్!

2. అతసీపుష్పసంకాశం హారనూపుర శోభితమ్
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్!

3. మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్
బర్హిపింఛావచూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్!

4. ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీలజీమూత సన్నిభమ్
యాదవానాంశిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్!

5. గోపికానాంకుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసమ్
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్!

6. రుక్మిణీకేళిసంయుక్తం పీతాంబర సుశోభితమ్
అవాప్తతులసీగంధం కృష్ణం వందే జగద్గురుమ్!

7. కుటిలాలకసంయుక్తం పూర్ణచంద్రనిభాననమ్
విలస త్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్!

8. శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్!

# గర్గ భాగవతము - కృష్ణ కథామృతము

**యథా హి రత్నై: నవభిర్విరాజతే**

**దేవాంగుళౌ తప్త సువర్ణముద్రికా**

**తథా చతుర్వర్గ ఫలప్రదే విధౌ**

**సర్గై: విసర్గై: ముని "గర్గ సంహితా!"**

***శ్రీకృష్ణపరమాత్మని వ్రేలికున్న బంగారపు ఉంగరములోని నవరత్నములవలె గర్గమహర్షి రచించిన ఈ గర్గ సంహిత నవఖండములతో విరాజిల్లుతున్నది. ఇది చతుర్వర్గ ఫల ప్రదాయకమైనది. - నారదమహర్షి***

కైవల్యప్రదమైన కైలాసపర్వతముపై పరమశివుడు కొలువుదీరి ఉన్నప్పుడు పార్వతి వచ్చి ప్రణామము చేసి "ప్రభూ! పూర్వము మీరు విష్ణుసహస్రనామములను తెలుపగా విని ఆనందించాను. ఇప్పుడు శ్రీకృష్ణపరమాత్మని దివ్య లీలావైభవమును దయతో తెలుపవలసినది" అని వేడుకున్నది. అందుకు ఈశ్వరుడు సంతసించి ఇలా పలుక సాగాడు - దేవీ! రాధామనోహరుడైన శ్రీకృష్ణుని దివ్య చరిత్ర గర్గ సంహితలో ఉన్నది. పూర్వము శ్రీకృష్ణపరమాత్మ తన దివ్యగాథను ప్రకటింపదలచి రాధాదేవికి చెప్పగా, అది విని ఆదిశేషుడు బ్రహ్మకు, బ్రహ్మ ధర్మువునకు, ధర్మువు తన కుమారుడైన నరునకు, నరుడు తన సోదరుడైన నారాయణునకు, నారాయణుడు నారదమహర్షికి తెలియజేశారు.

నారదమహర్షి ఒకనాడు గర్గాచలముపై తపము గావించుకొనే గర్గమహర్షి కడకు వెళ్ళి " ఓమహర్షీ ! నేను నీకు సంక్షిప్తంగా శ్రీకృష్ణ పరమాత్మని గాథను తెలియ పరుస్తాను. నీవు ఆ వృత్తాంతము నంతటినీ విశదంగా గ్రంథస్థము గావించు. నేను చెప్పిన మీదటనే వ్యాసమహర్షి మహాభాగవత రచన గావించాడు. నేను నీ గ్రంథమును భక్తాగ్రగణ్యుడైన బహుళాశ్వునకు వినిపించి ప్రశస్తికి తీసుకు వస్తాను" అన్నాడు. అందుకు గర్గమహర్షి ఆనందముతో సమ్మతించాడు.

మయావై సంహితాయాంచ కథా: కృష్ణస్య వర్ణితా:
పరిపూర్ణ తమస్యాపి యథాదృష్టా తథా(శుతా:

నేను స్వయంగా చూచినవి, ఆప్త జనులవలన విన్నవి అయిన చిత్రవిచిత్రములైన శ్రీకృష్ణపరమాత్ముని లీలలను "గర్గసంహిత"గా రచించాను - అని గర్గమహర్షి అభిభాషణము. గర్గమహర్షి పన్నెండు వేల శ్లోకములతో రచించిన ఈ సంహితను నారదమహర్షి బహుళాశ్వునకు చెప్తున్నట్లుగా రూపొందించి తన వినయమును నిరూపించుకున్నాడు.

**శ్రవణ ఫలము :**

ఈగర్గ సంహితను శ్రవణం చేయటం వల్ల విశిష్టమైన ఫలితం లభిస్తుంది. పూర్వం మధురానగరాన్ని వజ్ర పుత్రుడు, ఉదాత్త చరితుడు అయిన ప్రతిబాహుడనే రాజు పరిపాలించేవాడు. అతని భార్య మాలిని. వారికి సకల సంపదలు ఉన్నప్పటికీ సంతతిలేని కారణంగా మనశ్శాంతి లేకపోయింది. ఒకనాడు వారి అంత:పురానికి శాండిల్యమహాముని విచ్చేశాడు. సందర్భవశాత్తు మాలినీ ప్రతిబాహుల మనోవ్యథను తెలిసికొని దానికి నివారణోపాయంగా "గర్గసంహిత"ను శ్రవణం చేయుమని మహాముని వారికి హితవు చెప్పాడు. మహారాజు శాండిల్యమునితో "మహాత్మా! సకల శుభప్రదమైన ఆ గర్గసంహితను దయతో మీరే మాకు వినిపించవలసినది" అని కోరాడు.

శాండిల్యుడందుకు అంగీకరించి యమునానదీ తీరంలో గర్గసంహిత ప్రవచనమును ఆరంభించాడు. ఈ సంగతి తెలిసికొని మధురాపురవాసులందరూ అక్కడకు రాసాగారు. భక్తిశ్రద్ధలతో తొమ్మిది రోజులు శ్రవణం చేయగా ప్రసన్నుడైన శ్రీకృష్ణపరమాత్ముడు రాధాసమేతంగా ప్రత్యక్షమై వారిని ఆశీర్వదించాడు. ఫలితంగా ఒక శుభముహూర్తంలో మాలిని గర్భవతియై సుబాహుడనే కుమారుని కన్నది. ప్రతిబాహు మహారాజు పరమానందమును పొందాడు.

ఈ విషయమును విని పార్వతి "నాథా! కల్యాణాత్మకమైన కృష్ణ కథను వినవలెనని ఆసక్తిగా ఉన్నది. నాకు దయతో తెలుపు"మని కోరింది. అందుకు పరమశివుడు ప్రసన్నుడై కృష్ణకథామృతముతో నిండిన ఆ గర్గసంహిత (భాగవతము)ను వినిపించి "పార్వతీ! నీవు కలియుగంలో గంగాతీరంలోని బిల్వకేశవనంలో సిద్ధపీఠంలో శ్రీరూపిణిగా అవతరించి గర్గ సంహితను మరల మరల వినగలవు" అనిపలికాడు.

# 1. గోలోక ఖండము

## గర్గ మహర్షి:

ఒక పర్యాయం నైమిశారణ్యంలో శౌనకాదిమహర్షులు భగవత్కథా శ్రవణం చేస్తున్న సమయంలో అక్కడకు తేజస్వి, జ్ఞాన శిరోమణి, యోగశాస్త్రవిశారదుడు అయిన గర్గమహర్షి విచ్చేశాడు. ఆయనను చూచి అచటి ఋషులంతా సాదరంగా ఆహ్వానించారు. అనంతరం శౌనకుడు గర్గమహర్షితో "ఆర్యా! గృహస్థులకు శాంతిని ప్రసాదించే సాధు పురుషుల జీవితం ధన్యంగదా. మానవుల అజ్ఞానాంధకారాన్ని మహాత్ములే కాని మార్తాండుడు కూడా తొలగింపలేడు. మహాత్మా! మీరాక వల్ల మేము ధన్యులమయ్యాము. భగవంతుని అవతరణము ఎన్ని విధాలుగా ఉంటుందో తెలిసికొనవలెనని మాకు జిజ్ఞాసగా ఉన్నది. తమరు దయతో వివరింప వలసినది" అన్నాడు.

అప్పుడు గర్గమహర్షి "భగవంతుని గుణవర్ణనమునకు సంబంధించిన మీ ప్రశ్న ఎంతో ఉత్తమమయింది. ఇటువంటి పరమపావనమైన విషయములను శ్రవణం చేసినంత మాత్రం చేతనే మానవుడు పాపవిదూరుడు కాగలడు. ఇందుకు శ్రీకృష్ణ పరమాత్ముని గాథయే విశిష్టమైన ఉదాహరణము.

శ్రీకృష్ణుడు ద్వారకలో నివసిస్తున్న రోజులలో మిథిలానగరాన్ని బహుళాశ్వుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఆయన కృష్ణ భక్తుడు, ఉత్తమ చరితుడు. ఒకరోజున నారదమహర్షి ఆకాశమార్గంలో పయనించి మిథిలకు చేరుకున్నాడు. బహుళాశ్వుడు పరమానందభరితుడై మహర్షిని పూజించి "మహాత్మా! ఆదిమధ్యాంతరహితుడు, ప్రకృతి కంటె భిన్నుడు, సర్వాంతర్యామి అయిన భగవంతుడు శరీరధారిగా ఎలా అవతరిస్తాడు? దయతో విశదీకరించండి" అని అడిగాడు.

## నారద బహుళాశ్వ సంవాదము:

నారదమహర్షి బహుళాశ్వునితో "మహారాజా ! గోసాధు దేవతా బ్రాహ్మణ వేద రక్షణము కోసమై సాక్షాత్తు శ్రీహరి తన సంకల్పానుగుణంగా తానే శరీరధారణ చేస్తాడు. తన అద్భుత లీలాశక్తివల్ల తాను దేహధారియై కూడా సర్వత్ర వ్యాపకుడై ఉంటాడు. ఆయన శరీరము మృణ్మయము కాక చిన్మయమై ఉంటుంది. ఏవిధంగా

నటుడు తన మాయలో తాను పడక ఎదుటివారిని మాయలో పడవేస్తాడో అదేవిధంగా పరమాత్మ తానెంత మాత్రము మాయకు వశంకాక జగత్తు నంతటినీ మాయా మోహితం చేస్తాడు'' అన్నాడు. అప్పుడు బహుళాశ్వుడు "మహర్షీ! సాధుసంరక్షణార్థము శ్రీమహావిష్ణువు ఎన్నివిధాలుగా అవతరించాడు?'' అని అడిగినప్పుడు నారదుడిలా చెప్పసాగాడు -

అంశాంశోంశ స్తథావేశః కలాపూర్ణః ప్రకథ్యతే
వ్యాసాద్యైశ్చ స్మృతః షష్ఠః పరిపూర్ణతమః స్వయం
అంశాంశస్తు మరీచ్యాది రంశా బ్రహ్మాదయస్తథా
కలాః కపిల కూర్మాద్యా ఆవేశా భార్గవాదయః
పూర్ణో నృసింహో రామశ్చ శ్వేతద్వీపాధిపో హరిః
వైకుంఠోపి తథా యజ్ఞో నరనారాయణః స్మృతః
పరిపూర్ణతమః సాక్షాత్ శ్రీకృష్ణో భగవాన్ స్వయం
అసంఖ్య బ్రహ్మాండ పతిః గోలోకే ధామ్ని రాజతే!

"ఓ రాజా భగవంతుని అవతారములు అంశాంశ, అంశ, ఆవేశ, కళా, పూర్ణ, పరిపూర్ణతమ అని ఆరు విధములని వ్యాసాదిమహర్షులు తెలియజేశారు. మరీచి మున్నగువారు అంశాంశ అవతారములు. బ్రహ్మాదులు అంశావతారములు. పరశురామాదులు ఆవేశావతారములు. కపిల, కూర్మాదులు కళావతారములు. నృసింహ, రామ, శ్వేతద్వీపాధిపతి హరి, వైకుంఠయజ్ఞ, నరనారాయణులు పూర్ణావతారములు. శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగా, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులుగా చతుర్వ్యూహములుగా ఏర్పడి నవరసాభివ్యక్తిని నిరూపించి బలపరాక్రమములను ప్రదర్శించినప్పుడు అవి పూర్ణావతారములు. "యస్మిన్ సర్వాణి తేజాంసి విలీనయంతే స్వతేజసి, తం వదంతి పరే సాక్షాత్ పరిపూర్ణతమం స్వయం'' ఇక ఒక తేజస్సులో సకల దైవముల తేజస్సులు విలీనములైతే అది పరిపూర్ణావతారము. అవతారపురుషుడు శరీరధారియైనా మానవుల మనస్సులకు పరమప్రియమైన రూపంగా భాసిస్తాడు. ఇదే సాక్షాత్తు శ్రీకృష్ణుని అవతారము! ఆస్వామి ఒక లక్ష్యమునకై అవతరించి అనేకానేక కార్యములు నిర్వహించాడు. అఖిలాండకోటి బ్రహ్మాండములకు అధిపతియైన శ్రీకృష్ణపరమాత్ముడు గోలోకధామంలో విలసిల్లుతుంటాడు.''

నారదుని ఈ మాటలు విని బహుళాశ్వుని హృదయం పులకించిపోయింది. ఆతడు భగవత్ ప్రేమతో వివశుడై ఆనందబాష్పాలు స్రవిస్తుండగా "ఓ మహర్షీ సర్వవ్యాపకుడు, చిన్మయుడు అయిన శ్రీకృష్ణభగవానుడు గోలోకధామం విడిచిపెట్టి భరతవర్షంలో ద్వారకాపురిలో విరాజిల్లటానికి కారణం ఏమిటి? ఆ గోలోకధామం ఎలా ఉంటుంది? భక్తిరసార్ద్ర చిత్తుడనై నేను శ్రీకృష్ణుని దాసునకు దాసానుదాసునిగా ఉండేది ఎప్పుడు? దేవతలకు కూడా దుర్లభమైన కృష్ణపరమాత్ముని దర్శనం నాకెప్పుడు కలుగుతుంది?" అని అడిగాడు. అప్పుడు నారదుడు - "ఓ రాజా! నీవు ధన్యుడవు. నీవు శ్రీకృష్ణునకు ఇష్టుడవు, భక్తుడవు. భక్తవత్సలుడైన ఆ భగవానుడు నీకు దర్శన మివ్వటానికై ఇక్కడకు వస్తాడు. పరమాత్ముడు ద్వారకలో నివసిస్తున్నా నిన్నూ, శ్రుతదేవుణ్ణీ గుర్తుచేసుకుంటూనే ఉన్నాడు. ఆహా! ఈలోకంలో భగవంతుణ్ణి స్మరించే భక్తుల కెంత అదృష్టము!" అంటూ ఇలా పలుకసాగాడు -

## బ్రహ్మాదుల గోలోకగమనము:

ఈ శ్వేతవరాహకల్పంలో పూర్వం దైత్యులు, దానవులు, అసుర స్వభావం గల మానవులు భూమినంతటిని ఆక్రమించారు. వారి దురాగతాలకు అంతులేకపోయింది. అప్పుడు భూదేవి గోరూపం ధరించి బ్రహ్మదగ్గరకు వెళ్ళి దుఃఖోద్వేగంతో తన గోడును విన్నవించుకున్నది. విధాత ఆమెను ఊరడించి సకలదేవతా సహితుడై వైకుంఠానికి వెళ్ళి విష్ణుమూర్తిని సందర్శించి విషయం వివరించాడు. అప్పుడు విష్ణువు వారితో "అనేక బ్రహ్మాండాలకు అధిపతియైన సాక్షాత్తు నిర్గుణ పరబ్రహ్మయే శ్రీకృష్ణుడుగా గోలోకధామంలో విరాజిల్లుతున్నాడు! ఆ ఉజ్జ్వల ధామంలోకి వెళ్ళి ఆయనను ప్రార్థించండి అన్నాడు. అప్పుడు విధాత తండ్రీ తమకంటె వేరు దైవాన్ని మేము ఎరుగము. ఆ పరబ్రహ్మ నివసించే గోలోకధామాన్ని మీరు మాతో వచ్చి చూపవలసినదని వేడుకున్నాడు. అంతట విష్ణుమూర్తి వారితో బయలుదేరాడు.

త్రివిక్రమావతారంలో ఆ పరమాత్మ కాలిగోరు తగిలి బ్రహ్మాండ కర్పరం చిట్లి బ్రహ్మద్రవంగా (అక్షయగంగ) ఏర్పడింది. ఆ మార్గాన్ననుసరించి వారు పైకి చేరుకొని బ్రహ్మాండం ఒక పుచ్చకాయ మాదిరిగా ఉండటం చూచి ఆశ్చర్యపడ్డారు. అక్కడ ప్రవహించే బ్రహ్మద్రవంలో అటువంటి అనేక బ్రహ్మాండములు ఫలములవలె దొర్లుతూ ఉండటం చూచి దిగ్భ్రాంతి చెందారు. అక్కడ నుంచి కోటియోజనాల

దూరం ఊర్ధ్వముఖంగా పయనించారు. అక్కడ రత్ననిర్మితములైన ఎనిమిది పట్టణాలు, దేవతలు విహరించే విరజానది కనిపించాయి. వారికి అక్కడ అనంతకోటి సూర్యుల తేజస్సు కనిపించేసరికి ఆశ్చర్యచకితులయ్యారు. క్రమంగా వారికి ఆకాంతి లోపల ఒక శాంతి ధామం కనిపించింది. అందులో స్ఫటిక కాంతులతో ప్రకాశిస్తున్న ఆదిశేషుడు కనిపించాడు. ఆయన శిరస్సుపై విరాజిల్లుతున్నది గోలోకధామం! అక్కడంతా పరబ్రహ్మ తత్త్వమే! మాయాదేవికి అక్కడ స్థానమేలేదు.

అక్కడ మనోహర రూపలావణ్య శాలినులు, శ్యామసుందర విగ్రహులు అయిన కృష్ణ పార్శ్వజులు వీరిని అడ్డగించారు. అప్పుడు తాము బ్రహ్మ విష్ణు మహేశ్వరులమని, శ్రీకృష్ణ పరమాత్మ సందర్శనార్థమై వచ్చామని చెప్పగా వారు అంతఃపురం లోపలకు వెళ్ళి చెప్పారు. అప్పుడు లోపల నుంచి శతచంద్రానన అనే చెలికత్తెవచ్చింది. ఆమె పట్టుపీతాంబరం ధరించి, ఒక చేత్తో బెత్తం పట్టుకొని "మీరు ఏ బ్రహ్మాండానికి సంబంధించిన దేవతలు?" అని అడిగింది. అప్పుడు త్రిమూర్తులు ఆశ్చర్యపడి, బ్రహ్మాండము లింకా ఉన్నాయా? అనుకొని ఆమెతో "ఓ శుభాననా! మాకు ఇన్ని బ్రహ్మాండములున్నాయని తెలియదు. మేమున్నది ఒక్కటే బ్రహ్మాండము అనుకుంటున్నా" మని అన్నారు. అప్పుడు శతచంద్రానన వారితో "ఇక్కడ విరజానదిలోనే అనేక బ్రహ్మాండములు అటు ఇటు దొర్లుతున్నాయి. ప్రతి బ్రహ్మాండములోను మీవంటి బ్రహ్మ విష్ణు మహేశ్వరులున్నారు. మీరెప్పుడూ ఇక్కడకు రాలేదా? ఈ విషయమే మీకు తెలియదా?" అని అడిగింది. అప్పుడు విష్ణుమూర్తి "అమ్మా! ఏ బ్రహ్మాండములో సనాతనుడైన పృశ్నిగర్భుడు అవతరించాడో, ఎక్కడ త్రివిక్రముని కాలివ్రేలి గోరుతో బ్రహ్మాండము బ్రద్దలయినదో ఆ బ్రహ్మాండములోని వారము మేము" అని చెప్పగా ఆమె విష్ణుమూర్తిని అభినందన పూర్వకంగా చూచి వారి ప్రవేశానికి అనుమతించింది.

అప్పుడు దేవతలందరూ దివ్యవైభవంతో విరాజిల్లుతున్న గోలోకధామాన్ని సందర్శింపసాగారు. అక్కడ గోవర్ధనమనే గిరిరాజము గోవుల సమూహంతో విరాజిల్లుతున్నది. గోపికలంతా వసంతోత్సవం జరుపుకుంటున్నారు. ఒక వంక యమునా నది, దానికి ఇరువైపుల దివ్య సౌధాలు ఉన్నాయి. అక్కడ కల్పవృక్షాలతో, కల్పలతలతో బృందావనం విలసిల్లుతున్నది.

ఈవిధంగా గోవుల్ని, గోపాల గణాన్ని, శ్యామసుందర విగ్రహాలను చూస్తూ వెళ్ళగా ఒక పెద్ద తేజస్సు కనిపించింది. క్రమంగా అందులో సహస్రదళ పద్మం, అందులో షోడశదళ పద్మం, అందులో అష్టదళపద్మం, ఆ పద్మం మీద రత్నసింహాసనం కనిపించాయి. ఆ సింహాసనం మీద శ్రీకృష్ణపరమాత్ముడు రాధాసమేతుడై ఆసీనుడైయున్నాడు. వారి కిరువైపులా చెలికత్తెలు వింజామరలు వీస్తున్నారు. ఆస్వామి శ్యామ సుందరుడై, పద్మపత్రాక్షుడై, వనమాలియై, శ్రీవత్సలాంఛనుడై శోభిస్తున్నాడు. దివ్యమంగళస్వరూపులైన ఆరాధాకృష్ణులను బ్రహ్మాది దేవతలు సందర్శించి బ్రహ్మానందం పొందారు.

ఆ శుభ సమయంలో ఒక్కొక్క అవతారము వచ్చి శ్రీకృష్ణపరమాత్మునిలో విలీనమయింది. శంఖ చక్రాదులను ధరించిన చతుర్భుజుడైన శ్రీ మహావిష్ణువు వచ్చి శ్రీకృష్ణునిలో లీనమయ్యాడు. తరువాత పరాక్రమోపేతుడైన నృసింహస్వామి వచ్చి శ్రీకృష్ణ భగవానునిలో ఐక్యమయ్యాడు. అనంతరం కోదండధారి యైన శ్రీరామచంద్రమూర్తి సోదర సమేతంగా వానర సమూహ సహితంగా వచ్చి శ్రీకృష్ణ విగ్రహంలో తాదాత్మ్యం చెందాడు. యజ్ఞుడనే అవతారమూర్తి దక్షిణాదేవితో వచ్చి ఆస్వామిలో కలిశాడు. నరనారాయణులు మహర్షి గణంతో వచ్చి కృష్ణునిలో విలీనమయ్యారు. దేవగణం వచ్చి స్వామిలో తదేకమయింది. ఈ పరమాద్భుత దృశ్యం చూస్తున్న దేవతలందరూ విస్మితులై శ్రీకృష్ణ పరమాత్మున్ణి అనేక విధాలుగా స్తుతించారు.

**అభయ ప్రదానము :**

అప్పుడు గోకులాధిపతియైన కృష్ణపరమాత్ముడు “ఓ దేవతలారా! మీరందరూ మీమీ అంశలతో బృందావనంలో జన్మించండి. నేను యదువంశంలో అవతరించి భూభారం తొలగిస్తాను. వేదములు నా వాక్కు, విప్రులు నా ముఖం, గోవులు నా శరీరం, దేవతలంతా నా శరీర అవయవాలు. సాధుపురుషులు నా హృదయంలో నివసించే నా ప్రాణములే. ఎప్పుడెప్పుడు దుర్జనులవల్ల సాధుపురుషులకు బాధకలుగుతుందో, ధర్మానికి, యజ్ఞయాగాదులకు, దయకు ఆఘాతం కలుగుతుందో అప్పుడు నేను స్వయంగా భూతలంపై అవతరిస్తాను.” అని అభయమిచ్చాడు.

పరమాత్మ చెంతనే ఉన్న రాధ భగవానుడు తనను విడిచి వెళతాడనే

విషయం వినగానే హతాశురాలయింది. అప్పుడు పరమాత్ముడామెతో "మనము అద్వైత మూర్తులము కదా. అటువంటప్పుడు నిన్ను విడిచి నేను వెళ్ళుట మనేది లేదు. ఇద్దరము కలిసే భువికి వెళ్ళటము" అన్నాడు. అందుకు రాధ "నాథా! ఎక్కడ బృందావనం లేదో, యమునలేదో, గోవర్ధన గిరి లేదో అక్కడ నామనస్సుకు స్థిమితముంటుందా?" అని అన్నది. పరమాత్ముడు వెంటనే ఆ గోలోకధామంలోని ఎనభైనాలుగు క్రోసుల భాగాన్ని భూలోకానికి పంపాడు. గోవర్ధన పర్వతము, యమునానది, బృందావనము .ఆ భాగంలోనే ఉన్నాయి.

అప్పుడు విధాత కృష్ణపరమాత్మునకు నమస్కరించి "భగవాన్! నీవు భూలోకంలో ఎక్కడ అవతరిస్తావు? ఈ దేవతలంతా ఎవరెవరి గృహాలలో ఉద్భవిస్తారు? ఏయే పేర్లతో ఉంటారు?" అని అడిగాడు. అప్పుడు భగవానుడు బ్రహ్మతో ఇలా అన్నాడు.

వసుదేవస్య దేవక్యాం భవిష్యామి పర: స్వయం
రోహిణ్యాం మత్కలా శేషో భవిష్యతి న సంశయ:
శ్రీ సాక్షాత్ రుక్మిణీ భైష్మీ శివా జాంబవతీ తథా
సత్యాచ తులసీ భూమౌ సత్యభామా వసుంధరా
దక్షిణా లక్షణాచైవ కాళిందీ విరజా తథా
భద్రా హ్రీ మిత్రవిందాచ జాహ్నవీ పాపనాశినీ
రుక్మిణ్యాం కామదేవశ్చ ప్రద్యుమ్న ఇతి విశ్రుత:
భవిష్యతి న సందేహస్తస్య త్వం చ భవష్యసి
నందో ద్రోణో వసు: సాక్షా ద్యశోదా సా ధరాస్మృతా
వృషభాను: సుచంద్రశ్చ తస్య భార్యా కలావతీ
భూమౌ కీర్తిరితి ఖ్యాతా తస్యాం రాధా భవిష్యతి
సదా రాసం కరిష్యామి గోపీభి ర్వ్రజ మండలే

నేను స్వయంగా దేవకీ వసుదేవులకు కుమారునిగా అవతరిస్తాను. నా అంశతోనే బలరాముడు అవతరిస్తాడు. సాక్షాత్తు లక్ష్మీదేవియే భీష్మకుని ఇంట రుక్మిణిగా ఉదయిస్తుంది. పార్వతి అంశతో జాంబవతి, తులసి అంశతో సత్య (నాగ్నజితి కూతురు), భూదేవి అంశతో సత్యభామ, యజ్ఞపత్నియైన దక్షిణాదేవి

అంశతో లక్షణ జన్మిస్తారు. ఇక్కడి విరజానదియే అక్కడ కాళిందిగా పిలువబడుతుంది. హ్రీ అనే కళ భద్రగాను, జాహ్నవి మిత్రవిందగాను భువికి వస్తారు. రుక్మిణికి మన్మథుడే ప్రద్యుమ్న కుమారుడుగా జన్మిస్తాడు. ద్రోణుడనే వసువు నందునిగా జన్మించి యశోదను వివాహమాడతాడు. సుచంద్రుడు వృషభానుడుగా వచ్చి కళావతి అనే నామాంతరముగల కీర్తిని పరిణయమాడతాడు. వారికి రాధాదేవి జన్మిస్తుంది. వ్రజమండలంలో నేను రాసక్రీడ గావిస్తాను. నందవ్రజంలో నంద ఉపనందుల గృహాలలో నా సఖులు సుబలుడు శ్రీదాముడు జన్మిస్తారు. గోకులంలోని సుందరీమణులైన గోపికలు నూరుయూథములుగా ఉంటారు. గోలోకవాసినులు కూడా గోపికలుగా వస్తారు. వారిలో కొందరు బృందావన పాలికలుగా, కొందరు ద్వారపాలికలుగా, కొందరు పార్షదులుగా, కొందరు శయ్యనలంకరించువారుగా ఇత్యాదిగా నూరుయూథములుగా భువినవతరించి రాసక్రీడలో పాల్గొంటారు.

కశ్యపుడు వసుదేవుడుగా, అదితి దేవకిగా, ప్రాణుడనే వసువు శూరసేనుడుగా, ధ్రువుడనే వసువు దేవకుడుగా, వసుడనే వసువు ఉద్ధవుడుగా, దక్షప్రజాపతి అక్రూరుడుగా, వరుణుడు కృతవర్మగా, రాజా ప్రాచీనబర్హి గదుడుగా, మరుత్తు ఉగ్రసేనుడుగా అవతరిస్తారు. అంబరీషుడు యుయుధానుడుగా, ప్రహ్లాదుడు సాత్యకిగా, క్షీరసాగరుడు శంతనుడుగా, ద్రోణుడనే వసువు భీష్మునిగా, భగుడు ధృతరాష్ట్రునిగా, పూష పాండురాజుగా, యమధర్మరాజు యుధిష్ఠరుడుగా, వాయువు భీమసేనుడుగా, స్వాయంభువ మనువు అర్జునుడుగా, శతరూప సుభద్రగా, సూర్యుడు కర్ణుడుగా, అశ్వినీకుమారులు నకుల సహదేవులుగా అవతరిస్తారు. ధాత బాహ్లికుడుగా, అగ్నిదేవుడు ద్రోణుడుగా, కలిదుర్యోధనుడుగా, చంద్రుడు అభిమన్యుడుగా, శంకరుడు అశ్వత్థామగా అవతరిస్తారు. ఈవిధంగా దేవతలంతా వారి వారి అంశలతోయదు, కురువంశాలలో ఉద్భవిస్తారు. అనిపలికి పరమాత్ముడు యోగమాయను చూచి "నీవు దేవకి యొక్క ఏడవ గర్భాన్ని తీసికొని వెళ్ళి వసుదేవుని పత్నియైన రోహిణి గర్భంలో ప్రవేశపెట్టు. ఆమె కంసుని భయంవల్ల వ్రజంలో నందుని ఇంట ఉంటున్నది. నీవు కూడా ఆకార్యం నెరవేర్చి నందుని పత్నికి జన్మిస్తావు" అన్నాడు.

**కంసుని పూర్వజన్మ :**

నారదమహర్షి బహుళాశ్వునకు కంసుని పూర్వజన్మ వృత్తాంతాన్ని ఇలా

వివరిస్తున్నాడు. పూర్వము క్షీరసాగర మథన సమయంలో అమృతం కోసం దేవతలు దానవులు పోరాడే సమయంలో కాలనేమి యనే రాక్షసుడు విష్ణువుతో యుద్ధానికి దిగాడు. ఆయుద్ధంలో విష్ణువు కాలనేమిని సంహరించాడు. అప్పుడు శుక్రాచార్యుడు తన సంజీవనీ మంత్ర ప్రభావంచేత అతనిని పునర్జీవితుణ్ణి చేశాడు. అప్పుడు కాలనేమి మరల విష్ణువుతో పోరాడి గెలువవలెననే కాంక్షతో మందరాచల సమీపంలో ప్రతిరోజు కేవలం గరికరసం త్రాగి బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. ఆతని తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరమును కోరుకొనుమన్నాడు. అప్పుడాతడు ఏదైవము వలననూ తనకు మృత్యువు కలుగకుండునట్లుగా వరమిమ్మన్నాడు. అందుకు బ్రహ్మ "నీవు దుర్లభమైన కోరికను కోరావు. కాలాంతరములో నీకటువంటి శక్తి నిస్తా" నన్నాడు.

**కంస పరాక్రమం :**

ఆ కాలనేమి అనే అసురుడే కంసుడనే పేరుతో ఉగ్రసేనుని భార్య పద్మావతికి జన్మించాడు. కంసుడు చిన్నప్పటి నుండి అతిబలశాలి. ఒకసారి జరాసంధుడు దిగ్విజయయాత్రకు బయలుదేరి ఒకచోట విడిది దిగినప్పుడు కువలయాపీడమనే మదపుటేనుగును శిబిరం బయట కట్టివేశాడు. అది గొలుసు త్రెంపుకొని చెట్లు చేమలను ఛిన్నాభిన్నం చేస్తూ కంసుడు మల్లయుద్ధం చేస్తున్న చోటకు వచ్చింది. దానిని చూచి వీరులంతా పలాయనం చిత్తగించారు. కంసుడు దాని తొండము పట్టుకొని గిరగిరాత్రిప్పి విసిరివేయగా అది వచ్చి జరాసంధుని శిబిరం దగ్గర పడింది. జరాసంధుడు కంసుని పరాక్రమానికి ఆశ్చర్యపడి తన కుమార్తెలైన అస్తి, ప్రాస్తి అనువారిని కంసునకిచ్చి వివాహం చేశాడు.

ఒకసారి కంసుడు ఋష్యమూక వనానికి వెళ్ళి అక్కడ కేశియనే అశ్వముఖునితో పోరాడి వానిని లొంగదీసికొని మహేంద్రగిరి మీదకు చేరి ఆ పర్వతాన్ని అనేక పర్యాయాలు కదిపివేశాడు. ఆ పర్వతంపై నివసించే పరశురాముడందుకు క్రుద్ధుడై "ఓరి తుచ్ఛుడా! కీటకాధమా! నీకు పౌరుషముంటే ఇదిగో నాదగ్గర లక్షపుట్ల ఇనుప ధనుస్సు ఉన్నది. దీనిని పూర్వము త్రిపురాసురులను సంహరించే నిమిత్తమై మహావిష్ణువు శంకరునకు ప్రసాదించాడు. క్షత్రియ సంహారం నిమిత్తమై దీనిని శంకరుడు నాకు అనుగ్రహించాడు. నీవు దీనిని ఎక్కుపెట్టు. లేకుంటే నిన్ను

హతమారుస్తా నన్నాడు. అప్పుడు కంసుడు ధైర్యోత్సాహములతో ఏడుతాళ్ళ పొడవున్న ఆ భయంకరమైన ధనుస్సును ఎక్కుపెట్టాడు. తరువాత పరశురాముని పాదాలకు ప్రణమిల్లి శరణువేడాడు. పరశురాముడు ప్రసన్నుడై ధనుస్సును కంసునకే ఇచ్చి "కంసా! ఇది విష్ణుధనుస్సు. దీనిని విరిచినవాడు పరిపూర్ణుడైన పరమాత్మునిగా తెలిసికో. ఆ పరమాత్ముని చేతిలోనే నీకు మృత్యువు ప్రాప్తిస్తుంది" అని చెప్పాడు. కంసుడు పరశురామునకు ప్రణమిల్లి అనంతరం తననెదుర్కొనే వారెవ్వరున్నారని వెదకి అఘాసురుడు, అరిష్టకాసురుడు, బకాసురుడు, తృణావర్తుడు మున్నగువారిని ఓడించి వారినందరినీ తన సేవకులను గావించుకున్నాడు. ఓ బహుళాశ్వ మహారాజా! ఈ కంసాది దుష్టుల సంహారార్థమే శ్రీకృష్ణపరమాత్ముడు గోకులంలో లీలాబాలుడుగా అవతరించాడు అని నారదమహర్షి వివరించాడు.

## కీర్తి వృషభానులు :

వృషభానుని భార్య కీర్తి గర్భం ధరించింది. ఆమె క్రమక్రమంగా శుక్లపక్ష చంద్రునివలె వికాసం పొందసాగింది. అది భాద్రపదమాసం, శుక్లపక్షం, అష్టమీతిథి, సోమవారం మధ్యాహ్న సమయం. ప్రకృతి ప్రసన్న సుందరంగా ఉంది. ఆ అభిజిత్‌లగ్నంలో వారికి రాధాదేవి జన్మించింది. ఆ సమయంలో మలయ మారుతములు చల్లగా వీచాయి. తల్లిదండ్రులు కుమార్తె జన్మోత్సవం ఘనంగా జరిపారు. నూరు శరత్కాల చంద్రుల కాంతితో తనరారే రాధాదేవిని చూచి దేవతలు కూడా బ్రహ్మానందం పొందారు.

వృషభానుడు పూర్వజన్మలో నృగమహారాజుకు సుచంద్రుడనే కుమారుడుగా జన్మించి ప్రఖ్యాతి పొందాడు. అర్యమ ప్రభృతి పితృదేవతలకు కళావతి, రత్నమాల, మేనక అనే ముప్వురు మానసపుత్రికలుండేవారు. ఆ కళావతిని సుచంద్రునకిచ్చి వివాహం చేశారు. రత్నమాలను జనకుడు, మేనకను హిమవంతుడు పరిణయమాడారు. తరువాత కళావతీ సుచంద్రులు గోమతీ తీరంలో నైమిషమనే వనంలో పన్నెండు సంవత్సరాలు బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై సుచంద్రుణ్ణి వరమును కోరుకొనుమన్నాడు. అప్పుడు సుచంద్రుడు "ఓ స్వామీ! నాకు దివ్యమైన మోక్షం ప్రసాదించండి" అన్నాడు. వెంటనే కళావతి ఖిన్న వదనయై "ఓ దేవా! నా భర్త మోక్షము పొందితే నాగతి ఏమిటి? నాభర్త వియోగమును

నేను భరింపలేను" అన్నది. అందుకు బ్రహ్మదేవుడు "అమ్మా ! మీకు ఎడబాటు కలుగదు. మీరిద్దరూ కొంతకాలం స్వర్గానికి వెళ్ళి సౌఖ్యంపొంది ద్వాపరాంతంలో భరతఖండంలో గంగాయమునల మధ్యభాగంలోని భూమిపై కీర్తి వృషభాను దంపతులుగా జన్మిస్తారు. అప్పుడు జగన్మాతయైన రాధాదేవి మీ కుమార్తెగా జన్మిస్తుంది. మీరు ధన్యులౌతారు" అని అంతర్ధానమయ్యాడు. ఆసుచంద్రుడు సురభానుని ఇంట వృషభానుడనే పేరుతో జన్మించాడు. కళావతి కన్యాకుబ్జ దేశంలో భలందనుడనే రాజుకు యజ్ఞకుండంలో కీర్తి అనే పేరుతో జన్మించింది. వారిద్దరికీ తమతమ పూర్వజన్మల స్మృతి ఉన్నది. భగవంతుని సంకల్పానుసారం కీర్తి వృషభానులకు వివాహమయింది.

## దేవకీ వసుదేవులు :

మధురానగరాన్ని ఉగ్రసేన మహారాజు పరిపాలిస్తున్నాడు. ఒకనాడు వారి భవనానికి యాదవ పురోహితుడైన గర్గాచార్యులవారు విచ్చేశారు. మహారాజు గర్గాచార్యులను చూచి ఆనందంతో ఆహ్వానించి సుఖాసీనుల నొనరించారు. యాదవులంతా గర్గమహర్షికి ప్రణామం చేశారు. ఆ సమయంలో మహారాజైన ఉగ్రసేనుని చెంతనే అక్రూరుడు, దేవకుడు, కంసుడు వినయపూర్వకంగా నిలబడిఉన్నారు. అప్పుడు గర్గమహర్షి దేవకుని చూచి "రాజా! నీకుమార్తె దేవకికి శూరసేనుని కుమారుడు వసుదేవుడు తగిన వరుడు. అందువల్ల నీవు వసుదేవునికి నీకుమార్తెనిచ్చి వివాహం జరిపించు" అన్నాడు. జ్యోతిర్వేత్తయైన గర్గమహర్షి సూచనపై ఒక సుముహూర్తంలో దేవకీ వసుదేవుల వివాహం వైభవోపేతంగా జరిగింది. వివాహమైన తరువాత అందమైన రథం మీద దేవకిని అత్తవారింటికి పంపటానికి దేవకుడు సకల సన్నాహాలు చేశాడు. దేవకీవసుదేవులు రథంపై ఆసీనులయ్యారు. వసుదేవునిపై గల స్నేహభావంతో, చెల్లెలి పైగల మమకారంతో కంసుడే స్వయంగా రథం నడపటానికి సిద్ధమయ్యాడు. దేవకుడు తన కుమార్తెకు అనేకములైన కానుకలు బహూకరించాడు. భేరీ మృదంగ వేణు నినాదములతో ప్రయాణం ఆరంభమయింది. కొద్ది దూరం వెళ్ళగానే ఆకాశవాణి కంసుణ్ణి సంబోధించి "ఓరీ మూర్ఖుడా! కంసా! నీవెంతో సంతోషంగా రథం నడుపుతున్నావు. కానీ నీ చెల్లెలి ఎనిమిదవ గర్భమే నీ పాలిటి మృత్యువని నీకు తెలియదు" అని హెచ్చరించింది. ఆతడాశ్చర్య చకితుడయ్యాడు.

సహజంగా దుష్టుడయిన కంసుడీ మాటలు వినగానే ఒక చేతితో చెల్లెలి జుట్టుపట్టుకొని, వేరొక చేతితో నిశిత కరవాలాన్ని బట్టి ఆమెను సంహరించటానికి సిద్ధమయ్యాడు. ఒక్కసారిగా మంగళావాద్యాలు ఆగిపోయాయి. అందరూ ఆశ్చర్యంతో వారివైపు చూడసాగారు. అప్పుడు వసుదేవుడు శాంత చిత్తంతో "భోజేంద్రా! నీవు ఈ వంశపు కీర్తిని విస్తరింపచేసేవాడవు. భౌమాసుర, బకాసుర, వత్సాసుర, బాణాసురాదులు యుద్ధరంగంలో నీచే పరాజితులయ్యారు. అటువంటి పరాక్రమవంతుడవైన నీవు నీ చెల్లెలిని సంహరించటమా? బకాసురుని సోదరి పూతన వచ్చి నీతో యుద్ధం చేయాలని నిన్ను ఆహ్వానిస్తే "నేను స్త్రీ తో యుద్ధం చేయ" నని చెప్పి ఆమెను నీవు సోదరిగా మన్నించావు. అటువంటి నీవు సాక్షాత్తు సోదరిని సంహరించటం సమంజసమేనా? ఈమె వివాహపు వేడుకలో ఉన్నది. ఈమె నీకు చిన్న చెల్లెలు. నీకూతురు వంటిది" అని చెప్పిచూశాడు. కాని దుర్మార్గుడైన కంసుని బుద్ధి మారకపోవటం గమనించి వసుదేవుడు భగవంతునిపై భారం వైచి "బావా! ఓరాజా! నీకు దేవకి వల్ల ఎట్టి భయము లేదు. పోనీ ఆకాశవాణి మాటలను బట్టి భావించినా ఈమెకు జన్మించే ప్రతి శిశువును నీకు సమర్పిస్తాను. నీవు ఆందోళన పడవద్దు. నన్ను విశ్వసించు అన్నాడు. వసుదేవుని మాటపై నమ్మకంతో కంసుడు గృహోన్ముఖుడయ్యాడు. వసుదేవుడు భయపడుతూ దేవకితో తన భవనానికి చేరుకున్నాడు

**కంసుని దురాగతాలు :**

కంసుడు వెంటనే వేలాదిమంది శస్త్రధారుల్ని దేవకీనందుల భవనం చుట్టూ కాపలాగా ఏర్పరచాడు. వసుదేవునికి మొదట కీర్తిమంతుడనేకుమారుడు కలిగాడు. వసుదేవుడు సత్యవాక్యనియమంతో ఆబాలుణ్ణి కంసునకు సమర్పించటానికి తీసికొనివెళ్ళాడు. కంసుడికి హఠాత్తుగా మనస్సుమారి "ఎనిమిదవ గర్భంవల్ల కదా నాకు మృత్యువు. ఈ బాలుణ్ణి తీసికొనివెళ్ళు" అన్నాడు. వసుదేవుడు సంతోషంగా బాలునితోపాటు ఇంటికి చేరి కూడా ఈ కంసుని బుద్ధి అస్థిరమైనది కదా అని వ్యాకులపడుతూ ఉన్నాడు.

ఓ బహుళాశ్వ మహారాజా! అదే సమయంలో నేను ఆకాశమార్గంలో పయనిస్తూ మధురకు చేరుకున్నాను. ఉగ్రసేనుని కుమారుడైన కంసుడు నన్ను ఆదరించి - మహర్షి! నా విషయంలో దైవ నిర్ణయం ఎలా ఉన్నది? అని అడిగినప్పుడు

నేనిలా సమాధానం చెప్పాను "కంసా! నందాది గోపకులు వసువుల అవతారాలు. వృషభానుడు మున్నగువారు దేవతల రూపాలు. ఈ వ్రజభూమిలోని గోపికలు వేదాలలోనిఋుక్కులే. వసుదేవాదులు స్వత: దేవతలు. దేవకి మొదలైన వారు దేవాంగనలు. ఏడు లెక్కపెడితే తరువాత ఎనిమిదే. నీ మృత్యు సంఖ్యతో లెక్కపెడితే నీ చెల్లెలిమొదటి కుమారుడు ఎనిమిదవ సంతానమే కావచ్చు. దేవతలకు "సంఖ్యానాం వామతో గతి:" అంటారు అని నేను చెప్పి వచ్చిన తరువాత కంసుడు దేవతల ప్రవృత్తికి కృద్ధుడై యాదవులందర్నీ హతమార్చటానికి సిద్ధయయ్యాడు. దేవకీ వసుదేవుల్ని చెరసాలలో పెట్టి కాళ్ళకు చేతులకుసంకెలలు వేయించాడు. ఆ పెద్దకుమారుణ్ణి తీసికొనివచ్చి పెద్దబండపై వేసికొట్టి చంపాడు. కంసునకు పూర్వజన్మ స్ఫురణ ఉన్నది. అందువల్ల, విష్ణువంటే భయం వల్ల, తన దుష్ట స్వభావంవల్ల, దేవకికి పుట్టిన ఆరుగురు కుమారుల్ని ఇదేవిధంగా వధించాడు. ఇందుకు యాదవ నరేశ్వరుడైన ఉగ్రసేనుడు కుపితుడై కంసుడొనరించే ఆ దురాగతాన్ని ప్రతిఘటించాడు. కొందరు దుష్టవర్తనులు కంసుని చర్యలను సమర్థించారు. ఇరుపక్షాలవారు పోరుకు దిగారు. రాజసభా భవనం రణరంగంగా మారింది. కంసుడు గద తీసికొని పరపక్షం వారిని విచక్షణారహితంగా చావమోదాడు. చివరకు తన తండ్రిని కారాగారంలో బంధించి తాను సింహాసనం అధిరోహించాడు.

**బలరామ జననము :**

దేవకీదేవి ఏడవపర్యాయం గర్భవతి అయింది. ఆమె గర్భంలో సాక్షాత్తు అనంతదేవుడు ఉండటంవల్ల ఆమెకు సంతోషము, కంసుని వల్ల భయము కలిగాయి. యోగమాయ ఆగర్భమును తీసికొనివెళ్ళి నందవ్రజంలోని రోహిణీదేవిలో ప్రవేశపట్టింది. దేవకీదేవి గర్భము మాయమైనందుకు మధురాపుర కాంతలు ఎంతో బాధపడ్డారు. అయిదురోజుల తరువాత నందవ్రజంలో భాద్రపద శుక్లషష్ఠినాడు స్వాతినక్షత్రంలో బుధవారం రోజున తులాలగ్నంలో వసుదేవుని పత్నియైన రోహిణి గర్భంనుంచి అనంతదేవుడు బలరామునిగా ఆవిర్భవించాడు. దేవతలు పుష్పవర్షం కురిపించారు. నందరాజు ఆ బాలునకు జాతకర్మ సంస్కారములు జరిపి బ్రాహ్మణులకు విరివిగా గోదానాలు చేశాడు. దేవళుడు, దేవరాతుడు, వసిష్ఠుడు, బృహస్పతి, వ్యాసమహర్షి, నేను వెళ్ళి ఆబలరాముని దర్శించి వచ్చాము.

అప్పుడు నందుడు - ఓ మహర్షులారా! ఈ సుందర బాలకుడు ఎవరు? ఈతని వృత్తాంతమేమిటి? ఈ బాలుడు కేవలం ఐదు రోజులలో ఎలా ఆవిర్భవించాడు? అని అడుగగా వ్యాసమహర్షి "నందరాజా! నీ భాగ్యము నేమనవచ్చు. సనాతనుడైన ఆ శేషనాగుడే ఈ బాలుని రూపంలో ఉన్నాడు. ఈ బాలుడు ముందుగా దేవకీ గర్భమందే ప్రవేశించాడు. కాని ఆ పరమాత్ముని సంకల్పానుసారం తరువాత రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టబడ్డాడు. యోగులకు కూడా లభించని దర్శనం నీకు లభించింది" అని పలికాడు.

## శ్రీకృష్ణుని జననము :

దుష్టశిక్షణ, శిష్టరక్షణకై భగవంతుణ్ణి ఆవిర్భవించమని బ్రహ్మాది దేవతలు ప్రార్థించిన కారణంగా శ్రీకృష్ణపరమాత్మ అవతరింపబోతున్నాడు. పరమాత్ముని తేజస్సు దేవకీదేవి గర్భంలో ప్రవేశింపగా దేవకీదేవి అపూర్వమైన కాంతితో విరాజిల్లింది.ఆ కాంతిని చూచి కంసుడు భయభ్రాంతుడై ఆ జన్మింపబోయే కుమారుడే తన పాలిట మృత్యువు కాగలడని భావించి సర్వసన్నద్ధంగా ఉన్నాడు. తనపూర్వ శత్రువైన మహావిష్ణువును నిరంతరం చింతన చేయటం వల్ల ఆతనికి సర్వత్ర విష్ణువే కనిపింపసాగాడు.

బ్రహ్మాది దేవతలు వచ్చి దేవకీ గర్భంలో నున్న భగవానునకు నమస్కరించి- "ఓ పరమాత్మా! పరాత్పరా! పరంధామా! నీవు జాగ్రత్ స్వప్నాద్యవస్థలతో కూడిన ఈ విశ్వమున కంతటికీ హేతురూపుడవై యుండి కూడా అహేతువుగా పరిగణింపబడుతున్నావు. బలవంతులకంటే బలవత్తరమైన ఈ కాలము ఎవరిని శాసింపలేదో, ఎవరిపై మాయాప్రభావం పడదో, వేదములు కూడా ఎవరినివర్ణింపలేక మూగవోయినాయో, అటువంటి అమృతమయమైన ప్రశాంతమైన శుద్ధపరాత్పర పూర్ణబ్రహ్మ స్వరూపుడవైన నిన్ను మేము శరణు వేడుతున్నాము. ఓ ఆనందకందా! ఓ దేవకీనందనా! యోగులకు కూడా దుర్లభమైన, అగమ్యమైన నీ చరణరజము భక్తులకు సులభసాధ్యమైనది కదా" అని భక్తిపారవశ్యంతో అనేకవిధాలుగా స్తుతించారు.

భగవానుడు అవతరింప బోయేసమయంలో ఆకాశం నిర్మలంగా ఉంది. దిశలు స్వచ్ఛములైనాయి, తారకలు ప్రకాశవంతములైనాయి. భూమండలమంతా ప్రసన్నంగా ఉంది. పుష్పగంధాలను మలయమారుతం దశదిశలా వెదజల్లుతున్నది.దేవతలు

దుందుభిధ్వానాలు చేయసాగారు. సిద్ధచారణ కిన్నరులు గానాలాపన చేయసాగారు. గంధర్వ విద్యాధరులు నాట్యం చేయసాగారు. భాద్రపద మాసం, కృష్ణపక్షం, రోహిణీ నక్షత్రం, వృషభలగ్నం, అష్టమీతిధి అర్ధరాత్రి సమయంలో దేవకీదేవి గర్భం నుంచి శ్రీకృష్ణపరమాత్ముడు అరణి కాష్ఠంనుంచి అగ్నివలె ఆవిర్భవించాడు.

వక్షఃస్థలంపై కౌస్తుభహారంతో, భుజకీర్తులతో మకర కుండలములతో, మణికిరీటముతో శ్యామసుందరుడై, బాలకృష్ణుడు ప్రకాశింపసాగాడు. కారాగారమంతా ఆ బాలుని కాంతితో వెలిగి పోవటం చూచి విస్మితుడై వసుదేవుడు ఆలీలాబాలునికి నమస్కరించి " ఓ ఆదిదేవా! పరమాత్మా! నీవు అద్వితీయ మూర్తివి.ఏకమాత్రరూపుడవైన నీవు ప్రకృతిలోని త్రిగుణముల వల్ల అనేక రూపములతో ప్రకాశిస్తున్నావు. నీవు సృష్టిస్థితి, లయ కారకుడవు. ఇంధనములో అగ్నివలె నీవు ఈ సమస్త జగత్తులో అవ్యక్త రూపంతో నిండి ఉన్నావు. ఆకాశమువలె సర్వత్ర వ్యాపించి ఉన్నావు. పృధ్వివలె జగత్తుకు ఆధారభూతుడవై ఉన్నావు. నీవు సర్వ సాక్షివి. దేవతలను గోబ్రాహ్మణులను భక్తజనులను రక్షించటం కోసం నీవులవతరించావు. నీవు పురుషోత్తముడవు!". అని ప్రస్తుతించాడు. దేవకీదేవి- "ఓ సచ్చిదానందా! శ్రీకృష్ణా పరమేశ్వరా! పాపాత్ముడైన ఈ కంసుని బారినుంచి రక్ష కలిగించు ప్రభూ! అని వేడుకున్నది.

దేవకీ వసుదేవుల ప్రార్థనలను విని శ్రీ కృష్ణపరమాత్ముడు, చతుర్భుజుడై, తేజోమూర్తియై సాక్ష్యాత్కరించి మందహాసవదనంతో తల్లిదండ్రులతో ఇలా అన్నాడు. "అమ్మా క్రిందటి జన్మలో నీవు పృశ్ని అనే పతివ్రతవు. తండ్రీ! నీవు సుతపుడనే ప్రజాపతివి. మీరిద్దరూ బ్రహ్మదేవుని ఆజ్ఞతో ఒక మన్వంతర కాలం తపస్సు చేశారు. అప్పుడు నేను ప్రసన్నుడనై మీకు దర్శన మిచ్చి అభీష్టమును కోరుకొనుమని అన్నాను. మీరిద్దర్యూ "నీవంటి పుత్రుని మాకు ప్రసాదించు " అని వేడుకున్నారు. మీ పుణ్యంవల్ల మీరు ప్రజాపతులయ్యారు. ప్రపంచములో నావంటివారు మరొకరులేరు. అందువల్ల నేనే స్వయంగా మీకు కుమారుడనై పృశ్నిగర్భుడుగా ప్రఖ్యాతి పొందాను. తరువాత జన్మలో మీరు అదితి కశ్యపులుగా అవతరించారు. అప్పుడు నేను వామనుడుగా మీకు జన్మించాను. ఈ జన్మలో దేవకీ వసుదేవులైన మీకు మరల కుమారుడనయ్యాను. మీరు ఒక్కసారి కోరినప్పటికీ మీపై అనుగ్రహంవల్ల మీకు నేను మూడు పర్యాయాలు జన్మించాను. మీకు కంసునివల్ల ఎంతమాత్రం భయంలేదు.

నాయనా! నీవు నన్ను నందరాజు మందిరానికి తీసికొనివెళ్ళు. నందుని కుమార్తెను ఇక్కడకు తీసికొనిరా'' అనిపలికి వారు చూస్తుండగానే మరల భగవానుడు బాలుని రూపం ధరించాడు. అదే సమయంలో నందగోకులంలో నందుని పత్నికి యోగమాయ జన్మించింది.

వసుదేవుడు బాలకృష్ణుణ్ణి చిన్నబుట్టలో పరుండబెట్టి శిరస్సున పెట్టుకున్నాడు. పహరాదారులందరూ నిద్రలో మునిగిపోయారు. కారాగారం తలుపులు వాటంతట అవి తెరుచుకున్నాయి. వసుదేవుడు బయటకు నడిచాడు. ఆయన లోపలి అజ్ఞానము, బయటి అంధకారము రెండూ తొలగిపోయాయి. ఆకాశంలో మేఘాలుఅలముకున్నాయి. సన్నగా జల్లు పడసాగింది. వేయిపడగల ఆదిశేషుడు ఆ నీటి తుంపరలు బాలునిపై పడనీయకుండగా తన పడగను ఛత్రంవలె కప్పి వసుదేవుణ్ణి అనుసరింపసాగాడు. ఆ సమయంలో యమునానది ఉత్తుంగ తరంగాలతో ఉరకలు వేస్తున్నది. కళింద నందినియైన యమున వసుదేవుని చూడగానే మార్గమిచ్చింది.వసుదేవుడు యమునదాటి ముందుకు వెళ్ళాడు. నందవ్రజమంతా గాఢనిద్రలో ఉన్నది. వసుదేవుడు తన ప్రియమైన కుమారుణ్ణి యశోద పక్కలో పడుకొనబెట్టి, ఆమె పక్కలోని దివ్యబాలికను ఎత్తుకొని ప్రయాణమయ్యాడు.

**యోగమాయ :**

యశోద ప్రవసవేదన వల్ల అలసిపోయి ఆనందంతో గాడనిద్రలో ఉండి తనకు కలిగింది కుమార్తెయా కుమారుడా అనే విషయం కూడా గమనించకుండా ఉన్నది. అక్కడ కారాగారంలో దేవకి పొత్తిళ్ళలో బాలిక ఏడుపు విని కాపలాదారులు ఉలిక్కిపడి లేచి శిశువు జన్మించిన వార్తను కంసునకు చేరవేశారు. కంసుడు భయభ్రాంతుడై వెంటనే సూతగృహానికి వచ్చాడు. ఆతనిని చూడగానే దేవకీ దేవి విలపిస్తూ కంసునితో "అన్నా! నీవు దీనులయెడ, దు:ఖితులయెడ కనికరం చూపిస్తావు కదా. నేను నీ సోదరిని, కారాగారంలో పడవేశావు. నాకుమారులనందరినీ సంహరించావు. నేను అభాగ్యురాలను. ఇప్పుడు నాకు కుమార్తె కలిగింది. ఈమెను నాకు భిక్షగా ప్రసాదించు. స్త్రీని వధించడం నీవంటి వీరునకు తగినదికాదు'' అని అనేకవిధాలుగా వేడుకున్నది.

కాని యదుకుల కళంకుడు, నీచుడునైన కంసుడా మాటలు వినక నిర్దయుడై

నందరాజుకు కుమారుడు కలిగాడని విని కీర్తి వృషభాను దంపతులు కానుకలు తీసికొని ఏనుగునెక్కివచ్చారు. నవనందులు ఉపనందులు కట్నకానుకలు తీసికొనివచ్చారు. గోకులంలోని గోపికల ఆనందానికి మేరలేదు. వారు పరమానంద భరితలయ్యారు. ఇంటిలోని పనిపాటల నన్నిటినీ వదిలిపెట్టి రకరకాల కానుకలను తీసికొని నందగృహానికి తరలివచ్చారు. ఆ సంరంభం వల్ల మనోహరమూర్తులైన ఆ స్త్రీల కొప్పులు జారి, ఆభరణములు నలిగి, ముత్యాలు రాలి పోతున్నా వారు గమనించే స్థితిలో లేరు. వారు వచ్చేటప్పుడు ఆవాలు, పసుపు, గోధుమ పిండి, మొదలైనవి తెచ్చి పసికందుకి దిష్టితీశారు. వారు యశోదమ్మను చూచి "అమ్మా! యశోదమ్మా! నీవు ధన్యురాలవమ్మా! చాలాకాలం తరువాత భగవంతుడు నీ కోరిక సఫలం చేశాడు. కమలనేత్రుడు, శ్యామ సుందరుడు అయిన ఈ బాలుణ్ణి జాగ్రత్తగా చూచుకొనవలసినది" అన్నారు. అప్పుడు యశోదమ్మ వారితో "ఇదంతా మీ అందరి ఆశీర్వాద ఫలమే" అని వినయపూర్వకంగా పలికింది.

వసుదేవుని భార్య రోహిణి కూడా నందుని ఇంటనే ఉన్నది ఆమెను చూచి యశోద "అక్కా! నీవు బుద్ధిమతివి. ఇప్పుడు మన ఇంటికి వచ్చిన ఈ గోప కాంతలందరినీ తగువిధంగా ఆదరించు" అని చెప్పింది. రోహిణి రాజకుమార్తె. సహజంగానే ఆమె దానశీల. పైగా ఇప్పుడు యశోద ఆమెను దానధర్మాలు చేయటానికి ప్రేరేపించింది. రోహిణి సువర్ణకాంతితో మెరిసిపోతూ గోపకాంతలకు కట్నకానుకలిచ్చేటప్పుడు సాక్షాత్తు లక్ష్మీదేవివలె శోభించింది. నందవ్రజంలో ప్రతిఇంటనిధి, సిద్ధి, భుక్తి, ముక్తి సమృద్ధిగా విలసిల్లాయి. అందువల్ల సంపదల కోసం యాచించేవారే ఆ వ్రజంలో కనిపించరు.

ఆ సమయంలో సనత్కుమారుడు, కపిలుడు, శుకమహర్షి, వ్యాసుడు, దత్తాత్రేయుడు, పులస్త్యుడు, నేను వ్రజం చేరుకున్నాము. బ్రహ్మదేవుడు పరమాత్మని దర్శనం కోసం హంసవాహనంపై విచ్చేశాడు. వృషభవాహనారూఢుడై మహేశ్వరుడు, సప్తాశ్వరథారూఢుడై సూర్య భగవానుడు, ఐరావతంపై దేవేంద్రుడు, కాటుకపిట్టపై వాయుదేవుడు, పుష్పకవాహనంపై కుబేరుడు, మృగవాహనంపై చంద్రుడు, మేకనెక్కి అగ్నిదేవుడు, మొసలివాహనంపై వరుణుడు, మయూరవాహనంపై కార్తికేయుడు పరాత్పరుని దర్శించటం కోసం విచ్చేశారు. భూదేవి గోరూపం ధరించి వచ్చింది. షోడశ మాతృకలు పల్లకీలలో చేరుకున్నారు. నందభవనమంతా గోపకులతో,

గోపికలతోనిండి పోయింది. బ్రహ్మాది దేవతలు అక్కడకు వచ్చి లీలాబాలుణ్ణి దర్శించి, స్తుతించి వెళ్ళారు.

**పూతన :**

నారదమహర్షి బహుళాశ్వ మహారాజుతో పలుకుతున్నాడు - ఓరాజా! నందరాజు కంసునకు కప్పంకట్టటం కోసం, వసుదేవుని క్షేమ సమాచారాలు తెలిసికొని తనకు కుమారుడు కలిగిన సంతోషవార్తను వసుదేవునకు తెలియజేయటం కోసం వ్రేపల్లెనుంచి మధురానగరానికి వెళ్ళాడు. అదే సమయంలో కంసునిచేత పంపబడిన బాలఘాతిని, దుష్టరాక్షసియైన పూతన నగరములు, గ్రామములు, గోష్ఠములు సంచరిస్తూ చివరకు గోపకులతో గోపికలతో నిండిన గోకులం చేరుకున్నది. ఆమె ఘ్రాణేంద్రియం నుంచి ఘుర్ఘర శబ్దం కర్ణ కఠోరంగా వినిపిస్తున్నది. గోకులం సమీపానికి చేరుకోగానే ఆమె తన రాక్షస మాయ వల్ల దివ్యరూపం ధరించింది. పదహారు సంవత్సరాల తరుణ వయస్కురాలివలె మారిపోయింది. ఆమె సౌందర్యం చూచినప్పుడు ఈమె రతీదేవియా శచీదేవియా లక్ష్మీదేవియా అనిపించింది. రోహిణీ యశోదలు ఆమెను చూచి అప్రతిభలయ్యారు. ఆమె గబగబా చొరవతో వస్తూనే బాల గోపాలుణ్ణి వారి ఒడిలో నుంచి లాగుకొని ముద్దాడుతూ తన ఒడిలోనికి తీసికొని ఘోరమైన హాలాహలంతో నిండిన స్తన్యాన్ని బాలునకివ్వసాగింది. లీలా బాలుడు ఆమె ప్రాణాలతో సహితంగా పాలను త్రాగివేశాడు. ఆమె గుండెలలో సహింపరాని బాధకలిగి ఒక్కసారిగా "వదులు వదులు" అంటూ బిడ్డతో సహా పరుగు తీస్తూ బయటకు వెళ్ళింది. వెంటనే ఆమె సుందరరూపం పోయి అసలు రూపం బయటపడింది. గ్రుడ్లు బయటకు వచ్చాయి. శరీరం పాలిపోయింది. పెద్దగా అరుస్తూ ఏడుస్తూ నేలపైపడిపోయింది. ఆమె రూపం బృహత్తరంగా భయంకరంగా ఉంది. ఆమె నేలపై పడినప్పుడు వీపుక్రింద పడిన చెట్లు విరిగి ముక్కలయ్యాయి. ఆమె వికృతమైన ఆకారాన్ని చూచిన గోపకులు తమలో తాము "ఈమె ఒడిలో ఉండే బాలుడు జీవించే అవకాశమేలేదు. కాని ఈ అద్భుత బాలుడు ఆమె ఛాతి మీద కూర్చొని ఆనందంతో ఆడుకుంటున్నాడు. ఈ బాలుడు పాలతో పాటు ఆమె ప్రాణాలను పీల్చివేశాడు' అనుకున్నారు. ఆ బాలుణ్ణి ఈ దశలో చూచిన రోహిణీ యశోదలు తత్తరపాటుతో వెళ్ళి బాలుణ్ణి ఎత్తుకొని హృదయానికి హత్తుకొని ఒకటే ఆందోళన చెందారు.

గోపికలందరూ బాలుణ్ణి ఇంటికి తీసికొనివచ్చి విధి పూర్వకంగా రక్షకట్టారు. యమునానది మట్టిని గోపరిచితంతో తడిపి స్నానం చేయించారు. గోపికలు శ్రీకృష్ణునకు ఈవిధంగా రక్ష పలికారు



## శ్రీకృష్ణ కవచము

శ్రీకృష్ణ స్తే శిర: పాతు వైకుంఠ: కంఠమేవహి
శ్వేతద్వీపపతి: కర్ణౌ నాసికాం యజ్ఞరూపధృక్
నృసింహో నేత్రయుగ్మంచ జిహ్వాం దశరథాత్మజ:
అధరావవతాం తే తు నరనారాయణా వృషీ
కపోలౌ పాతు తే సాక్షాత్ సనకాద్యా: కలా హరే:
భాలం తే శ్వేత వారాహో నారదో భ్రూలతే2వతు
చిబుకం కపిల: పాతు దత్తాత్రేయ ఉరో వతు
స్కంధౌ ద్వౌ వృషభ: పాతు కరౌ మత్స్య: ప్రపాతు తే
దోర్దండం సతతం రక్షేత్ పృథు: ప్రథులవిక్రమ:
ఉదరం కమఠ: పాతు నాభిం ధన్వంతరిశ్చ తే
మోహినీ గుహ్యదేశంచ కటింతే వామనో2వతు
పృష్ఠం పరశురామశ్చ తవోరూ బాదరాయణ:
బలో జానుద్వయం పాతు జంఘే బుద్ధ: ప్రపాతు తే

పాదౌ ప్రాతు సగుల్ఫౌచ కల్కి: ధర్మపతి: ప్రభు:
సర్వ రక్షాకరం దివ్యం శ్రీకృష్ణ కవచం పరం
ఇదం భగవతా దత్తం బ్రహ్మణే నాభిపంకజే
బ్రహ్మణా శంభవే దత్తం శంభు: దుర్వాససే దదౌ
దుర్వాసా: శ్రీయశోమత్యై ప్రాదాత్ శ్రీనందమందిరే

శ్రీకృష్ణుడు నీ శిరస్సును కాపాడుగాక! నీ కంఠమును వైకుంఠాధిపతి కాచుగాక! నీ కర్ణములను శ్వేతద్వీపాధిపతి రక్షించును గాక! నీ నాసికను యజ్ఞరూపధారి బ్రోచుగాక! నీ నేత్రములను నరసింహస్వామి కాపాడుగాక! నీ నాలుకను శ్రీరాముడోము గాక! నీ అధరములను నరనారాయణులు కాచుగాక! నీ కపోలములను సనక సనందనాదులు రక్షించుగాక! నీ ఫాలభాగములను శ్వేత వరాహస్వామి బ్రోచుగాక! నీ భ్రూలతలను నారదుడు కాపాడుగాక! నీ చిబుకమును కపిలమహర్షి, వక్షస్థలమును దత్తాత్రేయుడు, మెడను వృషభుడు, హస్తములను మత్స్యభగవానుడు, బాహువులను పృథువు, ఉదరమును కచ్ఛపుడు, నాభిని ధన్వంతరి, గుహ్యదేశమును మోహిని, కటిని వామనుడు రక్షించుగాక! నీ పృష్ఠభాగమును పరశురాముడు, ఊరువులను బాదరాయణుడు, జానువులను బలరాముడు, జంఘువులను బుద్ధుడు, గుల్ఫములను పాదములను కల్కి రక్షించుగాక! ఇది సర్వరక్ష కలిగించే శ్రీకృష్ణ కవచము. దీనిని మహావిష్ణువు బ్రహ్మకు ప్రసాదించాడు. బ్రహ్మ శివునకు, శివుడు దుర్వాసునకు చెప్పగా, దుర్వాసుడు నందమందిరానికి వచ్చి యశోదకీ కృష్ణవకచం చెప్పాడు.

అదే సమయంలో నందుడు కొందరుగోపాలురతోపాటు మధురానగరం నుంచి గోకులానికి చేరుకున్నాడు. రాగానేవిషయం తెలిసికొని, భయానకమైన పూతన శరీరం చూచి ఎంతో ఆందోళన చెందాడు. గోపాలకులు పూతన శరీరాన్ని ముక్కలుముక్కలుగా ఖండించి యమునా తీరంలో దహన సంస్కారం గావించారు. శ్రీకృష్ణుని దివ్యస్పర్శ వల్ల పూతన శరీరం పవిత్రమయింది. అందువల్ల దహింపబడేటప్పుడు ఆమె శరీరం నుంచి వెలువడిన పరిమళం దశదిశల వ్యాపించింది.

**పూతన పూర్వజన్మ :**

ఈవిషయం విన్న బహుళాశ్వమహారాజు నారదునితో "ఓ మహర్షీ! బాలఘాతిని,

రాక్షసియైన పూతన పూర్వజన్మలో ఎవరు? హృదయంలో దుష్టభావన పెట్టుకొని, స్తనాలలో విషయం నింపుకొని వచ్చినా కూడా ఆమె శ్రీకృష్ణుని వల్ల మోక్షంఎలా పొందింది?" అని అడిగాడు. అందుకు నారదమహర్షి పత్యుత్తరమిస్తున్నాడు -

బలియజ్ఞే వామనస్య దృష్ట్వా రూపమత: పరం
బలికన్యా రత్నమాలా పుత్రస్నేహం చకార హ
ఏతాదృశో యది భవేత్ బాలస్తం హి శుచిస్మితమ్
పాయయామి స్తనం తేన ప్రసన్నం మే మనస్తదా
బలే: పరమభక్తస్య సుతాయై వామనో హరి:
మనోరథస్తు తే భూయాన్ మనస్యపి వరం దదౌ
సా2భవత్ ద్వాపరాంతే వై పూతనా నామ విశ్రుతా
శ్రీకృష్ణ స్పర్శ సంభూతా పరం ప్రాప్తి మనోరథా

పూర్వజన్మలో ఈ పూతన బలిచక్రవర్తి కూతురు. అప్పుడీమె పేరు రత్నమాల. బలిచక్రవర్తి స్వర్గాన్ని జయించి యజ్ఞం చేస్తున్న సమయంలో దేవతల ప్రార్థనపై భగవానుడు అదితికి వామనుడుగా జన్మించి బలి యజ్ఞశాలకు విచ్చేశాడు. ముద్దులు మూటగట్టే వామనుణ్ణి చూచి రత్నమాల ఇటువంటి బాలుడు కుమారుడైతే ఆ కుమారునకు పాలిచ్చి ఎంత ఆనందం పొందేదానిని! అని మనస్సులో భావించింది. బలిచక్రవర్తి తన భక్తుడు కావటం వల్ల ఆ పరమాత్ముడు బలికుమార్తె రత్నమాల కోరికను గ్రహించి ఆమె ^.పు చూచి " నీ మనస్సులో ఉన్న కోరిక నెరవేరుగాక' అని అభయహస్తం చూపించాడు. ఆ రత్నమాలయే ద్వాపరయుగాంతంలో పూతనగా జన్మించింది. పరమాత్ముడైన శ్రీకృష్ణుని స్పర్శవల్ల ఆమెకు ఉత్తమగతి ప్రాప్తించింది. ఇదీ పూతనామోక్ష వృత్తాంతం!"

**శకటాసురుడు :**

ఒకరోజున బాలకృష్ణుని పుట్టినరోజు పండుగ వచ్చింది. యశోద వ్రజంలోని గోపగోపికల నందరినీ ఇంటికి పిలిచింది. శ్యామసుందరునకు ఆరోజున ఎర్రని పట్టువస్త్రాలనుకట్టింది. పద్మపత్రాక్షుని కనులకు కాటుక పెట్టింది. మెడలో పులిగోరు హారం వేసింది. బంగరు ఆభరణాలను అలంకరించింది. గోపకులతో గోపికలతో

ఇల్లంతా కోలాహలంగా ఉంది. గోపకాంతలు వచ్చేవారు వెళ్ళేవారు. వారికి కానుకలిచ్చి పంపటంలో యశోదమ్మ తీరికలేకుండా ఉంది. అందువల్ల నిద్రపోతున్న బాలకృష్ణుడు లేచి ఏడుస్తున్న విషయం కూడా ఆమె గ్రహించలేకపోయింది. అదే సమయంలో పాపాత్ముడైన కంసునిచేత పంపబడిన ఉత్కచుడనే రాక్షసుడు ప్రవేశించాడు. అతడు వాయుశరీరం ధరించి సంచరిస్తుంటాడు. ఆతడువచ్చి అక్కడ పాలు, పెరుగు తీసికొనివెళ్ళే ఒకఖాళీ బండి ఉంటే దానినాశ్రయించి ఉన్నాడు. ఆ శకట రూపంలో పైనపడి ఆ బాలుణ్ణి హతం చేయాలని ఆతని ఉద్దేశము. ఇంతలో బాలకృష్ణుడు ఏడుస్తూనే కాలితో ఆ బండిని తన్నాడు. వెంటనే ఆ శకటం ముక్కలు ముక్కలై విరిగిపడిపోయింది. ఆ యసురుడు ప్రాణాలు కోల్పోయి నేలపై పడిపోయాడు. అప్పుడాతడు తన దైత్యరూపాన్ని విడిచి దివ్యరూపం ధరించి గోలోకానికి వెళ్ళాడు.

ఆందోళనతో నందుడు గోపకులు గోపికలు ఒక్కసారిగా పరుగు పరుగున వచ్చి అక్కడున్న వారిని అడిగారు " ఏమిటి ఈ శకటం దానంతట అది పడిపోయిందా? ఎవరైనా పడవేశారా? " అని. "బాలకృష్ణుడు పాలకోసం ఏడుస్తూ ఏడుస్తూ కాలితో తన్నగానే ఈ బండి తిరగబడి విరిగిపోయింది" అని గోపకులు చెప్పిన మాటలు విని గోపకాంతలు ఆశ్చర్యపడ్డారు. "మూడు నెలల బాలుడేమిటి? ఇంత శకటాన్ని తన్నటమేమిటి? అది తిరగబడి విరగటమేమిటి? వీడిని ఏ బాలగ్రహమో పట్టుకున్నది" అని భావించి యశోద బ్రాహ్మణుల చేత గ్రహయజ్ఞం చేయించింది.

## శకటాసురుని పూర్వజన్మ:

ఈ ఉత్కచుడు పూర్వజన్మలో హిరణ్యాక్షుని కుమారుడు. ఆతడు ఒకసారి లోమశ మహర్షి ఆశ్రమానికి వెళ్ళి అక్కడున్న చెట్లనన్నింటినీ విరిచివేశాడు. ఆ దృశ్యం చూచిన లోమశమహర్షి కోపించి " దుష్టుడా! నీవు ఈ స్థూలమైన దేహం చూసికొని విర్రవీగుతున్నావు. నీవు దేహ రహితుడవౌదువుగాక!" అని శపించాడు. అప్పుడుత్కచుడు మహర్షి పాదాలపైబడి శరణువేడగా దయామయుడైన ఆ మహర్షి ద్వాపర యుగాంతంలో పరమాత్ముని చరణ స్పర్శసోకినపుడు వాయుశరీరం పోయి తిరిగి నీవు దేహధారివి కాగల వని పలికాడు. ఆ లోమశ మహర్షి తన జీవితకాలంలో నూరుగురు బ్రహ్మలను చూశాడు. ఆ మహర్షిశాపం ఉత్కచునకు వరమయింది. ఆతడు శ్రీకృష్ణపరమాత్ముని పాద స్పర్శభాగ్యంపొంది మోక్షధామం చేరుకున్నాడు.

## తృణావర్తుడు:

ఒకరోజున యశోద ఒడిలో బాలకృష్ణుడు ఆడుకుంటున్నాడు. ఆశ్చర్యంగా ఆ లీలాబాలుడు క్రమక్రమంగా బరువెక్కసాగాడు. విశేషమైన భారంతో ఉన్న కుమారుణ్ణి ఆమె మోయలేక నేల మీద కూర్చొనబెట్టింది. "ఈ బాలునకు ఇంతబరువు ఎక్కడనుండి వచ్చింది? ఆశ్చర్యంగా ఉందే!" అనుకున్నది యశోద. అదేసమయంలో కంసునిచేత పంపబడిన మహాబలుడైన తృణావర్తుడనే దైత్యుడు సుడిగాలిరూపంలో వచ్చి నందకిశోరుణ్ణి ఆకాశానికి ఎత్తుకుపోయాడు. ఆ ధూళివల్ల నందవ్రజమంతా అంధకార బంధురమై పోయింది. కొంతసేపటికి యశోద కళ్ళు తెరచి చూచేసరికి బాలకృష్ణుడు కనిపించలేదు. ఆమె ఆందోళనతో ఆక్రందిస్తూ గోపాలుని వెదుక సాగింది. గోపికలందరూ వచ్చి కృష్ణునికోసం అన్వేషించారు. వారికంటి వెంట దుఃఖాశ్రువులు దొరలసాగాయి. గోవత్సంకోసం వెదికే గోవువలె యశోద తల్లడిల్లిపోయింది. అక్కడ తృణావర్తుడు పది యోజనాలదూరం పైకివెళ్ళాడు. పర్వతం వంటి అతని శరీరంపై బాలకృష్ణుడు కూర్చొని ఉన్నాడు. ఆ తృణావర్తునకు క్రమంగా కృష్ణుడు భారం కాసాగాడు. చివరికాతడు కృష్ణుణ్ణి అక్కడ నుండి నేలపై విసిరివేయాలని ప్రయత్నించాడు. కాని కృష్ణుడాతని మెడను పట్టుకొని వదల లేదు. ఆ నిశాచరుడు తనను వదిలి పెట్టమని ఆక్రందించి చివరకు ప్రాణాలు కోల్పోయి క్రిందపడ్డాడు. అతని లోనుంచి ఒక తేజస్సు వచ్చి కృష్ణునిలో లీనమయింది. అతడు పడిన శబ్దం విని గోపకాంతలక్కడకు పరుగుపరుగున వచ్చి ప్రాణాలు కోల్పోయిన రాక్షసుణ్ణి, ఆతని శరీరంపై ఆడుకొంటున్న బాలకృష్ణుణ్ణి చూచి ఆశ్చర్యపడ్డారు. వారంతా యశోదతో "అమ్మా! నీ కుమారుణ్ణి జాగ్రత్తగా కాపాడుకోవాలి. అశ్రద్ధతో ఉండవద్దు" అన్నారు. అప్పుడు యశోద "సోదరీమణులారా! నాకున్నది ఈ ఒక్కడే కుమారుడు. వీడిమీదకు క్షణక్షణము ఏదో ఒక అరిష్టంవస్తూనే ఉన్నది" అని బాధపడింది.

## తృణావర్తుని పూర్వజన్మ:

పూర్వం పాండు దేశంలో సహస్రాక్షుడనే మహారాజు ఉండేవాడు. ఆతడు విష్ణుభక్తుడు. యజ్ఞయాగాదులు చేసినవాడు. ఒకరోజున ఆతడు రేవా (నర్మదా) నదీతీరంలో స్త్రీలతో విహరిస్తుండగా అక్కడకు మహర్షి దుర్వాసుడు వచ్చాడు.

కామాంధుడైన సహస్రాక్షుడు మహర్షిని గమనించికూడా ఆయనకు నమస్కరింపలేదు. అప్పుడాయనకు ఆగ్రహం వచ్చి "నీవు రాక్షసుడవగుదువు గాక!" అని శపించాడు. అందుకు భయపడి సహస్రాక్షుడు దుర్వాసుని చరణములపైపడి శరణువేడాడు. దుర్వాసుడు కనికరించి "శ్రీకృష్ణ పరమాత్ముని దివ్య స్పర్శ కలిగినప్పుడు నీకు ముక్తి కలుగుతుంద"ని అన్నాడు. మహర్షి శాపంవల్ల సహస్రాక్షుడే తృణావర్తునిగా జన్మించి పరమాత్ముని స్పర్శవల్ల ముక్తుడయ్యాడు.

## యశోదానందుల పూర్వజన్మ :

నారదమహర్షి చెప్పిన ఈ వృత్తాంతం విని బహుళాశ్వుడు "ఆ యశోదానందులెంత అదృష్టవంతులు? తల్లిదండ్రులకు కూడా కలుగని భాగ్యం యశోదా నందులకెలా కలిగింది?" అని ప్రశ్నించాడు. అందుకు నారదుడిలా సమాధానం చెప్పాడు.

మహారాజా! అష్టవసువులలో ప్రముఖుడు ద్రోణుడు అతని భార్యపేరు ధర. వారిద్దరూ విష్ణుభక్తులు. వారు సంతానం లేని కారణంగా మందరాచలంపైకి వెళ్ళి బ్రహ్మను గూర్చి తపస్సుచేశారు. వారి కఠోరమైన తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకొనుమన్నాడు. అప్పుడు ద్రోణుడు "భగవంతుడు మాకు కుమారుడు కావాలి. మేమిద్దరం ఆ పరాత్పరుని సేవించి ఈ భవసాగరాన్ని తరించాలి. ఇదే మాకోరిక" అన్నాడు. అప్పుడు బ్రహ్మ "నీవు కోరిన వరం ఈ జన్మలో దుర్లభమయింది. మీకోరిక వచ్చేజన్మలో నెరవేరుతుంది. అప్పుడు మీకు భగవానుడు కుమారుడుకాగలడు" అని పలికాడు. ఆ ధరాద్రోణులే యశోదానందులుగా ఉద్భవించారు. బ్రహ్మ వాక్కు నిజం చేయటం కోసం పసిబాలుడైన కృష్ణుడు మధుర నుంచి వ్రజానికి వచ్చాడు. ఈ కృష్ణుని శుభచరిత్ర అమృతం కన్నా మధురమయింది. ఈ దివ్య వృత్తాంతాన్ని నేను గంధమాదన పర్వతం మీద సాక్షాత్తు నారాయణుని ద్వారా విన్నాను. ఆ విషయమే ఇప్పుడు నీకు వివరించాను. అని నారదుడు పలికినప్పుడు బహుళాశ్వుడు పరమానందభరితుడయ్యాడు.

## నామకరణోత్సవము :

మరల నారదుడిలా చెప్ప నారంభించాడు - ఒక శుభముహూర్తంలో వసుదేవుని చేత పంపబడి గర్గాచార్యుడు శిష్యసహితంగా నందవ్రజానికి విచ్చేశాడు. నందుడు

ఆయనను ఆదరించి "ఆర్యా! మీచరణ ధూళిసోకి మా గృహం పవిత్రమయింది. మీరాక మాకెంతో ఆనందం కలిగించింది. తమరు మాకుమారునకు నామకరణం చేయవలసింది." అని ప్రార్థించాడు. అప్పుడు గర్గమహర్షి "నందరాజా! నీకుమారునకు నామకరణం చేస్తాను, ఇందులో సంశయం లేదు. కాని వెనుకటి ఒక విషయం చెప్తాను. ఏకాంత స్థలానికి పద" అని గర్గమహర్షి నందుణ్ణి, యశోదను, ఇద్దరు కుమారులను తీసికొని ఇతరులెవరు లేని గోశాలలోనికి వెళ్ళి అక్కడ బాలకులిద్దరికి నామకరణసంస్కారం జరిపించాడు. విఘ్నేశ్వర పూజ చేసి నవగ్రహశాంతి చేసి గర్గమహర్షి "ముందు రోహిణీ పుత్రునకు పేరుపెడుతున్నాను విను. ఇతని యందు యోగి జనులు రమిస్తూఉంటారు. తన గుణముల చేత భక్తుల హృదయాలను రమింపచేస్తాడు. కాబట్టి ఈతడు రాముడనే పేరుతో పిలువబడతాడు. యోగమాయ వల్ల గర్భము యొక్క సంకర్షణ వల్ల ఈతడు జన్మించాడు కాబట్టి ఈతడు సంకర్షణుడనే పేరుతో ప్రసిద్ధుడౌతాడు. బలవంతులలో అధికుడు కాబట్టి బలరాముడని పిలువబడతాడు.

ఇక నీ బాలుని నామకరణం విను. ప్రాణికోటినంతటినీ పావన మొనర్చి, జగత్తుకు కల్యాణం కలిగించేది ఈతని నామము. సత్య, త్రేత, ద్వాపర, కలియుగాలలో ఈతడు శుక్ల, రక్త, పీత, కృష్ణ కాంతులతో విలసిల్లుతుంటాడు. ద్వాపరయుగం చివరలో, కలియుగం ఆదిలో ఈ బాలుడు కృష్ణకాంతితో ఉన్నాడు కాబట్టి నందనందనుడు "కృష్ణ" అను పేరుతో ప్రఖ్యాతి పొందుతాడు. కమలాప్రియుడు కావటం వల్ల 'క'కారము, శ్రీరాముడు కాబట్టి 'ఋ' కారము, షడ్విధసంపన్నుడు కాబట్టి 'ష' కారము, నారసింహుడు కాబట్టి 'ణ' కారము, అగ్నిరూపంతో హవిష్యములు స్వీకరిస్తాడు కాబట్టి అకారము, నరనారాయణ స్వరూపము కాబట్టి ':' వీటికలయికగా "కృష్ణః" అనుపేరు ఈ బాలకునకు తగినది. ఈతడు వాసుదేవుడుగా, రాధాపతిగా కూడా పిలువబడతాడు. నీ కుమారులు దుష్ట శిక్షణకై, భక్తజనరక్షణకై విచ్చేసిన అవతారమూర్తులు. వీరి నామములు అనంతములు. ఆ సమస్త నామములు వేదములలో గూఢరూపంలో చెప్పబడినాయి" అని పలికి గర్గమహర్షి అచటనుండి బయలుదేరి యమునాతీరంలో ఉన్న వృషభానుని ఇంటికి చేరుకున్నాడు.

**రాధాకృష్ణ ప్రశంస :**

వృషభానుడు గర్గమహర్షిని ఆదరముతో ఆహ్వానించి "ఓ మహాత్మా! మీరాక

మాకెంతో ఆనందం కలిగించింది. మీ దర్శనం వల్ల మేమంతా పవిత్రులమయ్యాము. ఓ మునీశ్వరా! నాకుమార్తె రాధికకు తగిన భర్త ఎవరో తెలుపవలసినది'' అన్నాడు. అప్పుడు గర్గమహర్షి వృషభానుణ్ణి యమునానదీ తీరానికి తీసికొని వెళ్ళి "ఓ వృషభానుడా! ఒక రహస్యమున్నది. ఈ విషయం నీవు ఎవరికీ చెప్పవద్దు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, గోలోకనాథుడు, పరాత్పరుడు, అద్వితీయుడు అయిన భగవంతుడు శ్రీకృష్ణుడనే పేరుతో నందుని ఇంట జన్మించాడు. భూభారాన్ని తొలగించటానికి కంసాది దుష్టులను నశింపచేయటానికి బ్రహ్మదేవుని ప్రార్థనపై భగవానుడు పృథ్విపై అవతరించాడు. రాధాకృష్ణులు గోలోకంలో విహరించే దంపతులు. ఆరాధయే నీకు కుమార్తెగా జన్మించింది. ఆమెను పరాశక్తిగా నీవు తెలిసికొన లేకపోతున్నావు'' అన్నాడు. ఈ మాటలను విని వృషభానుడు ఆశ్చర్యచకితుడై "ఓ మహాత్మా! ఆ కృష్ణ పరమాత్మునకే నేను నాకుమార్తెను సమర్పిస్తాను. ఈ వివాహము మీరే జరిపించాలి'' అని పలికాడు. అప్పుడు గర్గమహర్షి "రాధాకృష్ణుల వివాహం యమునాతీరంలో భాండీర వనంలో బృందావనం సమీపంలో సాక్షాత్తు బ్రహ్మదేవుడే వచ్చి జరిపిస్తాడు. మీ గోపకులంతా గోలోక ధామం నుంచి ఈ భూమండలానికి వచ్చారు. రాధా శబ్దంలో "ర'' కారం వల్ల రమాదేవి, "ధ'' కారం వల్ల ధర, "ఆ'' కారం వల్ల విరజానది సూచింపబడినాయి. "రాధాకృష్ణ'' నామోచ్చారణవల్ల కృష్ణ పరమాత్ముడు సులభంగా ప్రసన్ను డవుతాడు'' అనిచెప్పి గర్గమహర్షి వృషభానుని వీడ్కొని వెళ్ళాడు.

## కళ్యాణోత్సవము :

ఒక రోజున నందుడు బాలకృష్ణుణ్ణి ఎత్తుకొని గోవులవెంట యమునా తీరంలోని భాండీరవనంలో ప్రవేశించాడు. కొద్దిసేపట్లో పరమాత్ముని మాయాప్రభావంవల్ల తీవ్రంగా గాలి వీచి ఆకాశమంతా దట్టమైన మేఘాలతో నిండిపోయింది. క్రమంగా అంధకారబంధురమయింది. నందనందనుడు ఏడువసాగాడు, నందుడు కూడా భయపడి పరమేశ్వరుని ప్రార్థింపసాగాడు, ఆ సమయంలో వృషభానునందిని రాధ అనంతమైన కాంతులతో వెలిగిపోతూ అక్కడకు వచ్చింది. అందమైన నీలాంబరంతో, దివ్యాభరణ భూషితయై, అపూర్వమైన తేజస్సుతో ఆమె ప్రకాశింపసాగింది. అప్పుడు నందుడు ఆమెకు నమస్కరించి "అమ్మా!రాధా! ఈ నా కుమారుడు పురుషోత్తముడు, నీవు ఈతనికి ప్రాణవల్లభవు. ఈ రహస్యాన్ని నాకు గర్గమహర్షి తెలియచేశాడు.

ఈబాలుడు భయపడి ఏడుస్తున్నాడు. వీనిని నీవు ఇంటికి తీసికొనివెళ్ళు" అనిపలుకగా, రాధ ప్రసన్నురాలై నందనందనుణ్ణి తన కరకమలాలలోనికి తీసుకున్నది.

ఆ సమయంలో అక్కడ గోలోకఖండం సాక్షాత్కరించింది. కల్పవృక్షాలతో, గోవర్ధనపర్వతం నుంచి ప్రవహించే సెలయేరులతో, పూలమంటపాలతో, వసంతవిలాసంతో ప్రకృతి పరవశింపచేయసాగింది. అప్పుడు ఘనశ్యాముడైన బాలకృష్ణుడు, యుక్తవయస్కుడుగా రూపుదాల్చి రాధ సమ్ముఖమున నిలబడ్డాడు. పీతాంబరధారియై, కౌస్తుభమణి విభూషితుడై మురళీలోలుడై, నందనందనుడు సమ్మోహితస్వరూపంతో తేజరిల్లసాగాడు. ఆ స్వామి మందహాస వదనంతో రాధ చేయిపట్టుకొని వివాహమంటపంలో ప్రవేశించాడు. ఆకాశమార్గంనుంచి బ్రహ్మ అక్కడకు వచ్చాడు. వివాహసామగ్రి అంతా అక్కడ ప్రత్యక్షమయింది. వారిని చూచి బ్రహ్మదేవుడు "మీరిద్దరూ పురాణదంపతులు. గోలోకధామమునకు అధినాయకులు. మీ లీలలు అనంతములు. నీవు సాక్షాత్తు వైకుంఠనాథుడవు. ఈమె లక్ష్మీదేవి. నీవు శ్రీరామచంద్రుడవైనప్పుడు, ఈమె జనకనందన సీత. నీవు యజ్ఞ పురుషుడవైనప్పుడు ఈమె దక్షిణాదేవి. నీవు పరబ్రహ్మవు కాగా ఈమె ప్రకృతి" అని స్తుతించి వేదికపై అగ్నిహోత్రమును ప్రజ్వలింపచేశాడు. తాను వేదమంత్రాలను పఠిస్తూ ఆ పురాణదంపతులచేత అగ్నిహోత్రం చుట్టూ ప్రదక్షిణలు చేయించాడు. వైదిక విధి విధానంగా పాణిగ్రహణ కార్యక్రమాన్ని పూర్తి గావించాడు. ఆ సమయంలో దేవతలు పూలవాన కురిపించారు. గంధర్వులు విద్యాధరులు సుమంగళ గీతాలను గానం చేశారు. అప్పుడు కృష్ణపరమాత్ముడు విధాతను చూచి "నీకు కావలసిన దక్షిణ కోరకొను"మని అన్నాడు. అందుకు విధాత "మీదంపతుల చరణకమలాలపై అకుంఠితమైన భక్తిని నాకు దక్షిణగా ప్రసాదించు"మని అన్నాడు. పరమాత్ముడు ఆయనకు అభీష్ట వరప్రదానము చేశాడు. అనంతరం రాధాకృష్ణులు యమునా తీరంలో రాసవిహారం చేశారు. ఆ తరువాత ఆశ్చర్యకరంగా యుక్తవయస్కుడైన పరమాత్ముడు బాలకృష్ణుడుగా మారిపోయాడు. అప్పుడు రాధ దిగ్భ్రాంతి చెందగా ఆకాశవాణి "రాధా! నీవెంతమాత్రం విచారపడవద్దు. పరమాత్ముణ్ణి పతిగా పొందిన నీవు ధన్యవు. కొద్ది కాలం తరువాత నీకోరిక నెరవేరుతుంది" అనే పలుకులు వినిపించాయి. రాధ ఆనందంతో బాలకృష్ణుణ ఎత్తుకొని నందుని ఇంటికి వెళ్ళి యశోదకు అప్పగించింది. ఓ మహారాజా! ఈవిధంగా రాధామాధవుల వివాహం భాండీర వనంలో రహస్యంగా జరిగింది అని నారదమహర్షి తెలియచేశాడు.

## బాల్యక్రీడలు :

త్రిభువనాలను మోహింపచేసే లీలాబాలకులైన రాముడు, శ్యాముడు గోకులంలో యశోదానందులకు పరమానందానుభూతిని కలిగిస్తున్నారు. ధూళిలో ఆడుకొని పరుగులు తీస్తూవచ్చే కుమారుల్ని అపరిమితమైన ఆప్యాయతతో ఒడిలోనికి తీసికొని ఆమె మైమరచిపోయేది. బలరామకృష్ణులకు నీలపీతాంబరములు కట్టి బంగరు నగలను అలంకరించి ఆ తల్లి ఆనందడోలికలలో తేలిపోయేది. ఆ బాలముకుందుని దర్శనంకోసం గోపికలు తమతమ గృహములను విడిచిపెట్టి నందుని ఇంటికి వచ్చిఎనలేని చిత్తశాంతిని పొంది, తిరిగి ఇంటికి వెళ్ళటం మరచిపోయేవారు. వారు యశోదతో "తల్లీ! నీ కుమారుని ఆకర్షణకు అంతులేదు. ఎవరిదైనా దృష్టిదోషంతగిలేను సుమా! ఈ బాలుణ్ణి బయటకు రానియ్యకు. చూశావా! వీనికి ముందుగా పైరెండు పళ్ళువచ్చాయి. ఇది మేన మామకు గండం సుమా!" అని పలికారు. అందుకు యశోద తగురీతిగా శాంతి దానాలు చేసింది.

## నవనీతచౌర్యం :

బలరామకృష్ణులు క్రమంగా పెరిగి పెద్దవారవుతున్నారు. వీరికి శ్రీదాముడు, సుబలుడు మున్నగు వ్రజబాలకులు స్నేహితులయ్యారు. వీరంతా యమునా తీరంలో తమాల కదంబవనాలలో విహరింప సాగారు. శ్రీకృష్ణుడు నంద వ్రజంలో గోపాలురకు, గోపికలకు ఆనందం కలిగించటం కోసం స్నేహితులతో కలిసి ఇరుగు పొరుగు వారి ఇండ్లకు రహస్యంగా వెళ్ళి వెన్న, నెయ్యి, పాలు, పెరుగు దొంగతనంగా ఆరగింప సాగాడు. ఇలా కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు ఉపనంద పత్ని అయిన ప్రభావతి అనే గోపిక నందుని ఇంటికి వచ్చి యశోదతో "ఓ యశోమతీ! మాఇంటిలోని వెన్న, నెయ్యి, పాలు, పెరుగు మీవిగానే భావించి మీ కుమారుడుదొంగిలించి ఆరగిస్తున్నాడు. మీవాడికి మన తన అనే భేదం కనిపించటంలేదు. ఇదంతా నీ దయాప్రసాదమే. నీ కుమారుడు దొంగతనం నేర్చుకున్నాడని నేననటంకాదుకానీ, ఇన్ని పర్యాయాలు వెన్న దొంగతనం చేసినా నీవు పిలిచి ఒక్కసారైనా హెచ్చరించావా? ఒకరోజున నేను వీడిని పట్టుకొని బుద్ధి చెప్తుంటే నన్ను నానామాటలు అని పరుగెత్తుకువచ్చాడు. ఓ యశోదా! నందరాజు కుమారుడై ఉండి కృష్ణుడు దొంగతనం చేయటం భావ్యం కాదు. నీమీద ఆదరంతో నేను ఇన్నాళ్ళు ఈ విషయాలు

చెప్పలేదు." అని పలికింది. ప్రభావతి మాటలు విని నందపత్ని యశోద ప్రేమపూర్వకంగా "ఓ సోదరీ! మా ఇంట లక్షలాది గోవులున్నాయి.మా ఇల్లు నిరంతరం పాలతో తడిసిపోయి ఉంటుంది. అటువంటప్పుడు ఈ బాలుడు మీ ఇంట్లో పాలు, వెన్న ఎందుకు దొంగతనం చేస్తాడు? ఇక్కడ ఎంతబ్రతిమలాడినా పాలు త్రాగడు, వెన్నతినడు. ఒకవేళ వీడు వెన్న దొంగతనంగా తింటుంటే అప్పుడు వీడిని పట్టుకువచ్చి నాకు చూపించు, నేను దండిస్తాను, ఇంటిలో కట్టిపడవేస్తాను" అని పలుకగా ప్రభావతి ప్రసన్నతా పూర్వకంగా తనయింటికి తిరిగి వెళ్ళింది.

ఒకనాడు శ్రీకృష్ణుడు తన స్నేహితులతో కలసి మరల నవనీత చౌర్యం కోసం ఆమె ఇంటికే వెళ్ళాడు. ఇంటి గోడకు ఆనుకొని ఒకరిచేయి ఒకరుపట్టుకొని మెల్ల మెల్లగా నడుస్తూ ఇంటి లోపలికి ప్రవేశించారు. ఉట్టిమీద ఉంచిన పాలను అందుకొనటానికి కృష్ణుడు రోలుమీద ఒకపీటను వేసి దానిపై ఒకగోపాలుని నిలబెట్టి మెల్లగా ఆతని మీదకు తాను ఎక్కాడు. అప్పటికీ ఉట్టిమీద పెట్టిన పాలు చేతికి అందలేదు. అప్పుడు శ్రీదామ సుబలుల సహాయంతో కృష్ణుడు ఒక కర్ర తీసికొని కుండను పగులకొట్టాడు. ఒక్కసారిగా కుండలోని పెరుగంతా నేలపాలయింది. బలరామకృష్ణులు, గోపాలకులు కలిసి కడుపునిండా ఆ పెరుగును ఆరగించారు. కుండ పగిలిన శబ్దం విని ప్రభావతి అక్కడకు వచ్చింది. వెంటనే గోపాలకులంతా తప్పించుకొని పారిపోయారు. ఆమెకృష్ణుని చేతిని పట్టుకున్నది. కృష్ణుడుభయపడి కంటనీరు పెట్టాడు.

ప్రభావతి గోపాలుణ్ణి నంద భవనానికి తీసుకు వచ్చింది. అక్కడ నందరాజు నిలబడి ఉన్నాడు. ఆతనిని చూచి ప్రభావతి ముఖంపై ముసుగు వేసుకున్నది. రోషకషాయిత నేత్రయై ప్రభావతి రివ్వురివ్వున యశోద దగ్గరకు వెళ్ళి " వీడు నాఇంట్లోకుండపగలగొట్టి పెరుగు తింటుంటే పట్టుకున్నా చూడు" అని ఆవేశంతోపలికింది. ఆదృశ్యం చూచి, ఆమాటలు విని యశోద పకపకా నవ్వుతూ "ముందు నీవు ముఖంమీద మేలిముసుగుతీసి బాలకుని ముఖం చూచి మాట్లాడు" అన్నది. అప్పుడామె ముఖంమీద ముసుగు తీసి చూస్తే తాను చేతితో పట్టుకున్నది తనకుమారుడినే. కృష్ణుని మాయనెరుగలేక నలుగురిలో సిగ్గుపడి "నేను నందకిశోరుణ్ణి పట్టుకుంటే నీ వెక్కడనుంచి వచ్చావు? ఎప్పుడు వచ్చావు?" అని వాడిని లాక్కొని ఇంటికి వెళ్ళిపోయింది. యశోద, రోహిణి, నందుడు, బలరాముడు, గోపాలురు, గోపికలు

ఒకటే నవ్వుతూ "గోకులమంతా అన్యాయాలతో అభాండాలతో నిండి పోతున్నది" అనుకున్నారు.

తరువాత బయటకువచ్చి బాలకృష్ణుడు చంచలనేత్రాలతో కోపం నటిస్తూ ఆ గోపికలవైపు చూచి "ఈసారి మీరెవరైనా నన్ను పట్టుకుంటే నేను మీ భర్త రూపం ధరిస్తాను. జాగ్రత్త!" అనిపలికాడు. అది విని గోపకాంతలు ఆశ్చర్యచకితలై ఇళ్ళకు వెళ్ళారు. అప్పటినుంచి ఆ గోపికలు తమ ఇంట శ్రీకృష్ణుడు పాలు,వెన్న దొంగతనం చేయటం చూసినాకూడ సిగ్గుతో ఆతని చేతిని పట్టుకొనలేకపోయారు. ఈవిధంగా గోపాంగనల గృహాలలో సంచరిస్తూ నవనీత చౌర్యం చేస్తూ గోపికాచిత్తచోరుడై కృష్ణుడు గోకులంలో విలసిల్లుతున్నాడు. నవనందులు నందనందనుణ్ణి పట్టుకొని తమ ఇంటికి తీసికొనివెళ్ళి కూర్చొనబెట్టుకొని దివ్యమైన ఆ రూపమాధురిలో మైమంచిపోయేవారు. బాలకృష్ణుని మాటలకు, పాటలకు, నృత్యాలకు మురిసిపోయి గోకులమంతా జగత్తును మరచిపోయేది.



ఈ మాటలువిని బహుళాశ్వమహారాజు నారదునితో "మహర్షీ! ఉపనందుడు, నందుడు, వృషభానుడు అంటే ఎవరెరవరు?" అని అడిగినప్పుడు నారదమహర్షి "ఓ మహారాజా! ఐదులక్షల గోవుల కధిపతియైనవాడు ఉపనందుడని. తొమ్మిదిలక్షల గోవులకధిపతిని నందుడని, పదిలక్షల గోవులకధిపతిని వృషభానుడని, కోటిగోవులకధిపతిని నందరాజని అంటారు. వీతిహోత్రుడు, అగ్నిభుక్కు, సాంబుడు, శ్రీవరుడు, గోపతి,

శ్రుతుడు, వ్రజేశుడు, పావనుడు, శాంతుడు అని ఉపనందులు తొమ్మిదిమంది. గయుడు, విమలుడు, శ్రీశుడు, శ్రీధరుడు, మంగళాయనుడు, మంగళుడు, రంగవల్లీశుడు, రంగోజి, దేవనాయకుడు అను తొమ్మిది మందిని నవనందులుగా పిలుస్తారు.నీతివిదుడు, మార్గదుడు, శుక్లుడు, పతంగుడు, దివ్యవాహనుడు, గోపేష్టుడు అను ఆరుగురు వృషభానులు. గోలోకధామంలో పరాత్పరుని సన్నిధిలో నివసించే వీరంతా నందవ్రజంలో అవతరించారు.

## మృద్భక్షణ లీల :

ఓ మహారాజా! ఒకనాడు బాలకృష్ణుడు యమునాతీరంలో మట్టిని ఆరగించాడు. అప్పుడు గోపాలకులు వచ్చి యశోదతో "అమ్మా! నీకుమారుడు మట్టి తింటున్నాడు" అని చెప్పారు. యశోద గబగబావచ్చి కుమారుని చేతిని పట్టుకున్నది. కృష్ణుని కంటివెంట బాష్పబిందువులు దొరలసాగాయి. అప్పుడు యశోద కుమారునితో "ఓరి మూఢుడా! నీవు మట్టి ఎందుకుతిన్నావు? నీ స్నేహితులు చెప్పున్నారు, నీ అన్న బలరాముడు చెప్పుతున్నాడు. వారంతా అడ్డగించినా కూడా నీవు మట్టి తిన్నావట. నిజమేనా?" అని గద్దించింది;. అప్పుడు శ్యామసుందరుడు నెమ్మదిగా



"అమ్మా! వ్రజంలోని ఈ బాలకులంతా అబద్ధం చెప్తున్నారు. నేనెప్పుడూ మట్టి తినలేదు. నా మాట అబద్ధమనిపిస్తే నా నోరుచూడు" అన్నాడు. అప్పుడు యశోద బాలకుని సుందర ముఖాన్ని చూచింది. బాలకృష్ణుని నోటిలో త్రిగుణములచేత రచింపబడిన, దశదిశల వ్యాప్తమైన బ్రహ్మాండం కనిపించింది. సప్తద్వీపములు, సప్త సముద్రములు, భూభాగములు, పర్వతములు, ముల్లోకములు, సమస్త వ్రజమండలంతోపాటు తానుకూడ తనకుమారునినోటిలో కనిపించటం ఆమెకు దిగ్భ్రాంతి కలిగించింది. ఆమె ఆ యమునా తీరంలోనే చతికిలబడి "నా కుమారుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే" అని భావించి భావించి ధ్యానమగ్నురాలయింది. అప్పుడు బాలకృష్ణుడు ఆమెను తన మాయచేత తిరిగి మోహంలో ముంచి పకపకా నవ్వసాగాడు. వెంటనే యశోద కళ్ళు తెర చి చూచి మరల తన కుమారుడనే మోహంలో పడిపోయి కృష్ణుడు చూపిన లీలను భ్రాంతిగా భావించింది.

**ఉలూఖల బంధము :**

ఒకనాటి ఉదయం గోపకాంతలు గోపాలకృష్ణుని లీలలను పాడుకుంటూ గోకులంలో పెరుగుచిలుక సాగారు. నందమందిరంలో యశోదకూడా ప్రాత: కాలమే లేచి దధిభాండంలో కవ్వం పెట్టి చిలుక సాగింది. కవ్వం సవ్వడి వినగానే శ్యామసుందరుడు నవనీతం కోసంవచ్చి ఆ లయకు అనుగుణంగా నృత్యం చేయసాగాడు. తల్లిచుట్టూ తిరుగుతూ ఆమె కంకణాల సవ్వడికి అనుగుణంగా నందనందనుడు చిందులు వేసే సన్నివేశం మనోహరంగా ఉంది. మధురమైన మాటలను పలుకుతూ జాలిగా కన్నయ్య వెన్న నడుగసాగాడు. ఎంతసేపటికీ తనకు వెన్న లభింపకపోయేసరికి కృష్ణుడు కోపంతో ఒక చిన్నరాయితీసికొని పెరుగుకుండను పగులగొట్టి పరుగులు తీశాడు. నందకిశోరుణ్ణి పట్టుకొనటం కోసం వెనుకనే పరుగెత్తింది యశోద. కృష్ణుడు చేతికందే దూరంలోనే ఉన్నప్పటికీ యశోద పట్టుకొనలేక పోయింది. యోగీశ్వరులకు కూడ పట్టుపడని పరాత్పరుడు చివరకు తనకు తానుగా ఆ తల్లి చేతికి చిక్కాడు. అప్పుడు యశోద బాలుణ్ణిపట్టుకొని రోషంతో తాడుతో రోలుకు కట్టివేయటానికిపూనుకున్నది.ఆమె ఎంత త్రాడు తెచ్చినా అది బాలకృష్ణుణ్ణి బంధించటానికి తక్కువౌతూనే ఉన్నది. ప్రకృతిలోని త్రిగుణములచేత బంధింపబడలేని ప్రకృతికంటె భిన్నుడైన పరమాత్మ గుణము(త్రాడు) చేత ఎలా బంధితుడౌతాడు? బంధించటానికి ప్రయత్నించి ప్రయత్నించి అలసిపోయి యశోద కూర్చొని ఉండగా, తల్లి స్థితిని

చూచి జాలిపడి శ్రీకృష్ణుడు స్వవశంలో ఉన్నవాడు పరవశమయ్యాడు. కర్మ త్యాగులైన జ్ఞానులకు కూడా లభింపని పరమాత్ముడు కర్మాసక్తులైన వారికి ఎలాలభిస్తాడు? మరి ఇప్పుడు శ్యామసుందరుడు యశోద బంధనం లోకి తనంత తాను రావటం భక్తి యొక్కవైశిష్ట్యం తప్ప వేరుకాదు. అందువల్లనే భగవానుడు జ్ఞానసాధకులకు, ఆరాధకులకు ముక్తినిస్తాడుకాని భక్తినివ్వడు.

## యమళార్జున గర్వభంగము :

బాలకృష్ణుడు గోపబాలకులతో ఆడుకుంటూ ఆ రోటిని యమునాతీరంలో ఉన్న రెండు అర్జున వృక్షాల మధ్యగా ఒక్కసారిగా లాగేసరికి ఆ వేగానికి ఆరెండు వృక్షాలు విరిగి పడిపోయాయి. ఆవృక్షాలనుంచి ఇద్దరు దేవతలు వెలువడి దామోదరుని పాదాలకు ప్రణమిల్లి"హే!అచ్యుతా! మేము నీభక్తులను హేళనచేసి ఇలా మద్దివృక్షాలమయ్యాము. ఇప్పుడు నీదర్శనం వల్ల మాఇద్దరికీ ముక్తి లభించింది. నీవు కరుణానిధివి. నీకు అభివందనములు తండ్రీ!" అని ఆకాశ మార్గంలో ఉత్తరం వైపుకు వెళ్ళిపోయారు. అదే సమయంలో భీతచిత్తులైన నందాది గోపకులు అక్కడకు చేరుకున్నారు. గోపాలకులు జరిగిన విషయమంతా వివరించారు.వృద్ధ గోపాలురు ఈ మాటలను విశ్వసింపలేదు. నందుడు తనకుమారునికు కట్టినత్రాటిని విప్పి ఎత్తుకున్నాడు.

ఈ విషయం విన్న బహుళాశ్వ మహారాజు "నారదమహర్షీ! ఆదివ్యపురుషులిద్దరూ ఎవరు? వారు యమళార్జున వృక్షాలుగా ఎందుకు మారారు" అని అడిగాడు. అప్పుడు నారదుడు-"ఓ రాజా! వారిద్దరూ కుబేరుని కుమారులు నలకూబర మణిగ్రీవులు. ఒకరోజున వారిరువురు మందాకినీ నదిలో దేవకాంతలతో విహరిస్తున్నారు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన దేవళుడనే మహర్షిని చూచి నలకూబర మణిగ్రీవులు ఐశ్వర్య సౌందర్య గర్వంతో ఆయనను ఆదరింపలేదు. అందుకు ఆగ్రహించిన మహర్షి "మీరిరువురు జడులవలె లజ్జా విహీనులై ఉన్నారు కాబట్టి మీరు వృక్షములగుదురు గాక!" అని శపించాడు. ఆ మహర్షి వారి యందనుగ్రహంతో వారికి పూర్వజన్మ స్మృతిని నిలిపాడు. " ద్వాపరాంతంలో వ్రజ మండలంలో శ్రీకృష్ణుని దర్శనమైనప్పుడు మీరూపములు మీకు ప్రాప్తిస్తాయి" అని శాప విముక్తిని తెలిపాడు. వారే ఈనాడు శ్రీకృష్ణపరమాత్ముని దర్శనం వల్ల మరల దివ్యరూపాలను పొందారు" అని పలికాడు నారదమహర్షి.

**దుర్వాసుడు :**

ఒకనాడు మహర్షి దుర్వాసుడు శ్రీకృష్ణపరమాత్మని దర్శించటానికి వ్రజమండలానికి విచ్చేశాడు. దారిలోనే యమునా తీరంలో ఇసుక తిన్నెలమీద గోపాలకులతో కలిసి ఆడుకొంటున్న బాలకృష్ణుని చూశాడు. శరీరమంతా ధూళి ధూసరితము కాగా స్నేహితులతో మల్లయుద్ధం చేస్తున్న నందకిశోరుని చూచి దుర్వాసుడు ఆశ్చర్యపడి "షడ్విధ ఐశ్వర్య సంపన్నుడైన ఈశ్వరు డీతడేనా? ఈ బాలకులతో ఇలా ఆడుతున్నాడేమిటి? ఈతడు కేవలం నందకుమారుడే తప్ప పరాత్పరుడైన శ్రీకృష్ణుడు కాదు" అని భావించాడు. మహర్షి దుర్వాసుడు ఈవిధమైన మోహంలో పడేటప్పటికి ఆటలాడుతున్న గోపాలుడు గబగబా వచ్చి ఆయన ఒడిలో చేరాడు. మరల వెళ్ళాడు.మరల వచ్చాడు. మహర్షి వైపు చూశాడు. శ్రీకృష్ణుని దృష్టి బాలసింహపు దృష్టివలె ఉన్నది. ఒక్కసారి పకపకా నవ్వి, మధుర మధురంగా మాటలాడాడు. మరింత దగ్గరకు వచ్చాడు.

శ్రీకృష్ణుడు లోపలకు పీలుస్తున్న శ్వాసతో దుర్వాసుడు కృష్ణుని లోపలకు వెళ్ళిపోయాడు. ఆ లోపల ఒక విశాలమైన లోకం. అందులో అరణ్యాలు, నిర్జన ప్రదేశాలు కనిపిస్తున్నాయి. ఆ అరణ్యంలో సంచరిస్తూ "నేనెక్కడి నుంచి ఇక్కడకు వచ్చాను?" అని మహర్షి అనుకొంటుండగా ఒక కొండ చిలువ ఆయనను మ్రింగింది. దానిపొట్టలో ఆయనకు సప్తలోకాలు కనిపించాయి. అక్కడ ఒక ద్వీపంలో సంచరిస్తూ దుర్వాసుడు ఒక శ్వేత పర్వతంపై ఉండి శతకోటి సంవత్సరాలు పరమాత్మను గూర్చి తపస్సు చేశాడు. ఇంతలో విశ్వమంతా ప్రళయంతో నిండి ఆ సముద్ర జలం పొంగిపొంగి మహర్షి కూర్చున్న పర్వతాన్ని ముంచి వేస్తూ చివరకు ఆయనను సమీపించింది. మహర్షి నీటిలో కొట్టుకుపోసాగాడు. ఆ నీటికి అంతు ఎక్కడా కనిపించలేదు. అలా సహస్రయుగాలు గడిచిపోయాయి. ఆ నీటిలో ఆయనకు మరొక బ్రహ్మాండం కనిపించింది. ఆ బ్రహ్మాండాని కున్న ఒక బెజ్జము ద్వారా మహర్షి అందులోకి ప్రవేశించాడు. అక్కడి దివ్యసృష్టిని చూస్తూ కొన్ని కల్పములు గడిపాడు. తరువాత మరల ఆ వివరం ద్వారా బయటకు వచ్చాడు. ఆయనకు అనంతమైన జలరాశి కనిపించింది. అందులో కోట్ల బ్రహ్మాండములు దొర్లుతూ కనిపించాయి. మహర్షి ధ్యానం చేసి అంతా గమనింపసాగాడు. అక్కడాయనకు

విరజానది కనిపించింది. ఆ తీరం వెంట వెళ్ళి ఆయన గోలోకంలో ప్రవేశించాడు. అక్కడ క్రమంగా బృందావనం, గోవర్ధన పర్వతం, సుందర యమునా పులినతలం దర్శనమిచ్చాయి. ఆయనెంతో ప్రసన్నుడయ్యాడు. మహర్షి ఆ నికుంజాలనుంచి లోపలకు వెళ్ళాడు. జ్యోతిర్మండలం మధ్య లక్షదళ కమలంమధ్య పురుషోత్తముడైన శ్రీకృష్ణపరమాత్ముడు దర్శనమిచ్చాడు. చుట్టూ గోప గోపికాగణం, గోవుల సమూహం అసంఖ్యాకంగా కనిపించింది. ఆ గోలోకమంతా దర్శించిన దుర్వాసమునిని చూచి శ్రీకృష్ణుడు నవ్వసాగాడు. ఆ నవ్వే సమయంలో శ్రీకృష్ణుని శ్వాసలోనుంచి మహర్షి ఒక్కసారిగా వచ్చి బయటపడ్డాడు. బయటకు వచ్చి చూస్తే ఎదురుగా యమునాతీరంలో పులినతలంపై గోపాలురతో ఆడుకొంటున్న బాలకృష్ణుడు కనిపించాడు. అప్పుడు శ్యామసుందరుడు సాక్షాత్తు పరాత్పరుడే అని గ్రహించి మహర్షి ఆయన పాదాలకు ప్రణమిల్లి అనేక విధాలుగా స్తుతించి బదరికాశ్రమం వైపుకు పయనమయ్యాడని నారదమహర్షి పలికాడు.



# 2. బృందావన ఖండము

బహుళాశ్వ మహారాజుకు నారదమహర్షి వివరిస్తున్నాడు. వ్రజంలో వివిధ ఉపద్రవాలు జరుగుతుండటం చూచి నందరాజు ఒకనాడు నందులను, ఉపనందులను, వృషభానులను, గోపకులను పిలిపించి "గోపవరులారా! మన వనంలో అనేక ఉత్పాతాలు జరుగుతున్నాయి కదా. ఈ పరిస్థితిలో మన కర్తవ్యం ఏమిటి?" అని అడిగాడు. ఆమాటలు విని వారిలో వృద్ధుడైనటువంటి సన్నందుడనే గోపకుడు బలరామకృష్ణులను ఒడిలోనికి తీసికొని నందునితో "ఓ నందరాజా! మనం మన కుటుంబాలతో సహితంగా సత్వరమే ఇక్కడ నుంచి ప్రశాంతమైన చోటకు వెళ్ళాలి. ఈ బాలకృష్ణుడు ఇక్కడ వ్రజవాసులందరికీ ప్రాణసమానుడు, గోకులమంతటికీ దీపమీ బాలుడు. అటువంటిది ఈ పసిబాలకుడికి దైవవశాత్తు ఆపదలు తొలగిపోయాయి కాని అవి ఎంతటి ఘోర సన్నివేశాలు! మనం ఈ బాలురిద్దరినీ తీసికొని బృందావనానికి వెళదాము. ఇక్కడ పరిస్థితులన్నీ శాంతించిన తరువాతమరల తిరిగివద్దాము" అన్నాడు. అప్పుడు నందరాజు నవ్వి "సన్నంద మహాశయా! ఇక్కడకు బృందావనం ఎంత దూరం ఉంది? ఇక్కడ నుంచి అక్కడకు వెళ్ళి మనం పొందే సుఖం ఏమిటి? చెప్పండి" అన్నాడు. అందుకు సన్నందుడు బృందావన వైశిష్ట్యాన్ని ఇలా వివరింపసాగాడు.

**బృందావనం :**

ఓ నందరాజా! బర్హిష్మతీ పట్టణానికి ఈశాన్యదిక్కులో, యదుపురానికి దక్షిణంలో, శోణపురానికి పశ్చిమంలో ఉన్న భూప్రదేశాన్ని మధురమండల మని అంటారు. ఆ మధుర మండలంలో ఇరవై యోజనాల విస్తృతిగల భూభాగాన్ని దివ్య మధుర మండలమని పిలుస్తారు. తీర్థరాజైన పుష్కరుడు కూడా ఈ మధురమండలాన్ని పూజిస్తాడని గర్గాచార్యులవారు మధురానగరంలో వసుదేవునకు చెప్తున్నప్పుడు విన్నాను. మధురమండలంలో ఉన్న వనములలో కెల్ల బృందావనం శ్రేష్ఠమైనది. అక్కడే గోవర్ధన పర్వతం ఉన్నది, కాళింది ఇసుక తిన్నెలున్నాయి. అక్కడనే బృహత్సాను పర్వతం, నందీశ్వరగిరి మనోజ్ఞంగా కనిపిస్తాయి. పచ్చిక బయళ్ళు విస్తారంగా ఉన్నాయి కాబట్టి పశువుల ఆహారానికి ఇబ్బంది కలుగదు. కాబట్టి మనం అక్కడకు వెళదామని అన్నాడు.

అప్పుడు నందుడు "తీర్థరాజైన పుష్కరునిచేత బృందావనం ఏవిధంగా పూజింపబడింది" అని సన్నందుని అడిగాడు. సన్నందుడిలా సమాధానం చెప్పాడు - ఒక పర్యాయం ప్రళయకాలంలో శంఖాసురుడనే రాక్షసుడు దేవతలనందరినీ జయించి, బ్రహ్మలోకం వెళ్ళాడు. అక్కడ బ్రహ్మదేవుని చెంత నున్న వేదాలను తస్కరించి ఆతడు సముద్రంలోకి వెళ్ళి దాగాడు. అప్పుడు దేవతలందరూ శ్రీహరిని ప్రార్థించారు. శ్రీహరి మత్స్యావతారుడై ప్రళయ సముద్రంలో దాగిన శంఖాసురునితో యుద్ధం చేసి తన సుదర్శన చక్రంతో వాని శిరస్సును ఖండించివేశాడు. శ్రీమహావిష్ణువు ప్రయాగ వచ్చి నాల్గువేదములను బ్రహ్మదేవున కిచ్చాడు. దేవతలందరి ఎదుట బ్రహ్మ చేస్తున్న యజ్ఞాన్ని నిర్వహించి ప్రయాగతీర్థ అధిష్ఠాతను పిలిచి ఆతనిని తీర్థరాజుగా (పుష్కరునిగా) అభిషిక్తుని గావించాడు. ఆ సమయంలో జంబూద్వీపంలోని తీర్థరాజములన్నీ వచ్చి ఆయనను సేవించాయి.

ఒకనాడు కలహప్రియుడైన నారదుడు తీర్థరాజు యొద్దకు వచ్చి "తీర్థరాజా! సర్వతీర్థములు నిను పూజించాయి. కాని మధురమండలంలోని బృందావన తీర్థములు నిన్ను దర్శించటానికి రాలేదు చూశావా?" అని చెప్పి వెళ్ళాడు. ఆమాటలు విని తీర్థరాజు కోపించి వైకుంఠమునకు వెళ్ళి మహావిష్ణువును దర్శించి నమస్కరించి "మహాత్మా! నీవు నన్ను తీర్థరాజుగా అభిషిక్తుని చేశావు. సకల తీర్థరాజములు వచ్చి నన్ను సేవించాయి. కాని మధురమండలంలోని తీర్థములు నన్ను సేవించటానికి రాలేదు. అవి నన్ను తిరస్కరించాయి. ఈవిషయం నీకు మనవిచేసికొనటం కోసం వచ్చాను" అన్నాడు. అప్పుడు మహావిష్ణువు తీర్థరాజుతో "నిన్ను పుష్కరునిగా అభిషిక్తుని చేసిన మాట నిజమే. కాని నా నివాసం మీద నీకు అధికారం ఇవ్వలేదు. మధురమండలం సాక్షాత్తు నా నివాస స్థలము. ఆ దివ్యధామం ప్రళయకాలంలో కూడా నశించేది కాదు. ఆ పరమ పావన ప్రదేశము నీకు అధీనంకాదు" అని పలికాడు. అప్పుడు ప్రయాగతీర్థ అధిష్ఠాతయైన పుష్కరుడు సిగ్గుపడి మహావిష్ణువునకు అభివందనం చేసివచ్చి తానే స్వయంగా ఈ బృందావనఖండం దర్శించి పూజించి తరించాడు అని సన్నందుడు సమాధానమిచ్చాడు.

**మధురమండలం :**

భూదేవికి గర్వభంగం చేయటం కోసం ఇదివరకే ఈ మధురమండలం

చూపబడింది. ఆది వరాహకల్పంలో శ్రీహరి యజ్ఞ వరాహరూపాన్ని ధరించి రసాతలం నుంచి భూమిని పెల్లగించి తన కోరలపై నుంచి తెస్తుండగా భూదేవి భయపడి "ప్రభూ! విశ్వమంతా జలమయంగాఉంది. మరినన్ను ఎక్కడ ఉంచుతావు?" అని అడిగింది. అప్పుడు వరాహస్వామి "వృక్ష సముదాయం కనిపించిన చోట, జలతరంగాలు ఆనందాతిశయంతో ఉప్పొంగే చోట నిన్ను స్థాపన చేస్తాను" అన్నాడు. అప్పుడు భూదేవి "స్థావర వస్తుసముదాయమును ధరించియుండేది నేను కదా. నేను కాక మరొకరు ధరింపగలవారున్నారా! వృక్షసముదాయము నీటిలో ఎలాఉంటుంది?" అని అడిగింది. అంతలోనే ఆమెకు ఆ జలరాశిలో కళకళలాడే వృక్షములు పుష్పఫల భరితంగా కనిపించాయి. ధరణీదేవికి ఆశ్చర్యం కలిగింది. ఆమె గర్వం పటాపంచలయింది. అప్పుడు యజ్ఞ వరాహ స్వామి ఆమెతో "ఆకనిపించేది మధురమండలం. అది గోలోకం నుంచి వచ్చిన భూభాగం. ప్రళయకాలంలో కూడా నశించేదికాదు" అంటూ సన్నందుడు గోవర్ధన పర్వతం చరిత్రను వివరింపసాగాడు.

## గోవర్ధన గిరి గాథ :

గోలోకనాథుడైన శ్రీకృష్ణపరమాత్ముడు భూలోకంలో అవతరింప బోయేముందు రాధకోరిక ప్రకారం గోవర్ధనగిరిని, యమునా నదిని భూలోకమునకు పంపించాడు. గోవర్ధనగిరిరాజు భారతవర్షమునకు పశ్చిమదిశలోగల శాల్మలీద్వీపంలోని ద్రోణాచల పర్వతరాజుకు కుమారుడుగా జన్మించాడు. ఈ గిరిరాజు జన్మింపగానే దేవత లీయనపై పూలవాన కురిపించారు. హిమవంతుడు, సుమేరు పర్వతరాజులు వచ్చి గోవర్ధన గిరిని సందర్శించి "నీవు గోలోకధామం నుంచి భువికి అవతరించావు. నీవు పరమాత్మ నివాసస్థానానివి. బృందావన శోభ నినుమడింపచేసే వాడవు. ఇక పర్వతముల కన్నిటికీ నీకే అధిపతివి. నీవు "గిరిరాజువు" అని ప్రస్తుతించి వెళ్ళారు.

ఒకనాడు పులస్త్యబ్రహ్మ తీర్థాటన చేస్తూ ఈ శాల్మలీద్వీపానికి వచ్చి గోవర్ధన పర్వతాన్ని తిలకించాడు. శ్యామలవర్ణంతో, పుష్పఫల వృక్షాలతో, మాధవీలతలతో, సెలయేటి ధారలతో వివిధ ఓషధులతో విలసిల్లుతున్న గోవర్ధనగిరిని చూచి పులస్త్యుడు పులకించిపోయాడు. "శాంతిధామంగా ఉన్న ఈ పర్వతం తపస్సంపన్నులకు అనుకూలంగా ఉంటుందని" భావించి ఆయన గోవర్ధనగిరి తండ్రియైన ద్రోణాచలం దగ్గరకు వెళ్ళి "ఓ పర్వతరాజా! నీవు దేవతలందరికీ పూజనీయుడవు. నీకుమారుడు గోవర్ధనుడు

ఉత్తముడు. ఆ గోవర్ధనుణ్ణి నీవు నాకివ్వు. నేను విశ్వేశ్వరుడు నివసించే కాశీలో నివసిస్తున్నాను. అక్కడ ఎటువంటి పర్వతములు లేవు. గోవర్ధనగిరిని అక్కడ ప్రతిష్ఠ చేస్తాను. ఆ పర్వతముపై నేను తపస్సు చేసుకుంటాను" అని అడిగాడు. అప్పుడు ద్రోణాచలుడు కుమారుని విడిచిపెట్టలేక ఒకవైపు, మహర్షి ఏశాపమిస్తాడోనని మరొకవైపు ఎంతో వ్యాకుల పడ్డాడు. "మహర్షీ ! ఈకుమారుడు నాకత్యంత ప్రియమైనవాడు. మీ అభ్యర్థననూ కాదనలేను. మీ ఇష్టము" అని కుమారుని వైపు తిరిగి "నాయనా! నీవు ఈ మహర్షి వెంట కళ్యాణమయమైన, కర్మ క్షేత్రమైన భారతవర్షం వెళ్ళు. అక్కడ మానవులు చతుర్విధ పురుషార్థములను పాటిస్తూ ఉంటారు. క్షణములో మోక్షాన్ని సాధిస్తుంటారు" అని ద్రోణుడు పలికాడు.

అప్పుడు గోవర్ధనుడు "ఓ మహర్షీ! ఎనిమిది యోజనాల పొడవు, ఐదుయోజనాల చుట్టుకొలత ఉన్ననన్ను నీవు ఎలా తీసికొనివెళ్ళగలవు?" అని అడిగాడు. అందుకు పులస్త్యబ్రహ్మ "నిన్ను నాచేతిలో పెట్టుకొని తీసికొనివెళ్ళి కాశీలో దించుతాను. అధైర్యపడవద్దు" అన్నాడు. అప్పుడు గోవర్ధనుడు "మహర్షీ ! ఒక మాటవిను. నన్ను మధ్యలో ఎక్కడా దింపకుండగా తీసికొని వెళ్ళాలి. మధ్యలో ఎక్కడైనా నన్ను దింపితే అక్కడ నేను ప్రతిష్ఠితుడనవుతాను" అన్నాడు. అందుకు మహర్షి అంగీకరించాడు.

గోవర్ధనుడు తండ్రికి నమస్కరించి మహర్షి చేతిలోనికి ఎక్కాడు. తండ్రిని విడిచివెళుతున్నందుకు గోవర్ధనుని కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. అందరూ ఆశ్చర్యంతో చూస్తుండగా పులస్త్యుడు గగనమార్గంలో బయలుదేరాడు. మధురమండలం వచ్చింది. అప్పుడు గోవర్ధనుడు తనలో "ద్వాపరాంతములో శ్రీకృష్ణపరమాత్ముడు అవతరింపబోయే పుణ్యప్రదేశం కదా ఇది. ఆస్వామి లీలలు చూపే స్థలం కదా యిది. నేనిక్కడ ఉంటే పరమాత్ముని దర్శనం చేసికొనవచ్చు" అని భావించి తన శరీరం బరువు విశేషంగా పెంచాడు. అప్పటికే మహర్షి అలిసిపోయి యున్నాడు. గోవర్ధనగిరిరాజు పెట్టిన షరతును మరచిపోయి, పులస్త్యుడు గోవర్ధనగిరిని మధురమండలంలో ఉంచాడు. కొంతసేపటికి అలసట తీర్చుకొని మరల గిరిరాజును ఎత్తటానికి సిద్ధమయ్యాడు. కాని గోవర్ధ ుడందు కంగీకరింపక "ఓమహర్షీ ! నేను చెప్పిన ఒడంబడిక గుర్తున్నది కదా! ఇక నేనిక్కడ నుంచి కదలను" అన్నాడు. అప్పుడు పులస్త్యుడు కోపించి "గోవర్ధనాచలా! నీవు నా మనోరథాన్ని విఫలం చేశావు కాబట్టి నీవు రోజుకు

ఒక నువ్వుగింజంత ప్రమాణము తరిగిపోదువు గాక!" అని శపించి కాశీకి వెళ్ళిపోయాడు. ఈ భూమిమీద గంగానది ప్రవహిస్తున్నంతకాలం, గోవర్ధన గిరి ఉన్నంత కాలం కలిపురుషుని ప్రభావం అభివృద్ధి పొందదు అంటూ సన్నందుడు యమునానది చరిత్రను వివరింపసాగాడు.

**యమునానది :**

గోలోకధామంలో శ్రీకృష్ణ పరమాత్ముడు యమునానదిని భూలోకానికి వెళ్ళమని ఆజ్ఞాపించినప్పుడు యమున భగవానునికి నమస్కరించి బయలుదేరటానికి సిద్ధమయింది. అప్పుడు బ్రహ్మద్రవోద్భవయైన గంగ, విరజానదులు యమునలో లీనమయ్యాయి. ఈ ప్రవాహం వామనుని గోరు తాకి, బ్రహ్మాండ కర్పరం చిట్లగా ఆ జలంతో కలిసి అజితపదమును, ధ్రువలోకమును, ఆపై వైకుంఠమును తాకి అక్కడ నుండి బ్రహ్మలోకమునకు వచ్చి సుమేరు శిఖరంపై పడి అక్కడ నుండి మేరువుకు దక్షిణ భాగానికి చేరుకున్నది. అక్కడ గంగ విడిపోయి హిమాలయపర్వతముపై నుండి, యమున కళింద పర్వతము పైనుండి ప్రవహింపసాగాయి. అందువల్లనే గంగానదికి హైమవతియని, యమునకు కాళింది యని పేర్లువచ్చాయి. యమున అనేక ప్రాంతాలను పవిత్రం చేస్తూ ఖాండవ వనము చేరుకొని శ్రీకృష్ణపరమాత్మణ్ణి తన అధిపతిగా భావించి దివ్యదేహంతో తపస్సు చేసింది. మరల యమున అక్కడ నుంచి బయలుదేరి వ్రజమండలంలో బృందావనం దగ్గరకు వచ్చింది. అక్కడ కృష్ణపరమాత్మణ్ణి దర్శించి రాసక్రీడలో పాల్గొన్నది. కృష్ణుణ్ణి విడిచి వెళ్లలేక వెళ్ళలేక కన్నీరు కారుస్తూ చివరకు యమున పశ్చిమంవైపు ప్రయాణించి గంగానదితో కలిసింది. రెండూ కలిసి క్షీరసాగరం వైపు వెళ్ళాయి.

నదీశిరోమణి, కళిందనందిన, కృష్ణవర్ణ అయిన యమున సముద్రం దగ్గరకు చేరుతున్న సమయంలో గద్గద వాణితో గంగతో ఇలా అన్నది - "ఓ గంగా! నీవు ధన్యవు. సాక్షాత్తు శ్రీకృష్ణుని పాదపద్మాల సన్నిధిలో నీవు జన్మించావు. లోకమునంతటినీ పావనమొనరించే నీవు ఉత్తమురాలవు. నేనిక్కడ నుండి పైకి శ్రీహరిలోకానికి వెళుతున్నాను. నీవు ఇష్టమయితే నాతో రావచ్చును" అని పలికింది. అప్పుడు గంగ యమునతో "ఓ యమునా! నేను కృష్ణుని పాదముల దగ్గర

జన్మించినట్లయితే, నీవు సాక్షాత్తు శ్రీకృష్ణుని వామభాగం నుంచి ఆవిర్భవించావు. నీవు నాకంటె పరమ పావనమూర్తివి. పరమానంద స్వరూపిణివి. నీవు హరిప్రియవు. గోలోకంలో కూడా నీ దర్శనం దుర్లభం కదా! నీవు నన్ను విడిచి వెళుతున్నందుకు బాధగా ఉన్నది. నేను నీతో రాలేను. శ్రీకృష్ణపరమాత్ముని ఆదేశానుసారం నేను పాతాళలోకానికి వెళుతున్నాను" అని పలికింది. ఈవిధంగా గంగా యమునలు తమ తమ మార్గాలలో పయనించాయి. గంగ పాతాళంలోని భోగవతివనంలోకి వెళ్ళి "భోగవతి" అని పేరు పొందింది. శంకరభగవానుని శిరస్సుపై విలసిల్లే జలము అక్కడిదే. ఇక్కడ యమునా నది సప్తసాగరములను దాటి సువర్ణమయభూమిపై ప్రయాణించి లోకాలోక పర్వతం మీదకు చేరుకున్నది. అక్కడ నుండి బ్రహ్మలోకం మున్నగునవన్ని దాటి బ్రహ్మద్రవంతో కలిసి బ్రహ్మాండ కర్పరం ద్వారా ముందుకు సాగిపోయింది. చివరకు యమున పరమాత్ముని గోలోకధామం చేరింది. ఇదీ మంగళప్రదమైన యమునా చరిత్రము అని సన్నందుడు చెప్పినట్లు నారదమహర్షి బహుళాశ్వునకు తెలియపరచాడు.

**బృందావన ప్రవేశం :**

సన్నందుడు తెలిపిన విషయములను విని నందరాజు గోగణముతో బృందావనమునకు బయలుదేరటానికి సిద్ధమయ్యాడు. యశోద, రోహిణి, గోపకాంతలుకూడా బయలు దేరారు. నందుడు బలరామ కృష్ణులతో రథముపై అధివసించాడు. వెనుక గోసముదాయము రాసాగింది. వృషభానుడు ఏనుగుపై తన కుమార్తె రాధను, భార్యను కూర్చొన బెట్టుకొని బయలుదేరాడు. వారితో నందులు, ఉపనందులు, వృషభానులు గో గోపగణ సహితంగా బృందావనానికి చేరుకున్నారు. అక్కడ గోపకులు గోష్ఠములను, నివాసములను నిర్మాణం చేశారు. వృషభానుడు నాలుగు యోజనముల విస్తీర్ణంలో తన నగర నిర్మాణం చేయసాగాడు. నందుడు నందనగరం నిర్మించాడు. లీలాబాలకులైన బలరామకృష్ణులు ఆయమునా సైకత ప్రదేశాలలో గోపబాలురతో కలసి స్వేచ్ఛగాఆనందంగా ఆడుకొనసాగారు. బలరాముని శరీరంపై నీలాంబరం, శ్రీకృష్ణుని శరీరంపై పీతాంబరం కాంతులు వెదజల్లుతున్నాయి. ఆటలాడేటప్పుడు వారి పాద మంజీరనినాదాలు శ్రుతిహితంగా ఉన్నాయి. ఒకరినొకరు పట్టుకొనే ఆటలు, దాగుడుమూతలు, పైన విహంగం వెళుతుంటే క్రిందదాని నీడలో పరుగులు తీయటం ఇలా విహరిస్తున్నారు.

**వత్సాసురుడు :**

ఒకరోజున వారి గోవుల సముదాయంలో కంసునిచేత పంపబడిన ఒక అసురుడు వచ్చి గోరూపంతో కలిసి ఉన్నాడు. ఆతడే వత్సాసురుడు. ఈ విషయం గ్రహించిన శ్రీకృష్ణుడు మెల్ల మెల్లగా ఆ గోవు దగ్గరకు చేరాడు. వత్సాసురుడు వేగంగా వచ్చి తన వెనుక కాళ్ళతో బాలకృష్ణుని మెడపై తన్నాడు. ఈ దృశ్యం చూచిన మిగిలిన గోపాలురు దూరదూరంగా వెళ్ళారు. శ్రీకృష్ణుడు ఆ వత్సాసురుని కాళ్ళుపట్టుకొని గిరగిరా త్రిప్పినేలకేసి కొట్టాడు. మరల ఎత్తి అక్కడున్న ఒక వెలగచెట్టుకేసి కొట్టాడు. ఆ దెబ్బకు ఆచెట్టునున్న వెలగపండ్లన్నీ నేలరాలాయి. వత్సాసురుడు విగత జీవుడయ్యాడు. అతని శరీరంలో నుంచి ఒక జ్యోతి బయలుదేరి వచ్చి శ్యామసుందరునిలో విలీనమయింది. దేవతలు కృష్ణునిపై పూలవాన కురిపించారు.

**వత్సాసురుని పూర్వజన్మ :**

"పూర్వం మురాసురునకు ప్రమీలుడనే ఒక కుమారుడున్నాడు. ఆతడు దేవతలకు కూడా అజేయుడయ్యాడు. ఒకనాడా దైత్యుడు వసిష్ఠముని ఆశ్రమానికి వచ్చి అక్కడున్న నందినీ ధేనువును చూశాడు. దానిని ఎలాగైనా పొందాలని ఆతడు బ్రాహ్మణ రూపం ధరించి వసిష్ఠుని కడకు వచ్చి తనకు నందినీధేనువును ఇమ్మని అర్థించాడు. దివ్యదర్శనుడైన వసిష్ఠుడు విషయమంతా గ్రహించికూడా మౌనంగా ఉన్నాడు. అప్పుడునందినీ ధేనువు ఆతనితో "ఓరి దుర్మతీ! నీవు మురాసురుని కుమారుడవు. గోవుకోసం కపట బ్రాహ్మణ వేషం ధరించి వచ్చావు. కాబట్టి నీవు అసుర స్వభావంతో గోవత్సంగా మారిపోదువుగాక!" అని శపించింది. వెంటనే ఆ దైత్యుడు నందినీ ధేనువు పాదాలపై పడి తనను క్షమింపుమని వేడుకున్నాడు. అప్పుడు నందిని వానితో "నీవు ద్వాపరాంతంలో శ్రీకృష్ణుని గోవులలో చేరినప్పుడు, కృష్ణుని చేతిలో నీకు ముక్తి కలుగుతుంది" అని పలికింది. ఆకారణం వల్లనే వత్సాసురుని ఆత్మ పరమాత్మునిలో విలీనమయింది అని నారదమహర్షి తెలియజేశాడు.

**బకాసురుడు :**

ఒకనాడు శ్రీకృష్ణుడు బలరామునితోను, గోపబాలురతోను యమునా తీరంలో

విహరిస్తుండగా బకాసురుడు అక్కడకు వచ్చాడు. పర్వతాకారంతో, మేఘ గర్జనవంటి స్వరంతో ఉన్న బృహత్తరమైన బకమును చూచి గోపబాలకులు భయపడ్డారు. ఆ బకాసురుడు ఒక్కసారిగా కృష్ణుణ్ణి వజ్రం వంటి తన ముక్కుతో పట్టి నోట్లో వేసుకున్నాడు. ఆదృశ్యంచూచి గోపాలకులు భయభ్రాంతులై మూర్ఛపోయారు. ఇంద్రాది దేవతలు మరుక్షణంలోనే అక్కడకు చేరుకున్నారు. కాని ఆ దైత్యుణ్ణి సంహరించటం ఎవరికీ సాధ్యంకాలేదు. ఇక సమస్త దేవర్షులు, బ్రహ్మర్షులు, కృష్ణపరమాత్ముడు క్షేమంగా బయటకు రావాలని ప్రార్థింపసాగారు. అది విని బాలకృష్ణుడు తన జ్యోతిర్మయమైన దివ్యదేహాన్ని పెంచి పెద్దది చేశాడు. అప్పుడు బకాసురునకు ఊపిరిసలుపకనోరు తెరచి కృష్ణుణ్ణి బయటకు విడిచి వేశాడు. అప్పటికీ కృష్ణుడు బ్రతికి ఉన్నాడని బకాసురుడు తన తక్షణమైన ముక్కుతో మీదకు వస్తుండగా శ్రీకృష్ణుడు దాని రెండు ముక్కు పుటములు పట్టుకొని విరిచివేయగా ఆ దైత్యుడు ప్రాణాలను కోల్పోయాడు. వాని తేజము వచ్చి పరమాత్మునిలో లీనమయింది. కృష్ణుడు క్షేమంగా బ్రతికి బయటపడినందుకు గోపాలకులు సంతోషించి అందరూ పాటలు పాడుకొంటూ నందగృహానికి చేరుకున్నారు. గోపాలకులు ఆశ్చర్యానందాలతో జరిగిన విషయమంతా వివరించి చెప్పినపుడు అంతా విస్మితులయ్యారు అని చెప్పి నారదుడు బహుళాశ్వ మహారాజుతో బకాసురుని పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరిస్తున్నాడు.

**బకాసురుని పూర్వజన్మ :**

"ఓ మహారాజా! పూర్వం హయగ్రీవుడనే ఒక రాక్షసుడుండేవాడు. అతని కుమారుడైన ఉత్కలుడు దేవతలను జయించి ఇంద్రసింహాసనం ఆక్రమించి నూరు సంవత్సరాలు సకల వైభవాలను అనుభవించాడు. ఒకరోజున దైత్యుడైన ఆఉత్కలుడు అటుయిటుతిరుగుతూ గంగాసాగర సంగమ స్థలం దగ్గరఉన్న జాజలి మహర్షి ఆశ్రమం దగ్గరకు వచ్చాడు. ఉత్కలుడు అక్కడ ఉన్న సరస్సులో వలవేసి చేపలు పట్టసాగాడు. జాజలి మహర్షి అతనిని వారించి చేపలను ఆవిధంగా హింసింపవలదని అన్నాడు. అయినా దుర్బుద్ధియైన ఉత్కలుడు వినలేదు. అంతట సిద్ధుడైన ఆ మహాత్ముడు "మూర్ఖుడా! కొంగవలె చేపలను హతంచేస్తున్నావు కాబట్టి నీవు కొంగగా జన్మించు" అని శపించాడు.

అప్పుడు ఉత్కలుడు భయపడి తేజోవిహీనుడై మహర్షి పాదములపై పడి "మహాత్మా! మీ ప్రచండమైన తపోబలం గుర్తించలేక నేను పొరపాటు చేశాను. నన్ను మన్నించు " అని వివిధవిధములుగా వేడుకున్నాడు. ఆతని వినయపూర్వకమైన మాటలను విని ముని ప్రసన్నుడై "వైవస్వత మన్వంతరంలో ఇరవై ఎనిమిదవ ద్వాపరయుగం చివర శ్రీకృష్ణపరమాత్మడు వ్రజమండలంలో గోపాలకుడుగా విహరిస్తుంటాడు. ఆస్వామి దయవల్ల నీవు ముక్తిని పొందుతావు" అని పలికాడు. ఈ కారణంవల్ల ఆ ఉత్కలుడు బకాసురునిగా జన్మించి కృష్ణ పరమాత్మ చేతిలో ముక్తిని పొందాడు అని నారద మహర్షి బహుళాశ్వునికి తెలియజేశాడు.

**అఘాసురుడు :**

ఒకరోజున గోవిందుడు తోటి గోపాలబాలకులతో గోవులను మేపుకొంటూ కాళిందీ తీరంలో ఆటలాడసాగాడు. అదే సమయంలో అఘుడనే రాక్షసుడు పెద్ద సర్పాకారం ధరించి క్రోసెడు దూరం శరీరం పెంచి పెద్ద నోరు తెరుచుకొని దారి కడ్డంగా పడుకొని ఉన్నాడు. ఇంతలో గోవులతో పాటుగా వస్తున్న గోపాలకులు శ్రీకృష్ణుడు మన చెంత ఉండగా భయమేమిటి అని అందరూ దాని ముఖద్వారంలో ప్రవేశించారు. వెంటనే వారినందరనీ రక్షించటం కోసం కృష్ణుడు బలరామునితో సహితంగా అఘాసురుని వదన గహ్వారంలో ప్రవేశించి తన విరాట్ స్వరూపాన్ని విజృంభింపచేయటం ఆరంభించాడు. అఘాసురునకు ఊపిరి సలుపక విగతజీవు డయ్యాడు. అతని జీవనజ్యోతి ఘనశ్యామునిలో లీనమయింది. అ దైత్యుని నోటిలోకి వెళ్ళి ప్రాణాలు కోల్పోయిన గోవుల్ని, గోపకుల్ని మాధవుడు తన కృపావృష్టితో తిరిగి బ్రతికించాడు.

**అఘాసురుని పూర్వజన్మ :**

పూర్వం శంఖుడనే రాక్షసుడుండేవాడు. అతని కుమారుడే ఈ అఘుడు. బలవంతుడు, రూపవంతుడు అయిన అఘాసురుడు అహంకారంతో విర్రవీగుతూ ఉండేవాడు. ఆతడొకనాడు మలయాచలంపై తపస్సు చేసుకుంటున్న అష్టావక్ర మహర్షి రూపాన్ని చూచి పరిహసించాడు. అందుకు ఆగ్రహించిన మహర్షి "ఓరీ దుర్మతీ! నీవు వక్రవర్తనంగల సర్పమవగుదువు గాక!" అని శపించాడు. వెంటనే భయవిహ్వాలుడైన అఘుడు అష్టావక్ర మహర్షిని శరణువేడాడు. మహర్షి ప్రసన్నుడై

"కృష్ణపరమాత్ముడు నీ ఉదరంలో ప్రవేశించినప్పుడు నీకు సర్పరూపం నుంచి విముక్తి కలుగుతుంది" అని పలికాడు. ఆవిధంగా అఘాసురుడు సర్పాకృతి పొందటం, చివరకు ఘనశ్యాముని చేతిలో మోక్షం పొందటం జరిగింది అని నారదమహర్షి బహుళాశ్వునకు వివరించాడు.

**చల్దులారగింపు :**

నారదమహర్షి బహుళాశ్వునితో ఇలా పలికాడు - మహారాజా! కృష్ణపరమాత్ముని మరొక లీలను చెప్తాను విను. గోపకులంతా అఘాసురుని బారి పడినప్పుడు శ్రీకృష్ణుడు వారినందరినీ మృత్యుముఖం నుంచి రక్షించిన అనంతరం వారందరికీ తిరిగి ఆనందం కలిగించాలని వారిని యమునా తీరానికి తీసికొనివెళ్ళాడు. శ్రీకృష్ణుడు వారిని చూచి "సఖులారా! ఇక్కడి యమునా సైకత ప్రదేశం ఎంత అందంగా ఉన్నదో చూశారా! శీతల మంద సుగంధ సౌరభం ఎలా ఆహ్లాదం కలిగిస్తున్నదో కదా! అవును. ఇప్పటికే చాలా ప్రొద్దు పోయింది. భోజన సమయమయింది. ఈ అందమైన చోట కూర్చొని భోజనాలను చేద్దాము. ఇంతలో గోవులు కూడా ఇక్కడి పచ్చిక బయళ్ళలో మేసి ఈ జలాలు త్రాగుతుంటాయి" అన్నాడు. అప్పుడు కొందరు గోపకులు సరేనని భోజనాలకుపక్రమించారు. భోజనములను తెచ్చుకొనని గోపకులు తాము ఆహార పదార్థములను తెచ్చుకొనలేదని, గోవులను తోలుకొని ఇళ్ళకు వెళతామని అంటే గోవిందుడు వారిని చూచి "నేను ఉన్నాను గదా ఆవిషయం నేను చూసుకుంటాను" అన్నాడు.

గోపబాలురంతా శ్రీకృష్ణునకు చుట్టూ కూర్చున్నారు. గోపాలకులు వివిధ విధములైన రంగురంగుల వస్త్రాలను ధరించిఉన్నారు. మధ్యలో మాధవుడు పీతాంబరధారియై నయనానందకరంగా విలసిల్లసాగాడు. చుట్టూ కూర్చున్న గోప బాలురు పద్మ పత్రాలవలె ఉండగా, మధ్యలో కృష్ణుడు స్వర్ణ కర్ణికవలె శోభించాడు. తమకు లభించిన పూలరేకులలో, పత్రాలలో, ఆహారమునుంచుకొని రకరకాల రుచులతో కలుపుకొని తినటం ఆరంభించారు. కొందరు చేతులలోనే, కొందరు రాళ్ళపైనే, కొందరు చెట్ల చిగుర్లపైనే ఆహారము నుంచుకొని ఆరగింపసాగారు. ఒకబాలుడు గబగబావచ్చి ఒక ముద్దను కృష్ణుని నోటిలో పెట్టాడు. కృష్ణుడు నవ్వుతూ తింటూ "సోదరులారా! మీరు తెచ్చుకొన్న రుచికరములైన పదార్థాలను

మిగిలిన బాలకులకు కూడ పెట్టండి. నాకు రుచిగురించి బాగాతెలియదు" అన్నాడు. అప్పుడు ఆహారపదార్థాలను తెచ్చుకొన్నవారు తీసికొనిరానివారికి పంచిపెట్టి సంతృప్తిని పొందారు. గోపాలకులంతా ఒకరితో ఒకరు నవ్వుతూ ఆహారం తినసాగారు. సుబలుడు మరల హరినోటిలో ముద్దపెట్టాడు. కృష్ణుడు ఆ ముద్ద కొంత కొరికి తిని ఒకటే నవ్వటం. ఒక గోపకుడు కృష్ణుని చూచి "నందనందనా! తాత అమాయకుడయితే మనుమడికి రుచులు తెలియవని అంటారు" అని పలికాడు. ఇంతలో శ్రీదాముడు తన ఆహారపదార్థాన్ని కృష్ణునికి మరి కొందరికి పెట్టాడు. వరూథపుడు వచ్చి బ్రతిమలాడి వాసుదేవునకు ఒక ముద్దపెట్టాడు. అందరూ కొంచం కొంచం తినటం నవ్వుకొనటం ఆటలాడుకోవటం...

కటివస్త్రం దగ్గర వేణువు, ఎడమ చేతిలో ఒకకర్ర, కుడిచేతిలో అన్నపుముద్ద, వ్రేళ్ళమధ్య పళ్ళముక్కలు, సిగలో నెమలిపింఛం, భుజాన ఒక దుప్పటి, మెడలో వనమాల, పాదాలకు నూపురములు, వక్షస్థలంపై శ్రీవత్సం, కౌస్తుభమణి ధరించి శ్రీకృష్ణుడు గోపాల బాలకుల మధ్యలో కూర్చొని తన చతుర భాషణములతో వారిని నవ్విస్తున్నాడు. యజ్ఞభోక్తయైన శ్రీహరి ఈవిధంగా భోజనం చేస్తూఉండటం దేవతలు, మనుష్యులు కూడా ఆశ్చర్యచకితులై చూడసాగారు. ఈలోపు వారి గోవత్సములన్నీ మెల్లమెల్లగా గహనమైన వనంలోకి వెళ్ళిపోయాయి. ఇది గ్రహించి గోపాలకులు వ్యాకులతపొందారు. అప్పుడు కృష్ణుడు వారినిచూచి "అక్కడకు మీరు వెళ్ళవద్దు. నేను వెళ్ళి గోవుల్ని తీసికొనివస్తాను" అని అంటూ కుడిచేతిలో అన్నం ముద్ద ఉండగానే బయలుదేరి చెట్లుచేమలు వెదకటం ఆరంభించాడు. వ్రజవాసులతో శ్రీకృష్ణుడు యమునాతీరంలో అన్నంతింటూ కూర్చొన్న సమయంలోనే బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చి ఆదృశ్యం చూచి అమితాశ్చర్యంతో "ఈతడు దేవాదిదేవుడైన శ్రీహరి యేనా? ఈతడెవరో గోపబాలుడయి ఉంటాడు. ఈయన శ్రీహరి అయినట్లయితే ఇలా ఎంగిలి అన్నాలు తినటమేమిటి?" అనుకున్నాడు. ఈవిధంగా విధాత పరమాత్ముని మాయకు వశమైపోయి భ్రాంతి చెంది "ఈయన మహిమ ఏమిటో తెలిసికొనాలని" నిశ్చయించుకొని ఆ గోపబాలుర నందరినీ మాయం చేసి తానూ అంతర్థానమయిపోయాడు.

**బహురూపధారణ :**

గోవత్సములు కనిపించక గోవిందుడు తిరిగి యమునా తీరానికి చేరేసరికి

అక్కడ గోపాలకులు కూడా కనిపించలేదు. అప్పుడు పరమాత్ముడు ఒక్కక్షణం ఆలోచించి "ఓహో! ఇది బ్రహ్మచేసిన పనికదా!" అని అనుకున్నాడు. అఖిల విశ్వవిధాయకుడైనటువంటి శ్రీకృష్ణుడు తన లీలావిలాసంతో తానే గోవత్సములుగా, గోపాలకులుగా అనేక రూపాలను ధరించాడు. ఇది వరకు ఆ గోవత్సములు ఏవిధంగా ఉండేవో ఆ విధంగా, గోపాలకులు ఏయే రూపాలలో ఉండేవారో ఆ విధంగా, వారు ఏయేగుణాలతో, ఏయే అలంకారాలతో ఉండేవారో ఆ విధంగా భగవంతుడు అనేక రూపాలను ధరించాడు. ఇంతకు ముందు వలెనే ఆటలాడుతూ గోపాలకులు గోవత్సములతో సూర్యాస్తమయ సమయానికి నందభవనానికి చేరుకున్నారు. ఆ గోపాలకులు ఆ గోవత్సాలను గోష్ఠంలోకి తీసికొని వెళ్ళి ఏ గోవు దగ్గరకు ఏ దూడను తీసికొనివెళ్ళాలో అలాగే తీసికొని వెళ్ళారు. ఆ గోవులు తమ వత్సములను చూచి ఎనలేని వాత్సల్యంతో తమ పాలనివ్వసాగాయి. ఆసమయంలో ఆగోవులు శ్రీహరికి మాతృదేవతలయ్యాయి. ఏ గోపాలకుడు ఏయింటికి వెళ్ళాలో అలాగే వెళ్ళాడు. వంశీధ్వని విని గోపకాంతలు శీఘ్రంగా లేచి వచ్చి తమ బాలురను అప్యాయతతో దగ్గరకు తీసుకున్నారు. గోవత్సములపట్ల, గోపబాలకులపట్ల గోవులకు, గోపకాంతలకు ఇది వరకటికన్న వాత్సల్యము ప్రేమలు అనేకరెట్లు అధికమయ్యాయి. తరువాత కొందరు గోపబాలురకు వివాహాలు కూడా అయినాయి. వారి వారి వధువులు తమ పతులను కృష్ణస్వరూపులుగా భావించి వారిపట్ల అపరిమితంగా ప్రేమ చూపసాగారు.

ఒకరోజున బలరాముడు గోవులను చూడటానికి వనములోకి వెళ్ళాడు. అప్పటికి బ్రహ్మదేవుడు గోవత్సములను, గోపాలకులను మాయంచేసి నాలుగైదురోజులు తక్కువగా సంవత్సరం కావస్తున్నది. దూరంగా కొండశిఖరంపైన గోవులున్నాయి. పచ్చికబయలులో దూడలు తిరుగుతున్నాయి. తమ వత్సములను చూచి గోమాతలు పరుగుపరుగున వచ్చి వాత్సల్యంతో వాటికి పాలను కుడుపసాగాయి. ఆదృశ్యం చూచిన గోపాలకులకు అమితమైన కోపం వచ్చి తమ గోపబాలురను దండించటానికి కొండమీదనుంచి వేగంగా వచ్చారు. తీరాదగ్గరకు వచ్చి స్నేహవశీ భూతులై తమ కుమారులను ఒళ్ళోకి తీసికొని కూర్చున్నారు. వారందరి నేత్రాలనుంచి ప్రేమపూర్వకమైన ఆనందబాష్పాలు జాల్వారసాగాయి. బలరాముడీ సన్నివేశాలను చూచి ఆశ్చర్యపడి "ఏమిటీ విచిత్రం? దాదాపు ఒక సంవత్సరం కాలం నుంచి ఈ వ్రజమంతా

ఎందుకని ఇలా ఉన్నది? రోజురోజుకు అందరి హృదయాలలో ఈ ప్రేమ ఎలా వృద్ధి పొందుతున్నది. దేవతలు, గంధర్వులు, రాక్షసులలో ఎవరిమాయ ఇది? నన్ను మోహంలో ముంచుతున్న ఇది కృష్ణమాయ తప్ప వేరొకటికాదు" అని భావించి కనులు మూసికొని దివ్యదృష్టితో గమనించాడు. ఆయనకు అక్కడున్న గోవత్సములు, గోపబాలకులందరూ శ్యామసుందరమూర్తులుగా, వనమాలా శోభితులుగా కనిపించారు. ఒక్క కృష్ణుడే ఇన్ని రూపాలను ధరించినట్లు బలరాముడు గ్రహించాడు. బలరాముడు కళ్ళుతెరచి "కృష్ణా! బ్రహ్మాది దేవతలు నీసేవ చేయటానికి, నీఆజ్ఞపాలించటానికి నిరంతరం సిద్ధంగా ఉంటారు. నీవు పరమేశ్వరుడవు. నీవు శూన్యంలో కోట్లాది బ్రహ్మాండములను సృష్టించగల సమర్ధుడవు" అని స్తుతించాడు.

అదే సమయంలో బ్రహ్మాలోకంలో ఒక త్రుటికాలం గడిచింది. భూలోకంలో ఒక సంవత్సరకాలంగడిచింది. కృష్ణుడు యథావిధంగానే గోపాలకులతో, గోవత్సాలతో బృందావనంలో విహరిస్తున్నాడు. బ్రహ్మదేవుడు వెళ్ళి చూస్తే తాను దాచిన చోట గోవత్సములు, గోపబాలురు నిద్రావస్థలోనే ఉన్నారు. అప్పుడు బ్రహ్మ ఈ నందనందనుడు కేవలం గోపాలకుడు కాదు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడని గ్రహించాడు. మోహాతీతుడు విశ్వమోహనుడు అయిన స్వామిని మోహింపజేయటానికి తాను వచ్చినందుకు విధాత పశ్చాత్తప్తుడయ్యాడు.

## చతుర్ముఖుని కృష్ణ స్తుతి :

అప్పుడు విధాత తన హంసవాహనమునుంచి క్రిందకు దిగి కృష్ణపరమాత్ముని చరణకమలములకు సాష్టాంగ నమస్కారము చేశాడు. ఆనంద బాష్పములతో ఆ స్వామి పాదముల నభిషేకించి అంజలి ఘటించి శ్రీకృష్ణుని స్తుతింపసాగాడు.

"ఓ వంశీధరా! నీవు పురుషోత్తముడవు. పరమేశ్వరుడవు. ప్రకృతికతీతుడవు. నీకు అభివందనము స్వామీ! మేము ఏ పరాత్పరుని అంశలమో, ఏ పరబ్రహ్మశక్తినుంచి మేము సృష్టి స్థితి లయలను నిర్వహిస్తున్నామో ఆ పరాత్పరుడవు, పరబ్రహ్మవు నీవే. నీవు స్వయంగా సంకల్పించుకొని శ్రీకృష్ణునిరూపం ధరించి నందనందనుడవయ్యావు. గోపాలకులతో కలిసి గోపవేషం ధరించి బృందావనంలో గోవులతో విహరిస్తున్నావు. మేఘములచే స్పృశింపబడిన ఆకాశంవలె ప్రాణుల దేహములలో నీవు క్షేత్రజ్ఞుడవుగా చైతన్యరూపుడవుగా భాసిస్తున్నావు. నీవు మాయారహితుడవు. భక్తి వైరాగ్యములకు

మాత్రమే లభించేవాడవు. ఓ సర్వజ్ఞా! మెరుపుతీగవలె, నీటిలో వ్రాతవలె ఈ జగమంతా మిథ్యగా తెలుసుకుంటున్నాను. విషయసుఖములు దు:ఖభాజనము లవుతున్నాయి. చెట్లు కదలకపోయినా కదిలేనీటిలో చూసినప్పుడు చెట్లు కూడా కదులుతున్నట్లు కనిపిస్తాయి. అదేవిధంగా భ్రాంతిపొందిన మానవుడు ప్రకృతి నుంచి జనించిన గుణములకు వశమై, తాను పొందే సుఖమును సత్యమని భ్రమిస్తున్నాడు. సుఖదు:ఖములు మనస్సుకు సంబంధించినవి. అవి నిద్రావస్థలో లుప్తమై జాగ్రదవస్థలో అనుభవంలోకి వస్తాయి. ఈవివేకం పొందిన మానవుడు ఈ జగత్తు స్వప్నావస్థ వంటిదని గ్రహిస్తాడు. జ్ఞానులు అభిమాన మమకారములను పరిత్యజించి వైరాగ్యం పొంది శాంతులుగా ఉంటారు.

ఒక దీపం నుంచి వేలాది దీపములు ఏవిధంగా వెలుగుతాయో అదేవిధంగా ఒకే ఒక పరమాత్మ నుంచి సమస్తము ఆవిర్భవించింది. ఆ తాత్త్విక విషయమును జ్ఞానులు గ్రహింపగలరు.ఏ భక్తుడు అగ్నిశిఖవలె గుణముక్తుడై ఆత్మనిష్ఠుడై హృదయంలో దేవాధిదేవుడైన వాసుదేవుణ్ణి భజిస్తాడో ఆతడు అనేక జలపాత్రలలో ఒకే చంద్రబింబాన్ని దర్శించినట్లు, చరాచరజీవకోటిలో ఒకే ఆత్మతత్త్వమును దర్శిస్తాడు. నిరంతరం వర్ణించి కూడా వేదములు పరమపురుషుడవైన నీ వైభవంలో పదహారవభాగాన్ని కూడా తెలుపలేకపోయినాయి. ఓ ప్రభూ! భూతలంపై నీ ప్రభావాన్ని మానవులు, మహర్షులు, సురలు, అసురులు, చతుర్దశమనువులు కూడా తెలిసికొనలేరు. వీరు స్వప్నంలో కూడా నీ చరణకమలములను దర్శింప సమర్థులు కారు. నీవు గుణసాగరుడవు, ముక్తిదాతవు, పరాత్పరుడవు, రమేశుడవు, గుణేశుడవు, వ్రజేశ్వరుడవు, శ్రీమన్నారాయణుడవు. నీకు నమస్కారము. వైకుంఠంలో లీలలను మించిన లీలలను చూపిస్తున్న ఓస్వామీ! నీ పరమసుందరమైన మనోహర మూర్తికి దేవతలంతా అభివాదం చేస్తున్నారు స్వామీ!

ఓ జగన్నాథా! తండ్రీ! నీ నాభికమలం నుంచి నేను ఉద్భవించాను. నేను నీ కుమారుడను. అందువల్ల నేను చేసిన ఈ అపరాధం మన్నించు. ఒకలోకానికి అధిపతినైన నేనెక్కడ? అనేక బ్రహ్మాండములకు అధిపతివైన నీవెక్కడ? స్వామీ! నన్ను రక్షించు. నీ మాయా ప్రభావంవల్ల మానవులు, దైత్యులు, దేవతలు అందరూ మోహితులౌతారు. అటువంటిది అవివేకినైన నేను నామాయతో నిన్ను మోహింపచేయాలని భావించాను. ఓ గోవిందా! నారాయణా శేషశయనా! నిన్ను పరీక్ష చేయాలని

భావించిన నన్ను క్షమించు ప్రభూ! జ్ఞానులు భక్తి లేకుండా జ్ఞానంలో నిమగ్నమైఉంటే వారు పరమపదమును దర్శింపలేరు. కేవలం భక్తి భావంతోనే అనేకులు యోగులు, మునులు, వ్రజవాసులు నిన్ను పొందగలుగుతున్నారు. భగవాన్! నేను గోకులంలో జన్మించి, నీ పాద పద్మములను ఆరాధించి సుగతిని పొందుతాను. ఈవ్రజంలో నిన్ను పరిపూర్ణంగా దర్శనం చేసికొనే నీ తల్లిదండ్రులు, గోపకాంతలు, గోపాలురు ఎంత ధన్యులు. ప్రభూ! నీచుట్టూ ఒక్కసారి ప్రదక్షిణం చేస్తే జగత్తులోని సంపూర్ణ తీర్థాలను సేవించిన ఫలం దక్కుతుంది" అని ఈవిధంగా విధాత అనేక విధాలుగా కృష్ణ పరమాత్మున్ణి స్తుతించి స్వామికి ప్రదక్షిణం చేసి గోవత్సములను గోపాలకులను పరమాత్మునకు అప్పగించి వెళ్ళాడు.

సంవత్సరం క్రితం అచేతనులైన ఆగోపబాలురు కృష్ణుణ్ణి చూచి కొన్ని క్షణములైనట్లు భావించి "భోజనం చేద్దాము త్వరగా రా. నీకోసం ఎదురుచూస్తూ మేమింకా భోజనాలు చేయలేదు" అన్నారు. కృష్ణుడు చిన్న నవ్వు నవ్వి గోపబాలురతో కలిసి చల్ది లారగించాడు. అప్పుడు కృష్ణుడు వారికి సంవత్సరం క్రితం మృతమైన సర్పశరీరమును చూపించాడు. తరువాత వారంతా రంగురంగుల ఆక్రేపులను తోలుకొంటూ వ్రజమునకు బయలుదేరారు. గోపాలకులు గోష్ఠములలో క్రేపులను కట్టివేసి అఘాసుర వృత్తాంతమును తమ తల్లిదండ్రులకు చెప్పసాగారు. ఆసన్నివేశం జరిగి సంవత్సరమయిందని వారికి తెలియనే తెలియదు. సంధ్యా సమయంలో గోధూళి విస్తరించిన వేళ గోబృందం వెనుకనే శిఖిపింఛ సుందరుడు వేణుగానం చేస్తూ నందవ్రజమునకు వస్తుంటే గోపకాంతలు ఆ గోవిందుణ్ణి దర్శనం చేసికొనటం వల్ల వారికి ఎనలేని మానసిక శాంతి చేకూరేది. గోసముదాయం మధ్యలో గోధూళి ఛాయలలో నడుస్తూ బంగారపురంగు మురళిని ఊదుతూ వచ్చే నీలమేఘశ్యాముడు అస్పష్టంగా కనిపించేవాడు. అందువల్ల ఆ గోపవధువులు నందనందనుని కోసం మరింత ఉత్సుకతతో చూసేవారు.

## ధేనుకాసురుడు :

ఒకరోజున బలరామకృష్ణులు గోపబాలకులతో కలిసి గోవులను మేపుకుంటూ తాళవనంలోకి ప్రవేశించారు. ఆతాళవనంలో ధేనుకుడనే రాక్షసుడు గార్దభాకారంలో ఉండేవాడు. ఆతని భయం వల్ల గోపకులు ఆవనంలోకి వెళ్ళేవారు కారు. కృష్ణుడు

కూడా ఇంతకుముందు ఎన్నడూ ఆ వనంచూడలేదు. ఆ వనంలోపలకు వెళ్ళిన తరువాత బలరాముడు తన నీలి ఉత్తరీయమును నడుముకు చుట్టాడు. తాటిచెట్టును రెండు చేతులతో పట్టుకొని ఊపటం ఆరంభించాడు. పండిన తాటిపళ్ళు జలజల రాలి క్రిందపడ్డాయి. వాటిని గోపకులు తీసికొని తింటున్నారు. పండ్లు రాలి క్రిందపడిన శబ్దం విని గార్ధభాకాంలో ఉన్న ధేనుకాసురుడు క్రోధంతో ఊగిపోతూ పరుగుపరుగున వచ్చి బలరాముణ్ణి వక్షఃస్థలంపై వెనుకకాళ్ళతో తన్నాడు. బలరాముడు వెంటనే ఆ రాక్షసుని వెనుకరెండు కాళ్ళు చేత్తోపట్టుకొని అక్కడున్న ఒక మహాతాళవృక్షానికేసి విసిరివిసిరి కొట్టాడు. బలరాముడు సాక్షాత్తు అనంతుని అవతారం. ఆతని పరాక్రమం కూడా అనంతమే. బలదేవుని ముష్టిఘాతాలకు ధేనుకాసురుడు ప్రాణాలు కోల్పోయాడు.

ధేనుకుడు పూర్వజన్మలో బలిచక్రవర్తి కుమారులలో ఒకడైన సాహసికుడు. ఆతడు గంధమాదన పర్వతంపై కామినీజనంతో విహరిస్తున్నాడు. ఆప్రాంతంలోనే దుర్వాసుడు ధ్యానం చేసుకుంటున్నాడు. ధేనుకుని నృత్యగాన విలాసాదులు మహర్షి ధ్యానమునకు ఆటంకం కలిగించాయి. ఆయన బయటకు వచ్చి ధేనుకుని చూచి "ఓరి దుర్బుద్ధీ! నీవు ఔచిత్యం తెలియకుండగా గాడిదవలె ప్రవర్తిస్తున్నావు. నీవు గాడిదవు కాగలవుపో" అని శపించాడు. అనంతరం వానిపై జాలికలిగి "ద్వాపరాంతంలో మధురమండలంలో తాళవనంలో బలరాముని చేతిలో నీకు ముక్తి లభిస్తుంది' అని శాపావసానమును తెలిపాడు. ఆసాహసికుడే మధురమండలంలో తాళవనంలో గార్ధభరూపంతో జన్మించాడు. ఆ మహర్షి శాపం కారణంగానే ధేనుకాసురుడు బలరాముని చేతిలో ముక్తిని పొందాడు. పూర్వం శ్రీమహావిష్ణువు ప్రహ్లాదునకు "మీ వంశంలో ఎవరినీ నేను చంపను" అని వరప్రదానం చేసిన కారణంగా ఆవంశస్థుడైన ధేనుకుణ్ణి శ్రీకృష్ణుడు బలరాముని చేత చంపించవలసివచ్చింది.

**కాళీయుడు గరుడుడు :**

పూర్వం సర్పములన్నీ రమణక ద్వీపంలో నివాసం చేస్తూ ఉండేవి. అక్కడకు గరుడుడువచ్చి కనిపించిన పామును చంపి తింటూఉండేవాడు. అప్పుడు సర్పములన్నీ గరుడుని బాధ భరింపలేక గరుడునితో ఒక ఒడంబడికకు వచ్చినాయి. దానిప్రకారం గరుడుడు ప్రతిరోజు తనకు ఆహారంగా వచ్చిన ఒక సర్పమును మాత్రమే తిని తృప్తిపడాలి. ఇందుకు గరుడుడు కూడా సంతుష్టుడై అంగీకరించాడు. కానీ ఒక

నాడు ఈ నియమాన్ని బలగర్వంతో విజ్జృంభిస్తున్న కాళీయుడు ధిక్కరించాడు. అప్పుడు ప్రచండ పరాక్రమవంతుడైన గరుడుడు తనవాడి కాళిగోళ్ళతో కాళీయుని పడగపై ఒక్క చఱుపు చరిచాడు. ఆదెబ్బకు కాళీయుడు భయపడి గరుడునకు దొరకకుండగా అనేక చోట్లకు తిరిగాడు. గరుడుడాతనిని వెంటాడుతూనే ఉన్నాడు. శ్రీమహావిష్ణువుకు భయపడి ఎవరూ కాళీయునకు ఆశ్రయం ఇవ్వలేదు. చివరకు కాళీయుడు భూభారం వహిస్తున్న ఆదిశేషుణ్ణి శరణువేడాడు.

ఆదిశేషుడు కాళీయుని పరిస్థితి చూచి జాలిపడి ఇలా అన్నాడు - పూర్వం సౌభరి అనే పేరుగల ఒక సిద్ధముని ఉండేవాడు. ఆయన బృందావనంలో యమునానది నీటిలో ఉండి చాలా సంవత్సరాలు తపస్సుచేశాడు. ఒకనాడు ఆజలతరంగాలలో విహరిస్తున్న మీనములను, వాని సంతానమును చూచి తాను కూడా గృహస్థాశ్రమమును స్వీకరించి సుఖపడాలని భావించాడు. అప్పుడు సౌభరి మహర్షి మాంధాత మహారాజు కుమార్తెలను నూరుగురను వివాహం చేసికొని సుఖజీవితం గడిపాడు. మహర్షి యమునానదిలో దీర్ఘకాలం తపస్సు చేస్తున్న రోజులలోనే ఒకనాడు గరుడుడు వచ్చి అక్కడి మీనములను భక్షించటం ఆయన చూశాడు. ఆ మీనముల స్థితికి జాలిపడి గరుడునిపై కోపించి ఆమహర్షి "ఇక నేటినుండి నీవు ఈ కాళిందీ జలకుండములోని ప్రాణులను చంపినట్లయితే తక్షణమే నీ ప్రాణములు అనంతవాయువులలో కలిసిపోతాయి" అని శపించాడు. అందువల్ల నీవిక వెంటనే బృందావనం వెళ్ళి అక్కడి కాళిందీ నదిలో క్షేమంగా జీవించు" అని చెప్పాడు. ఆ మాటలు విని కాళీయుడు తన భార్యలతో, సంతానముతో పాటు యమునా నదికేగి అచ్చటనే నివసింపసాగాడు.

ఒకనాడు గోవిందుడు గోపబాలకులతో కలిసి గోవులను మేపుకొంటూ కాళిందీ తీరానికి చేరుకున్నాడు. అక్కడ కాళిందీ మడుగులో నాగరాజైన కాళీయుడు ఉండటంవల్ల ఆనీరంతా విషయుక్తమై ఉంది. ఈవిషయం తెలియక అక్కడకు చేరిన గోపాలకులలో కొందరు ఆ నీటిని త్రాగి ప్రాణములు కోల్పోయి నేలపై పడిపోయారు. కొన్ని గోవులు కూడా ఆ నీటిని త్రాగి మరణించాయి. ఈదృశ్యం చూచిన కృష్ణ పరమాత్ముడు కరుణాంతరంగుడై తన అమృత కటాక్షములతో ఆగోవులను, గోపకులను వెంటనే బ్రతికించాడు. పీతాంబరాన్ని గట్టిగా నడుముకు చుట్టుకొని ఆ తీరమున ఉన్న కదంబవృక్షంపైకి ఎక్కి ఆ విషయుక్త జలములలోకి

ఎగిరి దూకాడు. ఒక్కసారిగా జలకుండములోని నీరంతా చెల్లాచెదురయింది. అందులో నివసిస్తున్న నాగరాజైన కాళీయుడు అమితంగా ఆగ్రహించి తన నూరుపడగలను విప్పి శరీరం పెంచి కృష్ణుణ్ణి చుట్టివేశాడు. కృష్ణుడు వెంటనే తన శరీరాన్ని మరింత పెద్దదిగా చేసి ఆ నాగ బంధం నుంచి బయటపడ్డాడు. ఆ నాగరాజుతోకను పట్టుకొని గిరగిరా త్రిప్పి విసిరివేశాడు. నాగరాజుకు తలతిరిగిపోయి మూర్ఛవచ్చినంత పని అయింది. కాళీయుడు డస్సిపోయి సోలిపోయి తన పడగలను వంచి శ్రీకృష్ణుని పాదాల దగ్గర శరణువేడుకున్నాడు. మణులతో ప్రకాశించే కాళీయుని పడగలపైకి ఎక్కి శ్రీకృష్ణుడు నాట్యం చేశాడు. ఆనంద తాండవం చేస్తున్న కృష్ణునిపై దేవతలు పూలవాన కురిపించారు. ఆసమయంలో భయవిహ్వలలైన నాగపత్నులు అక్కడకు చేరుకొని తమకు "పతిభిక్షననుగ్రహించు"మని కృష్ణుణ్ణి వేడుకున్నారు.

కాళీయుని గర్వం అణగిపోయింది. అప్పుడు ఆ నాగరాజు తనను దయతో కాపాడుమని కృష్ణుని అర్థించాడు. అందుకు కృష్ణుడు ప్రసన్నుడై "నాగరాజా! నీవు నీపత్నులతో సహితంగా రమణక ద్వీపానికి వెళ్ళు. నీ శిరస్సుపై నాపాదచిహ్నాములున్నాయి. కాబట్టి గరుడుడు నీకు అపకారం తలపెట్టడు" అని పలికాడు. ఈ మాటలు విని కాళీయుడు భార్యలతో పిల్లలతో కాళిందిని విడిచి రమణక ద్వీపానికి తరలివెళ్ళాడు. "కాళీయ సర్పం శ్రీకృష్ణుణ్ణి చుట్టివేసింది" అనే విషయం విని నందాది గోపకులంతా ఆందోళనతో అక్కడకు చేరుకున్నారు. శ్రీకృష్ణుడు నీటిలో నుంచి క్షేమంగా బయటకు రావటం చూచి వారంతా ఎంతో ఊరటపొందారు. నందుడు తన కుమారుణ్ణి కౌగిలించుకొని తృప్తి ననుభవించాడు.

**దావానల భక్షణం :**

అప్పటికే ఆందోళనతో అలసిపోయి ఉండటం వల్ల యమునానదీ తీరందగ్గరనే గోపకాంతలు, గోపాలురు అందరూ నిద్రపోయారు. అర్ధరాత్రి సమయమయింది. వెదరు కర్రలు పేలిపోతున్న శబ్దం వినిపించింది. గోపాలురు నిద్ర లేచిచూస్తే ఆ అడవిలో పెద్ద కార్చిచ్చు అంటుకొని చెలరేగిపోతున్నది. భీకరమైన ఆ జ్వాలలు గోపకులను చుట్టుముడుతున్నాయి. వారంతా భయభ్రాంతులై శరణాగత వత్సలుడైన శ్రీకృష్ణపరమాత్ముణ్ణి ఆశ్రయించారు. యోగేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు వారికి "నేనుండగా భయమెందుకు?" అని అభయమిచ్చి వారినందరిని కన్నులు మూసికొనమని చెప్పి

ఆ దావానలాన్ని తాను త్రాగివేశాడు. తెల్లవారింది. గోగోపగణ సహితంగా నందనందనుడు ఆనందంగా వ్రజమండలానికి బయలుదేరాడు.

## వేదశిరుడు అశ్వశిరుడు :

స్వాయంభువ మన్వంతరంలో వేదశిరుడనే మునిఉండేవాడు. ఆయన భృగువంశీయుడు. ఆయన వింధ్యపర్వతంపై తపస్సు చేసికొనేవాడు. ఒకనాడు మరొక అశ్వశిరుడనే ముని వచ్చి తాను అక్కడ ఉండి తపస్సు చేసుకుంటానన్నాడు. అందుకు వేదశిరుడు అంగీకరించలేదు. అందుకు అశ్వశిరుడు ఆగ్రహించి "మునిశ్రేష్ఠా! ఈ సమస్త విశ్వము శ్రీమహావిష్ణువుకు సంబంధించినది. నీదీనాదీ కాదు. ఇక్కడ ఇప్పటివరకు ఎందరు మునులు తపస్సు చేశారు! నీవు సర్పమువలె బుసకొడుతూ మాట్లాడుతున్నావు. నీవు సర్పమవు అవుతావు. నీవు గరుడుడంటే భయపడుతూ బ్రతుకుతావు పో" అని శపించాడు. ఆ మాటలు విని వేదశిరుడు "ఓరీ దుర్మతీ! నీ ప్రవర్తన అనుచితంగా ఉన్నది. చిన్న దోషానికి పెద్ద దండన విధిస్తావా! నీపని గడవటం కోసం ఎక్కడికైనా తిరుగుతావు. నీవు ఒకకాకివి అవుతావు పో" అని శపించాడు.

అదే సమయంలో ఆ ఇద్దరి ఋషుల మధ్య శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయ్యాడు. ఆ మహర్షులిద్దరూ తాము పొందిన శాపాలకు ఎంతో బాధపడసాగారు. అందుకు మహావిష్ణువు వారిని ఊరడించి "మీరిద్దరూ నా భక్తులు. నేను మీ ఇద్దరి శాపాలను వృథాచేయగలను. కాని నా భక్తుల మాటలను వమ్ముచేయటం నాకు ఇష్టంలేదు. ఓ వేదశిరుడా! నీవు సర్పమైనప్పుడు నీపడగలపై నా పాదముద్రలు ఉంచుతాను. అందువల్ల నీకు గరుడుని భయంఉండదు. అశ్వశిరుడా! నీవు నా మాటవిను. బాధపడనద్దు. కాకిగా ఉన్నాకూడా నీకు ఉత్తమ జ్ఞానం కలుగుతుంది. యోగసిద్ధులతో కూడిన త్రికాలదర్శియైన జ్ఞానం నీకు సులభంగాలభిస్తుంది." అని పలికి అంతర్ధాన మయ్యాడు. విష్ణుమూర్తి వెళ్ళగానే అశ్వశిరముని యోగీంద్రుడైన కాకభుశుండిగా మారిపోయి నీలపర్వతంపై నివసింప సాగాడు. సమస్త శాస్త్రార్థములను తెలిసికొని రామభక్తుడుగా జీవింపసాగాడు. ఆతడే గరుత్మంతునకు రామాయణగాథను తెలియజేశాడు. చాక్షుష మన్వంతరంలో దక్షప్రజాపతి కశ్యపునకు తన పదకొండుమంది కుమార్తెల నిచ్చి వివాహం చేశాడు. వారిలో ఒకామె కద్రువ.

ఆ కద్రువయే ద్వాపరయుగంలో రోహిణిగా జన్మించి బలరాముని తల్లి అయింది. ఆ కద్రువ అనేక నాగులకు జన్మనిచ్చింది. వారిలో అలనాటి వేదశిరుడే కాళీయమహాసర్పంగా జన్మించాడు.

**ఆదిశేషుడు :**

ఆ నాగులలో మొదటివాడే ఆదిశేషుడు. ఆయనే అనంతుడుగా కూడా ప్రసిద్ధుడు. ఆ అనంతుడే ఇప్పుడు బలరాముడుగా జన్మించాడు. ఒకనాటి విషయం - శ్రీమహావిష్ణువు ఆదిశేషుణ్ణి పిలిచి ప్రసన్న చిత్తుడై "ఈ భూమండలమును భరించటం నీకు తప్ప ఎవరికి సాధ్యమౌతుంది?" నీవు ఈ భూమిని నీ శిరస్సుపై ధరించు. నీ పరాక్రమము అనంతము, అందువల్ల నీవు అనంతుడవని కూడా పిలువబడతావు. విశ్వకళ్యాణం కోసం నీవీ కార్యము నెరవేర్చాలి" అని పలికాడు.

శ్రీమహావిష్ణువు అదేశమును అంగీకరిస్తూ శేషుడు "పరాత్పరా! భూభారం వహించటానికి నాకు ఒక అవధి తెలియజేయవలసింది. నేను ఎప్పటివరకు భూభారం వహించవలెనో చెప్పవలసింది" అని అభ్యర్థించాడు. అప్పుడు దేవదేవుడు "ఓ నాగరాజా! నీవు ప్రతిదినము నీ సహస్రముఖములతో నా నామగుణమహిమా వైభవమును వివిధ విధములుగా కీర్తించు. ఏనాడు నీవు నా దివ్య మహిమలను, దివ్యనామములను కీర్తించటం పరిసమాప్తి అవుతుందో ఆనాడు నీవు భూభారం తొలగించుకొని సుఖంగా ఉండు" అనివచించాడు.

శేషుడా మాటలను విని "ఓ ప్రభూ! పృథ్వికి నేనాధారమయితే నాకు ఆధారం ఎవరు? నాకుఏ ఆధారము లేకపోతే నేను నీటిలో ఎలా ఉండ గలను?" అని అడిగాడు. అప్పుడు మహావిష్ణువు "మిత్రమా! అందుకు నీవు చింతించవద్దు. నేను కచ్ఛపరూపం ధరించి నీవిశాలశరీరమును భరిస్తాను" అన్నాడు. ఆమాటలు విని శేషుడు గరుడధ్వజునకు ప్రణామంచేసి పాతాళలోకం కంటే లక్షయోజనములు క్రిందకువెళ్ళాడు. ప్రచండ పరాక్రమంగల శేషుడు నెమ్మదిగా ఈ భూమిని తన వేయిపడగలలోని ఒక పడగపై పెట్టుకున్నాడు. అనంతదేవుడు పాతాళలోకమునకు వెళ్ళేటప్పటికి బ్రహ్మదేవుని అనుజ్ఞతో ఇతర నాగరాజులు పాతాళలోకమునకు వెళ్ళారు, కాళీయుడు మొదలైన నాగరాజులు భూమండలంపై రమణక ద్వీపంలో నివసింపసాగారు.

## రాధాకృష్ణుల దర్శనము :

ఇది ఒకనాటి విషయము-శ్రీకృష్ణపరమాత్మ ఒకనాడు మోహనమురళీనాదం చేస్తూ గోవులతో, గోపాలురతో వెళుతున్నాడు. ఆ దృశ్యం చూచి రాధాదేవి చెలికత్తెలు లలిత విశాఖ అనువారు పరుగుపరుగున రాధ దగ్గరకు వచ్చి "రాధా! నీవు ఎవరిని ధ్యానిస్తున్నావో, ఎవరంటే నీకు ప్రాణమో ఆ గోపాలుడు ప్రతినిత్యం గోవులను తోలుకొని ఇటే వెళుతున్నాడమ్మా! నీవు చూశావా లేదా?" అని అడిగారు. అందుకు రాధ వారితో "మీరు ఎవరిని చూచి ఎవరనుకున్నారో. మీమాటలు నేను నమ్మను. మీరు నిజంగా నందనందనుణ్ణి చూచినట్లయితే ఎలా ఉన్నాడో ఏదీ చిత్రమును వ్రాసి చూపించండి" అన్నది.

లలిత విశాఖలు సుందరమైన గోవిందుని చిత్రమును వ్రాసి రాధ కరకమలములలో ఉంచారు. ఆ చిత్తరువును చూచి రాధ ఆనందంతో తన్మయురాలయింది. ఆమె హృదయమంతా కృష్ణ స్మరణతో నిండిపోయింది. పారవశ్యంతో ఆమె కనులు మూత పడ్డాయి...... యమునాతీరంలో భాండీరవనంలో ఒకచోట నీలమేఘశ్యాముడు చిరునవ్వులు చిందిస్తూ రాధ సన్నిధిలో నృత్యం చేయసాగాడు. లయబద్ధంగా, మధుర మనోహరంగా, ఎంతో సౌఖ్యంగా అనిపించసాగింది.....ఇంతలో ఆమెకు మెలకువ వచ్చింది. కనులు తెరచి చూచింది. కృష్ణవియోగంతో ఆమె విహ్వాల అయింది. అదే సమయంలో మురళీ లోలుడు గోధూళిధూసరిత కోమల గోపవేషంతో ఆ మార్గంలోనే వెళుతున్నాడు. వెంటనే చెలికత్తె రాధను పిలిచి గవాక్షంలో నుంచి శ్యామసుందరుణ్ణి చూపించింది. ఆమె కృష్ణుని రూపం చూచి ముగ్ధురాలయింది.అదే సమయంలో కృష్ణుడు రాధను చూశాడు. అద్భుతమైన ఆనందప్రదమైన రాధ రూపమునుచూచి కృష్ణుడు చూపు మరల్చుకొనలేకపోయాడు.

కృష్ణ స్మరణాయత్తచిత్తయైన రాధకు లలితవిశాఖలు హితవులు చెప్పసాగారు. "నీవు ఎందుకు ఇంతగా మూర్ఛపోయి వ్యధిత హృదయురాలవు అవుతున్నావు? శ్రీకృష్ణుణ్ణి పొందాలనుకుంటే నీ ప్రేమను మరింత దృఢతరం చేసుకో" అని పలికింది లలిత. లలిత లలితములైన పలుకులను విని రాధ "ఓలలితా! వ్రజభూషణుడైన శ్యామసుందరుని చరణారవిందములసన్నిధి నాకు లభించకపోతే నేను జీవించి ఉండటం అసంభవం" అన్నది.

ఈ మాటలు విని భయపడిన లలిత యమునాతీరంలో ఉన్న శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళింది. కదంబవృక్షం నీడలో, మాధవీలతామంటపంలో కూర్చున్న శ్యామసుందరుణ్ణిచూచి "ఓ ప్రభూ! వృషభానునందిని రాధ నిన్ను చూచినప్పటినుంచి మనస్సు స్థిమితం కోల్పోయి నీకోసం పరితపిస్తున్నది. నీ విరహంలో ఉన్న ఆమెకు పువ్వులు బాణములయినాయి, చంద్రబింబం విషబింబ సదృశమయింది. నీవు శీఘ్రమే ఆమెకు దర్శనం ప్రసాదించు. నీదర్శనం వల్లనే ఆమెకు ఆరోగ్యం చేకూరుతుంది. నీవు సర్వసాక్షివి, నీకు తెలియనిది ఏమున్నది స్వామీ! సృష్టి స్థితి లయలు నీ అధీనములు. నీవు పరమేశ్వరుడవు. అఖిల మానవాళిపై నీకు సమానమైన దృష్టి ఉన్నప్పటికీ నీవు భక్తవశంకరుడవుకదా!" అని పలికింది.

ఈ మాటలను విని కృష్ణభగవానుడు "ఓ భామినీ! సహజంగా మనస్సు ఎప్పుడూ పురుషోత్తముని వైపు మొగ్గటానికి సిద్ధంగా ఉండదు. అందుకు మీరు చేయవలసింది నన్నుప్రేమించటం ఒక్కటే. ఈ ప్రపంచంలో ప్రేమను మించింది మరియొకటిలేదు. నేను ప్రేమకే సులభంగా లభిస్తాను. భాండీరవనంలో రాధ మనస్సులో ఏవిధంగా కోరిక కలిగిందో, అదేవిధంగా ఆ కోరిక నెరవేరుతుంది. ఉత్తముల ప్రేమ అహేతుకంగా ఉంటుంది. మహాత్ములు కారణములేని ఆ ప్రేమనే నిర్గుణమని అంటారు. పాలు, దానిలోని తెల్లదనములు ఏవిధంగా వేరువేరు కావో, అదేవిధంగా మా ఇరువురిలోను భేదమును చూడనివారు మాత్రమే ఆ నిర్మల ప్రేమను మనస్సులలో నింపుకొని బ్రహ్మపదమును అందుకొనగలుగుతారు" అని వచించాడు.

కృష్ణపరమాత్ముని మాటలను విని లలిత పరుగున రాధదగ్గరకు వెళ్ళి చిరునవ్వులు చిందిస్తూ "ఓ సఖీ! నీవు ఏవిధంగా కృష్ణుణ్ణి అభిలషిస్తున్నావో అదేవిధంగా మాధవుడు కూడా నిన్ను కోరుకుంటున్నాడు. మీ ఇద్దరి తేజస్సు ఒక్కటే. కాబట్టి ఓ దేవీ! నీవు శ్రీకృష్ణుని కోసం నిష్కామ కర్మను నిర్వర్తించు. అటువంటి పరాభక్తివల్ల నీ మనోరథం నెరవేరుతుంది" అని పలికింది. ఈ మాటలనువిని రాజేశ్వరియైన రాధ ధర్మవిదురాలైన చంద్రానన అనే సఖిని పిలిచి "చెలియా! కృష్ణపరమాత్ముణ్ణి ప్రసన్నం చేసికొనటానికి ఎటువంటి పూజచేయాలి? నీవు గర్గాచార్యుల శిష్యురాలివి కాబట్టి సౌభాగ్యదాయకమైన, పుణ్యప్రదమైన, మనోవాంచార్థసిద్ధిప్రదాయకమైన ఒక వ్రతం చెప్పు చేస్తాను" అన్నది. అప్పుడు చంద్రానన రాధాదేవికి తులసీవ్రత

మాహాత్మ్యమును వివరించింది. రాధ భక్తితో ఆ వ్రతం నెరవేర్చింది. ఫలితంగా తులసీదేవి ప్రేమతో ప్రత్యక్షమై ఆమె అభీష్టము నెరవేరుతుందని అభయప్రదానం చేసింది.

## గోపికగా కృష్ణుడు :

రాధాదేవి తులసీవ్రతం నిర్వర్తించినదనివిని ఆమె ప్రేమను పరీక్షించటం కోసం కృష్ణ పరమాత్ముడు వృషభానుని నగరమునకు వచ్చాడు. ఆ సమయంలో కృష్ణుడు అందమైన గోపాంగన రూపం ధరించాడు. ఆమె నడుస్తుంటే పాదములకున్న మంజీరముల సవ్వడులు మనోహరంగా వినిపిస్తున్నాయి. నడుముకు అలంకరించిన చిరుమువ్వలు సవ్వడులు చేస్తున్నాయి. వ్రేళ్ళకు అంగుళీయకములు, చేతికి రత్నకటకములు, భుజములకు కేయూరములు, మంగళగళసీమలో ముత్యముల వరుసలు ఆమె శోభను ఇనుమడింపచేస్తున్నాయి. ఆమె శిరీషపుష్పాలను సిగలో అలంకరించుకొని, కేశపాశములను నైపుణ్యంగా తీర్చిదిద్దుకున్నది. నాసికకు ముత్తెపు బులాకి ముచ్చట గొలుపుతున్నది. శరీరపు దివ్యకాంతి అలకల కాంతివలెనే శ్యామ సుందరంగా ఉంది. ఇటువంటి రూపం ధరించి కృష్ణుడు వృషభానుని భవనం వద్దకుచేరుకున్నాడు. ఆ భవన వైభవమునకు తగినట్లుగా ప్రధాన ద్వారం దగ్గర కాటుక రంగులో ఉన్న పెద్ద ఏనుగు సంచరిస్తున్నది. మంటప ప్రాంగణంలో వాయువేగ మనోవేగాలతో పయనింపగల అశ్వములు కట్టబడి ఉన్నాయి. ఒకవంక అసంఖ్యాకంగా గోసముదాయములు విలసిల్లుతున్నాయి.

మాయాగోపిక మెల్లమెల్లగా భవన ప్రాంగణంలోనికి ప్రవేశించింది. వీణ, తాళ, మృదంగాది నిస్వనములు శ్రుతిహితంగా వినిపిస్తున్నాయి.గోప సుందరీమణుల మధ్య వ్రజేశ్వరి అయిన రాధిక అందాలు విరజిమ్ముతూ అద్భుతంగా కనిపించింది. మణి మందిరంలోపలకు నెమ్మదిగా అడుగుపెట్టిన నవగోపసుందరిని రాధాదేవి చూసింది. ఆ గోపసుందరి తేజస్సు ఎదుట అక్కడి సుందరీమణుల సౌందర్యం చంద్రబింబం ముందు తారకల సౌందర్యం వలె వెలవెలపోయింది. రాధాదేవి ముందుకు వచ్చి ఆ నవగోపకాంతను ఎంతో అభిమానపురస్సరంగా ఆహ్వానించింది. ఆ తరువాత ఆమెను చక్కని సింహాసనంపై ఆసీనురాలిని చేసి "ఓ సఖీ! నీవు ఎవతెవు? నిన్ను చూస్తుంటే నాకెంతో ఆహ్లాదంగా ఉన్నది. నీవంటి ఆకర్షణతో

కూడిన అందగత్తెను నేను ఎన్నడూ చూచిఎరుగను. నీనివాసము ఎక్కడ? నీవు వచ్చిన కారణము ఏమిటి? నీ మోహనరూపం చూస్తుంటే నాకు మురళీమోహనుడే గుర్తుకు వస్తున్నాడు. నీ ఆకృతి, నీముఖ కవళికలు, నీ మందహాసములు మాటిమాటికి గోవిందుని తలపిస్తున్నాయి. నీవు ప్రతిరోజు నా దగ్గరకు వస్తూ ఉండు" అన్నది.

మాయాగోపికమధుర మధురంగా నవ్వి "ఓ దేవీ! గోకులంలో నందభవనమునకు ఉత్తరంగా నా నివాసం ఉన్నది. నన్ను గోపదేవి అంటారు. నీ సఖురాలు లలిత చెప్పగా నీగుణమాధుర్యము, రూపమాధుర్యములను గురించి విన్నాను. అందువల్ల ఓ చకిత నయనా! నిన్ను చూడటం కోసం ఇలా నీ భవనమునకు వచ్చాను. అమరావతిని మించిన అందమైన నీ భవనం చూశాను" అని పలికింది. ఈ విధంగా మాయాగోపిక రాధాదేవి ఇద్దరూ ఉద్యానవనంలో పువ్వులతోటలో మాటలాడుకొంటూ, పరిహాసములాడుకొంటూ, పాటలు పాడుకొంటూ విహరింపసాగారు. సంధ్యాసమయమయింది. అప్పుడుగోపదేవి రాధతో "వ్రజేశ్వరీ! నందనగరం ఇక్కడకు చాలా దూరము. ప్రొద్దుపోతున్నది. ఇక నేను వెళ్ళి మరల రేపు ఉదయము తప్పక వస్తాను సుమా!" అన్నది. ఆ మాటలు వినగానే రాధ కన్నులు అశ్రుసిక్తము లయ్యాయి.ఆమె స్పృహకోల్పోయి నేలపై పడిపోయింది. వెంటనే పరిచారికలు వచ్చి వింజామరలు వీచి ఆమెను సేదదీర్చారు. అప్పుడు మాయాగోపిక మృదు మధురంగా "రేపు ఉదయమే తప్పక వస్తాను, చింతించవద్దు. అలాకాకపోతే నా గోవులపై ఆన" అని పలికి ఆమెను కౌగిలిలోనికి తీసికొని బుజ్జగించి వెళ్ళింది.

తెలతెలవారుతూనే అందాలు చిమ్ముకొంటూ గోపదేవి వచ్చింది. ఆమె రావటం చూడగానే రాధాదేవి హర్షప్రపుల్ల అయింది. "సఖీ! నీవు లేని నిన్న రాత్రి గడపటం ఎంత కష్టమయింది!" అని అంటూ "సఖీ! నీవు ఎందువల్లఇలా మౌనంగా ఉన్నావు?" అని అడిగింది. రాధాదేవి ప్రేమపూర్వకమైన మాటలకు సంతసించి గోపదేవి మందహాస వదనంతో "ఓ రాధా! నందవ్రజం సమీపంలోని వీధులలో నేను పెరుగు అమ్ముకు రావటానికి వెళుతున్నాను. ఇంతలో నవతరుణంలో ఉన్న నందనందనుడు నన్ను దారిలోనే అడ్డగించాడు. ఆతనికి ఒక చేతిలో మురళి, మరొకచేతిలో బెత్తం ఉన్నాయి. ఆ రసిక శేఖరుడు సిగ్గుకు తిలాంజలి నిచ్చి గబగబావచ్చి నా చేయిపట్టుకొని పకపకా నవ్వుతూ "ఓ సుందరీ! నేను నిన్ను

చేపట్టేవాణ్ణి. అందువల్ల నిన్ను నీవు నాకు అర్పించుకో" అన్నాడు. అప్పుడు నేను "నీ వంటి అల్లరిచిల్లరి వానికి నన్ను నేను అర్పించుకోలేను" అన్నాను. ఇంతలోనే నా శిరస్సుమీద నున్న పెరుగు కుండను ఒక్కసారిగా క్రిందకు లాగాడు. కుండ పగిలిపోయింది. కాస్త పెరుగు తిని గబగబా నందగిరికి ఈశాన్యంవైపుకు వెళ్ళిపోయాడు. అందుకే విచారంగా ఉన్నాను. జాతి చూస్తే గోపాలుడు. రంగు చూద్దామా నలుపు. ధనవంతుడూకాదు. ఇటువంటి వ్యక్తిని నీవు ప్రేమించటం బాగాలేదు.ఇక ఈరోజు నుంచి ఆ అభిమానహీనుడైన కృష్ణుణ్ణి మనస్సులోకి రానీయకు" అని పలికింది.

గోపదేవి మాటలను విని రాధాదేవి ఆశ్చర్యపడింది. రాధ గోపదేవితో "సఖీ! బ్రహ్మరుద్రాదులు యోగముద్రలో ఉండి ధ్యానం చేసేది ఈ స్వామి కోసమే. వేలుపులు ఈ స్వామి చరణారవిందాల స్పర్శకే తహతహలాడిపోతుంటారు. ఈయన పుట్టుకలేని ప్రభువు. పరిపూర్ణ అవతార పురుషుడు. భూభారం తొలగించటం కోసం అవతరించిన పురుషోత్తముడు. కృష్ణుడు నల్లగా ఉన్నాడని అన్నావు. ఆ శ్యామసుందరుడైన కృష్ణుని దర్శించి, ఆ స్వామిలో మనస్సును లగ్నంచేసి నీలకంఠుడు జటాజూటధారిగా, భస్మభూషితాంగుడుగా ఉండిపోయాడు. సిద్ధ, ముని, యక్ష, నాగ, మరుద్గణముల అధిపతులు కూడా నిరంతరం భక్తిభావంతో ఈ స్వామి పాదములకు నమస్కరించి అశేషమైన ఐశ్వర్యమును పొందుతుంటారు. అటువంటిది ఆ స్వామిని నిర్ధనుడని ఎలా అనుకున్నావు? ఇక వత్సాసుర, అఘాసుర, బకాసుర, తృణావర్త, శకటాసుర, పూతనాదులను వధించినవాడు, కాళీయదర్పమును, యమమళార్జున గర్వమును దమించినవాడు ఈ కృష్ణుడు. అనేక బ్రహ్మాండ సమూహముల సృష్టి స్థితి లయలకు అధీశ్వరుడైన ఈ మురారి యశస్సు సామాన్యమైనదా?

ఈ పురుషోత్తమునకు భక్తులకన్నా ప్రియమైనవారు వేరెవ్వరూలేరు. బ్రహ్మాదులు కూడా భక్తుల తరువాతనే. ఈ భగవానుడు భక్తులకు సన్నిహితుడై ఉంటాడు. ఈ కృష్ణుడు కేవలం సుశీలుడే కాదు . సమస్త లోకములలోని సుజనుల సముదాయములకు చూడామణి వంటివాడు. భక్తవశంకరుడై ఉంటూకూడా ఈ పరమాత్ముడు తన రోమరోమములో ఉన్న లోకములనన్నింటినీ పవిత్రమొనరిస్తూ ఉంటాడు. తనను భజించేవారికి ఆ ముకుందుడు అనాయాసంగా ముక్తిని ప్రసాదిస్తాడు కాని ఉత్తమ

భక్తి యోగాన్ని మాత్రం త్వరగా ప్రసాదించడు. కారణం తాను ప్రసాదించే ఆ భక్తికి తానే బంధింపబడతాడు" అని పలికింది.

రాధ పలికిన పలుకులు విని గోపదేవి "ఓ రాధా! నీ బుద్ధి నిరుపమానము. నీవాణి వేదవాణిగా అనిపించింది. ఓ దేవీ! నిజంగా నీవు పిలువగానే శ్రీకృష్ణుడు ఇక్కడకు వచ్చినట్లయితే నీవు చెప్పినదంతా సత్యమని నేను నమ్ముతాను" అన్నది. అప్పుడు రాధ "సఖీ! కృష్ణపరమాత్ముడు నేను పిలువగానే ఇక్కడకు వస్తే ఏమివ్వగలవు? నా పిలుపుకా వనమాలి ఇక్కడకు రాకపోతే నా సంపదనంతా నీకు ధారపోస్తాను' 'అని పలికి రాధ నిశ్చలమైన మనస్సుతో శ్రీకృష్ణుణ్ణి ధ్యానింపసాగింది. కృష్ణపరమాత్ముడు రాధను చూశాడు. తన దర్శనం కోసం ఆమె ఉత్కంఠతో ఉన్నది. ఆమె నేత్రములనుంచి బాష్ప ధారలు ప్రవిస్తున్నాయి. ఆమె శరీరమంతా స్వేదమయమయింది. ఇది చూచి భక్తవత్సలుడైన భగవానుడు సఖులంతా చూస్తుండగానే పురుషాకృతితో ప్రత్యక్షమై "ఓ చంద్రవదనా! నీవు హృదయపూర్వకంగా పిలిచావు. ఇదిగో వెంటనే వచ్చాను. ఇటు కళ్ళుతెరచి చూడు. గోకులంనుంచి గోపకుల బృందంతో యమునాతీరమునకు వెళుతున్న నాకు నీ పిలుపు వినిపించి పరుగుపరుగున వచ్చాను. నేను రావటంతోటే ఇక్కడ నీ సఖిరూపంలోఉన్న యక్షిణి అదృశ్యమయింది చూశావా!" అని పలికాడు. కనులు తెరచి కృష్ణపరమాత్ముణ్ణి చూచి రాధాదేవి పరమానంద భరితయై ఆ స్వామి చరణకమలములపై వ్రాలిపోయింది. ఆమె మనోరథం నెరవేరింది.

**రాసవిహారం :**

అది వైశాఖమాసం, కృష్ణపక్షము, పంచమీ తిథి. జగమంతా పండువెన్నెల కాస్తున్నది. శ్యామసుందరుడు రాధా మేతుడై యమునాతీరంలో రాసవిహారం చేస్తున్నాడు. పూర్వం గోలోకంనుంచి భూమికి వచ్చిన ఆ ప్రదేశమంతా సువర్ణమయంగా, పద్మరాగ మణులతో విరాజిల్లసాగింది. బృందావనం కూడా దివ్యరూపంధరించి కల్పవృక్షాలతో, మాధవీలతలతో సమలంకృతమై నందనవనమును తిరస్కరిస్తున్నది. వివిధములైన పుష్పాలతో, కలహంసలతో యమునానది శోభిస్తున్నది. గోవర్ధన గిరిరాజు గజరాజు వలె కనిపిస్తున్నాడు. గజరాజు గండస్థలముల నుండి మదజలధారలు స్రవిస్తున్నట్లుగా గిరిరాజు శిఖరములనుండి సెలయేటి ధారలు ప్రవహిస్తున్నాయి. ఆ వనమంతా

దివ్యసౌందర్యంతో భాసిస్తున్నది. గోవిందుని ఆరాధించటానికి ఎక్కడెక్కడి గోపికలు అక్కడకు చేరుకున్నారు. ఆ గోపికలు మొత్తం పన్నెండు యూథములుగా పరమాత్ముని సన్నిధికి విచ్చేశారు. యమునాయూథం కూడా వచ్చి వారితో కలిసింది. ఆ యూథంలోని వారు నీలి వస్త్రాలను ధరించి ఉన్నారు. జాహ్నవీ యూథం వచ్చి చేరింది. ఆ యూథంలోని వారు శ్వేత వస్త్రాలను ధరించి ఉన్నారు. ఇంతలో రమాయూథం వచ్చింది. ఆ బృందంలోని వారు అరుణరాగ రంజితమైన వస్త్రాలను ధరించి ఉన్నారు. అదే సమయంలో సఖురాండ్రతో కలిసి వసంతలక్ష్మి వచ్చింది. ఆమె మధుమాధవి కాబట్టి ఆమెను కృష్ణపత్ని అనికూడా అంటారు. విరజాయూథం, లలిత, విశాఖ, లక్ష్మీ యూథములు, అష్టమహిషీమణులు అక్కడకు చేరుకున్నారు.

ఆకాశంలో తారకల మధ్యలో శోభించే చంద్రబింబంవలె బృందావనంలో ఆ సుందరీమణుల మధ్యలో కృష్ణచంద్రుడు మనోహరంగా ప్రకాశింపసాగాడు. నటనసూత్రధారియైన కృష్ణుడు ఆ గోపకాంతలందరికీ ప్రేమను అతిశయింపజేయటానికి మురళీగానం చేయసాగాడు. సిగలో శిఖిపింఛం, వక్షమున వనమాల, చెవులకు కుండలములు ఇదీ కృష్ణుని అలంకారము. సుందరీమణులు మనోహరంగా జగన్నాథుని గూర్చిన గీతాలాపన చేయసాగారు. అంతలోనే అక్కడ మొత్తం ఎందరు కాంతలున్నారో అన్ని రూపాలను ధరించాడు నటవరుడైన కృష్ణపరమాత్ముడు. కొందరు గోపికలు గానం చేయసాగారు. మరికొందరు గోపికలు నృత్యం చేయసాగారు. మరికొందరు గోపికలు సంగీతవాద్యములను ప్రయోగిస్తున్నారు. అందరితో అన్ని విధాలుగా అలరారుతున్నాడు ఆ నందనందనుడు. బృందావనమంతా శ్యామసుందరుని మయమై సమ్మోహనమై విలసిల్లింది. మెల్లమెల్లగా అందరూ యమునానది జలతరంగాలలోనికి దిగి విహరింపసాగారు. ఆ గోపికల కొప్పులలోని రంగురంగుల పువ్వులు ఆ నీటిలో పడి వినీలవస్త్రంపై రంగురంగుల పువ్వులను అద్దినట్లుగా కనిపింపసాగింది. కరతాళములతో, మృదంగ ధ్వనులతో కలిసి వారు చేసే కృష్ణగానం మధురమధురమై రవళించింది. వారి కోరిక నెరవేరింది. వారి తాపత్రయములు ఉపశమించాయి. ఈ రాసవిహారమును ఆకాశంనుంచి చూస్తున్న దేవతలు, గంధర్వులు, విద్యాధరులు వారిపై పుష్పవృష్టి కురిపించారు.

జలక్రీడల అనంతరం వారంతా గోవర్ధన పర్వతం మీద విహరించారు. సఖురాండ్రు రాధాదేవిని అద్భుతంగా అలంకరించారు. రాధాదేవి సింగారింపబడిన

ఆప్రదేశమునకే "శృంగార మండల" మని పేరు. వివిధములైన ఆభరణములతో అలంకరింపబడిన రాధ ఆ సమయంలో దివ్య జ్యోతిగా ప్రకాశింపసాగింది. గోవర్ధనగిరిపై రాధా మాధవులిద్దరూ దక్షిణాయజ్ఞనారాయణులవలె తేజరిల్లసాగారు. అక్కడ నుంచి రాధాకృష్ణులు గోపికలతో కలిసి బహుళవనమునకు చేరుకున్నారు. అలసిసొలసిన గోపికలను చూచి మాధవుడు మేఘమల్లార రాగము నాలపించాడు. ఎక్కడెక్కడి నుంచో మేఘములు కదలి వచ్చి అమృతవర్షమును కురిపించాయి. చల్లని మలయమారుతం అందరికీ ఆహ్లాదం కలిగించింది. గోపకాంతలంతా సౌఖ్యం పొందారు. వారు మురారి మహత్త్యాన్ని గానం చేశారు. తరువాత అందరూ తాళవనం చేరుకున్నారు. అప్పుడు గోపికలు శ్రీకృష్ణపరమాత్మని చేరి "ఓ దేవా! యమునానది ఇక్కడకు చాలా దూరంగా ఉంది. మాకు అమితమైన దాహం వేస్తున్నది. నీవు జగత్తున కంతటికీ అధీశ్వరుడవు కదా. ఇక్కడ జలమును సృష్టిచేయకూడదా!" అని అడిగారు. అప్పుడు శ్రీకృష్ణుడు తన చేతి బెత్తంతో నేలపై కొట్టగానే జలవాహిని బయలుదేరింది. దానినే "వేత్రగంగ" అంటారు. అందులోని నీటిని త్రాగి గోపికలంతా తమ తాపములను ఉపశమింపచేసుకున్నారు.

అక్కడ పున్నమివెన్నెలలో చిన్నకొండపైకూర్చొని శ్రీకృష్ణుడు మోహనమురళీ గానం చేశాడు. ఆ మురళీగానం విని చరాచరప్రకృతి అంతా స్తంభించిపోయింది. శ్రీకృష్ణుని చరణార విందముల చిహ్నములేర్పడిన ఆ కొండకు శ్రీచరణ పర్వతమని పేరు వచ్చింది. అక్కడనుంచి వారంతా నందీశ్వర పర్వతమునకు చేరుకున్నారు. అక్కడ కృష్ణపరమాత్మనితో ఆనంద నృత్యం చేసిన ఆ గోపకాంతలకు తమ అదృష్టమునకు తమకే గర్వం కలిగింది. ఆ క్షణమే కృష్ణుడు రాధాదేవితో సహితంగా అదృశ్యమయ్యాడు. ఆ గోపకాంతలు కృష్ణ విరహంతో విహ్వలచిత్తలై విలపింపసాగారు. వారు ఉన్మత్తలై లతలను, వృక్షములను "నందనందనుడు ఎక్కడదాగాడని" అడుగ సాగారు. "కృష్ణా! కృష్ణా!" అని వారు పిలువసాగారు. వారి మనస్సులు శ్రీకృష్ణ రూపమునందే లగ్నమైఉన్నాయి. అందువల్ల వారు కృష్ణస్వరూపమునే స్మరించి కృష్ణునితో తాదాత్మ్యము చెంది వారు కృష్ణభూమికలను ధరించారు.

కొంతసమయం తరువాత గోపకాంతలకు శ్రీకృష్ణుని పాదారవిందముల జాడలు కనిపించాయి. శంఖచక్రాది చిహ్నములతో విరాజిల్లుతున్న ఆ పాదముద్రలను చూచి పారవశ్యముపొంది ఆ ధూళిని తమ శిరస్సులపై చల్లుకున్నారు. ఆ అడుగుజాడల

ననుసరించి వారు కోకిలావనమునకు చేరుకున్నారు. నందనందనుని పాదముద్రల ప్రక్కనే రాధాదేవి పాదముద్రలు కనిపించాయి. ఆదృశ్యంచూచి గోపికలు ఆనందానుభూతిని పొందారు.

గోపికల కోలాహలం విని మాధవుడు రాధతో "రాధా! గోపికలు మనిద్దరినీ వెదుకుతూ ఇటే వస్తున్నారు. త్వరగా ఇక్కడనుండి వెళ్ళు" అన్నాడు. ఆసమయంలో రూప యౌవన చాతుర్యములతో గర్వించిఉన్న రాధ భగవానునితో "నేనెన్నడు ఇల్లువిడిచి వచ్చినదాననుకాను. ఈరోజు ఎంతదూరము నడిచాను. ఇక ఒక్క అడుగుకూడా నేను ముందుకు వేయలేను" అని పలికింది. "అలా అయితే నాభుజములపై కూర్చో. నేను తీసికొని వెళతాను" అన్నాడు కృష్ణుడు. ఆమె సరేనన్నది. కానీ కృష్ణపరమాత్ముడు అదృశ్యమయ్యాడు. ఇక ఆమె దు:ఖమునకు అంతులేకపోయింది. ఆ కోకిలావనమంతా స్వామికోసం వెదుకసాగింది. ఇంతలో గోపికాబృందము అక్కడకు చేరుకున్నది. వారు తమ స్వామిని స్థితిని చూచి జాలిపడి, ఆమెను సాంత్వన పరుపసాగారు.

## గోపికల కృష్ణస్తుతి :

తరువాత వ్రజాంగనలు అందరూ కలిసి శ్రీకృష్ణుని రాకకోసమై ఆ భగవానుని గుణగానం చేయసాగారు. "ఓ లోకసుందరా! జనభూషణా! మదనమోహనా! సమస్త జగత్తు పాపరాశిని పారద్రోలే మహాత్మా! యదునందనా! నందనందనా! నీ పాదపద్మముల మకరందం కూడా మధుర మనోహరము కదా! నీవు దేవ బ్రాహ్మణాది సాధు సంరక్షణకై, కంసాది దైత్య శిక్షణకై అవతరించిన దేవదేవుడవు. గోవిందా! గోపాలా! నీవు రాసలీల జరిపినప్పుడు ఎన్ని వింతలు విశేషములు చూపావు. నీవు ఇప్పుడు మా కనులముందు ప్రత్యక్షం కావాలి. ఈ వ్రజభూమిని, గోవర్ధన గిరిని నీచరణ ధూళి పరమపావనం చేసింది. జగత్సృష్టికి, జగత్ పాలనకు నీ పాదపద్మపరాగము చాలును స్వామీ! ఇప్పటివరకు ఆనందము కలిగించిన వెన్నెల ఇప్పుడు తీక్షణ మైన సూర్యతాపము వలె బాధకలిగిస్తున్నది ప్రభూ! నీతో విహరించినప్పుడు ఆనందం కలిగించిన ఈ వనం ఇప్పుడు అసిపత్రవనము వలె అనిపిస్తున్నది. మందమందంగా వీచే మలయమారుతం ఇప్పుడు చురుక్కు చురుక్కుమంటున్నది. సకల భక్త శిరోమణివైన నీపాదపద్మముల నాశ్రయించిన ఉద్ధవునివలె మేము కూడా నిన్ను శరణువేడుతున్నాము. దయతో మాకు శరణు ప్రసాదించు!"

ఈ విధంగా పరితపిస్తున్న గోపికల బృందం మధ్యలో కృష్ణపరమాత్ముడు రాధాదేవితో ప్రత్యక్షమయ్యాడు. మురళీ మోహనుడైన మాధవుడు రాధతో ఆనంద నృత్యం చేయసాగాడు. దుఃఖోద్వేగం నుంచి తెప్పరిల్లిన గోపకాంతలు గోవిందుని చూచి "శ్యామసుందరా! మా గోపికా సముదాయమంతా జగత్తు నంతటిని తృణ ప్రాయంగా భావించి నిన్ను శరణు వేడితే మమ్మల్ని అందరినీ విడిచిపెట్టి నీవు ఎక్కడకు వెళ్ళావు?" అని అడిగారు. అందుకు పరమాత్ముడు చిరునవ్వు నవ్వి "ఓ కాంతలారా! పుష్కరద్వీపంలో హంసుడనే పేరుగల మహాముని ఎటువంటి కోరిక లేకుండగా నన్ను గురించి తపస్సు చేస్తున్నాడు. ఇప్పటికి రెండు మన్వంతరములు గడిచాయి. ఈరోజున ఆసముద్రంలోని అర్ధయోజనము విస్తీర్ణముగల ఒక చేప ఆ మహామునిని మ్రింగివేసింది. ఇంతలో బృహత్తరమైన మత్స్యరూపం ధరించిన పౌండ్రుడనే అసురుడు ఆచేపను మ్రింగివేశాడు. అందువల్ల నేను అక్కడకు వెళ్ళి ఆ రెండు మత్స్యములను సంహరించి ఆ హంసమహామునిని కాపాడి, తరువాత శ్వేతద్వీపానికి వెళ్ళాను. అక్కడ క్షీరసాగరంలో శేషశయ్యపై పవ్వళించాను. ఇంతలో ఇక్కడ మీరు నా కోసం పరితపించటం గ్రహించి వెంటనే ఇక్కడకు వచ్చాను. జితేంద్రియులు, సమదర్శనలు అయిన మీవంటివారు మాత్రమే నాతోడి పరమసుఖమును తెలిసికొగలరు" అనిపలికాడు.

## శేషశయనుడుగా కృష్ణుడు :

ఆ మాటలను విని గోపికలు "ఓ మాధవా! మాపై అనుగ్రహించి శేషశయ్యపై నీవు పవ్వళించిన రూపమును మాకు చూపింపవా?" అని అడిగారు. వెంటనే పరమాత్ముడు గోపిక లందరూ చూస్తుండగానే శ్రీమన్నారాయణుని రూపం ధరించాడు. రాధాదేవి లక్ష్మి రూపం ధరించింది. అక్కడనే ఉత్తుంగ తరంగ మాలికలతో క్షీరసాగరం దృశ్యమానమయింది. దివ్యమైన, రత్నమయమైన, మంగళ రూపమైన, ప్రాసాదము ఒకటి కనిపింపసాగింది. అక్కడనే కమలనాళము వంటి తెల్లదనముతో ఆదిశేషుడు చుట్టగా చుట్టుకొని ఉన్నాడు. బాలసూర్యుని వంటి తేజస్సుతో శేషుని వేయి పడగలు విరాజిల్లుతున్నాయి. ఆ శేషశయ్య మీద నారాయణుడు శయనించాడు. లక్ష్మి రూపధారిణియైన రాధ ఆస్వామికి పాదసేవ చేస్తున్నది. కోటిసూర్య కాంతితో తేజరిల్లుతున్న లక్ష్మీనారాయణులను చూచి గోపకాంతలు దిగ్భ్రాంతి చెంది అనేక అభివందనములు చేశారు.

## గోపికల అనుభూతులు :

శ్యామసుందరుడైన కృష్ణుడు, గోపికలతో బృందావనమునకు చేరుకున్నాడు. ఆసమయంలో పూర్వం శ్రీహరి వరప్రదానం చేసి ఉన్నకారణంగా బృందావనంలోని ఓషధులన్నీ వ్రజాంగనలుగా మారిపోయినాయి. వారంతా ఒక యూథంగా ఏర్పడ్డారు. వారితో రాసవిహారం జరిగింది. శ్రీహరికి ఆనందం కలిగించటం కోసం గోపకాంతలతో పాటు దేవకాంతలు కూడా కలిసి వివిధములైన వాద్యములమేళవింపుతో మధురమనోహరంగా గానం చేయసాగారు. రకరకములైన రాగములను ఆలపించారు. వారిలో కొందరు గోపికలు గబగబా మాట్లాడేవారు కాగా మరికొందరు గోపికలు ముగ్ధాంగనలు, కొందరు గోపికలు కృష్ణునితో ఆటలాడుతున్నారు. కొందరు గోపికలు కృష్ణునిపై పూలను చల్లుతున్నారు.

కొందరు గోపికలు పాదములకు అందెల నలంకరించుకొని మృదునర్తనం చేస్తూ బాలకృష్ణుని మధురాధరముల స్పృశింపసాగారు. మరికొందరు గోపికలు యోగులకు కూడా దుర్లభమైన శ్రీకృష్ణుణ్ణి రెండుచేతులతో పట్టుకొని మధుర హాసములు చిందిస్తూ దగ్గరకు చేర్చుకొంటున్నారు. కొందరు గోపికలు పిల్లనగ్రోవిని ఊదుతూ వీణాలాపన చేయసాగారు. మరికొందరు గోపికలు మృదంగ నినాదం చేస్తూ భగవంతుని గుణగానం చేయసాగారు. కొందరు గోపికలు కరతాళధ్వనులు చేస్తుండగా కొందరు నిశ్చలంగా నిర్మలంగా గీతాలాపన చేస్తున్నారు. వారు ప్రాకృతికమైన సాంసారిక సుఖాలను మరిచిపోయి ఆవిధంగా పరమాత్ముని సన్నిధిలో పరవశలై ఉన్నారు. కొందరు గోపికలుమెల్లగా శ్రీకృష్ణుని చేతిని తమ చేతులలోనికి తీసికొని ఆనందానుభూతితో అటుఇటు విహరిస్తున్నారు. కొందరు గోపికలు శ్రీకృష్ణుడు చర్వణము చేసిన సుగంధయుత తాంబూలమును సగం తీసికొని తాము చర్వణంచేయసాగారు. వారు పూర్వం ఎటువంటి తపస్సు చేశారోకదా! కొందరు గోపికలు మధురమధురంగా నవ్వుతూ శ్యామసుందరుని కపోలములను మెల్లమెల్లగా తమ చేతివ్రేళ్ళతో తాకసాగారు. కదంబవృక్షాల నీడలో ఈవిధంగా కృష్ణ క్రీడావినోదం జరుగుతున్నది.

కొందరు గోపికలు పురుషవేషం ధరించి నెమలిపింఛం పెట్టుకొని, కర్ణకుండలములు అలంకరించుకొని కృష్ణునివలె అభినయింపసాగారు. చంద్రవదనలైన కొందరు గోపికలు

రాధాదేవిగా అభినయిస్తూ రాధ తనప్రాణవల్లభునికోసం గానం చేసినట్లు గానం చేయసాగారు. కొందరు వ్రజాంగనలు హర్ష పులకితలై ప్రేమ విహ్వలలై పరమానందంలో నిమగ్నలై యోగిజనులవలె సమాధి స్థితిలో కూర్చొనిఉన్నారు. కొందరు గోపికలు లతలలో, వృక్షములలో, చరాచరప్రకృతిలో పరమాత్మున్ణి దర్శిస్తూ మౌనముద్రలో మునిగిపోయారు. ఈవిధంగా పరమ మనోహరమూర్తి, బృందావనాధీశుడు, యదునందనుడు బాలుడు అయిన గోవిందుణ్ణి భక్తి, ప్రేమలతో ఆరాధించిన ఆగోపికల మనోరథములు నెరవేరినాయి. ఆగోపికలకు లభించిన భగవత్ కృపా కటాక్షములు జ్ఞానులకు కూడా లభింపవుకదా!

**ఆసురి మహర్షి :**

శ్రీకృష్ణుని ప్రియభక్తుడు ఆసురి అనుమహర్షి నారద పర్వతం మీద తపస్సు చేస్తున్నాడు. ఆయన హృదయ కమలం మధ్యలో జ్యోతిర్మండలంలోపల రాధా సమేతుడైన మాధవుని మూర్తిని చింతన చేస్తున్నాడు. ఒకరోజు రాత్రి ముని ఎంతగా ధ్యానించినప్పటికీ శ్రీకృష్ణుడు ఆయన ధ్యానంలోకి రాలేదు. ఆమహర్షి మరల మరల ధ్యానం చేశాడు. కానీ ఫలితం లభించలేదు. అందుకు ఆ మహర్షి ఖిన్నుడయ్యాడు. ఆయన ధ్యానం నుంచి లేచి శ్రీకృష్ణదర్శనం కోసం బదరీఖండంలోని నారాయణా శ్రమమునకు వెళ్ళాడు. కానీ అక్కడ కూడా మునీశ్వరునకు నర నారాయణుల దర్శనం కాలేదు. అందుకాయన మరింత విస్మయం పొంది లోకాలోకపర్వతం మీదకు వెళ్ళాడు. అక్కడ వేయిపడగల అనంతుడు కూడా కనిపించలేదు. అప్పుడా మహర్షి అక్కడున్న పారిషదులను "భగవానుడు ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్ళాడు?" అని అడిగాడు. వారు "మాకు తెలియదు" అన్నారు. ఆమాట వినగానే మహర్షికి అమిత ఖేదం కలిగింది. ఆయన అక్కడ నుండి క్షీరసాగరం విలసిల్లే శ్వేతద్వీపం వెళ్ళాడు. అక్కడ కూడా శేషశయ్యమీద శ్రీహరి కనిపించలేదు. ఆయన మనస్సు మరింత బాధపడింది. ఆమహర్షి అక్కడి పారిషదులను "భగవానుడు ఇక్కడ నుండి ఎక్కడకు వెళ్ళాడు?" అని అడిగాడు. వారు కూడా "మాకు తెలియదు" అన్నారు. ఆమాటలు విని మహర్షి చింతాక్రాంతుడై "శ్రీహరి దర్శనం చేసికొనాలంటే నేను ఏమి చేయాలి?" అనుకొని మనోవేగంతో వైకుంఠధామంలో ప్రవేశించాడు. అక్కడ శ్రీమహాలక్ష్మితోపాటు నివసించే నారాయణుడు కనిపించనేలేదు.

ఆసురి ముని అక్కడ నుండి గోలోకమునకు వెళ్ళాడు. అక్కడి బృందావన నికుంజాలలో కూడా పరాత్పరుడైన శ్రీకృష్ణుని దర్శనం కాలేదు. మహర్షి దు:ఖమునకు అంతులేకపోయింది. కృష్ణవిరహం వల్ల ఆయన వ్యాకులుడయ్యాడు. అక్కడి పారిషదులను అడిగితే వారు "పృశ్నిగర్భుడైన వామనుడు అవతరించిన బ్రహ్మాండములో భగవానుడు అవతరించాడు" అని సమాధానం చెప్పారు. ఆసురిముని ఆబ్రహ్మాండములోనికి వెళ్ళి అక్కడ కూడా పరమాత్ముని కానక కైలాసపర్వతమునకు చేరుకున్నాడు. అక్కడ పరమశివుడు శ్రీకృష్ణుని ధ్యానిస్తూ ఉన్నాడు. అనంతరం ఈముని శివునితో "భగవాన్! నేను బ్రహ్మాండమంతా ఇటుఅటు తిరిగాను. పరాత్పరుని దర్శనం కోసమై వైకుంఠంనుంచి గోలోకం వరకు సంచరించాను. కాని ఆ దేవాధిదేవుడు నాకు ఎక్కడా కనిపించలేదు. ఓ సర్వజ్ఞ శిరోమణీ! మీరు చెప్పండి. ఇప్పుడు పరమాత్ముడు ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

అప్పుడు మహాదేవుడు "ఓ ఆసురీ! నీవు ధన్యుడవు. నీవు నిష్కామభక్తుడవు. నాకు తెలుసు. కృష్ణదర్శనం కాకపోవటం వల్ల చింతాక్రాంతుడవయ్యావు. కర్మేంద్రియములు రూపరసాది విషయములను గ్రహించలేనట్లు నిష్కాములైన మునిజనులు సాధారణ మనుష్యులు వాంఛించే గూఢమైన, నిర్గుణమైన సుఖములను గ్రహించలేరు. క్షీరసాగరంలో నివసించే హంసమహర్షి పెద్ద కష్టంలో పడ్డాడు. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్ముడు వెళ్ళి ఆమహర్షిని ఆక్లేశం నుంచి రక్షించి ప్రస్తుతం బృందావనంలో గోపికలతో రాసక్రీడ చేస్తున్నాడు. ఓ మహర్షీ! ఇప్పుడు ఆ కృష్ణపరమాత్ముడు తన మాయతో ఆరునెలల కాలమును ఒకరాత్రిగా చేశాడు. నేను ఇప్పుడు ఆ రాసోత్సవం దర్శించటానికి వెళుతున్నాను. నీవు కూడా నాతో వస్తే నీ కోరిక నెరవేరుతుంది" అని పలికాడు.

పరమశివుడు, ఆసురిముని ఇద్దరూ వజ్రమండలం చేరుకున్నారు. దివ్యవృక్షములతో, లతలతో, నికుంజములతో ఆ ప్రాంతమంతా శోభిస్తున్నది. ఆ ప్రకృతి సోయగాలను తిలకిస్తూ ఇద్దరూ యమునాతీరమునకు చేరుకున్నారు. అక్కడ గోలోకవాసినీ గోపసుందరీమణులు కొందరు చేతిలో బెత్తములను పట్టుకొని పహరా కాస్తున్నారు. వారు ఈశ్వర ఆసురీమునులను లోపలకు ప్రవేశించకుండగా అడ్డుకున్నారు. అప్పుడు వారు "మేము శ్రీకృష్ణపరమాత్ముని దర్శించవలెననే కాంక్షతో వచ్చాము" అని అన్నారు. అందుకు ఆ ద్వారపాలికలు కృష్ణపరమాత్ముడు ఈ

బృందావనంచుట్టూ మమ్మల్ని రక్షగా నిలిపి ఉంచాడు. ఈ రాసమండలంలో శ్రీకృష్ణుడు ఒక్కడే పురుషుడు. గోపికా యూథం తప్ప మరెవ్వరూ లోపలకు ప్రవేశించటానికి వీలులేదు. ఓ మునులారా! ఒకవేళ మీకు శ్రీకృష్ణదర్శన కాంక్ష తీవ్రంగా ఉండి లోపలకు ప్రవేశించవలెననిపిస్తే ముందుగా మానససరోవరంలో స్నానం చెయ్యండి. మీరు గోపికలుగా మారిపోతారు. అప్పుడు ఈ రాసమండలం లోపలకు మీరు ప్రవేశించవచ్చు అని తెలియజేశారు.

ఈశ్వర ఆసురీమునులు ద్వారపాలికల మాటలు విని మానససరోవరంలో స్నానం చేసి గోపికల స్వరూపం ధరించి రాసమండలంలో ప్రవేశించారు. రమణీయమైన రాసమండలంలో గోపకాంతల మధ్య కోటి చందమామల కాంతితో మెరిసిపోతున్న రాధాదేవి, కోటి మన్మథ సౌందర్య కోమలాంగుడైన శ్రీకృష్ణ పరమాత్ముడు సాక్షాత్కరించారు. మురళీమనోహరుడై, పీతాంబరధారియై, శ్రీవత్స శోభితుడై, కౌస్తుభ వనమాలికాలంకృతుడై, శిఖిపింఛమౌళియై పరమాత్ముడు ప్రకాశిస్తున్నాడు. ఈశ్వర ఆసురీమునులు శ్రీకృష్ణుని చూడటంతోటే పులకితాంగులై ప్రణామములు చేశారు. అప్పుడు కృష్ణపరమాత్ముడు మందహాసం చేసి మేఘగర్జన పోలిన గంభీర వాణితో "మీరిద్దరూ అరవై వేల సంవత్సరాలపాటు చేసిన తపస్సు కారణగా మీకు నా దర్శనమయింది. ఎవరైతే అకించనుడుగా, శాంతుడుగా, సమదర్శనుడుగా ఉంటాడో ఆతడే నా సఖుడు, మీకు ఏయే వరములు కావాలో కోరుకొనండి" అన్నాడు. అప్పుడు శివ ఆసురీమునులు "పరమాత్మా! నమస్కారము. మీరిరువురు విహరిస్తున్న ఈచోట మీ సన్నిధిలో మేము నివాసం ఉండేలాగ అనుగ్రహించవలసింది" అని అన్నారు. అందుకు శ్రీకృష్ణుడు సమ్మతించి "తథాస్తు" అని పలికాడు. అప్పటినుండి శివ, ఆసురీమునులు బృందావనంలో వంశీవట సమీపంలో రాసమండలంలో కాళిందీ నదీ తీర నికుంజాలలోనే నివసింప సాగారు. గోపికలతో, రాధాదేవితో కృష్ణపరమాత్ముడు రాసనృత్యం చేయసాగాడు. ఆరు నెలల కాలం ఒకేరాత్రిగా మార్చాడు పరాత్పరుడు. ఆ ఆనందపు పారవశ్యంలో అంతటిరాత్రికూడా వారికి ఒక్కక్షణములా గడిచిపోయింది. అనంతరం సూర్యోదయమయిన తరువాత గోపికలు, రాధిక, శ్రీకృష్ణుడు ఎవరిగృహములకు వారు వెళ్ళారు. ఈ రాసలీల వృత్తాంతము పరమ పావనమైనదిగా, సకల పుణ్య ప్రదమైనదిగా, పాపహరమైనదిగా పరిగణింపబడుతున్నది.

**శంఖచూడుడు :**

కుబేరుని సేవకుడు శంఖచూడుడనే ఒక యక్షుడు ఉన్నాడు. ఆతడు కడు బలిష్ఠుడు, గదాయుద్ధములో ఆతనిని మించినవారు భూతలమునలేరు. ఒకరోజున ఆతడు నారదమహర్షి వల్ల కంసుని ప్రచండ పరాక్రమం గురించి విని లక్షలాది లోహపుగదలను తీసికొని మధురానగరం వెళ్ళాడు. ఆ మదోన్మత్తుడు రాజసభ లోకివెళ్ళి సింహాసనంపై ఉన్న కంసునకు నమస్కరించి "ఓ రాజా! నీవు త్రిభువన విజయుడవని విన్నాను. నీతో గదాయుద్ధం చేయవలెనని నాకు కాంక్షగా ఉన్నది. ఈ గదాయుద్ధంలో నీవు గెలిచినట్లయితే నేను నీకు దాసుడనౌతాను. ఒకవేళ నేను గెలిచినట్లయితే నీవు నాకు దాసుడవుకాగలవు" అన్నాడు. అందుకు సమ్మతించి కంసుడు ఒక పెద్ద గద తీసికొని శంఖచూడునితో గదా యుద్ధమునకు దిగాడు. క్రమక్రమంగా యుద్ధము తీవ్రదశకు చేరుకున్నది. పరస్పర ఆఘాతప్రత్యాఘాతముల వల్ల ఛటఛట శబ్దములు పిడుగుల సవ్వడులవలె వినిపింపసాగాయి. వారిద్దరూ గజరాజులవలె, సింహములవలె పోరు సలుపసాగారు. ఇద్దరి గదలు ఒకదానికొకటి ఢీ కొంటూ నిప్పుల రవ్వలు రాలుస్తూ చూర్ణమయ్యాయి. ఇద్దరూ ఆగ్రహావేశంతో ముష్టి యుద్ధానికి దిగారు. ఆ సమయంలో అక్కడకు గర్గాచార్యుల వారు విచ్చేశారు. వెంటనే వారిద్దరూ ఆ మహర్షికి నమస్కరించారు.

అప్పుడు గర్గమహర్షి కంసుని చూచి శాంతస్వరంతో "కంసా! ఇక యుద్ధం చెయ్యకు. దీనివల్ల ఎటువంటి ఫలితము ఉండదు. ఈ శంఖచూడుడు నీతో సమానమైన బలవంతుడు. ఇతడు నీచేత అజేయుడు. దీనికి కారణం విను - నిన్ను పరిమార్చబోయే పరమాత్ముడే ఈ శంఖచూడుణ్ణి కూడా పరిమారుస్తాడు. అందువల్ల నీవు శంఖచూడుని పట్ల అభిమానంతో ఉండు" అని ఆయక్షుని వైపు తిరిగి "నీవు కూడా కంసుని పట్ల ప్రేమగా ఉండు" అన్నాడు. గర్గమహర్షి మాటలను విని కంసుడు, శంఖచూడుడు పరస్పరము ఆలింగనం చేసికొని అభిమానంతో ఉన్నారు.

తరువాత కంసుని దగ్గర సెలవు తీసికొని శంఖచూడుడు ఆరాత్రి వేళ వనంమధ్యనుంచి ఇంటికి వెళుతున్నాడు. ఆ వనంలో రాసనృత్యం జరుగుతున్నది. తాళ స్వరములతో మనోహరమైన గానాలాపన వినిపింప సాగింది. శంఖచూడుడు

ఆ గోపకాంతల బృందముల మధ్య రాధామాధవులను దర్శించాడు. మాధవుడు తన కుడిమోచేతిని రాధపై ఉంచి మధురమధురంగా మురళీగానం చేస్తున్నాడు. ఎడమ పాదం త్రిభంగిగా వంచి నిలిపాడు. సుందర వదనంపై మందహాసరేఖలు తళుక్కుమంటున్నాయి. ఆరూపం అపురూపమై భాసించింది. కోటి మన్మథులను జయించిన కోమలాంగుని రూపమది. మాధవుని చూచి శంఖచూడుడు సామాన్యమైన బాలునిగా భావించాడు.

క్రూరమైన పులివంటి ముఖంతో, కాలకూటవిషము వంటి నల్లని దేహంతో భయంకరంగా ముందుకు వస్తున్న శంఖచూడుణ్ణి చూచి గోపికలు భయభ్రాంత లయ్యారు. రాసమండలమంతా హాహాకారంతో నిండిపోయింది. కామపీడితుడైన ఆ దుష్ట యక్షుడు శతచంద్రానన అనే గోపసుందరిని చేత పట్టుకొని ఎటువంటి భయం లేకుండగా ఉత్తరదిశవైపుకు వెళ్ళసాగాడు. శతచంద్రానన భయకంపితురాలై "కృష్ణా! కృష్ణా!" అని ఆర్తనాదం చేయసాగింది. ఇది చూచి కృష్ణుడు కుపితుడై ఒక సాలవృక్షమును చేతితో పెకలించి పట్టుకొని వెంబడించాడు. కాలస్వరూపునివలె తన వెంటబడుతున్న కృష్ణుణ్ణి చూచి భయపడి శంఖచూడుడు ఆ గోపికను వదిలిపెట్టి ప్రాణభయంతో పరుగులిడసాగాడు. చివరకు హిమగిరి సానువుల చెంత శంఖచూడుడు కృష్ణునితో పోరాడటానికి ఎదురునిలిచాడు. తన చేతిలోని వృక్షమును విసిరి ఆ యక్షుణ్ణి ఒక్క గుద్దుతో శిరస్సును మెడనుండి వేరుచేసి ఆతని చూడామణిని లాగివేశాడు. ఆసమయంలో శంఖచూడుని శరీరంనుంచి ఒక జ్యోతి బయలుదేరి దిఙ్మండలమునంతా ప్రకాశింపచేస్తూవచ్చి శ్రీకృష్ణుని మిత్రుడైన శ్రీదామునిలో విలీనమయింది. అప్పుడు కృష్ణుడు తాను తెచ్చిన మణిని శతచంద్రాననకు ఇచ్చి ఆనందం కలిగించాడు.

## శ్రీదాముని అంశ శంఖచూడుడు :

పూర్వం ఒకనాడు కృష్ణపరమాత్ముడు యమునాని కుంజాలచెంత విరజాదేవితో విహరింపసాగాడు. ఈవిషయం తెలిసిన రాధాదేవి రథం మీద బయలుదేరి ఆ నికుంజముల దగ్గరకు చేరుకున్నది. అక్కడ కృష్ణసఖుడైన శ్రీదాముడు పహరా కాస్తున్నాడు. తమ మార్గమునకు అడ్డుగా ఉన్న శ్రీదాముణ్ణి రాధాదేవి పరివారము కొరడాతో కొట్టి ప్రక్కకు నెట్టి లోపలకు ప్రవేశించింది. సఖుల కోలాహలము

విని శ్రీకృష్ణుడు అంతర్ధానమయ్యాడు. విరజాదేవి నదీరూపం పొందింది. ఈ విషయం గ్రహించి రాధ తన మందిరమునకు తిరిగివెళ్ళింది. తరువాత మరల కృష్ణపరమాత్ముడు ఆవనంలో ప్రత్యక్షమయ్యాడు. నదీరూపంలో ఉన్న విరజ మరల స్త్రీరూపం ధరించింది. ఇద్దరూ వనవిహారం చేయసాగారు. విరజాదేవికి కృష్ణ పరమాత్ముని వల్ల ఏడుగురు కుమారులు ఉద్భవించారు. వారు శైశవం నుంచి బాల్యంలోకి అడుగుపెట్టారు. వారు ఒకనాడు ఒకరితో ఒకరు తగాదాపడగా అందరి కన్నా చిన్నవాడిని పెద్దపిల్లలు కొట్టసాగారు. చిన్నవాడు పరుగుపరుగున తల్లిఒడిలోకి చేరుకున్నాడు. విరజాదేవికి పరమాత్మపై నుంచి పుత్రులపైకి మమకారం మరలే టప్పటికి శ్రీకృష్ణుడు అంతర్ధానమయ్యాడు. అప్పుడు విరజ విరహవిహ్వలయై తనకు పతి యెడబాటు కలిగించినందులకు కోపించి తన కుమారులను "మీరు భువిపై జలరూపములను పొందుదురు గాక! మీ జలము మానవుల దప్పిక తీర్చటానికి కూడా పనికిరాకుండు గాక!" అని శపించింది. మాతృశాపం వల్ల వారంతా భువికి వచ్చారు. ప్రియవ్రతుడనే రాజు రథం వల్ల ఏర్పడిన పరిఖలలో వారు సమా వేశమయ్యారు. ఆ ఏడుగురు సప్తసముద్రములుగా మారిపోయారు. కుమారులు వెళ్ళిపోయిన తరవాత విరజ వ్యాకులపడసాగింది. అప్పుడు కృష్ణపరమాత్ముడు ప్రత్యక్షమై "విరజా! నీవు బాధపడకు, నీవు నీ తేజస్సుతో నిరంతరము నీ కుమారులను రక్షిస్తూ ఉంటావు. మన ఇరువురికి కూడా ఎన్నడూ వియోగం కలుగదు" అని ఆశీర్వదించాడు.

ఒకనాడు రాధాదేవి విరహంతో బాధపడుతున్నదని గ్రహించి శ్యామ సుందరుడైన గోవిందుడు శ్రీదామునితో కలిసి ఆమె ఉన్న చోటకు విచ్చేశాడు. నికుంజ ద్వారం దగ్గరకు రాగానే అభిమానవతియైన రాధ "నీకిక్కడ పనిలేదు. నీ ప్రియ విరజ నది అయినదిగదా నీవు కూడా నదిగా మారి అక్కడే విహరించు. నాతో నీకేమిపని?" అని పలికింది. శ్రీకృష్ణుడు వెనుదిరిగి వెళ్ళిపోయాడు. అప్పుడు కృష్ణసఖుడైన శ్రీదాముడు కోపించి "రాధా! శ్రీకృష్ణుడు సాక్షాత్తు అవతారమూర్తి. ఆయన అనేక బ్రహ్మాండములకు అధిపతి, గోలోకమున అధివసించే పరాత్పరుడు. నీవు ఆయనను అధిక్షేపించటమా?" అన్నాడు.

ఆమాటలు విని రాధ "మూర్ఖుడా! తండ్రిని స్తుతించి తల్లిని నిందిస్తున్నావన్నమాట. నీవు రాక్షసుడవౌదువుగాక" అని శపించింది. అప్పుడు శ్రీదాముడు "శ్రీకృష్ణుడు సదా నీకు అనుకూలంగా ఉంటున్నాడనే కదా. ఇక మీఇద్దరికీ నూరు సంవత్సరముల పాటు వియోగం కలుగుతుంది'' అని పలికి ప్రతిశాపమిచ్చాడు. రాధా శ్రీదాము లిద్దరూ తమ ప్రవర్తనకు తామే బాధపడ్డారు. ఆసమయంలో శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చి "రాధా! జరిగినదానికి చింతింపకు. నామాటవిను. వియోగకాలంలో కూడా ప్రతినెలలో ఒక పర్యాయం నీకు నా దర్శనం కలుగుతుంది. వరాహకల్పంలో భూభారం తొలగించటం కోసం, భక్తులకు దర్శన ప్రసాదించటం కోసం మన మిరువురమూ భువిపై అవతరిద్దాము.

శ్రీదామా! విను నీలోని ఒక అంశ అసురరూపం పొందుతుంది. మన్వంతరంలో నీవు ఆ అసురరూపంతో రాసమండలంలో ప్రవేశించి నన్ను అవహేళన చేస్తావు. అప్పుడు నాచేతిలోనే నీకు ముక్తి కలిగి నీపూర్వశరీరంనీకు లభిస్తుంది'' అని పలికాడు. ఈవిధంగా శాపవశంవల్ల మహాతపస్వియైన శ్రీదామునిలోని ఒక అంశ యక్షలోకంలో శ్రీమంతుని కుమారుడుగా జన్మించింది. ఆతడే శంఖచూడునిగా ప్రఖ్యాతిపొంది కుబేరుని సేవకుడయ్యాడు. ఈ కారణం వల్లనే శంఖచూడుని ఆత్మజ్యోతి శ్రీదామునిలో లీనమయింది.



# 3. గిరిరాజ ఖండము

## గోవర్ధనగిరి పూజ :

లోకంలో ప్రజలు ప్రభువునకు కప్పము కట్టినట్లుగా, గోపకులు ప్రతిసంవత్సరము శరదృతువులో ఇంద్రపూజను నిర్వహిస్తారు. ఒక పర్యాయం ఆవిధంగా ఇంద్రపూజ కోసం ఏర్పాట్లు చేస్తున్న సమయంలో గోవిందుడు తోటి గోపకులతో తన తండ్రి చెంత చేరి "తండ్రీ! ఈ ఇంద్రపూజ వల్ల ఫలితం ఏమిటి? దీనివల్ల కలిగే ఫలితం లౌకికమైనదా? లేక పారలౌకికమైనదా?" అని అడిగాడు. అప్పుడు నందుడు "శ్యామసుందరా! మనము దేవేంద్రుని పూజించటం వల్ల భోగ మోక్షములు రెండూ మనకు లభ్యమవుతాయి. ఇవి లేకపోతే మానవునకు సుఖం ఎక్కడిది?" అన్నాడు.

అప్పుడు కృష్ణుడు "తండ్రీ! ఇంద్రాది దేవతలు తమ పూర్వ పుణ్యంవల్లనే స్వర్గంలో ఉండగలుగుతున్నారు. తమ పుణ్యం పూర్తికాగానే వారు మరల మర్త్యలోకంలో జన్మిస్తారు. అందువల్ల వారిని సేవిస్తే మోక్షం ఎలా వస్తుంది? బ్రహ్మాది దేవతలే కాలబద్ధులైఉన్నారు కదా! అటువంటిది ఆ బ్రహ్మచేత సృష్టింపబడిన మానవులు ఆ దేవతల నారాధించి మెక్షం పొందటం ఎలా సాధ్యం? కాలము చాలా బలవత్తరమైనది. అందువల్ల కాలానుగుణంగా సత్కర్మల నాచరిస్తూ సురేశ్వరుడు, యజ్ఞేశ్వరుడు, పరమాత్ముడు అయిన శ్రీహరిని భజించాలి. సమస్త సత్కర్మలఫలమును మనస్సులో ఆ పరమాత్మునకు సమర్పించాలి. అప్పుడే ఎవరికైనా మోక్షం లభిస్తుంది. అంతేగాని మరొకవిధంగా మోక్షం ప్రాప్తించదు.

గోవులు, బ్రాహ్మణులు, సాధువులు, అగ్ని, దేవతలు, వేదములు, ధర్మము ఇవి భగవంతుని విభూతులు. వీటి ఆధారంగా ఎవరు శ్రీహరిని భజిస్తారో వారు ఇహలోకపరలోక సుఖములను పొందుతారు. పరమాత్ముని వక్షస్థలం నుంచి ఆవిర్భవించిన గోవర్ధన పర్వతము పులస్త్యమహర్షి ప్రభావం వల్ల ఈవ్రజమండలమునకు వచ్చింది. ఈ పర్వతమును దర్శిస్తే పునర్జన్మ ఉండదు. అందువల్ల ఈ గోవర్ధనగిరిని పూజించండి!" అని పలికాడు.

నందనందనుడైన బాలకృష్ణుని మాటలను విని వ్రజవాసులందరూ ఆశ్చర్యపడ్డారు. సన్నందుడు మున్నగువారంతా ఇంద్రపూజ విషయం వదిలిపెట్టి గోవర్ధనగిరిని ఆరాధించటానికే నిశ్చయించుకున్నారు. బలరామకృష్ణులు యశోదవెంట పూజాసామగ్రిని

తీసికొని బయలుదేరారు. యాదవ పురోహితుడు గర్గాచార్యుల వారు బంగరుకలశం తీసికొని సతీసమేతుడై భద్రగజంపై బయలుదేరారు. నందులు, ఉపనందులు, వృషభానులు తమ కుటుంబాలతో సహా గిరిరాజు దగ్గరకు చేరుకున్నారు. గోవర్ధనగిరి శృంగములు స్వర్ణకాంతులతో శోభిల్లుతున్నాయి. తుమ్మెదల ఝుంకారములతో సెలయేళ్ళ ప్రవాహములతో విరాజిల్లుతున్న గిరిరాజు గజరాజు వలెనే అనిపించాడు. ఆసమయంలో మేరువు హిమవంతుడు మున్నగు పర్వతరాజులు దివ్యరూపాలను ధరించి గోవర్ధనునకు కానుకలను తీసికొనివచ్చారు.

బాలకృష్ణుడు చెప్పిన విధంగా పూజావిధానమంతా యథావిధిగా జరిగింది. గోపగోపీగణములు ఆనందంతో నృత్యగీతములతో వేడుకలు గావించారు. అప్పుడు గోవర్ధన గిరిరాజు ఒక మహారాజువలెనే ప్రకాశింపసాగాడు. అప్పుడు సాక్షాత్తు శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతం మధ్యనుంచి ఒక బృహత్తరమైన రూపం ధరించి ముందుకు వచ్చి "నేను గిరిరాజు గోవర్ధనుణ్ణి" అంటూ అక్కడ ఉన్న అన్నపు రాశిపై చేతులనుంచి భుజింపసాగాడు. ఈవింతను చూచి అందరూ ఆశ్చర్యానందములను పొందారు. అప్పుడు గోపకులు "ఓ ప్రభూ! గోవర్ధనగిరిరాజా! నందనందనుని దయవల్ల ఇప్పుడు మాకు నీ దర్శనమయింది. మా గోగణము, బంధుగణము నిరంతరం అభివృద్ధి పొందేవిధంగా ఆశీర్వదించు" అని ప్రార్థించారు. కిరీట కేయూర కంకణములతో విరాజిల్లుతున్న గిరిరాజు "తథాస్తు" అని పలికి అదృశ్యమయ్యాడు. గోపకులు, గోపికలు ఆనందానుభూతిని పొందారు. వారు తమ గోధనంతో, గోవిందునితో కలిసి నందవ్రజానికి బయలుదేరారు.

### ఇంద్రుని ఆగ్రహం :

ఒకసారి నారదమహర్షి ఇంద్రలోకమునకు వెళ్ళి ఇంద్రునితో ఈవిషయమంతా చెప్పగా తనను కాకుండగా గిరిరాజును పూజించినందుకు ఇంద్రుడు వ్రజవాసులపై కోపగించాడు. కేవలం ప్రళయకాలంలో మాత్రమే విడుదలచేసే సంవర్తక మేఘములను పిలిపించి వ్రజమును ముంచెత్తవలసినదిగా ఆజ్ఞాపించాడు. ఆజ్ఞాపించటమే తడవుగా విచిత్రవర్ణములు కలిగిన ఆ మేఘగణములు రోషపూర్వకమైన గర్జన చేస్తూ బయలు దేరినాయి. మదోన్మత్త గజములవలె ఆ మేఘములు వ్రజమండలంపై జలధారలు కురిపింపసాగాయి. ఏనుగు తొండములంతటి ధారలతో పాటు రాళ్ళ వర్షం కూడా

ఆరంభమయింది. కారుమేఘాల వల్ల అంధకారం వ్యాపించింది. చెట్లు విరిగి పడుతున్నాయి. ఇళ్ళు లేచిపోతున్నాయి. మేఘాలు భీకరంగా కురుస్తుండగా భీతి కలిగించే విధంగా పిడుగులు పడసాగాయి. గోవత్సములతోపాటు గోగణములన్నీ చెల్లాచెదురు కాసాగాయి. గోపకులు భయభ్రాంతులై తమ పిల్లపాపలతో నందుని గృహమునకు చేరుకున్నారు. గోపాలకులందరూ శ్రీకృష్ణుని చరణారవిందములకు మ్రొక్కి "కృష్ణా ! ఇంద్రపూజ మాని మనం గిరిపూజ చేసినందుకు ఫలితంగా ఇంద్రుడు కోపించి ఈవిధంగా కష్టం కలిగిస్తున్నాడు. ఇప్పుడు మమ్మల్ని అందరినీ నీవే రక్షించాలి. మమ్మల్ని ఏమి చేయమంటావు చెప్పు" అన్నారు.

కృష్ణపరమాత్ముడు వారితో "మీరు ఎంతమాత్రము భయపడవద్దు. మీరందరూ సమస్త పరివారంతో గోవత్సములతో గోవులతో గోవర్ధనగిరివద్దకు పదండి. మీ పూజలను గిరిరాజు స్వీకరించాడు. కాబట్టి మిమ్మల్ని ఆయనే రక్షిస్తాడు" అని చెప్పి వారితో తాను కూడా అక్కడకు చేరుకున్నాడు. కృష్ణుడు అక్కడకు వెళ్ళి ఏనుగు కమలమును పైకిఎత్తినట్లుగా గోవర్ధన గిరిని పెకలించి చేతితో పైకి ఎత్తి పట్టుకున్నాడు. ఆ దృశ్యం అద్భుతమై పరమ రమణీయమై అందగించింది. నందనందనుడు గోపకులను చూచి "నాయనలారా! వ్రజవల్లభులారా! మీరందరూ సకల పరివారములతో, గోగణములతో ఈ కొండక్రిందకు రండి. ఇంద్రుడు మీకే అపకారము చేయలేడు. సంశయము వద్దు అని పలికాడు. ఈమాటలను విని గోపాలకు లందరూ తమ పిల్ల పాపలతో, కుటుంబములతో సహితంగా కొండక్రిందకు చేరుకున్నారు. ఒకవేళ కొండక్రిందకు పడుతుందేమోనని ఆ గోపాలకులు తమ చేతికఱ్ఱలను పైకిఎత్తి కొండకు పోటీ పెట్టసాగారు.

## మహేంద్ర గర్వభంగము :

కొండక్రిందుగా జలప్రవాహములు రావటం చూచి కృష్ణభగవానుడు సుదర్శన చక్రమును, శేషసర్పమును మనస్సులో స్మరించాడు. వెంటనే కోటిసూర్యకాంతులను వెదజల్లుతూ వచ్చి సుదర్శన చక్రము ఆ జలధారలను పీల్చివేయసాగింది. ఆదిశేషుడు వచ్చి ఆ కొండక్రింద చుట్టూ చుట్టచుట్టుకొని పడుకొనగా ఆ వచ్చే నీటి ప్రవాహములకు అడ్డువేసినట్లయింది. కొండచుట్టూ జలధారలు, రాళ్ళవర్షము, పిడుగులు పడుతున్నాయి. వారంరోజులు గడిచాయి. గోపకులందరూ ఆ కొండక్రిందనే ఉండి చకోరములవలె కృష్ణచంద్రుని చూస్తూ సమయం మరచిపోయారు.

మహేంద్రుడు ఆగ్రహోదగ్రుడై ఐరావతంపై అధివసించి సేనాసమేతంగా వ్రజమండలమునకు విచ్చేశాడు. వస్తూనే దూరంనుంచి వ్రజమండలమును ధ్వంసము చేయటానికై వజ్రాయుధం ప్రయోగింపబోయాడు. కాని మాధవుని ప్రభావం వల్ల వజ్రాయుధంతో సహితంగా ఇంద్రుని భుజాదండము స్తంభించిపోయింది. ఇంద్రుడు ఒక్కసారిగా భయభ్రాంతుడై సంవర్తక మేఘాలను మరలించుకొని సేనాసమేతంగా తిరుగుముఖం పట్టాడు.

అప్పుడే సూర్యోదయమయింది. మేఘాలు అటుఇటు చెదిరిపోయాయి. ఆకాశం నిర్మలమయింది. వాయువు వేగం తగ్గిపోయింది. భూమి పరిశుభ్రమయింది. విహంగములు విహరింపసాగాయి. అప్పుడు భగవానుని అనుజ్ఞ తీసికొని గోపాలకులు తమ తమ పరివారములను గోగణములను మెల్లమెల్లగా బయటకు పంపారు. గిరిధారియైన కృష్ణుడు గోపకులను చూచి "మీరు కూడా బయటకు వెళ్ళండి" అన్నాడు. అప్పుడు వారు "మేము మాబలంతో కఱ్ఱలు పట్టి ఈ పర్వతాన్ని ఆపాము. నీవే ముందుగా బయటకు వెళ్ళు" అన్నారు. అప్పుడు కృష్ణుడు గోవర్ధన గిరిని ఒక వైపు మెల్లగా క్రిందకు దించాడు. అంతే ఆ గోపకులు ఒక్కసారిగా క్రిందపడిపోయారు. తరువాత కృష్ణుడు వారినందరినీ బయటకు పంపి గోవర్ధనగిరిని యథాస్థానంలో ఉంచాడు. గోపాలకులందరూ శ్రీకృష్ణుని మహామహిమత్వమును గుర్తించి గంధ పుష్పాక్షతలతో ఆస్వామిని పూజించారు. నందుడు, యశోద, రోహిణి, బలరాముడు, సన్నందుడు మొదలైన పెద్దలందరూ శ్రీకృష్ణుణ్ణి దగ్గరకు తీసికొని ప్రేమపూర్వకంగా ఆశీర్వదించారు. ఆకాశం నుంచి దేవతలు కృష్ణునిపై పూలవాన కురిపించారు.

**ఇంద్ర స్తవము :**

తనగర్వం తొలగిపోయిన తరువాత మహేంద్రుడు గోవర్ధనగిరి మీదకు వచ్చి శ్రీకృష్ణపరమాత్మణ్ణి సందర్శించి, ప్రణామం చేసి "స్వామీ! నీవు దేవాధిదేవుడవు, సర్వసమర్థుడవు, పూర్ణ పరమేశ్వరుడవు, పురాణ పురుషుడవు, పురుషోత్తముడవు, ప్రకృతికంటె భిన్నమైన పరాత్పరుడవైన శ్రీహరివి. నీవు స్వర్లోకాధిపతివి, జగత్పతివి, నన్ను రక్షించు! ధర్మరక్షణ కొఱకై దశావతారములను ధరించినది నీవే. కంసాది రాక్షసులను సంహరించుటకు విచ్చేసిన అవతారపురుషుడవు నీవే. నీ మాయా ప్రభావం వల్ల నా చిత్తము మోహితమై నీపట్ల నేను అపరాధము చేశాను. తండ్రి

అపారమైన ప్రేమతో కుమారుని క్షమించినట్లుగా నన్ను నీవు క్షమించు. దేవేశ్వరా! జగన్నివాసా! నా పై ప్రసన్నతను చూపించు. గోవర్ధనగిరిధారీ! గోవిందా! గోకులనివాసా! గోపాలా! గోపాలపతీ! గోపిజనభర్తా! కరుణానిధీ! జగద్విధాతా! జగన్మంగళకారీ! జగన్నివాసా! జగన్మోహనా! కోటి మన్మథమన్మథా! రాధామనోహరా! నీకు నమస్కారము!" అని పలికి దేవేంద్రుడు కృష్ణుని చరణకమలములపై శరణువేడాడు.

## గోవింద పట్టాభిషేకము :

అప్పుడు క్షీరసాగరంనుంచి ఉద్భవించిన కామధేనువు గోవర్ధన గిరిపైకి వచ్చి తన క్షీరధారలతో కృష్ణునకు అభిషేకం చేసింది. ఐరావతము గంగాజలంతో కృష్ణునకు మంగళ స్నానం చేయించింది. ఈదృశ్యం చూచి దేవతలు, గంధర్వులు, కిన్నరులు, ఋషులు వేదమంత్రములను పఠిస్తూ భగవంతునకు పుష్పార్చన చేశారు. ఈ సన్నివేశమునకు పులకించిపోయి గోవర్ధనం ఆనందంతో ద్రవీభూతమయింది. అందుకు పరమాత్ముడు ప్రసన్నుడై ఆగిరిపై తన పాదపద్మముల చిహ్నములతో పాటు, అభినందన పూర్వకముగా హస్త చిహ్నమును కూడా ఉంచాడు. గోవర్ధన గిరిపై కృష్ణుడు పాలతో స్నానం చేసిన ప్రదేశం "గోవింద కుండ్" అని, గంగాజలంతో స్నానం చేసిన ప్రదేశం "మానసీగంగా" అని ప్రసిద్ధములయ్యాయి. ఈ కృష్ణాభిషేక సన్నివేశమును చూచి పరమాత్ముని వివిధ విధములుగా స్తుతిస్తూ దేవేంద్రుడు దేవతలతోపాటు స్వర్గలోకమునకు వెళ్ళాడు.

## గోపకుల అధిక్షేపము :

ఒక పర్యాయము గోపకులకు నందనందనుని అతిమానుషమైన చర్యలను చూచి సందేహం కలిగి యశోదానందుల దగ్గరకు వెళ్ళి "ఓ గోపరాజా! నీ వంశంలో ఇంతకు ముందు ఎన్నడూ పర్వతము నెత్తగలిగిన ఇటువంటి బలాఢ్యుడైన బాలకుడు జన్మింపలేదు. నీవు కూడా ఏడురోజులపాటు ఒక శిలను పైకెత్తి మోయలేవు కదా! మరి అటువంటిది ఏడు సంవత్సరముల బాలుడెక్కడ? గిరిరాజును చేతితో ఎత్తట మెక్కడ? అందువల్ల బలవంతుడైన నీ కుమారుని విషయంలో మాకు సందేహం కలుగుతున్నది.

గౌరవర్ణా యశోదే త్వం నంద త్వం గౌరవర్ణధృక్
అయం జాత: కృష్ణవర్ణ ఏతత్ కులవిలక్షణమ్ !

యశోదా! నీవు గౌరవర్ణంలో ఉన్నావు. నందరాజా! నీవు కూడా సువర్ణ చ్ఛాయతో ప్రకాశిస్తున్నావు. కాని ఈ బాలుడు నల్లని రంగుతో ఉన్నాడు. ఈతని రూపము రంగు కూడా మీ కులమునకు విలక్షణంగా ఉన్నది. బలరాముడు కూడా విలక్షణంగానే ఉన్నాడు కాని ఆతడు చంద్రవంశంలో జన్మించటం వల్ల ప్రత్యేకంగా దోషమేమీ కనిపించటం లేదు. ఇప్పుడు మీరు నిజం చెప్పండి. కృష్ణుడువెవరు? ఏమిటి?'' అని అడిగారు ఆ మాటలు వినగానే యశోదా దేవి భయకంపితురాలయింది.

అప్పుడు కోపావిష్టులై ఉన్న గోపకులంతో నందరాజు "గోపకులారా! గర్గమహర్షి నాకు చెప్పిన విషయము మీకు చెప్పాలి వినండి. అప్పుడు మీ సంశయం తొలగిపోతుంది. "కృష్ణ'' అనే పదంలోని క కారం కమలాకాంతుని సూచిస్తుంది. ఋకారం రామునకుసంకేతం. షకారం శ్వేతద్వీప నివాసి షడ్గుణ ఐశ్వర్య గుణములకు అధిపతి అయిన విష్ణువును సూచిస్తుంది. ణకారము సాక్షాత్తు నరసింహ స్వరూపము. అకారము అక్షర పురుషుణ్ణి సూచిస్తుంది. చివరలో ఉన్న విసర్గము నరనారాయణ ఋషులకు ప్రతీక. ఈ షడ్విధ పూర్ణ తత్త్వములు ఏకత్వమైయున్న పరిపూర్ణతమ పరమాత్ముడు కృష్ణుడు. అందుకనే ఈ బాలునకు కృష్ణుడనే పేరు పెట్టబడింది. యుగములను బట్టి సత్యయుగంలో ఈతడు శుక్లవర్ణుడు, త్రేతాయుగంలో రక్తవర్ణుడు, ద్వాపరయుగంలో పీతవర్ణుడుగా ఉన్నాడు. ప్రస్తుతము ఇది ద్వాపరయుగాంతము కలియుగారంభము కాబట్టి పరమాత్ముడు కృష్ణవర్ణుడుగా ఉన్నాడు. అందుకని కూడా వీనిని కృష్ణుడని అన్నారు.

ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము ఈ ఎనిమిందిటికి అధిపతి కాబట్టి కూడా ఈ పేరు ప్రసిద్ధమయింది. ఈ ఎనిమిదింటిలో అంతర్యామిగా ఉంటాడు కాబట్టి ఈకృష్ణుడినే వాసుదేవుడని కూడా అంటారు. వృషభానునందినియైన రాధకు పతికాబట్టి రాధాపతి అని కూడా వీనికి పేరు. ఈతడు అసంఖ్యాకమైన బ్రహ్మాండములకు అధిపతి, సర్వవ్యాపకుడు అయినప్పటికి స్వరూపధారిగా గోలోకధామంలో విరాజిల్లుతుంటాడు. ఓ నందుడా! ఆ భగవంతుడే భూభారం తొలగించటానికి, కంసాది దైత్యులను హరించటానికి నీ కుమారుడుగా జన్మించాడు. ఈ బాలునకు అనేక నామధేయములున్నాయి. అవి వేదములకు కూడా అందనివి. లీలలను బట్టి మరి అనేక నామములు ఈ బాలునకు ఏర్పడతాయి. ఈతడు నెరవేర్చే కృత్యములు మహాద్భుతములై ఒప్పుతుంటాయి. ఈ విషయంలో ఆశ్చర్యపడనవసరం

లేదు అని గర్గమహర్షి నాకు చెప్పటం వల్ల ఈ బాలుని విషయంలో నాకెటువంటి సందేహము కలుగదు. లోకంలో వేదవాక్యములు, విప్రవచనములే గదా మనకు ప్రమాణములు!" అని పలికాడు.

ఆ మాటలు విని గోపకులు "గర్గాచార్యులవారు నామకరణ సంస్కారం నెరవేర్చటం కోసం మీ ఇంటికి వచ్చినప్పుడు నీవు బంధువులను మిత్రులను ఎవరినీ పిలువకుండగా రహస్యంగా ఎందుకు జరుపవలసివచ్చింది?" అంటూ వారంతా కోపంతో నందమందిరం నుంచి బయలు దేరి, వృషభానుని దగ్గరకు వెళ్ళారు. వృషభానుడు నందరాజుకు ఆప్తుడు, సహాయకుడు. ఆ వృషభానుని చేరి గోపకులు "నీవు మాజ్ఞాతి వర్గంలో ముఖ్యుడవు, మహామనస్వివి. అందువల్ల ఓ భూపాలా! నీవు నందరాజును మన జాతినుంచి వేరుగా ఉంచు" అని చెప్పారు. అప్పుడు వృషభానుడు "నందునిలో ఏమైనా దోషం ఉంటే ఆతనిని నేను పరిత్యజిస్తాను. కాని నందుడు గోపకులందరికీ ప్రియుడు, మనజాతికంతటికీ కిరీటము వంటివాడు, నాకు మరింత ఇష్టుడు" అన్నాడు.

అప్పుడు గోపకులు "నీవు నందరాజును విడిచిపెట్టలేకపోతే వ్రజవాసులమంతా నిన్ను విడిచిపెడతాము. ఇంట్లో వయస్సు వచ్చిన కుమార్తె ఉన్నది. నీవు మన వంశంలో ముఖ్యుడవైయుండి కూడా ఐశ్వర్యమదంతో ఇప్పటివరకు నీవు ఆమెను ఎవరికీ కట్టబెట్టలేదు. అందువల్ల నీకు పాపం సంక్రమించింది. శీఘ్రంగా ఇప్పటికైనా నందుణ్ణి విడిచిపెట్టు లేదా నిన్ను జాతి భ్రష్టునిగా భావించి నిన్ను వేరుగా చూడవలసి వస్తుంది" అన్నారు.

అందుకు వృషభానుడు "గోపకులారా! గర్గమహర్షి నాకు చెప్పినది వినండి. మీకు సంశయం తొలగిపోతుంది - అసంఖ్యాకమైన బ్రహ్మాండములకు అధిపతి, లోకేశ్వరుడు, నందగృహంలో శ్రీకృష్ణునిగా అవతరించాడు. గోలోకములోని రాధాదేవియే నీ ఇంట నీకుమార్తెగా అవతరించింది. ఈ దేవిని నీవు గుర్తించలేదు. వీరిద్దరి వివాహము నేను చేయనవసరం లేదు. యమునాతీరంలో భాండీరవనంలో సాక్షాత్తు బ్రహ్మదేవుడే వీరి వివాహం జరుపుతాడు. రాధాదేవిని కృష్ణుని అర్ధాంగిగా, సాక్షాత్తు గోలోకధామనివాసినిగా గ్రహించు. మీ గోపకులందరూ కూడా గోలోకం నుంచి

భూలోకమునకు విచ్చేశారు. అదేవిధంగా గోపికలు, గోవులు కూడా రాధాదేవి సంకల్పానుసారం గోలోకం నుంచి గోకులమునకు రావటం జరిగింది - అని గర్గమహర్షి చెప్పిన నాటి నుంచి నేను రాధ విషయంలో ఎటువంటి సంశయం లేకుండగా ఉన్నాను'' అన్నాడు.

వృషభానుని ఈ మాటలను వినగానే వ్రజవాసులందరూ శాంతచిత్తులయ్యారు. వారి సందేహములన్నీ సద్దుమణిగినాయి. వారికి ఆశ్చర్యం కూడా కలిగింది. అప్పుడు వారందరూ "మహాత్మా! నీవు చెప్పినది సత్యము. ఈరాధ కృష్ణునికి ఇష్టురాలు. ఈమె ప్రభావం వల్ల భువిలో నీ వైభవం అధికమయింది. వేలాది మదగజములు, చురుకైన అశ్వరాజములు, కోట్లాది సుందర రథములు, పల్లకీలు, స్వర్ణాభరణములతో విభూషితములైన కోట్లాది గోవులు, విచిత్ర భవనములు, మణులు మాణిక్యములతో నీ ఐశ్వర్యము సాటిలేనిదిగా భాసిస్తున్నది. నీ పరాక్రమం చూచి కంసుడు కూడా పరాభూతుడయ్యాడు. కన్యాకుబ్జ దేశాధిపతి రాజా భలందనునకు అల్లుడవై, కుబేరునితో సమానమైన సంపదలను గడించావు. నీతో సమానమైన సంపద నందరాజువద్ద కూడా లేదు. నందుడు కేవలం కృషీవలుడు, గోగణములకు అధిపతి, దయార్ద్ర హృదయుడు. ఓ ప్రభూ! ఒకవేళ నందుని కుమారుడు సాక్షాత్తు శ్రీహరియే అయినట్లయితే మాఅందరి ఎదుట నందునివైభవమును పరీక్ష చేయించాలి" అన్నారు.

## ముత్యముల పరీక్ష :

వృషభానుడు గోపకుల మాటను విని నందరాజు వైభవమును పరీక్షచేయదలచాడు. ఆతడు కోటి ముత్యాలహారాలను తెచ్చి గోపకులందరూ చూస్తూ ఉండగా వాటిని భద్రంగా నగల పెట్టెలలో అమర్చి సంబంధం కుదిర్చే నైపుణ్యంగల పెద్దలకిచ్చి నందరాజు దగ్గరకు పంపాడు. ఆ హారాలలో కూర్చబడిన ఒక్కొక్క ముత్యం కోటి బంగారు కాసుల విలువ చేసేదిగా ఉంది. ఆ ముత్యాల కాంతి చాలా దూరం వరకు ప్రతిఫలిస్తున్నది. ఆ మధ్యవర్తులు ఈ ముత్యాలహారములను తీసికొని వెళ్ళి నందరాజు ముందు ఉంచి ప్రణామము చేసి "నందరాజా! వృషభానుడు తన కుమార్తె రాధా దేవికి తగిన వరుని కోసమై అన్వేషిస్తూ నీకుమారుడు శ్రీకృష్ణుడు దివ్యుడని గ్రహించి, గోవర్ధనగిరిధారిగా, అమిత భుజబలసంపన్నునిగా తెలిసికొని

మమ్ములను నీదగ్గరకు పంపించాడు. ముందుగా వరుని ఒడినింపటం కోసం వృషభానుడు పంపిన ఈ మౌక్తికరాశిని స్వీకరించండి. తరువాత కన్య ఒడి నింపటం కోసం మీరు మౌక్తిక రాశిని మాకిచ్చి పంపండి. ఇది మన కుల మర్యాద గదా'' అన్నారు.

ఆ మౌక్తిక రాశిని చూచి నందుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. అప్పుడు నందుడు యశోదను చూచి వాటితో సమానమైన సంపద మన దగ్గర ఉన్నదా లేదా అని ఇరువురూ అంతఃపురంలోపలకు వెళ్ళి పెట్టెలన్నీ వెదకటం ఆరంభించారు. వెదకి వెదకి చివరకు వారు "ఆసంపదతో సమానమైన సంపద తమ యొద్ద లేదు'' అనే నిశ్చితాభిప్రాయమునకు వచ్చారు. "మరి నలుగురిలో నవ్వులపాలవుతుంది ఎలా? వీటికి ప్రతిగా మనం ఏమివ్వగలము? ఇప్పుడు ఏమిచేయాలి? శ్రీకృష్ణుని వివాహం నిమిత్తమై మనవల్ల జరుగవలసినది ఏమిటి? ముందుగా వరుని కొఱకై తెచ్చినది తీసికొని తరువాత మన ధనము వచ్చిన తరువాత వధువుకు కానుకలు తీసికొని వెళదాము'' అని యశోదానందులు భావిస్తున్న తరుణంలో అక్కడకు ఆడుతూ పాడుతూ కృష్ణుడు వచ్చాడు. రావటంతోటే అక్కడ ఉన్న ముత్యాలహారములలో ఒక నూరుహారాలను చేతితో తీసికొని బయట పొలాలలోకి వెళ్ళి ఒక చేతి నుంచి ఒక చేతిలోనికి ఒక్కొక్క ముత్యం తీసికొని పొలాలలో ధాన్యం గింజలను చల్లినట్లు చల్లాడు.

ఇక్కడ నందుడు తాను తీసిఉంచిన ముక్తాహారాలను లెక్కిస్తూ వాటిల్లో ఒక నూరు హారాలు తగ్గిఉండటం గమనించాడు. "ఇక్కడ ఉంచిన హారాలు ఏమైనాయి. ఈ విషయం బంధువులకు తెలిస్తే ఎంత అవమానం? ఒకవేళ బలరామకృష్ణులు ఆడుకొనటానికి వీటిల్లో కొన్ని హారాలు తీసికొని వెళ్ళారా ఏమిటి?'' అని విచారంగా వెళ్ళి ఆ హారముల విషయం ముందుగా శ్రీకృష్ణుణ్ణి అడిగాడు. అప్పుడు పకపకా నవ్వి గోవర్ధనగిరిధారియైన కృష్ణుడు నందునితో "బాబా! మనమందరము రైతులము గదా. మనము పొలంలో రకరకముల గింజలు చల్లుతుంటాము గదా. అందుకని మేము ఈరోజున ముత్యాలను చల్లి వచ్చాము'' అన్నాడు. ఈమాటలను వినగానే వ్రజేశ్వరుడైన నందుడు దిగ్భ్రాంతి

చెందాడు. వెంటనే ఆముత్యాల నన్నింటినీ ఏరి తీసికొనిరావటం కోసం ఆ బాలుణ్ణి వెంటబెట్టుకొని పొలమునకు వెళ్ళాడు. అత్యాశ్చర్యకరముగా అక్కడ వందలాది ముత్యముల వృక్షములు అందంగా అద్భుతంగా కనిపించసాగినాయి. గగన మండలంలో గుంపులు గుంపులుగా నక్షత్ర సమూహము వలె ప్రతిచెట్టుకు కోట్లాది తళతళ మెరిసిపోతున్న ముత్యములు వెల్లివిరిశాయి. ఆదృశ్యమును చూచి శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమేశ్వరుడని నందుడు గ్రహించాడు. వెంటనే వాటిల్లో పెద్దవి, ప్రకాశవంతమైనవీ అయిన కోట్లాది ముత్యాలను కోసి బండ్లపై వేసికొని వచ్చి వాటిని ఆ మధ్యవర్తులకిచ్చి పంపించాడు. ఆ మధ్యవర్తులు ఆ ముక్తాఫలాలను తీసికొని వెళ్ళి గోపకుల మధ్యనున్న వృషభానునకు సమర్పించి విషయమంతా తెలియజేశారు. ఇది విని గోపకులందరూ విస్మితులయారు. నందనందనుడు సాక్షాత్తు శ్రీహరి యని గ్రహించి తమ సంశయములను తొలగించుకొని వారు వృషభానునకు నమస్కరించి వెళ్ళారు. శ్రీకృష్ణపరమాత్ముడు ముత్యములను చల్లిన ఆ ప్రదేశము "ముక్తాసరోవరము" అని ప్రసిద్ధి పొందింది.

## గోవర్ధన తీర్థములు :

గోవర్ధనము సర్వతీర్థరాజము. మానసకుండము, గోవింద కుండము, రాధాకుండము, కృష్ణకుండము, లలితాకుండము, గోపాల కుండము, కుసుమ సరోవరము అని అనేక తీర్థములు ఇందున్నాయి. కృష్ణుని శిరస్సు స్పర్శపొందిన శిలకు ముకుటశిల అనిపేరు. కృష్ణుడు చిత్రము లిఖించిన శిలకు చిత్రశిల అనిపేరు. గీతగానముల సమయంలో కృష్ణుడు ఒక శిలపై చేతితో తాళం వేశాడు కాబట్టి ఆశిలకు వాదినీశిల అనిపేరు. గోపబాలురతో ఒక రాతిని బంతిగా ఆడినాడు కాబట్టి ఆరాతికి కందుకశిల అనిపేరు. కృష్ణుడు ఆటలాడిన ధూళిలో దొర్లినవాడు సాక్షాత్తు విష్ణుపదమును పొందగలడు. మాధవుడు గోపకుల తలపాగలను దొంగలించిన చోటును ఔష్ణీష తీర్థము అంటారు.

ఒక సమయంలో అక్కడకు పెరుగు అమ్మటానికి గోపవధువులు వచ్చారు. వారి పాదమంజీరాల సవ్వడివిని కృష్ణుడు వచ్చి దారికి అడ్డుగా నిలిచాడు. ఒకచేత మురళిని మరొకచేత బెత్తమును పట్టుకొని ఉన్న కృష్ణునితో పాటు గోపాలబాలురు కూడా వచ్చి గోపికలను చుట్టుముట్టారు. "ఈ మార్గంలో మీరు నడవాలంటే

మీరు నాకు సుంకం కట్టాలి" అన్నాడు కృష్ణుడు. అప్పుడు గోపికలు "నీవు చాలా పోకిరివి. గోపాలకులతో కలిసి మాకు అడ్డుగా నిలబడితే ఎలా? మాకు దారి విడువు. లేకపోతే మేము నీవిషయం కంసునకు చెప్పి చెరసాలలో వేయిస్తాము" అన్నారు. అందుకు కృష్ణుడు వారితో "కంసునిపేరు చెప్పి నన్ను భయపెట్టాలనుకొంటున్నారా? నేను కంసుణ్ణి ఆతని పరివారాన్ని హతం చేస్తాను. గుర్తుపెట్టుకొనండి" అన్నాడు. మెల్లగా స్నేహితులతో కలిసి వారిదగ్గర నున్న పెరుగుపాత్రలను ఒక్కొక్కటే అడిగి తీసికొని నేలపై పడవేసి పగులగొట్టాడు. గోపకాంతలు "అయ్యో!-ఈ బాలుడు ఉన్నకొద్దీ దుండగుడౌతున్నాడు. ఈతని నిరంకుశత్వానికి అడ్డు లేకుండా ఉన్నది. వనంలోకి వచ్చి వీరుని వలె ప్రవర్తిస్తున్నాడు. ఈతని విషయము వెళ్ళి యశోదతో చెప్పాలని అనుకొంటూ తిరిగి గోకులమునకు వెళ్ళారు.

ఇక్కడ మాధవుడు కదంబ, పలాశ వృక్షముల పత్రములను దొన్నెలుగా చేసి క్రిందపడిన పెరుగును ఆ దొన్నెలలోకి తీసికొని తినసాగాడు. అప్పటినుంచి ఆచెట్ల ఆకులు దొన్నెల ఆకృతిని వహించాయి. ఆ పరమ పుణ్య క్షేత్రమునకు ద్రోణతీర్థమని పేరువచ్చింది. కృష్ణుడు చెలికాండ్రతో విహరించిన ఆ ప్రదేశమునకు కదంబతీర్థమని పేరు కలిగింది. కృష్ణుడు మిత్రులతో దాగుడు మూతలాడిన ప్రదేశమునకు లౌకిక తీర్థమని పేరువచ్చింది. గోవర్ధన పర్వతముపై రాధ కృష్ణునకు అలంకారము చేసిన చోటును శృంగార మండలమని అన్నారు. శ్రీకృష్ణుడు ఏరూపంలో గోవర్ధన పర్వతమును ధరించాడో ఆరూపము శృంగారమండల తీర్థంలో కనిపిస్తుంది. కలియుగంలో నాలుగువేల ఎనిమిది వందల యేండ్లు గడిచిన తరువాత ఆ శృంగార క్షేత్రంలో గోవర్ధన గిరి గుహ మధ్యభాగంలో అందరూ చూస్తూఉండగా శ్రీహరి స్వతఃసిద్ధ స్వరూపం కనిపిస్తుంది. ఆయననే శ్రీనాథుడని అంటారు. కలియుగంలో ఎవరు ఆ శ్రీకృష్ణపరమాత్ముని రూపమును దర్శిస్తారో వారు కృతార్థులు. ఆ పరమాత్ముడు పంచనాథులుగా భారతదేశంలో విరాజిల్లుతున్నాడు. భారతదేశం నాలుగువైపుల క్రమంగా జగన్నాథుడు, రంగనాథుడు, ద్వారకానాథుడు, బదరీ నాథుడు ప్రసిద్ధులుగా ఉన్నారు. భారత వర్షం మధ్యభాగంలో గోవర్ధన నాథుడనే పేరుతో విలసిల్లుతున్నాడు.

**గిరి శకల ప్రభావము :**

పూర్వం గోదావరీ తీరంలో విజయుడనే పేరుగల ఒక బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. ఆతడు ఒక పర్యాయం తనకు రావలసిన ధనమును వసూలు చేసికొనటానికి మధురానగరం వెళ్ళి తిరిగి ఈ గోవర్ధగిరి ప్రక్కనుంచి తన గ్రామమమునకు వెళుతున్నాడు. ఆసమయంలో ఆతడు రమణీయమైన గోవర్ధనగిరిని చూస్తూ అక్కడి ఒక రాతిని చేతితో తీసికొని ముందుకు సాగిపోయాడు. తరువాత ఆతడు వ్రజమండలం దాటి ఒక అరణ్యం మధ్యనుంచి ప్రయాణం చేస్తున్నప్పుడు ఆతనికి ఒక రాక్షసుడు ఎదురు పడ్డాడు. అతని ముఖం ఆతని ఛాతిలో ఉన్నది. మూడు కాళ్ళతో, ఆరు భుజాలతో, మూడు చేతులతో వికృతాకారంతో ఉన్న ఆరాక్షసుడు ఆకలితో అరుస్తూ తనవైపు రావటం చూచి ఆ బ్రాహ్మణుడు భయకంపితుడయ్యాడు. అప్పుడు ఆబ్రాహ్మణుడు తనచేతిలో ఉన్న రాతిని ఆ రాక్షసునిపై విసిరివేశాడు.

గోవర్ధనగిరికి సంబంధించిన ఆ రాతి స్పర్శ తగలగానే ఆ రాక్షసుడు తన వికృత రూపం వదిలిపెట్టి మనోహరమైన శ్యామసుందరమూర్తి రూపం ధరించాడు. పీతాంబరధారియై, వనమాలికా శోభితుడై, ఆభరణ భూషితుడై, మురళీమనోహరుడై విలసిల్లుతున్న ఆతడు ఈ బ్రాహ్మణునకు ప్రణామం చేసి "మహాత్మా! నీవు పుణ్యాత్ముడవు, లోకములో ఇతరుల కష్టములను తొలగించే వాడు ధన్యుడుకదా. నీవు నామీద విసరిన రాతిస్పర్శవల్ల నాకు రాక్షసజన్మ పోయి ఈ దివ్యమంగళ రూపం లభించింది" అని పలికాడు. ఆ మాటలు విని ఆ బ్రాహ్మణుడు" నీమాటలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. నిన్ను ఉద్ధరించే శక్తి నాకు ఎక్కడిది? పాషాణ స్పర్శ ఇంతటి ఫలితము నివ్వటమేమిటి?" అని అన్నాడు.

అప్పుడు ఆదివ్యరూపంధరించిన సిద్ధుడు బ్రాహ్మణునితో "మహాత్మా! గోవర్ధన పర్వతము సాక్షాత్తు శ్రీహరి యొక్క రూపమే. దాని దర్శన మాత్రం చేతనే మానవుడు కృతార్థుడు కాగలడు.ఈ గిరి దగ్గర నున్న పుచ్ఛ కుండములో ఒక్కసారి స్నానము చేసినంత మాత్రంచేత అనంత ఫలములు కలుగుతాయి. నీవు ఈ గిరిరాజును దర్శించి ఆ పాషాణమును నాకు స్పృశింపచేశావు కాబట్టి నాకీ రూపం వచ్చింది" అని పలికాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు సంతోషించి "ఓ మహాభాగా! ఇప్పుడు నీవు దివ్యరూపధారిగానే కనిపిస్తున్నావు. కానీ నీపూర్వజన్మ వృత్తాంతముఏమిటి?" అని అడిగాడు. అప్పుడు సిద్ధుడు "ఓ మహాత్మా! పూర్వజన్మలో నేను ఒక ధనవంతుడైన వైశ్యుడను. చివరకు నేను జూదరినై, వేశ్యాలోలుడనై, తల్లి దండ్రులను భార్యను నానా హింసలు పెట్టి చివరకు వారి నందరినీ హతమార్చాను. చివరకు అరణ్యములో ఒక పాము కాటుకు చనిపోయాను. అప్పుడు యమదూతలు నన్ను తీసికొని వెళ్ళి నరక కుండంలో పడవేసి చిత్రహింసలు పెట్టారు. అనేక సంవత్సరముల అనంతరం నేను వరాహముగా, దున్నపోతుగా, పెద్దపులిగా, పాముగా పుట్టి చివరకు ఈ నిర్జన వనంలో రాక్షసుడుగా పుట్టి జీవితం గడుపుతున్నాను. ఒకనాడు నేనుఒక బాటసారి భుజములపై ఎక్కి గోకులంవైపు వెళ్ళాను. కృష్ణపార్షదులు నా వికృతరూపం చూచి నన్ను కట్టులతో కొట్టగా నేను ఆ దెబ్బలను భరింపలేక వ్రజం విడిచి పరుగుపెడుతూ మార్గమధ్యంలో నిన్ను చూశాను. ఆకలిని భరింపలేక నిన్ను మ్రింగబోయాను. నీవు నన్ను చూచి భయపడి నీ చేతిలో నున్న రాతితో కొట్టి ఈ విధంగా నాకు విముక్తి కలిగించావు. శ్రీకృష్ణపరమాత్ముని అనుగ్రహం వల్ల నాకీ దివ్యరూపం వచ్చింది. ఇదీ నా వృత్తాంతము" అని వివరించాడు. అదే సమయంలో గోలోకం నుండి ఒక దివ్యరథం వచ్చింది. ఆ బ్రాహ్మణుడు చూస్తూ ఉండగానే ఆ రథంలోని దివ్యపురుషులు ఆ సిద్ధుణ్ణి రధంపై తీసికొని వెళ్ళారు.

అనంతరము ఆ బ్రాహ్మణుడు గోవర్ధనగిరి ప్రభావమును గ్రహించి మరల వెనుకకు వెళ్ళి గిరి ప్రదక్షిణమొనర్చి తన గ్రామమునకు చేరుకొని సుఖజీవనం చేయసాగాడు. ఇది గోవర్ధనగిరి రాజ ప్రభావము.

# 4. మాధుర్య ఖండము

"ఓ మహాత్మా! శ్రీకృష్ణపరమాత్మునితో పుణ్యప్రదమైన రాసలీలలలో పాల్గొన్న గోపికలు ఎవరు? వారు పూర్వజన్మలో చేసికొన్న పుణ్యమేమిటి?" అని బహుళాశ్వజనకుడు అడిగినప్పుడు నారదమహర్షి ఈ విధంగా సమాధానమిచ్చాడు-- "ఓ మహారాజా! కృష్ణపరమాత్ముని సన్నిధికి వచ్చిన గోపికల బృందములు అనేక విధములుగా ఉన్నాయి.

**శ్రుతి రూప గోపికలు :**

పూర్వం శ్రుతులు విరాట్పురుషుని అనేక విధాలుగా మధురవాణిలో ప్రశంసించాయి. చివరకవి "భగవాన్ ! నీతత్త్వం వాక్కుచేత గ్రహింపనలవికానిది. అందువల్ల మేము నిన్ను తెలిసికొనలేకపోతున్నాము. పురాణపురుషులు, జ్ఞానులు నిన్ను ఆనందస్వరూపునిగా అభివర్ణిస్తున్నారు. ఆరూపాన్ని మాకు చూపించు" అన్నాయి. అప్పుడు భగవానుడు జ్ఞానానంద స్వరూపమైనటువంటి గోలోకధామాన్ని, అచట తన దివ్యరూపాన్ని దర్శింపచేశాడు. అప్పుడు శ్రుతులు "భగవాన్ ! జగన్మోహనమైన నీ రూపం చూచిన తరువాత నిన్ను విడువలేకుండా ఉన్నాము. మాకు నీతో విహరించాలని ఉన్నది" అన్నాయి. అప్పుడు పరమాత్ముడు "ఈ సారస్వత కల్పం గడిచిపోయిన తరువాత మీరు వ్రజంలో గోపికలు కాగలరు. అప్పుడు మీకోరిక నెరవేరుతుంది" అని అభయప్రదానం చేశాడు. ఆశ్రుతులే శ్రుతిరూప గోపికలుగా వచ్చారు.

ఒకనాటి రేయి శ్రీకృష్ణుడు ఆలస్యంగా తన మందిరమునకు రాగా శ్రుతిరూప గోపికలు "ఓ కృష్ణా ! చంద్ర దర్శనముకై చకోరముల వలె నీరాక కోసమై మేమంతా ఎదురుచూస్తుంటే ఈనాడింత ఆలస్యమైనదేమిటి?" అని అడిగారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారితో "ఓ కాంతలారా! నేను మీ హృదయంలో నివసిస్తుంటే మీకు నాకు దూరమనేది ఎక్కడున్నది? సూర్యుడు ఆకాశంలో, కమలంభూమిమీద ఉంటున్నా సూర్యుణ్ణి చూడగానే కమలం వికసించటంలేదా? ఈరోజు నేను ఆలస్యంగా రావటానికి కారణం వినండి. ఈరోజు మా గురువుగారైన మహర్షి దుర్వాసుడు భాండీరవనానికి విచ్చేశారు. వారితో మాట్లాడి వారి సేవలు చేసి, అచట నుండి వచ్చేటప్పటికి ఆలస్యమయింది. గురువే బ్రహ్మము, గురువే

విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపము కదా" అని పలికాడు. అప్పుడు గోపికలు! "ఓ ప్రభూ! నీవు పరమేశ్వరుడవు కదా. నీకు కూడా ఒక గురువు ఉన్నాడా ఆశ్చర్యంగా ఉన్నదే. అలాగయితే మేము వారిని దర్శింపవచ్చునా?" అని అడిగారు. అందుకు కృష్ణుడు సమ్మతించి యమునానది అవతలి ఒడ్డున దుర్వాసుడు ఉన్న విషయం తెలిపాడు. అప్పుడు గోపికలు "కృష్ణా! ఈఅర్ధరాత్రి సమయంలో యమునానదిని దాటటంఎలా?" అని అడిగారు. అందుకు కృష్ణుడు వారితో "ఓ ప్రియకాంతలారా! మీరు తప్పకుండగా అక్కడకు వెళ్ళవలెనని భావించి నట్లయితే యమునానది దగ్గరకు వెళ్ళి దారి నిమ్మని ఇలా ప్రార్థించండి

యది కృష్ణో బాలయతి: సర్వదోష వివర్జిత:
తర్హి నో దేహి మార్గం వై కాళింది సరితాం వరే

ఓ యమునా! గోపాలుడైన కృష్ణుడు బాలయతి అయినట్లయితే, అస్ఖలిత బ్రహ్మచారి అయినట్లయితే, సర్వదోషవివర్జితుడయినట్లయితే మాకు దారి యొసగు మని ప్రార్థించుమన్నాడు. గోపికలు తమ వెంట పాత్రలలో మంచిమంచి ఆహార పదార్థాలను తీసికొని యమునానది చెంతకు వెళ్ళి కృష్ణపరమాత్ముడు చెప్ప మన్నట్లుగా చెప్పగా యమున వారికి మార్గమిచ్చింది. గోపికలు విస్మితలై ఆ మార్గం వెంట యమున దాటి భాండీరవనమునకు చేరుకున్నారు. అక్కడ వారు దుర్వాసుని సందర్శించి, ఆదరంతో పూజించి, "స్వామీ! ముందుగా నేను తెచ్చిన ఆహారపదార్థాలు స్వీకరించండి, ముందుగా నేను తెచ్చిన ఆహారపదార్థాలు స్వీక రించండి" అని ప్రార్థింపసాగారు. వారి భక్తి భావమునకు మెచ్చి మహర్షి వారితో "ఓ గోపకాంతలారా! నేను కృతకృత్యుడను, మీరందరూ మీరు తెచ్చిన ఆహారపదార్థాలను మీరే స్వయంగా నా నోటిలో వేయండి" అని పలికి నోరు తెరిచాడు. అప్పుడు గోపికలు సంతోషంతో ఒకరి తరువాత ఒకరు వచ్చి తాము తెచ్చిన మధురాన్నములను మహర్షి నోటిలో వేశారు. గోపకాంతల పాత్రలన్నీ ఖాళీఅయినాయి. వారంతా ఆశ్చర్యపడ్డారు. తరువాత గోపికలు మహర్షికి నమస్కరించి "స్వామీ! ఇంతరాత్రివేళ మేము శ్రీకృష్ణపరమాత్ముని దయవల్ల యమునదాటి రాగలిగాము. ఇప్పుడు మేము తిరిగి ఏవిధంగా వెళ్ళగలము?" అని అడిగారు. అందుకు దుర్వాసముని వారితో "గోపకాంతలారా! మీరు వెళ్ళేటప్పుడు యమునానదితో

యది దూర్వారసం పీత్వా దుర్వాసా: కేవలం క్షితౌ
వ్రతీ నిరన్నో నిర్వారి వర్తతే పృథివీతలే
తర్హినో దేహి మార్గం వై కాళింది సరితాం వరే

దుర్వాసమహర్షి కేవలం దూర్వారసం మాత్రమే త్రాగి, ఎటువంటి ఆహారపదార్థము లను, జలమును స్వీకరింపకుండగా నియమపాలనము చేస్తున్నట్లయితే ఓ కాళిందీ నదీ! మాకు మార్గమివ్వు అని అడుగుమని పలికాడు.

ఈ మాటలు విని గోపికలు మునిపుంగవునకు ప్రణామం చేసి యమునాతీరానికి వచ్చి ఆయన చెప్పమన్న మాటలను చెప్పారు. యమున దారి యిచ్చింది. తరువాత వారు శ్రీకృష్ణపరమాత్ముని చేరి జరిగిన వృత్తాంతమంతా వివరించి "ప్రభూ! మీ గురు శిష్యులు ఇద్దరూ కూడా అసత్యవాదులుగానే కనిపిస్తున్నారు. నీవు ఇందరు కాంతామణులతో విహరిస్తూ బాల బ్రహ్మచారివి ఎలా అయినావు? దుర్వాసమహర్షి అన్ని పాత్రలలోని ఆహారపదార్థాలను స్వీకరించి కేవలం దూర్వారసం త్రాగి ఉంటున్నానని అన్నారు. ఈ రెండు విషయాలు మాకు అర్థం కావటం లేదు" అన్నారు.

అందుకు పరమాత్ముడు పకపకానవ్వి "గోపసుందరులారా! నేను మమకార అహంకార రహితుణ్ణి, నేను సర్వాంతర్యామిని, సర్వవ్యాపకుడను, గుణరహితుడను, దోషరహితుడను, భక్తులు ఏవిధంగా నన్ను భజిస్తూఉంటారో అదేవిధంగా నేనూ వారిని స్మరిస్తూ ఉంటాను. అలాగే జ్ఞానులు సాధువులు మహాత్ములు కూడా సమదృష్టితో ఉంటారు. కాని కొందరు కర్మాసక్తులై ఆ కర్మలు నిర్వహిస్తూ ఉంటారు. నిష్కామ్యబుద్ధితో నిర్వహించే వారి సమస్త కర్మలు జ్ఞానాగ్నిలో దగ్ధమైపోతాయి. అంటే ఆ కర్మలు వారికి బంధనకారకాలుగా ఉండవు. ఈ ప్రపంచంలో జ్ఞానము నకు మించినది మరియొకటి లేదు. ఎవరు తమ సమస్తకర్మలను బ్రహ్మార్పణం గావిస్తారో అటువంటి వారికి పద్మపత్రమునకు నీరు అంటనట్లుగా వారికి పాపసంకిలం ఎంతమాత్రము అంటదు. మహర్షి దుర్వాసుడు మీఅందరి తృప్తికోసమే అంత ఆహారాన్ని స్వీకరించారు. స్వత: ఆయనకు భోజనంపై ఇచ్ఛ లేదు. ఆయన కేవలం దూర్వారసమే ఆహారంగా తీసుకుంటారు "అని శ్రీకృష్ణపరమాత్ముడు చెప్పగా విని శ్రుతిరూప గోపికలు నిస్సందేహులై జ్ఞానవతులయ్యారు.

**ఋషి రూపగోపికలు :**

శ్రీరామచంద్రుడు దండకారణ్యంలో విహరించే సమయంలో అక్కడి ఋషులందరూ రాముని దివ్య సుందర రూపమును చూచి ఆకర్షితులయ్యారు. వారు శ్రీరాముని ఆకర్షణకు పరవశులై సీతవలె తాము ఆస్వామికి సన్నిహితంగా ఉండి సేవించుకొనే భాగ్యం ప్రసాదించమని వేడుకున్నారు. అప్పుడు "రాముడు లక్ష్మణుని వలె సేవచేసే అభిలాష ఉంటే మీకోరిక ఇప్పుడే నెరవేరేది. మీరు సీతవలె ప్రేమపూర్వకంగా సేవచేయాలని భావించారు. కాబట్టి ద్వాపరయుగాంతంలో మీ కోరిక నెరవేరుతుంది" అని అభయమిచ్చాడు.

ఆ ఋషులే ద్వాపరయుగాంతంలో వంగదేశంలోని మంగళుడనే గోపరాజుకుమార్తెలుగా జన్మించారు. ఆతడు గొప్ప ధనికుడు. తొమ్మిది లక్షల గోవులకతడు అధిపతి. ఆతనికి ఐదువేలమంది భార్యలు. కాని దైవ యోగం వల్ల ఆతని ధనసంపద, గోసంపద కొంత దొంగలపాలయింది, మరికొంత అచటి రాజు వశంచేసుకున్నాడు. ఆకస్మికంగా ఆతని స్థితి తారుమారయింది. ఆతడెంతో దు:ఖంపొందాడు. అటువంటి పరిస్థితిలో అసంఖ్యాకంగాఉన్న తన కుమార్తెలను చూసికొని ఆతడు మరింత వ్యథపొందాడు.

ఒకనాడు మధురమండలం నుంచి జయుడనే బుద్ధిమంతుడైన ఒక వృద్ధ గోపకుడు తీర్థయాత్రలు చేస్తూ మంగళుని యొద్దకు వచ్చాడు. మాటల సందర్భంలో ఆతడు నందరాజు సంపద గురించి, వైభవం గురించి చెప్పి "మంగళా! నీవు నిశ్చింతగా నీ కుమార్తెల నందరినీ నందరాజు దగ్గర ఉంచు. ఆతనికి గోసంపద విస్తారంగా ఉన్నది. ఆగోవుల పరిచర్యలు చేస్తూ నందరాజు పోషణలో నీకుమార్తెలు సుఖపడతారు" అని హితవు పలికాడు. పేదరికం చేత పీడితుడైన మంగళుడు ఆలోచించి చివరకు చారులోచనలైన తన కుమార్తెలను నందవ్రజానికి పంపించాడు. నందరాజు గృహంలో ఉంటూ రత్నమయభూషణాలను ధరించి గోవుల పరిచర్యలు చేస్తున్న సమయంలో ఒకరోజున వారు కృష్ణపరమాత్మున్ణి దర్శించారు. వెంటనే వారికి పూర్వజన్మ స్ఫురణ కలిగింది. శ్రీకృష్ణుని పతిగా పొందటం కోసం వారు యమునాదేవిని పూజించారు. ఆమె ప్రసన్నురాలై అభీష్టసిద్ధి కలుగుతుందని వారిని ఆశీర్వదించింది. వారి ఆర్తిని గుర్తించిన శ్రీకృష్ణుడు కార్తీక పౌర్ణమి నాటి రాత్రి వారితో రాసక్రీడ సలిపి వారిని అనుగ్రహించాడు.

**మిథిలా గోపికలు :**

త్రేతాయుగంలో మిథిలానగరంలో శ్రీరామచంద్రుడు ధనుర్భంగం చేసే సమయంలో మిథిలానగరకాంతలు రామచంద్రుని చూచి మోహితలయ్యారు. కృష్ణావతారంలో మీకోరిక నెరవేరుతుందని రామచంద్రుడు వారికి అభయమిచ్చాడు. ఆవర ప్రభావం వల్ల ఆ మిథిలానగరకాంతలు వ్రజంలో నవనందుల గృహాలలో జన్మించారు. వారు నందనందనుణ్ణి దర్శించి పరవశించిపోయారు. వారందరూ శ్రీకృష్ణుణ్ణి పతిగా కోరి మార్గశీర్ష మాసంలో కాత్యాయనీ వ్రతం ఆచరించారు. ప్రతిరోజు తెల్లవారుఝామున శ్రీకృష్ణుని గుణగానంచేస్తూ వెళ్ళి యమునానదిలో స్నానం చేసేవారు. ఒకనాడు ఆవ్రజాంగనలు ప్రతిదినము వలెనే యమున చెంతకు వెళ్ళి తమ వస్త్రములను ఒడ్డున పెట్టి నీటిలోకి దిగి స్నానాలు చేస్తూ ఒకరిపై ఒకరు వేడుకగా నీరుచల్లుకొంటూ జలక్రీడలాడుతున్నారు. అప్పుడు బాలకృష్ణుడు అక్కడకు వచ్చి వారి వస్త్రాలనన్నింటినీ తీసికొని వెళ్ళి కదంబ వృక్షంపైకి ఎక్కి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. గోపికలు స్నానానంతరం వచ్చి తమ వస్త్రా లక్కడ లేకపోవుటం చూచి ఆశ్చర్యపడ్డారు. శ్యామసుందరుడు తమ వస్త్రాలను తీసికొని కదంబ వృక్షంపై కూర్చొని ఉండటం చూచి వారు సిగ్గుతో అవనతముఖులయ్యారు. అప్పుడు కృష్ణుడు వారితో "ఇక్కడకు వచ్చి మీ వస్త్రాలు మీరు తీసికొని వెళ్ళండి" అన్నాడు. వారు ఆ చల్లని నీటిలో నిలబడి శ్యామసుందరా! నీ ఆజ్ఞ మాకు శిరోధార్యమే. మేము నీ దాసీలము కదా. మేము వస్త్రహీనలమై ఎలా రావటం?" అన్నారు. "మీరు నా ఆజ్ఞను పాలించే అనుకూలవతులయినట్లయితే ఈ కదంబ వృక్షం దగ్గరకు వచ్చి మీ వస్త్రాలను తీసికొనండి లేకపోతే వీటిని నేను ఇంటికి తీసికొని వెళతాను". అన్నాడు బాలకృష్ణుడు. అప్పుడు వారు భగవంతుని మీద భారం వేసి చేతులతో తమ శరీరాన్ని కప్పుకొని కృష్ణుని సన్నిధికి వచ్చి ఆ పరమాత్ముడిచ్చిన వస్త్రాలను ధరించారు. ప్రేమ పారవశ్యంతో కూడిన వారి చూపులను గ్రహించి శ్రీకృష్ణుడు స్మిత స్మిత సుందరుడై "గోపాంగనలారా! నన్ను పొందటం కోసం మార్గశిర మాసమంతా మీరు చేసిన కాత్యాయనీ వ్రతం సఫలమయింది" అని ఆ వనంలో యమునా తీరంలో వారితో ఆనందప్రదమైన రాసక్రీడ సలిపాడు.

**కోసల గోపికలు :**

కోసలదేశంలోని కాంతామణులు శ్రీరామచంద్రుని దర్శించి ఆ మధుర మోహనమూర్తిని తమ హృదయాలలో నిలుపుకున్నారు. ఆ శ్రీరామచంద్రుని అనుగ్రహ పూర్వకమయిన వరప్రదానం వల్ల కోసల కాంతలు వ్రజమండలంలో ఉపనందుల కుమార్తెలుగా జన్మించారు. ఆ గోపికలు గోపాలురను వివాహము చేసుకున్నారు. వెన్నెలవంటి శరీరకాంతితో, కమలదళముల వంటి విశాలమయిన కన్నులతో ఆ పద్మినీ జాతిస్త్రీలు సౌందర్య సమన్వితలయి తేజరిల్లసాగారు. వారు నందనందనుడైన శ్రీకృష్ణపరమాత్ముని సౌందర్యమును చూచి ఆశ్చర్యపడి ఆకర్షితలయ్యారు. బృందావనం వీధులలో శ్రీకృష్ణునితో పరిహాసము లాడుతూ వారు జగత్తునే మరచిపోయేవారు.

దధి విక్రయార్థం యాంత్యస్తా: కృష్ణ కృష్ణేతి చాబ్రువన్
కృష్ణేహి ప్రేమ సంసక్తా భ్రమంత్య: కుంజమండలే

ఆ రమణీమణులు పెరుగు అమ్మకొనటానికి వీధులలోనికి వెళ్ళినప్పుడు "పెరుగు, పెరుగు" అనడానికి బదులుగా వారు పరవశలయి "కృష్ణా, కృష్ణా" అని పలికేవారు. శ్రీకృష్ణుని పట్ల ప్రేమాసక్తలైనవారికి ఆకాశంలో, వాయువులో, అగ్ని జలములలో, పృథ్విలో, నక్షత్రమండలంలో, చెట్లు, చేమలలో జలసముదాయంలో సకలదిశలలో, కేవలం కృష్ణుడు మాత్రమే కన్పించేవాడు. వారి హృదయమంతా కృష్ణమయమై గగుర్పాటుతో, గద్గదస్వరముతో ఆనందబాష్పములతో మైమరపుతో విరహవేదనతో ఉద్విగ్నలయ్యే వారు. కృష్ణ విరహోన్మాదం వల్ల వారు ఉన్మత్తలై పరమహంసల వలె ప్రవర్తించేవారు. ఆ దారిలో గోవిందుడు వెళ్ళేటప్పుడు ఈగోపికలు బాలకృష్ణుని ముఖారవిందమును ముద్దుపెట్టుకొనేవారు. వారి తపస్సును ఏమని వర్ణించాలి? సమస్త లోక వ్యవహారములను విడిచిపెట్టి హృదయమంతా ఆవాసుదేవుని పట్ల ప్రేమతో నింపుకున్నారు. అందువల్లనే వారు శ్రీకృష్ణుని భుజముపై చేతులు వేసి ఆనంద తుందిలమయిన రాసక్రీడలో పాల్గొనగలిగారు. యోగులు యోగం చేత, సాంఖ్యం చేత, శుభకర్మలచేత ఎటువంటి ఉత్తమ పదము చేరుకుంటారో ఆ పదమును గోపికలు కేవలము భక్తి భావంతోనే పొందగలిగారు.

**అయోధ్యాపుర గోపికలు :**

పూర్వం అయోధ్యాపురంలోని రమణీలలామలు శ్రీరామచంద్రుని దివ్య సౌందర్యం

చూచి ఆ రామచంద్రుడు తమకు పతి కావలెనని కోరుకున్నారు. వారి కోరిక కృష్ణావతారంలో నెరవేరుతుందని శ్రీరామచంద్రుడు వారికి అభయమిచ్చాడు. సింధుదేశంలో చంపకనగరంలో ధర్మపరాయణుడైన విమలుడనే రాజు ఉండేవాడు. అతడు కుబేరుని వలె సంపన్నుడు, ప్రహ్లాదుని వలె విష్ణుభక్తుడు. ఆయనకు అసంఖ్యాకంగా భార్యలున్నారు. కాని దైవ యోగం వల్ల సంతానం లేక ఆ రాజు నిరంతరం దు:ఖంతో ఉండేవాడు. ఒకరోజున యాజ్ఞవల్క్యమహర్షి ఆతని అంత:పురానికి విచ్చేశాడు. విమలుడు మహర్షిని పూజించి ఆతిథ్యమిచ్చాడు. మహారాజు ముఖంలో కన్పిస్తున్న విచారం గమనించి యాజ్ఞవల్క్యుడు విషయమడిగి తెలిసికొని "ఓ రాజేంద్రా! ఈ జన్మలో నీకు కుమారులు కలిగే యోగం లేదు, కాని కుమార్తెలు అనేకమంది నీకు కల్గుతారు" అని పలికాడు. అందుకు ఆ రాజు మహర్షితో "మహాత్మా! పుత్రులు లేకపోతే పున్నామ నరకం నుంచి ఎలా బయట పడటం? మీరు దయార్ద్ర హృదయులు కదా నాకు తగిన హితవు చెప్పవలసినది" అని పలికాడు.

ఆ మాటలు విని యాజ్ఞవల్క్యుడు "ఓరాజా! ఇందుకు నీవు చింతించవద్దు. నీ కుమార్తెలను సాక్షాత్తు పరమాత్ముడయిన శ్రీకృష్ణుడే స్వీకరిస్తాడు" అని పలికాడు. ఆ మాటలు విని విమలునకు ఆనందం కలిగింది. ఆయన యాజ్ఞవల్క్యునితో "మహర్షీ! ఆ పరమాత్ముడు ఎప్పుడు, ఎక్కడ అవతరిస్తాడు? ఆస్వామి ఎలా ఉంటాడు? తెలియ జేయు"మని అడిగాడు. అందుకు యాజ్ఞవల్క్యుడు "రాజేంద్రా! ఈ ద్వాపర యుగాంతము నూటపదిహేను సంవత్సరములు ఉన్నదనగా మధురానగరంలో యదు వంశంలో భాద్రపద మాసం, కృష్ణ పక్షం, బుధవారం, రోహిణీ నక్షత్రంలో వృషభలగ్నంలో అష్టమీ తిథిలో అర్ధరాత్రి సమయంలో చంద్రోదయమయ్యే వేళ దేవకీ వసుదేవులకు భగవంతుడు ఆవిర్భవిస్తాడు. ఆ పరమాత్ముని వక్ష:స్థలంపై శ్రీవత్స చిహ్నం ఉంటుంది. ఆతడు నీలమేఘ కాంతితో, వనమాలికాధరుడై చతుర్భుజుడై విరాజిల్లుతుంటాడు. నీవు నీకుమార్తెలను ఆ పరమాత్మునకిచ్చి వివాహం చేయి. అప్పటి వరకు నీవు సుఖంగా జీవించి ఉంటావు" అని మహర్షి పలికి నిష్క్రమించాడు.

శ్రీరాముని వల్ల వరం పొందిన అయోధ్యాపురవాసినులే విమలుని కుమార్తెలుగా జన్మించారు. ఆ రాజకన్యలందరూ సుందరీమణులు. వారికి వివాహయోగ్యమైన వయస్సు వచ్చింది. చంపకేశ్వరుడు చింతాక్రాంతుడయ్యాడు. ఒకరోజున ఆ మహారాజుకు

గతంలో యాజ్ఞవల్క్య మహర్షి పలికిన మాటగుర్తుకు వచ్చింది. వెంటనే ఆరాజు ఒక దూతను పిలిచి "మధురానగరంలో వసుదేవునకు గల కుమారుని గురించి విచారించు. ఆతని వక్షఃస్థలంపై శ్రీవత్సం ఉంటుంది. ఆతడు వినీల సుందరవిగ్రహుడై వనమాల ధరించి చతుర్భుజుడుగా ఉంటాడు. అలా ఉండటం నిజమైతే నేను ఆ పరమాత్మునకు నా కుమార్తెలను సమర్పిస్తాను" అని వచించాడు. ఆ దూత మహారాజు వాక్యానుసారం మధురానగరం వెళ్ళి అక్కడి పెద్దలను కలిసికొని ఈ విషయం విచారింపసాగాడు. కంసునివల్ల భయపడే కొందరు మధురాపురవాసులు ఆ దూతను ఒక ఏకాంత ప్రదేశమునకు తీసికొని వెళ్ళి నెమ్మదిగా "వసుదేవునకు చాలామంది పుత్రులు కలిగారు. వారినందరిని కంసుడు హతమార్చాడు. ఒక్క కుమార్తె మాత్రం బ్రతికి బయట పడింది. కానీ ఆమెకూడా ఆకాశంలోకి ఎగిరిపోయింది. వసుదేవుడు ఇక్కడే ఉంటున్నాడు. తనకు కలిగిన సంతాన వియోగంవల్ల అతడు క్రుంగిపోయి ఉన్నాడు. ఈనగరంలో కంసుడంటే అందరికీ భయం. అందువల్ల మేమీ విధంగా చెప్పినట్లు ఎవ్వరితోనూ అనవద్దు" అని పలికారు.

ఆ మాటలు విని ఆ దూత తన నగరమునకు తిరిగివెళ్ళి మహారాజుతో ఈ సంభాషణ అంతా చెప్పి "మహారాజా! నేను తిరిగి వచ్చేటప్పుడు బృందావనంలో యమునాతీరంలో ఒక అందమయిన బాలుణ్ణి చూశాను. ఆ బాలుడు విశేషమయిన ఆకర్షణతో విరాజిల్లుతూ గోపబాలకులలో విశిష్టునిగా కన్పించాడు. ఆ బాలుని వక్షస్థలంపై శ్రీవత్స చిహ్నము ప్రకాశిస్తున్నది. శరీరకాంతి మేఘకాంతితో సమానంగా ఉంది. వనమాలధరించి ఆబాలుడు అత్యంత సౌందర్యంతో కన్పించాడు. గోపకుమారు లందరివలెనే వసుదేవకుమారుడు కూడా రెండు చేతులతోనే ఉన్నాడు. ఆ తారతమ్యం తప్ప మిగిలిన లక్షణములన్నీ మీరు చెప్పినవి అన్వయించాయి" అని తెలియజేశాడు.

విమలుడు విస్మయంతో ఆలోచిస్తుండగా ఇంతలో అక్కడకు హస్తినాపురం నుంచి సింధుదేశ దండయాత్రకు వెళుతున్న భీష్ములవారు విచ్చేశారు. విమలుడు భీష్ముణ్ణి యథావిధిగా పూజించి "మహాత్మా! పూర్వం యాజ్ఞవల్క్యమహర్షి ఇచటకు వచ్చి సాక్షాత్తు ఆశ్రీహరి దేవకీవసుదేవుల కుమారుడుగా జన్మిస్తాడని పలికారు. కాని దేవకీవసుదేవులకు జన్మించిన ఆరుగురు కుమారులను కంసుడు హతమార్చాడు. తరువాత మగపిల్లలు కలుగలేదు కదా. నా కుమార్తెలను ఎవరికిచ్చి వివాహం చేయాలో తెలియజేయు" మని అడిగాడు. అప్పుడు భక్తుడు, తత్వజ్ఞుడు, జితేంద్రి

యుడు అయిన భీష్ముడు "ఓ రాజా! నేను వేదవ్యాస మహర్షి నుంచి ఒక రహస్యమైన విషయం విన్నాను. ఇది అత్యంత పుణ్యప్రదము, పాపహరము అయినట్టిది. దుష్టశిక్షణ శిష్టరక్షణ కొఱకై పరమాత్ముడు దేవకికి జన్మించిన మాట నిజమే. కాని కంసుని భయం వల్ల అర్ధరాత్రి సమయంలో వసుదేవుడు ఆ శిశువును తీసికొని గోకులం వెళ్ళి అక్కడ యశోద పక్కనే పడుకొనబెట్టాడు. ఆమెకు జన్మించిన మాయాబాలికను తీసికొని మధురాపురానికి తిరిగివచ్చాడు. అప్పటి నుంచి శ్రీకృష్ణుడు గోకులంలోనే పెరిగి పెద్దవాడవుతున్నాడు. ఈ విషయం వేరెవరికీ తెలియదు. గోవిందుడు పదకొండు సంవత్సరాల వయస్సు వరకు ఆ విధంగా గోప్యంగా ఉంటాడు. తరువాత మధురానగరం వచ్చి కంసుని హతమార్చిన తరువాత కృష్ణుని విషయం అందరకూ తెలుస్తుంది. అయోధ్యాపురవాసినులైన నారీమణులు శ్రీరామచంద్రుని వరప్రభావం వల్ల ఇప్పుడు గోపకాంతలుగా నీకు జన్మించారు. వారినందరినీ నీవు శ్రీకృష్ణపరమాత్మునకు సమర్పించు" అని చెప్పి భీష్ముడు నిష్క్రమించాడు.

అనంతరం విమలుడు నందనందనుణ్ణి ఆహ్వానించి తన కుమార్తెలను పరమాత్మునకు సమర్పించాడు. బృందావనంలో రాసక్రీడ సమయంలో ఆ ఒక్కొక్క గోపికదగ్గర ఒక్కొక్క కృష్ణుడుగా తాను బహురూపధారణ చేసి గోవిందుడు వారిని పరవశింపజేశాడు.

### యజ్ఞసీతా స్వరూప గోపికలు :

శ్రీరామచంద్రుడు సీతాదేవిని అరణ్యాలకు పంపిన తరువాత యజ్ఞాలు చేయవలసివచ్చింది. అప్పుడు సీత స్థానంలో బంగారు సీత విగ్రహాలను చేయించి యజ్ఞాలను నిర్వహించారు. తరువాత ఆ యజ్ఞసీత విగ్రహములు ప్రాణవంతములై తమ్ము స్వీకరించమని శ్రీరామచంద్రుని వేడుకున్నాయి. అప్పుడు రాముడు మీ కోరికను ద్వాపరయుగంలో నెరవేరుస్తానని మాట ఇచ్చాడు.

దక్షిణ ప్రాంతంలో ఉశీనర దేశం ఉంది. ఒకసారి అక్కడ పది సంవత్సరముల పాటు వర్షం పడలేదు. అక్కడ గోధనం సమృద్ధిగా ఉన్న గోపకులు ఈ అనావృష్టి పరిస్థితికి భయపడి తమ గోవులతో కుటుంబాలతో సహా వ్రజమండలమునకు వచ్చారు. నందరాజు సహాయ సహకారాలవల్ల వారు పవిత్ర బృందావనంలో

యమునాతీరంలో నివసింపసాగారు. శ్రీరామచంద్రుని వరప్రభావంవల్ల యజ్ఞసీత లందరూ ఈ గోపకుల కుమార్తెలుగా జన్మించారు. వీరు నవయౌవన విలాసములతో దివ్య సౌందర్యములతో విరాజిల్లసాగారు. ఒకసారి వారు జగన్మోహనుడైన శ్రీకృష్ణపరమాత్మని దర్శించి మోహితలయ్యారు. అప్పుడు వారు రాధాదేవి దగ్గరకు వెళ్ళి శ్రీకృష్ణపరమాత్మణ్ణి ప్రసన్నుని చేసికొనటానికి ఉపాయం తెలుపవలసినదిగా అభ్యర్థించారు. అప్పుడు వృషభానునందినియైన రాధ వారిని మార్గశిరమాసంలో కృష్ణపక్షంలో ఏకాదశీ వ్రతం ఆచరిస్తే గోవిందుడు ప్రసన్నుడౌతాడని ఆ వ్రతవిధానం వివరించింది.

శ్రీకృష్ణ సందర్శన లాలాసలైన యజ్ఞసీతా స్వరూప గోపికలు రాధాదేవి చెప్పిన ప్రకారంగా ఏకాదశీ వ్రత మాచరించారు. శ్రీకృష్ణభగవానుడు వారికి ప్రసన్నుడై ఆ మార్గశిర మాసంలో పున్నమినాటి రాత్రి బృందావనంలో వారితో రాసక్రీడ లాడి వారికి పరమానందాన్ని అనుగ్రహించాడు.

**పుళింద గోపికలు :**

శ్రీరామచంద్రుడు దండకారణ్యంలో సంచరించే సమయంలో ఆ అరణ్యంలోని పుళింద కాంతలు మనోహరమైన శ్రీరాముని సౌందర్యం చూచి మోహితలయ్యారు. పుళిందులంటే అడవిలో నివసించే చెంచుజాతివారు. ఆ కాంతలు ద్వాపరయుగంలో గోపికలుగా జన్మించి తమ మనస్సులలోని తీవ్రమైన కాంక్షవల్ల శ్రీకృష్ణపరమాత్మని సాన్నిహిత్యాన్ని పొందగలిగారు.

వింధ్యపర్వత ప్రాంతాలలో కొందరు పుళిందులు నివసిస్తున్నారు. వారు దోపిడీలతో దొంగతనాలతో జీవనం సాగించేవారు. ఒక పర్యాయం వింధ్యప్రాంతాన్ని పరిపాలించే రాజు వారిపట్ల ఆగ్రహించి రెండు అక్షౌహిణుల సైన్యంతో వచ్చి పుళిందు లందరినీ ముట్టడించి వారితో ఘోరయుద్ధం చేశాడు. వారందరూ చివరకు ఆ రాజ సైన్యం ధాటికి ఓర్వలేక యాదవరాజైన కంసునకు తమ్ము రక్షించుమని వర్తమానం చేశారు. కంసుడు వెంటనే ప్రలంబాసురుణ్ణి అక్కడకు పంపాడు. ఆ ప్రలంబుడు రెండు ఆమడల ఎత్తు, కారునలుపు శరీరము:, సర్పముల మాలలు, చేతిలో గదతో భీకరంగా ఉన్నాడు. చేతికి అందిన చెట్లను పెకలించి శత్రువులపై విసురుతూ వచ్చే ప్రలంబాసురుణ్ణి చూచి ఆరాజు సైన్యసమేతంగా వెనుదిరిగి పోయాడు.

ప్రలంబాసురుడు ఆ పుళిందుల నందరినీ మధురలోని కంసుని దగ్గరకు తీసికొనివచ్చాడు. వారందరూ కంసుని సేవకులయ్యారు. వారంతా తమ కుటుంబాలతో కామగిరి అనే కొండపై నివాసమేర్పరచుకున్నారు. పూర్వం దండకారణ్యంలో శ్రీరాముని వరం పొందిన పుళింద కాంతలు వీరి గృహాలలో పుళింద కాంతలుగా జన్మించారు. చక్కని రూప సౌందర్యాలతో లక్ష్మీకళ ఉట్టిపడుతున్న ఆ కాంతలు పూర్వజన్మ లోని తమ ఆర్తి వల్ల శ్రీకృష్ణపరమాత్మణ్ణి దర్శించి పేమ విహ్వాలలయ్యారు. వారు శ్రీకృష్ణుని చరణరజమును శిరస్సుపై ధరించి రాత్రింబవళ్ళు ఆ పరమాత్ముని ధ్యాసతోనే ఉండేవారు. వారి భక్తితత్పరతకు భగవానుడు సంతసించి ఆ పుళింద గోపికలతో రాసోత్సవము గావించి వారికి పరిపూర్ణమైన ఆనందమును ప్రసాదించాడు.

## రమాసఖ్యాది గోపికలు :

శ్రీమన్నారాయణుని వరప్రదానం వల్ల వైకుంఠవాసినియైన రమాదేవి సఖులు, సముద్రములో నివసించినప్పటి రమాదేవి చెలికత్తెలు, అజితపద వాసినులైన దేవతలు, ఊర్ధ్వ వైకుంఠ వాసినులైన దేవతలు, లోకాచల వాసినిగా నున్నప్పటి లక్ష్మీదేవి సహచారిణులు ద్వాపరయుగాంతంలో గోకులంలోని వృషభానుల కుమార్తెలుగా జన్మించారు. నీతివిదుడు, మార్గదుడు, శుక్లుడు, పతంగుడు, దివ్యవాహనుడు, గోపేష్టుడు అనే ఆరుగురు వృషభానుల కుమార్తెలుగా జన్మించి వారు గోవింద చరణారవింద చింతనతో మాఘమాసవ్రతం చేశారు. వారి భక్తికి శ్రీకృష్ణుడు ప్రసన్నుడయ్యాడు. మాఘమాసంలో శుక్లపక్షంలో పంచమీ తిథినాడు కృష్ణుడు ఒక యోగివేషం ధరించి వారి వద్దకు వచ్చాడు. పులితోలు కట్టుకొని, జటాబంధము కట్టి, శరీరమంతా విభూతిని అలదుకొని వేణువు నూదుతూ జగత్తును మోహింప చేస్తూ వచ్చిన ఆ యోగి పుంగవుని చూచి ఆ గోపిక లందరూ ఆనందాతిశయం పొందారు. ఆతనిని చూచి నందనందనుణ్ణి చూచినంతగా వారు పరవశలయ్యారు.

ఆ గోపికలు స్వామి చెంత చేరి "ఓ యోగీశ్వరా! మీ నామధేయ మేమిటి? మీరెక్కడ నివసిస్తారు? మీ వృత్తాంత మేమిటి?" అని అడిగారు. ఆ సిద్ధయోగి చిరునవ్వుతో "నన్ను స్వయంప్రకాశుడని అంటారు. నేను మానససరోవరం దగ్గర ఉంటాను. నేను ఆహారపానీయాలు స్వీకరింపకుండా ఉండగలను. నాకు దివ్యదృష్టి ఉంది. అందరి భూత భవిష్యత్ వర్తమాన కాలములు నాకు తెలుసు" అని

పలికాడు. అప్పుడా గోపికలు "మహాత్మా! మీరు త్రికాలములు తెలిసినవారైతే ఇప్పుడు మా మనస్సులలో ఏమున్నదో చెప్పగలరా?" అని అడిగారు. అప్పుడా యోగీశ్వరుడు "వ్రజాంగనలారా! ఆ రహస్యమైన విషయం మీ చెవిలో చెప్పటం సముచితం. మీరు చెప్పమంటే అందరికీ వినిపించే విధంగా పైకి చెప్తాను" అన్నాడు. అప్పుడు గోపికలు "మీరు యోగీశ్వరులే సందేహంలేదు. తమరు వశీకరణ మంత్రంతో మా మనస్సులలో ఉన్న వ్యక్తిని ఇక్కడకు రప్పించగలిగితే మీరు మంత్రజ్ఞులలో కూడా శ్రేష్ఠులని అంగీకరిస్తాము" అన్నారు. ఆ మాటలకు ఆ కపటయోగి "వ్రజకాంతలారా! మీరు దుర్లభమైన కోరికను కోరారు. అయినా నేను మాటతప్పక మీ కోరిక నెరవేరుస్తాను. ఒక్కసారి మీరంతా కళ్ళు మూసుకొనండి" అని వచించాడు. గోపకాంతలంతా కళ్ళు మూసుకున్నారు. వెంటనే పరమాత్ముడు యోగి రూపం విడిచిపెట్టి నందనందనుడుగా మారిపోయాడు. గోపికలు కళ్ళుతెరచి ఎదుట మందహాసవదనంతో అందాలు చిందిస్తున్న చిన్నారి గోవిందుని చూచి అప్రతిభులయ్యారు. మాఘమాసంలో మహా రసోత్సవంలో కృష్ణపరమాత్ముడు ఆ వ్రజకాంత లందరికీ మహానందాన్ని ప్రసాదించాడు.

## దివ్యాదివ్య త్రిగుణావృత్తి గోపికలు :

గోకులంలో తొమ్మిదిమంది ఉపనందులున్నారు. వీతిహోత్రుడు, అగ్నిభుక్కు, సాంబుడు, శ్రీకరుడు, గోపతి, శ్రుతుడు, వ్రజేశుడు, పావనుడు, శాంతుడు అని వారి పేర్లు. వారి పవిత్ర గృహాలలో దివ్యులు, అదివ్యులు, త్రిగుణావృత్తి గోపికలు జన్మించారు. వారు పూర్వకృతపుణ్యాఫలంగా భూతలంపై గోపికలుగా అవతరించి రాధాదేవి సఖురాండ్రుగా వర్తింపసాగారు.

ఒకనాడు రాధాదేవి ప్రణయకలహంతో ఉండగా శ్రీకృష్ణుడు హోలికామహోత్సవం ఏర్పాటుగావించాడు. అప్పుడీ గోపికలందరూ వెళ్ళి బ్రతిమాలాడి రాధాదేవిని వసంతోత్సవానికి ఆహ్వానించారు. శ్రీకృష్ణపరమాత్ముడు అరుణరాగ రంజితమైన నేత్రములతో, పీతాంబరధారియై, శ్యామసుందర విగ్రహుడై విరాజిల్లసాగాడు. రాధాదేవితో కలిసి గోపకాంతలందరూ చందన అగరు కస్తూరి పన్నీరులను నింపిన పాత్రలను పట్టుకొని వరుసలుగా విచ్చేశారు. గులాములతో వారి కరకమలములు రాగ రంజితములయ్యాయి. వాసంతీవర్ణమైన పసుపు పచ్చని వస్త్రాలు ధరించి, వసంత

గీతాల నాలపిస్తూ గోపికలు నూపుర ఝంకార ధ్వనులతో నృత్యంచేస్తూ మనోహరంగా భాసించారు. వ్రజాంగనల మధ్య శ్రీకృష్ణపరమాత్ముడు మెరుపుతీగల మధ్య నీలిమేఘంవలె శోభించాడు. పన్నీరు మంచిగంధం గులాములు ఒకరిపై ఒకరు చల్లుకొంటూ గోవిందునితో సరస సల్లాపము లాడుతూ గోపభామలు నృత్యకేళి సలుపుతున్నారు. వారి రంగురంగుల వస్త్రాలు కుంకుమాంకితములయ్యాయి. నిరంతర ధ్యాస వల్ల ఆ గోపికలకు ఆ స్వామి ఒక్కొక్కరికి ఒక్కొక్క కృష్ణుడుగా సాక్షాత్కరించాడు. ఆ హోలికా మహోత్సవంలో రాధాదేవి శ్రీకృష్ణుని కనులకు కాటుక నలంకరించింది. కృష్ణపరమాత్ము డామెకు తన ఉత్తరీయాన్ని కానుకగా సమర్పించాడు. ఆవిధంగా వసంతోత్సవం వేడుకగా జరిగింది.

## దేవకన్యా స్వరూప గోపికలు :

పూర్వం మాళవ దేశంలో దివస్పతి అను పేరుగల ఒక గోపరాజు నివసించేవాడు. ఆయనకు చాలమంది భార్యలున్నారు. ఆయన గొప్ప ధనవంతుడు, నీతిమంతుడు. ఆయన ఒకసారి తీర్థయాత్రలు చేస్తూ మధురామండలం రావటం తటస్థించింది. అక్కడ వ్రజాధీశ్వరుడైన నందరాజును గురించి విని గోకులం వెళ్ళి ఆయనను దర్శించి, ఆ బృందావన శోభను చూచి మైమరచిపోయి నందరాజు అనుజ్ఞను తీసికొని దివస్పతి కుటుంబ సమేతంగా అక్కడే ఉండిపోయాడు. అక్కడే గోవుల కోసం గోష్ఠములు నిర్మించుకున్నాడు. దివస్పతి పూర్వ పుణ్యావిశేషంవల్ల దేవతల మహర్షి శుభాశీస్సులవల్ల దేవతా కాంతలు దివస్పతికి కుమార్తెలుగా జన్మించారు. వారు దివ్య సౌందర్యంతో అగ్నులవలె ప్రకాశిస్తూ ఉండేవారు. ఆ కాంతామణులు ఒక పర్యాయం శ్రీకృష్ణపరమాత్మ్ముణ్ణి సందర్శించి పరమానందానుభూతిని పొందారు. ఆ భగవంతుని ప్రాప్తి కోసమై వారు మాఘవ్రతం ఆరంభించారు. ప్రతిదినము ప్రాత:కాలమే యమునకు వెళ్ళి స్నానంచేసి ప్రేమ విహ్వాలలై కృష్ణలీలలను గానం చేయసాగారు. కృష్ణభగవానుడు వారిపట్ల ప్రసన్నుడై "ఓ గోపకాంతలారా! మీకు ఏమికావాలో కోరుకొనండి" అన్నాడు. ఆ గోపికలు చేతులు జోడించి ప్రణామంచేసి "ఓ ప్రభూ! యోగీశ్వరులకు కూడా నీ దర్శనము దుర్లభం కదా. సమస్తమునకు ఈశ్వరుడవు నీవు. ఓ వంశీధరా! నీవు సర్వకాల సర్వావస్థలయందు మా కనులఎదుట కనబడేలా వరమనుగ్రహించు" అని వేడుకున్నారు. భగవానుడు

సంతసించి తథాస్తు అని పలికాడు. తన దర్శనం చేత వారిని ముక్తులను గావించాడు. వారు ఎప్పుడు స్మరిస్తే అప్పుడు కృష్ణపరమాత్ముడు వారి హృదయంలో సాక్షాత్కరింపసాగాడు. భగవంతుడు కేవలం భక్తి చేతనే, ప్రేమచేతనే వశమౌతాడని ఈ గోపికల వృత్తాంతం నిరూపిస్తుంది.

**జాలంధర కన్యాగోపికలు :**

శ్రీ మహావిష్ణువు జలంధరుని అంతఃపురమునకు వెళ్ళినప్పుడు అక్కడి కాంతామణులు ఆ స్వామి అద్భుతమైన సౌందర్యమును చూచి మోహితలయ్యారు. అప్పుడు మహావిష్ణువు వారిని చూచి "కృష్ణావతార సమయంలో మీరు నా సాన్నిధ్యం పొందుతారు'' అని వరము నొసగాడు. వారే జాలంధర కన్యాగోపికలు.

సప్త నదీ తీరంలో రంగమనే పట్టణమున్నది. ఆ పట్టణాధీశ్వరుడు రంగోజీ. ఆ గోపనాయకుడు ఉత్తముడు. అతడు హస్తినాపుర ప్రభువగు ధృతరాష్ట్రునకు సామంతునిగా ఉంటూ ప్రతి సంవత్సరము కప్పంకడుతూ ఉండేవాడు. ఒక సంవత్సరం రంగోజీ అనుకున్న సమయానికి కప్పం కట్టలేదు. అప్పుడు ధృతరాష్ట్రుడు పదివేలమంది వీరుల్ని పంపించి రంగోజీని బంధించి హస్తినాపురమునకు తెప్పించాడు. ఆతనిని శృంఖలాబద్ధుణ్ణి చేసి కారాగారంలో ఉంచాడు. అయినా ఆతడు ధృతరాష్ట్రునకు కప్పం కట్టటానికి సమ్మతించలేదు. ఒకనాటి రాత్రి రంగోజీ భయంకరమైన చెరసాలనుంచి పారిపోయి తన రంగ నగరానికి చేరుకున్నాడు. వెంటనే ధృతరాష్ట్రుడు సేనావాహినిని పంపాడు. ఆ సేనకు రంగోజీసేనకు భీషణ సంగ్రామం చెలరేగింది. అందులో గెలుపు సంశయంకాగా రంగోజీ కంసమహారాజుకు వర్తమానం పంపించాడు.

వెంటనే కంసుడు వింధ్య పర్వతంవంటి భయంకరమైన ఆకారం గలిగిన తన కువలయాపీడమత్తేభం పై బయలుదేరాడు. వెంట చాణూర ముష్టికులనే మల్లులు, కేశి, వ్యోమ, వృషాసురులు బయలుదేరారు. యుద్ధరంగంలో వారి విజృంభణకు భయపడి కౌరవసేన పలాయనం చిత్తగించింది. కంసుడు రంగోజీని తీసికొనివచ్చి వ్రజమండల సరిహద్దులోనున్న తన బర్హిషదమనే నగరమును ఆతనికిచ్చాడు. రంగోజీ కుటుంబ సమేతంగా అక్కడ సుఖనివాసం చేయసాగాడు.

ఆ రోజులలోనే పూర్వం శ్రీమహావిష్ణువుచేత వరం పొందిన జాలంధర కన్యలు రంగోజీ కుమార్తెలుగా జన్మించారు. వారు యుక్తవయస్కలై గోపకులను వివాహమాడారు. వారు కృష్ణపరమాత్మను దర్శించి, నిరంతరం ఆ స్వామిని స్మరిస్తూ భక్తితత్పరులై కాలం గడిపేవారు. ఆ గోపికలు చైత్రమాసంలో భగవానునితో రాసోత్సవంలో పాల్గొని పరమ ప్రశాంతిని అనుభవించారు.

## సముద్రకన్యకాది గోపికలు :

గోకులంలో శోణపురంలో శ్రీమంతుడైన నందుడనే గోపకుడు నివసిస్తున్నాడు. నీతిమంతుడై ధీమంతుడై, బలవంతుడై నందగోపకుడు అష్టైశ్వర్యాలతో సుఖజీవనం సాగిస్తున్నాడు. పూర్వం శ్రీమహావిష్ణువు మత్స్యావతారం ధరించినప్పుడు సముద్ర కన్యలు పరమాత్మను చూచి విరహార్తిని పొందారు. అప్పుడు మహావిష్ణువు వారితో "కృష్ణావతారంలో మీరు నా సాన్నిహిత్యం పొందగలరు" అని వరం ప్రసాదించాడు. ఆ సముద్రకన్యా గోపికలు నందరాజు కుమార్తెలుగా జన్మించారు.

పృథ్వి నుండి జనించిన ఓషధులు పరమాత్మ సాన్నిధ్యం కోసం పరితపించాయి. భగవానుడు వాటి ఆర్తికి ప్రసన్నుడయ్యాడు. ఆ ఓషధీలతా గోపికలు నంద గోపకుని కుమర్తెలుగా ఆవిర్భవించారు. హిమగిరి గుహలలో తపస్సు చేసుకుంటున్న నరనారాయణు లకు విఘ్నం కలిగించటానికి మహేంద్రుడు అప్సరోగణమును పంపాడు. వారు ఆ స్వామి సౌందర్యమునకు విశేషంగా ఆకర్షింపబడ్డారు. నారాయణుడు వారికి వరము నొసగాడు. ఆ అప్సర కన్యా గోపికలు నందవ్రజంలో ఆవిర్భవించారు.

పరమాత్మ వామనావతారం ధరించినప్పుడు సుతలలోకంలోని స్త్రీలు ఆయనను చూచి మోహం పొందారు. వామనుని వరప్రభావం వల్ల ఆ సుతలలోక వాసినీ కాంతలు గోకులంలో గోపికలుగా ఉద్భవించారు. అనేక జన్మలలోని ఆర్తి ఫలితంగా ద్వాపర యుగాంతంలో గోపికలుగా జన్మించిన వీరందరూ పరమాత్మను సేవించటానికి వచ్చినప్పుడు దుర్వాసుడు వారికి యమునా పంచాంగమనే మహామంత్రాన్ని ఉపదేశించాడు. ఆ గోపికలందరూ నందనందనునకు ప్రియతమమైన యమునను ఆరాధించి కృష్ణపరమాత్మని అనుగ్రహం పొందారు.

## ప్రలంబాసురుని వృత్తాంతం :

ఒక రోజున బలరామ కృష్ణులు గోపబాలకులతో కలసి గోవులను మేపుకొంటూ

యమునా తీరంలోని భాండీర వనం చేరుకున్నారు. అక్కడ వారంతా వినోదంగా ఒకరిని ఒకరు మోస్తూ ఆడే ఆటలను ఆడసాగారు. అదేసమయంలో కంస ప్రేరితుడైన ప్రలంబుడనే రాక్షసుడు గోపబాలుని రూపం ధరించి వారిలో కలిసి పోయాడు. ఈ విషయం ఒక్క కృష్ణుడు మాత్రమే గ్రహించాడు. ఆటలలో గెలిచిన వారిని ఓడినవారు మోస్తూ నడవాలి. ఆ సమయంలో బలరాముడు గెలిచాడు. బలరాముణ్ణి మోయటానికి ఎవరూ ముందుకు రాలేదు. అదే అదనుగా భావించి ప్రలంబుడు వచ్చి బలరాముణ్ణి తన వీపుపై ఎక్కించుకొని యమునాతీరం వైపు వెళ్ళసాగాడు. గమ్యస్థానం దగ్గర దింపకుండగా ఆతడు వేగంగా మధురవైపు వెళుతున్నాడు. భయానకమైన రూపం ధరించి తనను తీసికొని వెళుతున్న ఆ రాక్షసుని చూచి బలరామునికి తీవ్రమైన క్రోధం కలిగింది. వెంటనే ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతంపై కొట్టినట్లుగా బలరాముడు ముష్టిఘాతంతో ప్రలంబా సురుని కొట్టాడు. ఆ దెబ్బకు వాడు విగతజీవుడయ్యాడు. ఆతని శరీరంనుంచి జ్యోతి వెలువడివచ్చి బలరామునిలో లీనమయింది. దేవతలు బలరామునిపై పూలవాన కురిపించారు.

## ప్రలంబుని పూర్వజన్మ :

యక్షులకు అధిపతియైన కుబేరునకు చైత్రరథమనే పూలతోట ఉంది. ఆ పూలు పరమేశ్వర పూజ కోసమై ఉపయోగింపబడుతుంటాయి. అటువంటిది ఆ వనమునకు ఎంత కాపలా ఉంచినా ఎవరో ఆ పూలను దొంగిలిస్తూనే ఉన్నారు. అందుకు కుబేరుడు కోపించి "ఈ వనంలో పూలను అపహరించినవారు యక్షులైనా, దేవతలైనా సరే వెంటనే రాక్షసులుగా మారిపోతారు" అని శపించాడు. ఆ సంగతి తెలియక ఒకనాడు హూహూ అనే గంధర్వుని కుమారుడు విజయు డనేవాడు తీర్థయాత్రలు చేసి వస్తూ, వీణ మీటుతూ విష్ణుగానం చేస్తూ ఆ చైత్రవనంలో ప్రవేశించి పూవ్వులను కోశాడు. వెంటనే ఆతడు రాక్షసుడుగా మారిపోయాడు. ఆతడెంతో బాధపడి వెళ్ళి కుబేరుని శరణువేడాడు. కుబేరుడు జాలిపడి "నాయనా! నీవు విష్ణుభక్తుడవు. శాంతచిత్తుడవు అందువల్ల బాధపడవద్దు. ద్వాపరాంతములో యమునాతీరంలో భాండీరవనంలో బలరాముని చేతిలో నీకు ముక్తి కలుగు తుంది." అని పలికాడు. ఆ విజయుడనే గంధర్వుడే ప్రలంబాసురుడుగా జన్మించి బలరాముని చేతిలో పరమగతిని పొందాడు.

**దావాగ్ని భక్షణ :**

ఒకనాడు బలరామునితో సహితంగా గోపబాలకులు క్రీడాసక్తులై ఉన్నారు. గోవుల మందలు ఆహారంకోసం దట్టమైన అరణ్యంలోకి వెళ్ళాయి. వాటిని వెదకి తీసికొని వద్దామని గోపబాలకులు కూడా అరణ్యంలో ప్రవేశించారు. ఇంతలోనే అరణ్యంలో ఘోరమైన దావానలం అంటుకున్నది. గోపబాలురు భయభ్రాంతులై శ్రీకృష్ణుని కోసం ఆర్తితో పిలువసాగారు. రక్షింపుమని కేకలువేయసాగారు. తమ సఖులంతా దావాగ్నిలో చిక్కుబడటం చూచి యోగేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు "భయ పడవద్దు. మీరంతా ఒక్కసారి కళ్ళు మూసుకొనండి" అన్నాడు. గోపాలకులంతా కళ్ళుమూసుకున్నారు. కృష్ణపరమాత్ముడు ఆ అగ్నిని క్షణకాలంలో లోపలకు త్రాగి వేశాడు. గోపాలకులు సంభ్రమాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరి అయ్యారు. గోపాల కులను, గోవులను తీసికొని కృష్ణుడు యమునకు అవ్వలివైపున ఉన్న అశోకమైన భాండీర వనానికి చేరుకున్నాడు.

**మునిపత్నుల కథ :**

అక్కడకు చేరుకోగానే గోపబాలురకు బాగా ఆకలి అయింది. వారంతా కృష్ణుని చుట్టూ చేరి తమకు బాగా ఆకలిగా ఉన్నదని, ఆహారం కావాలని అన్నారు. అప్పుడు కృష్ణుడు చిరునవ్వు నవ్వి ఇక్కడ దగ్గరలో కొందరు బ్రాహ్మణులు అంగిరసమనే యజ్ఞం చేస్తున్నారు. అక్కడ వెళ్ళి అడగండి ఆహారం పెడతారు అని పలికాడు. గోపాలకులు యజ్ఞశాలకు వెళ్ళి "ఓ బ్రాహ్మణులారా! నందనందనుడు, బలరాముడు, గోపాలురతో సహా గోవులను మేపుకుంటూ ఈ వనమునకు వచ్చారు. బలరామ కృష్ణులకు, గోపాలకులకు బాగా ఆకలిగా ఉంది. అందుకని ఆహారం కోసం వచ్చాము" అన్నారు. ఆ వేదపండితులు ఈ గోపాలకుల మాటలు విని మాట్లాడకుండా ఊరుకున్నారు. గోపాలకులు తిరిగి శ్రీకృష్ణుని సన్నిధికి వచ్చి జరిగిన విషయమంతా వివరించారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారిని విప్రపత్నుల దగ్గరకు వెళ్ళి అడుగమని పంపాడు. వారు యజ్ఞశాలలో వంటలు చేస్తున్న విప్రపత్నుల దగ్గరకు వెళ్ళి "విప్రపత్నులారా! వ్రజరాజనందనుడైన కృష్ణుడు బలరామునితో గోపాలకులతో కలిసి గోవులను మేపుకుంటూ ఈ వనానికి వచ్చాడు. వారందరికీ బాగా ఆకలిగా ఉంది. వారికి ఆహారం కావాలి" అని అడిగారు.

శ్రీకృష్ణుడు ఆ వనమునకు విచ్చేశాడని విని విప్రపత్నులందరూ ఆ పరమాత్మని సందర్శనముకై తహతహలాడారు. వెంటనే వారు రకరకముల పాత్రలలో భోజన పదార్థములను పెట్టుకొని గోవిందుని సన్నిధికి చేరుకున్నారు. వారు యమునాతీరంలో ఆ సుందరవనంలో స్మితస్మిత సుందరుడైన కృష్ణపరమాత్మణ్ణి కన్నులారా దర్శించి పరమానందము ననుభవించారు. యోగిజనులకు పరబ్రహ్మ సందర్శనము వల్ల కలిగే ఆనందమే వీరికీ కలిగింది. ఆ ఆనందం మాటలతో వర్ణింప సాధ్యంకానిది.

శ్రీకృష్ణపరమాత్ముడు గోపాలకులతో కలిసి విప్రసతులు భక్తితో తీసికొని వచ్చిన మధురాన్నమును స్వీకరించాడు. అనంతరం కృష్ణుడు వారిని చూచి "విప్రపత్నులారా! నన్ను చూడటం కోసం ఇంతదూరం వచ్చారు. మీ జీవితములు ధన్యమయ్యాయి. ఇక మీరు శీఘ్రమే తిరిగి వెళ్ళండి. మీ పతులు మీ కోసం చూస్తుంటారు. మీరు వారితో కలిసి యజ్ఞకార్యములను పరిసమాప్తి చెయ్యండి" అని వారికి శుభాశీస్సుల ననుగ్రహించి పంపించాడు. విప్రపత్నులు పరమాత్మనకు మరల మరల ప్రణామం చేసి యజ్ఞశాలకు చేరుకున్నారు. అప్పుడు ఆ విప్రులు తమలో తాము ఎంతో బాధపడ్డారు. సాక్షాత్తు యజ్ఞేశ్వరుడే వచ్చి అడిగితే ఆహారము నొసగలేక పోయామే, ఆ కంసుని వల్ల భయపడి శ్రీకృష్ణుణ్ణి సందర్శించుకొనలేక పోయామే, మన సతులు ఎంత వివేకంతో ప్రవర్తించారు! అనుకున్నారు వారు.

## వైకుంఠ దర్శనం :

ఒకానొక రోజున నందమహారాజు ఏకాదశీవ్రతం పూర్తిచేసి మరునాడు ద్వాదశి ఉన్నదనగా ఆనాటి అర్ధరాత్రి సమయంలో గోపాలకులతో కలిసి యమునానదిలో స్నానం చేయటానికి దిగాడు. అప్పుడు వరుణదేవుని భటుడొకడు వచ్చి ఆయనను పట్టుకొని వరుణలోకమునకు తీసికొని వెళ్ళాడు. నందరాజు నీటిలో మునిగిపోయినందున గోపాలకులందరూ హాహాకారాలు చేయసాగారు. నందనందనుడు వారికి ధైర్యము చెప్పి ఊరడించి వెంటనే నీటిలోనికి దూకి వరుణ నగరం వెళ్ళి వరుణుని కోటను ధ్వంసం గావించాడు. కోటి సూర్య ప్రభా భాసమానుడగు కృష్ణుడు క్రుద్ధుడై ఉండటం చూచి వరుణుడు పరమాత్మ పాదపద్మాలకు నమస్కరించాడు. తన తప్పును క్షమించుమని వివిధ విధముల ప్రార్థించి శరణు వేడుకున్నాడు. శ్రీకృష్ణుడు వరుణుని పట్ల ప్రసన్నుడై విడిచిపెట్టాడు. వరుణుడు నందుని తీసికొని వచ్చి పరమాత్మకు సమర్పించాడు. కృష్ణుడు నందునితో కలిసి యమునలో నుండి బయటకు రాగా గోపాలకులందరూ ఆశ్చర్యానందాలను పొందారు. వరుణుడు

కృష్ణుణ్ణి ఏవిధంగా ఆదరించిందీ నందుడు చెప్పగా విని గోపాలకులు కృష్ణునితో "ఓ ప్రభూ! నీవు లోకపాలురచేత పూజింపబడే భగవంతుడవు. నీవు సాక్షాత్తు వైకుంఠవాసివి. నీ వైకుంఠమును మాకు కూడా దయతో చూపించు" అని ప్రార్థించారు.

అప్పుడు శ్రీకృష్ణుడు వారి అభ్యర్థనకు సంతసించి వారి నందరినీ తీసికొని వెళ్ళి వైకుంఠధామంలో ప్రవేశించాడు. అక్కడ అద్భుత కాంతులతో విరాజిల్లే జ్యోతిర్మండలం మధ్యలో విలసిల్లుతున్న తన స్వరూపాన్ని వారికి చూపించాడు. ఆ స్వామి సహస్ర భుజములతో, కిరీట, కటకాది భూషణములతో శంఖ చక్ర గద పద్మ వనమాలలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. కోటిసూర్యప్రభలతో తేజరిల్లే ఆ స్వామి బ్రహ్మాదిదేవతలు తనను సేవిస్తూఉండగా ఆదిశేషునిపై పవ్వళించిఉన్నాడు. ఆసమయంలో ఆ పరమాత్మ చెంతనున్న గదాధరులు వచ్చి ఈ గోపాలురను పరమాత్మకు నమస్కరింపచేసి నెమ్మదిగా దూరంగా తీసికొనివెళ్ళారు. ఆ గదాధరులు ఈ గోపాలకులను చూచి ఆశ్చర్యపడుతూ "వనచరులారా! నిశ్శబ్దంగా ఉండండి. ఇక్కడ ఎటువంటి మాటలు మాట్లాడకూడదు. ఎప్పుడూ మీరు శ్రీహరి కొలువుకూటానికి రాలేదా? ఈయన సమస్తమునకు ప్రభువైన దేవాదిదేవుడు, సాక్షాత్తు భగవంతుడు! ఈయనను ఎప్పుడూ వేదములు కీర్తిస్తుంటాయి!" అని తెలిపారు. ఆ మాటలను విని గోపాలకులు ఆశ్చర్యంతో తమలోతాము ఇలా అనుకున్నారు "ఆ ఉన్నత సింహాసనంపైన కూర్చున్నది మన శ్రీకృష్ణుడే. ఇప్పుడు మనతో పాటేగదా ఉన్నది. మరి ఇప్పుడు మనం ఇక్కడ క్రింద ఉన్నాము. కృష్ణుడు అక్కడ ఉన్నత స్థానంపై ఉన్నాడు. మనతో ఒక్కమాటైనా మాట్లాడటం లేదు. మనకు ఇక్కడ కంటే గోకులమే ఎంతో ఆనందదాయకంగా ఉంది. ఎందుకంటే వ్రజంలో అయితే కృష్ణుడు మన సోదరుడుగా ఉంటాడు. మనమంతాకలిసిమెలిసి ఉంటాము" ఈ విధంగా మాట్లాడుకుంటూ వస్తున్న గోపాలురవెనుకనే శ్రీకృష్ణుడు గోకులానికి తిరిగి వచ్చాడు.

## సుదర్శనోపాఖ్యానము :

ఒక పర్యాయం అంబికా వనంలోని భద్రకాళి ఉత్సవాలకు వృషభానులు, ఉపనందాదులు బంధుమిత్రులతో బండ్లు కట్టుకొని బయలుదేరారు. అంబికావనంలో భద్రకాళి, పశుపతులను విధిపూర్వకంగా పూజించి బ్రాహ్మణులకు దానధర్మములు చేశారు. ఆరోజు రాత్రి భోజనములయిన తరువాత అక్కడనే నదీతీరంలో పడుకొని

నిద్రపోయారు. అర్ధరాత్రివేళ ఒక సర్పము వచ్చి నందుని పాదాలకు చుట్టుకున్నది. నందుడు భయభ్రాంతుడై "కృష్ణా! కృష్ణా!" అని పిలువసాగాడు. గోపాలబాలకులు మండుతున్న కర్రలు తెచ్చి ఆపామును కొట్టారు, అయినా ఆపాము నందుణ్ణి విడిచి పెట్టలేదు. అప్పుడు కృష్ణపరమాత్ముడు అక్కడకు వచ్చి తన పాదంతో దాన్ని త్రొక్కిపట్టాడు. భగవంతుని పాద స్పర్శ సోకేసరికి దానికి సర్పరూపం పోయి విద్యాధర రూపం వచ్చింది. ఆ విద్యాధరుడు శ్రీకృష్ణునకు నమస్కరించి "ఓ ప్రభూ! పరమాత్మా! నన్ను సుదర్శనుడని అంటారు. నేను బలగర్వంతో మదించి అష్టావక్ర మహర్షి రూపాన్ని చూచి పరిహసించాను. అప్పుడా మహర్షి నన్ను చూచి "ఓరీ దుర్మతీ! నీవు సర్పం అగుదువుగాక!" అని శపించాడు. ఓ మాధవా! ఆ శాపప్రభావం వల్ల సర్పంగాఉన్న నేను ఈనాడు నీ దయవల్ల ముక్తుడనయ్యాను. నీ చరణ కమల పరాగ స్పర్శ వల్ల నాకు మరల నా దివ్యపదం సంప్రాప్తించింది. నీవు భూభారం తొలగించటానికి అవతరించిన పరమాత్ముడవు. నీకు అభివందనము స్వామీ!" అని పలికి విష్ణులోకానికి వెళ్ళాడు. ఈ దృశ్యం చూచిన నందాది గోపకులు ఎంతో ఆశ్చర్యపడ్డారు. కృష్ణుడు సాక్షాత్తు భగవంతుడేనని గ్రహించారు. వారంతా శ్రీకృష్ణునితో కలిసి అంబికావనం నుంచి వ్రజమండలానికి బయలుదేరారు.

## వ్యోమాసురుడు :

ఒకరోజున గోవర్ధన పర్వత సమీపంలో బలరామకృష్ణులు గోపాలకులతో కలిసి దొంగాట ఆడుతున్నారు. దొంగ అయిన వ్యక్తి మిగిలిన వ్యక్తులను పట్టుకోనాలి. అక్కడకు కంసునిచేత ప్రేరింపబడిన వ్యోమాసురుడు వచ్చాడు. ఆతడు బలవంతుడైన మయాసురుని కుమారుడు. ఆతడు ఆటలాడే బాలకులతో కలిసిపోయి ఒక్కొక్క బాలుణ్ణి రహస్యంగా తీసికొని వెళ్ళి ఒక పర్వత గుహలో ఉంచి ఒక పెద్ద శిలను ఆ ద్వారానికి అడ్డుగా పెట్టి వస్తున్నాడు. అసలైన దొంగ ఇప్పుడు దొరికాడు గదా అని గ్రహించి శ్రీకృష్ణుడు ఆతనిని తన రెండు బాహుదండాలతో గట్టిగా పట్టుకొని విసిరి నేలకేసి కొట్టగానే వ్యోమాసురుడు విగత జీవుడయ్యాడు. ఆతని శరీరం నుంచి తేజస్సు బయల్వెడలి ఘనశ్యామునిలో లీనమయింది.

ఆతని పూర్వజన్మ వృత్తాంతమిది - కాశీనగరాన్ని భీమరథుడనే ప్రసిద్ధుడైన రాజు పరిపాలిస్తుండేవాడు. ఆతడు దానగుణశీలుడు, విష్ణుభక్తి పరాయణుడు. ఆరాజు తన రాజ్యాన్ని కుమారున కప్పగించి మలయాచలం మీదకు వెళ్ళి తపస్సు

చేయసాగాడు. ఒకనాడు ఆయన ఆశ్రమానికి పులస్త్య మహర్షి శిష్యసమేతంగా విచ్చేశాడు. ఆ మహర్షిని చూచి కూడా భీమరథుడు తాను కూర్చున్నచోట నుండి లేవలేదు. ఆయనకు నమస్కరింపలేదు. అందుకు పులస్త్యుడు కోపించి "నీవు అసురుడ వగుదువు గాక!" అని శపించాడు. అప్పుడా రాజు మహర్షి పాదాలపైపడి శరణువేడగా ఆయన కరుణించి "ద్వాపరాంతంలో మధురానగర జనపదములలోని పవిత్ర వ్రజమండలంలో కృష్ణపరమాత్ముని చేతిలో నీకు ముక్తి ప్రాప్తిస్తుంది" అని అనుగ్రహంతో పలికాడు. ఆ భీమరథుడే మయాసురుని కుమారుడైన వ్యోమాసురుడుగా జన్మించి కృష్ణుని చేతిలో మోక్షం పొందాడు.

**అరిష్టాసురుడు :**

ఒకనాడు కంసుని చేత ప్రేరితుడైన అరిష్టాసురుడు ఒక వృషభరూపంలో వచ్చి గోపబాలకుల మధ్య విహరించసాగాడు. భీకరంగా రంకెలు వేస్తూ తన కొమ్ములతో పర్వతసానువుల్ని బద్దలు చేస్తూ ఉన్న ఈ వృషభాన్ని చూచి గోపాలురు గోపికలు భయపడి అటుఇటు పరుగులుతీశారు. దైత్యనాశకుడైన కృష్ణపరమాత్ముడు వారిని భయపడవద్దని చెప్పి ఆ వృషభమును కొమ్ములు పట్టి వెనుకకు నెట్టివేశాడు. ఆ వృషభం కోపంతో వచ్చి కృష్ణుణ్ణి రెండు యోజనముల దూరం తీసికొని వెళ్ళింది. కృష్ణుడప్పుడు దాని తోకను పట్టుకొని గిరగిర త్రిప్పి నేలపై విసిరికొట్టాడు. అది కోపంతో కొమ్ములతో నేలను పెళ్ళగించగానే నేలలోపల నుంచి జలధారలు పైకి ఉబికినాయి. కృష్ణుడు ఆ వృషభము కొమ్ములను పట్టి నేలపై కొట్టగానే దాని ప్రాణం పోయినంతపని అయింది. అప్పుడది ఒక బ్రాహ్మణ రూపం ధరించింది. ఆ బ్రాహ్మణుడు నందనందనుని పాద పద్మములపై పడి "ఓ పరమాత్మా! నేను బృహస్పతి శిష్యుడను. వరతంతువనే బ్రహ్మచారిని. నేను విద్యాభ్యాసం నిమిత్తమై బృహస్పతి దగ్గరఉన్నాను. ఒకనాడు నాకు తెలియక కాళ్ళు జాపుకొని ఆయన ఎదుట కూర్చున్నాను. అప్పుడు గురువు గారికి కోపం వచ్చి "ఓరి దుర్బుద్ధీ! నీవు నన్ను అవమానించటం కోసం ఎదురుగా ఎద్దువలె కూర్చున్నావు. నీవు ఎద్దువు అవుతావు" అని శపించారు. పరమాత్మా! ఆ శాపం వల్ల నేను వంగదేశంలో వృషభంగా జన్మించాను. అసురుల సాహచర్యంవల్ల నాలో అసురభావాలు కలిగాయి. ఇప్పుడు నీ అనుగ్రహం వల్ల నాకు శాపవిముక్తి కలిగింది, అసురభావాలు తొలగిపోయాయి." అని పలికి అనేక విధాలుగా స్తుతించి దేదీప్యమానమైన విమానంపై దివ్యలోకాలకు వెళ్ళాడు అని నారదమహర్షి బహుళాశ్వమహారాజుకు వివరించాడు.

# 5. మధురాఖండము

**కంసుని దురాలోచన :**

బహులాశ్వుడు నారదునితో "ఓ మహర్షీ! కృష్ణ భగవానుడు మధురలో ఏయే లీలలు చేశాడు? కృష్ణుడు కంసుణ ఎందుకు చంపాడు? ఎలా చంపాడు? నాకు విశదపరచు"మని అడిగినప్పుడు నారదుడిలా తెలియచెప్పసాగాడు - ఓరాజా! ఒకనాడు సాక్షాత్తు శ్రీహరి ప్రేరణతో నేను భగవంతుని దైత్యవధ కార్యక్రమాన్ని కొనసాగింప చేయటానికై మధురానగరం వెళ్ళాను. అక్కడ కొలువుకూటంలో కంసుడు తానిదివరకు ఇంద్రుని దగ్గరనుండి తెచ్చుకొన్న సింహాసనంపై, శ్వేత ఛత్రం క్రింద కూర్చొని ఉన్నాడు. ఆతడు బలపరాక్రమాలతో, క్రూరత్వంతో నాగరాజు వలె దుస్సహుడై ఉన్నాడు. ఆతడు నన్ను చూచి అతిథి సత్కారాలు చేసి ఆహ్వానించాడు. అప్పుడు నేను కంసుణ్ణి చూచి ఓ మధురా నరేశ్వరా! ఆనాడు నీ చేతులలో నుంచి ఆకాశానికి ఎగిరిపోయిన బాలిక దేవకీతనయకాదు. ఆమె యశోద కుమార్తె, దేవకికి శ్రీకృష్ణుడు జన్మించాడు. రోహిణికి బలరాముడు జన్మించాడు. ఓ దైత్యరాజా! నీ శత్రువులైన బలరామ శ్రీకృష్ణుల్ని వసుదేవుడు తన మిత్రుడైన నందుని దగ్గర భద్రంగా ఉంచి రక్షించుకున్నాడు. పూతన దగ్గర నుంచి అరిష్టాసురుని వరకు నీవుపంపిన రాక్షసులనందర్నీ బలరామకృష్ణులే సంహరించారు. వారిద్దరే నీ పాలి మృత్యువులని అనుకుంటున్నారు అని అన్నాను. నా మాటలు విని కంసుడు కోపంతో ఊగిపోయాడు. ఆతడు శూరనందనుడైన వసుదేవుణ్ణి నిండు సభలోనే సంహరించటం కోసం కత్తిదూశాడు. కాని నేను ఆతనిని వారించాను. అప్పటి నుంచి కంసుడు వసుదేవుణ్ణి భార్యతో సహితంగా సంకెళ్ళు వేసి చెరసాలలో పెట్టించాడు. ఇక అక్కడ నుండి నేను వచ్చాను.

తరువాత కంసుడు బలరామకృష్ణుల్ని వధింపదలచి దైత్యశ్రేష్ఠుడైన కేశి కోసం కబురు చేశాడు. ఆ తరువాత చాణూరుడు మున్నగు మల్లులను, కువలయాపీడమనే ఏనుగును రప్పించాడు. వారిని చూచి కంసుడు "ఓ కూటా! ఓ తోశలా! మహాబలుడవైన చాణూరా! బలరామకృష్ణులిద్దరూ నాకు మృత్యు రూపులు. ఈ విషయం నాకు నారదుడు స్వయంగా చెప్పాడు. వారిద్దరూ ఇక్కడకు వచ్చినప్పుడు మీరంతా కలిసి మల్లయుద్ధం చూస్తున్న వారిద్దరినీ హతమార్చాలి. మల్లభూమిని సత్వరమే సిద్ధం చెయ్యండి. ఓ మహావతా! రంగశాల ద్వారం దగ్గర మదించిన కువలయాపీడాన్ని

నిలిపి వారిద్దరూ ప్రవేశించేటప్పుడు వారిని సంహరింపచేయాలి. రేపు వచ్చే చతుర్దశినాడు ధనుర్యజ్ఞం చెయ్యాలి. అమావాస్యనాడు మల్లయుద్ధం జరుగుతుంది" అన్నాడు.

**అక్రూరుడు :**

కంసుడు వెంటనే అక్రూరుణ్ణి తన దగ్గరకు రమ్మని పిలిపించి "అక్రూరా! నీవు నాకు మాన్యుడవైన మంత్రివి. నేను చెప్పే ఈ మంచి మాట విను. ఓ మహామతీ! రేపు ఉదయమే నందవ్రజానికి బయలుదేరి వెళ్ళు. వసుదేవుని కుమారులైన బలరామకృష్ణులు నాకు శత్రువులు. వారక్కడ ఉన్నారు. నందరాజు గోపగణ సహితంగా కానుకలు తీసికొని ఇక్కడకు వస్తాడు. వారితోపాటు మధురా నగరం చూపించటం కోసం బలరామకృష్ణుల్ని కూడా రథంపై కూర్చొనబెట్టుకొని శీఘ్రంగా ఇక్కడకు తీసికొనిరా, ఇక్కడకు వచ్చిన తరువాత ఏనుగుచేతగాని మల్లులచేతగాని నేను వారిద్దరినీ తుదముట్టింపచేస్తాను. తరువాత వసుదేవునకు సహాయం చేసే నందరాజు, వృషభానుడు, నవనందులు, ఉపనందులందర్నీ సంహరిస్తాను. తదనంతరం వసుదేవునకు సహాయకుడైన దేవకుణ్ణి, వసుదేవుణ్ణి, వృద్ధ జనకుడైన ఉగ్రసేనుణ్ణి హతమారుస్తాను. వీరంతా అయిన తరువాత సమస్త యాదవుల్ని చంపివేస్తాను. ఇందులో సంశయం లేదు.

ఓ సచివశేఖరా! వీరంతా దేవతలు, మనుష్యరూపాలలో ఉన్నారు! చంద్రావతిపతి శకుని నాకు మంచి మిత్రుడు. భూతసంతాపన, ధ్రుష్ట, వృక, శంబర, కాలనాభ, మహానాభ, హరిశ్మశ్రులు నాకు ప్రాణస్నేహితులు. జరాసంధుడు నాకు మామ. ద్వివిదుడు నాకు మిత్రుడు. బాణాసుర, నరకాసురులు నేనంటే అభిమానం ఉన్నవారు. వీరంతా ఈ పృధ్విని జయించి, ఇంద్రాది దేవతలందర్నీ బంధించి ధన సంపత్తికి అధిపతులయ్యారు. కుబేరుణ్ణి మేరుపర్వత దుర్గమ కందరంలో పడవేసి వీరు త్రిలోకపాలకులయ్యారు. ఓ అక్రూరా! నీవు నీతివిశారదులలో శుక్రాచార్యునితో సమానుడవు. సంభాషణా చాతురిలో బృహస్పతి తుల్యుడవు. అందువల్ల నీవు ఈపని చెయ్యాలి" అన్నాడు.

అందుకు అక్రూరుడు "ఓ యదురాజా! నీవు మహాసాగరం వంటి మనోరథాన్ని రచించావు. దైవేచ్ఛ తోడ్పడితే ఈ సముద్రం గోష్పాదంతో సమానమవుతుంది. దైవం అనుకూలించకపోతే ఇది అపారమైన మహాసాగరమే". అన్నాడు. అప్పుడు

కంసుడు "బలవంతు డెప్పుడూ దైవ సహాయం వదిలి కర్తవ్యం నిర్వహిస్తాడు. కాని బలహీనుడు దైవ సహాయం పొంది చతికిలబడి కుర్చుంటాడు" అని కోపంతో సింహాసనం మీద నుంచి లేచి అంతఃపురం లోపలకు వెళ్ళాడు.

**కేశి :**

నారదుడిలా అంటున్నాడు "ఓ మిథిలేశ్వరా! అప్పుడు బలవంతుడు మదోన్మత్తుడు, అయిన మహాదైత్యుడు కేశి అశ్వరూపం ధరించి అతివేగంగా బృందావనంలోకి వెళ్ళి మేఘగర్జన వంటి సంకిలింపుచేశాడు. ఆ గుఱ్ఱం కాలి తాకిడికి చెట్లు విరిగి పడిపోసాగాయి. దాని తోక విసురుకి ఆకాశంలోని మేఘాలు ముక్కలు ముక్కలు కాసాగినాయి. దాని వేగం దుస్సహంగా ఉంది. దానిని చూచి గోప గోపికలంతా భయభ్రాంతులై కృష్ణపరమాత్మణ్ణి శరణువేడారు. ఆర్తజనావనుడైన కృష్ణుడు వారిని చూచి "నేనుండగా భయమెందుకు" అని వారికి అభయమిచ్చాడు. అంతలోనే ఆ మహాసురుడు పరుగు పరుగున వచ్చి తన నోటితో శ్రీహరిని పట్టుకొని ఆకాశమార్గంలో అమితవేగంతో పయనింపసాగాడు. ఆకాశంలో వారిద్దరికీ రెండు జాముల పాటు ఘోరయుద్ధం జరిగింది. ఆ అశ్వం తన కాళ్ళతో, మెడతో, నోటితో తోకతో కృష్ణుణ్ణి హింసింపసాగింది. శ్రీహరి దానిని రెండు చేతులతో పట్టుకొని గిరిగిరా త్రిప్పి విసిరి నేలకేసి కొట్టాడు. తిరిగివచ్చిన దాని నోట్లోకి శ్రీహరి తన చేతిని పోనిచ్చాడు. అది అసాధ్యమైన రోగం వలె క్రమక్రమంగా పెద్దది కాసాగింది. ఇక ఆ రాక్షసునకు ఊపిరిసలపడం కూడా కష్టమైపోయి వాని పొట్ట పగిలిపోయింది. అశ్వరూపధారి అసురుడు ప్రాణం వదిలిపెట్టాడు. శరీరం వదిలిపెట్టగానే ఆతడు దివ్యరూపం ధరించి శ్రీకృష్ణునకు రెండుచేతులు జోడించి అభివందనం చేసి ఇలా అన్నాడు.

**కేశి పూర్వజన్మ :**

"ఓ మాధవా! నేను చంద్రుని అనుచరుడను. నన్ను కుముదుడని అంటారు. తేజోవంతుడను, రూప వంతుడను అయిన నేను ఇంద్రునకు ఛత్రం పట్టేవాడిని. పూర్వం ఇంద్రుడు వృత్రాసుర సంహారం చేసి, ఆబ్రహ్మ హత్యా పాతకం పోగొట్టు కొనటానికి అశ్వమేధ యాగం చేశాడు. ఆయజ్ఞాశ్వం శ్వేతవర్ణంలో ఉన్నది. దాని చెవులు నల్లగా ఉన్నాయి. అది మనోవేగంతో ప్రయాణం చేసేది. దాని సౌందర్య

పరాక్రమాలను చూచిన నాకు దానిని అధిరోహించాలనే కోరిక కలిగింది. వెంటనే నా కోరిక నెరవేర్చుకొనటానికై నేను ఆ అశ్వాన్ని అపహరించి అతల లోకానికి వెళ్ళిపోయాను. అక్కడ నన్ను మరుత్తులు చూచి బంధించి తెచ్చి దేవేంద్రుని దగ్గర పడవేశారు. అప్పుడు దేవేంద్రుడు నన్ను చూచి "ఓరీ దుర్బుద్ధీ! నీవు రాక్షసుడవవుతావు. భూతలంపై కొన్ని మన్వంతరాల వరకు నీవు ఇలా అశ్వరూపంలోనే ఉంటావు" అని శపించాడు.

ఓ ప్రభూ! ఈనాడు నేను నీ దివ్య హస్తాలలో శాప విముక్తుడ నయ్యాను. ఓ దేవా! ఇక నీవు నన్ను సేవకునిగా స్వీకరించు. నా మనస్సు నీ చరణ కమలములపైలగ్నమయింది. నీవు లోకైకసాక్షీభూతుడవు. నీకు నమస్కారము" అని పలికాడు. ఓ మిథిలేశ్వరా! కుముదుడు ఈవిధంగా పలికి శ్రీకృష్ణునకు ప్రదక్షిణం చేసి అత్యంత ప్రకాశమానమైన ఉత్తమ విమానాన్ని అధిరోహించి దిశలన్నిటిని దేదీప్యమానం చేస్తూ వైకుంఠధామానికి వెళ్ళాడని నారదమహర్షి వచించాడు.

**అక్రూరుని వ్రజప్రవేశము :**

నారదమహర్షి బహుళాశ్వునితో ఇలా చెప్తున్నాడు. ఓ మిథిలేంద్రా! అక్రూరుడు కంసుని కార్యం నెరవేర్చటం కోసం రథంమీద నందవ్రజానికి బయలుదేరాడు. ఆతనికి పురుషోత్తముడైన శ్రీకృష్ణుని పట్ల అపారమైన భక్తి ఉన్నది. బుద్ధిమంతుడైన అక్రూరుడు ఆవిధంగా వెళుతూ మార్గమధ్యంలో ఇలా భావింప సాగాడు. "ఈరోజు నేను భగవంతుడైన శ్రీహరిని దర్శనం చేసికొనబోతున్నాను ఇందుకు కారణంగా నేనేపుణ్యం చేసిఉంటాను? నిస్వార్థంగా ఏదానం చేసి ఉంటాను? ఏ ఉత్తమ యజ్ఞం, తీర్థయాత్ర, బ్రహ్మణసేవ చేసి ఉంటాను? పూర్వజన్మలో నేను ఏతపం చేశాను? ఏ సాధుపురుషుల సేవ చేశాను? లేకపోతే ఇప్పుడు నాకు శ్రీకృష్ణపరమాత్ముని దర్శనం ఎందుకు కలుగుతుంది? ఈ స్వామిని దర్శించిన వాని జన్మ సఫలం కదా" అనుకుంటూ ఉత్తమ శకునాలను చూస్తూ, గాందినీ నందనుడైన అక్రూరుడు సంధ్యాసమయానికి గోకులంలో ప్రవేశించాడు. శంఖచక్రాలతో కూడుకొనియున్న శ్రీకృష్ణ చరణారవిందాల చిహ్నాలు ఆ గోకులం ధూళిలో అక్రూరునకు కనిపించాయి. ఆతడు ఉత్కంఠతో, భక్తిభావంవల్ల కలిగిన ఆనందంతో విహ్వాలుడై రథం మీద నుంచి క్రిందకు దూకి ఆ ధూళిలో దొర్లసాగాడు. ఆ సమయంలో ఆతని నేత్రాల నుంచి ఆనందబాష్పాలు పొంగి పొరలసాగాయి.

ఓ మిథిలేశ్వరా! ఎవరి హృదయంలో శ్రీకృష్ణుని పట్ల భక్తిభావం ఉత్పన్నమవుతుందో, అటువంటివానికి ఈ సమస్త ప్రపంచ సుఖము తృణప్రాయంగా తుచ్ఛమై కనిపిస్తుంది. తరువాత అక్రూరుడు రథంపై నందుని గ్రామానికి చేరుకున్నాడు. అక్కడ గోష్ఠంలో చూస్తే బలరాముడు, కృష్ణుడు అక్కడే ఉన్నారు. పురాణపురుషులైన వారిద్దరూ వజ్ర, ఇంద్రనీల మణిపర్వతాలవలె ప్రకాశిస్తున్నారు. వారి కిరీటాలు బాలసూర్యకాంతుల్ని ప్రసరిస్తున్నాయి. శరన్మేఘచ్ఛాయ నీలిమేఘచ్ఛాయ పోలిన దేహాలపై కాంతులీనే వస్త్రాలను ధరించి యున్నారు. వారిరువురను చూడగానే అక్రూరుడు వెంటనే రథం మీద నుంచి దిగి భక్తి భావ వివశుడై వారి చరణకమలములపై పడిపోయాడు. ఆతని కనుల నుండి ఆనందాశ్రువులు స్రవిస్తున్నాయి. ఆతని శరీరం భక్తి తన్మయత్వంతో పులకించిపోయింది.

అక్రూరుణ్ణి శ్రీకృష్ణుడు తన రెండు చేతులతో పట్టుకొని లేవదీశాడు. మాధవుని దయకు ఆతడు వివశుడయ్యాడు. వారి ముగ్గురు ఇంటికి చేరుకున్నారు. అక్కడ కృష్ణుడు అక్రూరునకు అతిథి సత్కారాలు చేసి, ఒక ఆవును ఆతనికిచ్చి సరసభోజనం పెట్టాడు. కృష్ణుడు అక్రూరుని చేతిని తన చేతిలోనికి తీసికొని "నీవు కంసుని రాజ్యంలో ఎలా ఉంటున్నావు? తన సోదరికి జన్మించిన చిన్న చిన్న శిశువులనే సంహరించినవాడు ఇతరుల్ని దయతో ఎలా చూడగలడు?" అని అడిగాడు. నందుడు ఇంటిలోపలకు వెళ్ళిన తరువాత కృష్ణుడు తన తల్లిదండ్రుల క్షేమ సమాచారాలను అడిగి తెలుసుకున్నాడు.

అక్రూరుడు కృష్ణునితో "ఓ దేవా! మొన్నటిరోజున భోజరాజైన కంసుడు చేత కత్తిపట్టుకొని వసుదేవుణ్ణి చంపటానికి ఉద్యుక్తుడయ్యాడు. అప్పుడు నారదమహర్షి ఆతనిని నివారించాడు. యాదవులు బంధుమిత్రసహితంగా వేరే ప్రదేశాలకు వెళ్ళిపోయారు. ఆతడిప్పుడు యాదవులను సంహరించటానికి, దేవతలను జయించటానికి సిద్ధమవుతున్నాడు. జగదుద్ధారకులైన మీరిద్దరూ అవశ్యము మధురకు విచ్చేయవలసింది. మీఇరువురివల్ల తప్ప మరెవరిచేత కూడా ఈ కార్యక్రమం నెరవేరేది కాదు" అని పలికాడు.

అక్రూరుని మాటలు విని శ్రీకృష్ణుడు బలరామునితో సహితంగా వెళ్ళి నందుని సలహా తీసుకున్నాడు. తరువాత యాదవులతో కృష్ణుడు "ఓ బంధువులారా!

వృద్ధ యాదవులతో, బలరామునితో, నందరాజుతో నేను మధురానగరం వెళుతున్నాను. నవనందులు, ఉపనందులు, ఆరుగురు వృషభానులు ఉదయమే లేచి మధురానగర యాత్రకు బయలుదేరతారు. మీరంతా పాలు, పెరుగు, నెయ్యి ఒకచోట సేకరించి ఉంచండి. రాజులకు సమర్పించటానికి మరికొన్ని ఉపాయనాలను కూడా సిద్ధపరచండి. ఎడ్లబండ్లతో పాటు రథాలను కూడా సిద్ధంచేసి ఉంచండి" అని చెప్పాడు. గోపకులంతా ఈ మాటలు విని వారి వారి ఇళ్లకు వెళ్ళి గోపకాంతలతో కృష్ణుడు చెప్పిన మాటలన్నీ చెప్పారు. అంతే! గోపికల హృదయాలు ఉద్విగ్నతతో నిండిపోయాయి. కృష్ణుడు తమ్మువీడి వెళుతున్నాడనే విరహంతో విహ్వాలలయ్యారు. అందరి ఇళ్ళల్లో నుంచి గోపికలు ఒకచోటకు చేరి ఇదే విషయం మాట్లాడుకొనసాగారు.

**గోపికల విరహం :**

ఓ మహారాజా! శ్రీకృష్ణుని ప్రయాణవార్త వృషభానుని ఇంటికి కూడా చేరింది. ప్రియతముడిలా వెళుతున్నాడనే మాట విని వృషభానునందనయైన రాధ దు:ఖితమతి అయింది. ప్రభంజనం వల్ల నేలకూలిన అరటిచెట్టువలె ఆమె నేలమీదపడి మూర్ఛపోయింది. కొందరు గోపికల వదనాలు వాడిపోయాయి. వారి వ్రేళ్ళ ఉంగరాలు హస్తకంకణాలైనాయి. ఆ గోపకాంతలు తమ తమ గృహాలలో "శ్రీకృష్ణ గోవింద హరే మురారే" అని స్మరిస్తూ అత్యంత విహ్వాల చిత్తాలతో స్తిమితం లేకుండా ఉన్నారు. అప్పుడు వారు గృహకృత్యాలనన్నిటినీ వదిలి యోగులవలె కూర్చొని ధ్యానమగ్నలయ్యారు.

మరికొందరు గోపికలు ఒకరితో నొకరు శ్రీకృష్ణుని ప్రయాణ విషయం మాట్లాడుకొంటున్న సమయంలో వారి వారి కంఠాలు గద్గదములై నోటమాట రాని స్థితి ఏర్పడింది. వారి నేత్రాలు బాష్పధారలతో వన్నె కోల్పోయినాయి. అప్పుడు గోపికలు ఇలా అనుకున్నారు. "ఆహా! మోహం లేని వారి చరిత్ర విచిత్రంగా ఉంటుంది. అది నోటితో చెప్పదగినది కాదు. నిర్మోహంతో ఉన్నవారు నోటితో చెప్పేది ఒకటి, వారి హృదయంలో ఉండేది మరొకటి. వారి మనోభావాలు దేవతలకు కూడా తెలియవు. అటువంటిది మానవమాత్రులమైన మనకెలా తెలుస్తుంది? రాసక్రీడ సమయంలో చెప్పిన మాటలనన్నీ అబద్ధాలు చేసి తాను మధురకు వెళ్ళటానికి సిద్ధమౌతున్నాడు. మన ఈ ప్రాణవల్లభుడు మధురాపురం వెళ్ళినంత మాత్రంచేత మనకు ఏ కష్టమూ కలుగదు."

## రాధ విరహం :

నారద మహర్షి ఈ విధంగా చెప్పసాగాడు. ఓ రాజా! ఈ విధంగా మాట్లాడుకొంటున్న గోపికల విరహక్లేశం గ్రహించి కృష్ణపరమాత్ముడు వెంటనే వారందరి గృహాలకు వెళ్ళాడు. ఓ మిథిలేశ్వరా! ఎంతమంది వ్రజకాంతలున్నారో అన్ని రూపాలను ధరించి శ్రీకృష్ణుడు వారందరికీ వేరు వేరుగా కనిపించాడు. రాధాదేవి భవనంలోకి వెళ్ళి చూస్తే అక్కడ సఖురాండ్ర మధ్య ఆమె నేలపై మూర్ఛపోయిఉన్నది. అప్పుడు కృష్ణుడు మధురస్వరంతో మురళీ గానం చేశాడు. వంశీనాదం విని రాధ వెంటనే కనులు తెరచి చూచింది. ఎట్టఎదుట గోవిందుడు కనిపించాడు! పద్మిని సూర్యుణ్ణి చూచి ప్రసన్నురాలయినట్లు, పద్మినీ నాయిక రాధ తన ప్రాణ వల్లభుణ్ణి ఎట్ట ఎదుట చూచి ఆనంద పారవశ్యం పొందింది. దు:ఖంతో ఉద్విగ్నమై యున్న ఆమెతో కృష్ణపరమాత్ముడు మేఘ గంభీర నాదంతో ఇలా అన్నాడు. "భద్రా! ఓ రాధికా! నీ మనస్సు ఎందుకు ఉదాసీనంగా ఉంది? నీవు ఈ విధంగా దు:ఖించటం తగదు. నా మధురానగర ప్రయాణం విని బాధపడుతున్నావా? ఇటుచూడు విధాత అభ్యర్థన వల్ల భూలోకంలో భారం తొలగించటంకోసం, కంసాది అసురులను సంహరించటం కోసం నీతోటి నేను భూమిపై అవతరించాను. ఆ సంకల్పాన్ని నెరవేర్చటం కోసం నేను మధురకు వెళ్ళి భూభారం తగ్గించవలసి ఉంది. అది నెరవేర్చి వెంటనే ఇక్కడకు వచ్చి నీకు ఆనందం కలిగిస్తాను".

జగదీశ్వరుడైన శ్రీహరి ఈవిధంగా పలికిన వెంటనే వియోగవిహ్వలయైన రాధ దావాలంచే దగ్ధంచేయబడిన లతవలె మూర్ఛపోయింది. అప్పుడు కంపము, రోమాంచము మొదలైన సాత్వికభావాలు అంకురించాయి. అటువంటి దశలో ఆమె ప్రాణవల్లభునితో ఇలా పలికింది" ఓ ప్రాణనాథా! నీవు భూభారం తగ్గించటం కోసం తప్పక మధురానగరం వెళ్ళు. కానీ ఈలోగా నా ప్రతిజ్ఞ కూడా ఒక్కసారి విను. ఇక్కడ నుంచి నీవు వెళ్ళిన తరువాత నేను ఈ శరీరం ధరించి ఉండను. ఈమాటను నీవు నమ్మనట్లయితే మరొకసారి నీవు మధుర వెళుతున్న విషయం ప్రస్తావించి చూడు నీకు తెలుస్తుంది. నేను కథాశేషంగా మిగిలిపోతాను. నా ప్రాణం కర్పూర ధూళికణంలాగా ఆహుతి కావటానికి సిద్ధంగా ఉంది."

అప్పుడు భగవంతుడిలా అన్నాడు "ఓ రాధికా! నేను వేద స్వరూపమైన

నా మాటనైనా ఉల్లంఘింపగలను కానీ నా భక్తుల మాటను మాత్రము ఉల్లంఘించే శక్తి నాకు లేదు. పూర్వం గోలోకంలో జరిగిన కలహంలో శ్రీదాముడిచ్చిన శాపంవల్ల మన ఇద్దరికీ నూరు సంవత్సరాల పాటు వియోగం కలుగవలసిఉంది. ఇందులో సంశయం లేదు. ఓ కల్యాణీ! రాధికా! శోకింపకు. నేను నీకిచ్చిన వరాన్ని గుర్తుంచుకో. నీవియోగ దు:ఖ శాంతికోసం ప్రతినెలలో ఒకరోజు నేనునీకుదర్శనంఇస్తాను".

ఆ మాటలు విని రాధ కృష్ణపరమాత్మునితో- "స్వామీ! నా విరహ దు:ఖ శాంతి కోసం ఆవిధంగా ప్రతినెలలో ఒకరోజు దర్శనం ప్రసాదింపకపోతే నేను ప్రాణపరిత్యాగం చేస్తాను. ఓ లోకాభిరామా! జనభూషణా! విశ్వదీపా! మదనమోహనా! ఆనందకుందా! యదకులనందనా! నందకిశోరా! నాకు ఒట్టువేసి చెప్పు. ప్రతినెలలో ఒకరోజు వచ్చి దర్శనం ప్రసాదిస్తావుకదూ!" అని పలికింది. అప్పుడు కృష్ణుడు- "ఓ రాధా! గోవుల మీద ఒట్టువేసి చెప్తున్నా. ఇందులో ఎటువంటి సందేహం వద్దు. నిస్వార్థంగా భగవంతునితో మైత్రి నెరపేవాడు ధన్యుడు. అలా కాకుండగా స్వార్థ భావంతో కపటంతో ప్రవర్తించేవాడు కేవలం నటుడు. అటువంటివారిని ధిక్కరించాలి. ఏవిధంగా కర్మేంద్రియాలు శబ్ద స్పర్శరూపరస గంధాదులను స్వయంగా గ్రహింపలేవో అదేవిధంగా సకామ భావనతో ఉన్న మునులు భగంతుని నిరపేక్షమైన, నిర్గుణమైన, గూఢమైన, పరమసుఖాన్ని కొంచం కూడా తెలిసికొనలేక పోతున్నారు. ఏవిధంగా జ్ఞానేంద్రియాలు రసగంధాదుల విషయాలను తెలిసి కొంటున్నాయో, ఆవిధంగా సమదర్శనము జితేంద్రియత్వము, అపేక్షరాహిత్యముగల మహాత్ములు నిష్కామమైన నా పరమ సుఖానుభవాన్ని పొందగలుగుతున్నారు.

ఓ భామినీ! మనస్సులోని సమస్త భావాలు పరస్పరాశ్రితాలు. అవి ఒకదానితో ఒకటి అనుబంధం కలిగి ఉంటాయి. అందువల్ల ప్రేమ అనేది కూడా ఏకపక్షంగా కలిగేదికాదు. రెండు వైపుల నుంచీ ఉండాలి. అందువలన నీ నుంచి నావైపు ప్రేమ పొంగిపొరలాలి. ఈ ప్రపంచంలో ప్రేమతో సమానమైనది వేరేదీ లేదు.

ఓ రాధా! భాండీర వనంలో నీ మనోరథం నెరవేరింది. మరల అదేవిధంగా జరుగుతుంది. సత్పురుషులు ఏ నిర్హేతుకమైన ప్రేమను చూపుతారో దానిని కూడా సాధుపురుషులు నిర్గుణమని భావిస్తారు. ఏవిధంగా పాలను తెల్లదనాన్ని వేరుచేసి చూడలేమో, అదేవిధంగా నిన్ను రాధ అని, నన్ను కేశవుడని భేద బుద్ధితో చూడనివారు నిష్కామభావనవల్ల కలిగిన భక్తిచేత నాబ్రహ్మపదాన్ని పొందగలుగుతున్నారు" ఈ

విధంగా రాధను, గోపికలను ఆశ్వాసించి నీతికుశలుడైన గోవిందుడు నందభవనానికి తిరిగివచ్చాడు.

## శ్రీకృష్ణుని మధుర ప్రయాణము :

సూర్యోదయం కాగానే నందాది గోపకులు ఎడ్లబండ్లమీద కానుకలు తీసికొని రథాన్ని అధిరోహించారు. బలరాముడు శ్రీకృష్ణుడు తన రథంపై ఆసీనులు కాగా గాందినీ పుత్రుడైన అక్రూరుడు మధురవైపు ప్రయాణం సాగించాడు. మార్గంలో అనేకమంది గోపాంగనలు నిలబడి, కోపంతో, మోహంతో విహ్వలచిత్తలై నందవ్రజం నుంచి కృష్ణుడు వెళుతున్నదృశ్యాన్ని చూస్తూ నిలబడ్డారు. వారు అక్రూరుణ్ణి "క్రూరుడు క్రూరుడ"ని అంటూ పరుషంగా మాట్లాడసాగారు. మేఘాలు సూర్యుణ్ణి కప్పివేసినట్లుగా గోపకాంతల సముదాయాలు అక్రూరుని రథాన్ని నలువైపులనుంచి చుట్టుముట్టాయి.

ఓ రాజా! భగవంతుని విరహంవల్ల వ్యాకులంపొందిన గోపకాంతలు అక్రూరుని రథాన్ని, గుఱ్ఱాలను, సారథిని కర్రలతో కొట్టడం ఆరంభించారు. ఆ దెబ్బలవల్ల అశ్వాలు అటుఇటు పరుగెత్తసాగాయి. గోపికల రెండు వ్రేళ్ళ దెబ్బలకే సారథి ఆ రథంపైనుంచి క్రింద పడ్డాడు. లోకం ఏమనుకుంటుందో అనే భావనకు తిలాంజలి యిచ్చి గోపికలు బలరామకృష్ణులు చూస్తూండగానే అక్రూరుణ్ణి బలవంతంగా రథంపైనుంచి క్రిందకు లాగి అతణ్ణి కొట్టటం ఆరంభించారు. గోపకాంతలు ఆవిధంగా సేనా వాహినివలె ప్రవర్తించటం చూచి బలరామకృష్ణులు గాందినీనందనుడైన అక్రూరుణ్ణి రక్షించి గోపికల నిలా శాంతపరచారు- "ఓ వ్రజకాంతలారా! బాధపడకండి. నేనీరోజు సంధ్యాసమయానికే తిరిగి వస్తాను. ఈ అక్రూరుని ఎదుట వ్రజవాసులమైన మనం నవ్వులపాలు కాకూడదు, ఆవిధంగా మీరుప్రయత్నం చెయ్యాలి." అని పలికి బలరామకృష్ణులు అక్రూరునితో సహితంగా అందమైన రథంపై మధురాపురంవైపు తరలివెళ్ళారు. వారి రథము, కేతనము, అశ్వాల కాలిగిట్టలవల్లరేగిన ధూళి కనిపించినంతసేపు మోహవశలైన గోపికలు ఆ మార్గంలో చిత్రంలో లిఖింపబడిన విధంగా చూస్తూ నిలబడిపోయారు. కృష్ణుడు చెప్పిన మాట గుర్తుకు తెచ్చుకొని వారు మాధవుని పునరాగమనం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు.

## యమునలో అద్భుత దృశ్యం :

అక్రూరుడు బలరామకృష్ణులతో మధురానగర ఉపవనం దగ్గరకు చేరుకొని

యమునా తీరంలో రథం నిలిపాడు. కృష్ణపరమాత్ముడు రథందిగి యముననలో మంచినీరు త్రాగి వచ్చి కూర్చున్నాడు. అక్రూరుడు బలరామకృష్ణుల అనుజ్ఞ గ్రహించి నిత్య నైమిత్తిక కర్మల నాచరించటానికి యమునానది నీటిలోకి దిగాడు. ఆ నీరు అగాధంగా ఉంది. ఆ నీటిలో అక్రూరునకు బలరామకృష్ణులు సంభాషిస్తూ కనిపించారు. ఆదృశ్యంచూచి అక్రూరుడు చకితుడై ఒడ్డుపైకి వచ్చి రథంవైపు చూశాడు. రథంమీద బలరామకృష్ణులిద్దరూ కూర్చొని కనిపించారు. అక్రూరుడు మరల నీటిలోకి వెళ్ళి చూచాడు. బలరాముడు నాగరాజైన ఆదిశేషుని రూపంలో చుట్టచుట్టుకొని కూర్చొని ఉన్నాడు. ఆతని ఒడిలో పరమ ప్రకాశమయమైన గోలోకము, గోవర్ధన పర్వతము, యమునానది, మనోహర బృందావనము, కోటి సూర్యుల కాంతితో జ్యోతిర్మండలము కన్పింపసాగాయి. ఆకాంతి మండలంలో రాసమండలంమధ్యలో కోటి మన్మథ సౌందర్య కోమలాంగుడైన కృష్ణపరమాత్ముడు రాధా సహితంగా అక్రూరునకు దర్శనం ఇచ్చాడు. అప్పుడు అక్రూరుడు శ్రీకృష్ణుణ్ణి పరమాత్మగా పరబ్రహ్మగా తెలిసికొని మరలమరల నమస్కరించి అంజలి ఘటించి ఇలా స్తుతించాడు.

నమః శ్రీకృష్ణచంద్రాయ పరిపూర్ణతమాయచ
అసంఖ్యాండాధిపతయే గోలోకపతయే నమః
శ్రీరాధాపతయే తుభ్యం వ్రజాధీశాయ తే నమః
నమః శ్రీనందపుత్రాయ యశోదానందనాయచ
దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే
యాదూత్తమ జగన్నాథ పాహిమాం పురుషోత్తమం
వాణీ సదా తే గుణవర్ణనేస్యా త్కర్ణౌ కథాయాం దోశ్చకర్మణి
మనః సదా త్వచ్చరణారవిందయోః దృశౌ స్ఫురద్ధామ విశేషదర్శనే

"అసంఖ్యాకమైన బ్రహ్మాండాలకు అధిపతి, గోలోకధామ స్వామి, పరిపూర్ణతముడునైన శ్రీకృష్ణచంద్రునకు నమస్కారము. రాధా ప్రాణవల్లభా! వ్రజాధీశ్వరా! నందనందనా! యశోదతనయా! నీకు నమస్కారము. దేవకీసుతా! గోవిందా! వాసుదేవా! జగదీశ్వరా! యదుకులతిలకా! జగన్నాథా! పురుషోత్తమా!

నీకు అభివందనము. హే భగవన్! నాజిహ్వ నిరంతరం నీ గుణగణాలను కీర్తించుగాక! నా కర్ణములు నీ కథా శ్రవణమున లీనమై యుండు గాక! నా హస్తములు నీ సేవాకార్యమునందు నిమగ్నమగుగాక! నా మనస్సు సదా నీ చరణారవిందాలను ధ్యానించుగాక! నా నేత్రములు నీ భవ్య ధామ దర్శనము నందు ఆసక్తితో ఉండుగాక!"

ఈవిధంగా అక్రూరుడు కృష్ణపరమాత్మణ్ణి స్తుతించి వినయపూర్వకంగా వచ్చి రథంపై ఆసీనుడయ్యాడు. సూర్యుడు అస్తమించే సమయానికి వారు మధురా నగరం చేరుకున్నారు. అక్కడ ఉపవనంలో నందుణ్ణి చూచి శ్రీకృష్ణుడు మందహాసం చేసి మేఘ గంభీర నిస్వనంతో అక్రూరునితో "నీవు రథంతో మధురానగరానికి వెళ్లు. నేనిక్కడ దిగి గోపబాలురతో కలిసి వస్తాను" అన్నాడు. అప్పుడు అక్రూరుడు "ఓ దేవదేవా! జగన్నాథా! గోవిందా! పురుషోత్తమా! ప్రభూ! నీవు బలరామునితో, గోపకులందరితో నా ఇంటికి దయచేయి. నిన్ను తీసికొని వెళ్ళకుండా నేను ఇంటికి వెళ్ళను" అన్నాడు. అందుకు కృష్ణుడు "నేను కంసుణ్ణి సంహరించి తప్పక మీ ఇంటికి వచ్చి నీకు ఆనందం కలిగిస్తాను" అని పలికిఅక్రూరుణ్ణి ముందు పంపించాడు. అక్రూరుడు కృష్ణుని ఆగమనవార్తను కంసునకు తెలిపి ఇంటికి వెళ్ళాడు. రెండవరోజు ఉదయం బలరామునితో, గోపకులతో కలిసి మధురానగరం చూడటానికి వెళ్ల బోతున్న గోవిందుణ్ణి చూచి నందుడు "నాయనా! నగరాన్ని చూచి త్వరగా తిరిగి రావాలి. ఇది గోకులం కాదు. ఇది భయం కలిగించే కంసుని సామ్రాజ్యం' ' అని పలికాడు. ఆమాటలకు సరేనని గోవిందుడు బలరామునితో, గోపవృద్ధులు, గోపబాలురతో సహితంగా పురములోని కేగాడు. ఆ నగరం శోభాయమానమైన గృహాలతో, గగన చుంబితములైన ప్రాసాదాలతో దేవతల రాజధానియైన అమరావతితో తులతూగే విధంగా ఉంది. ఆ నగరశోభను తిలకిస్తూ కృష్ణుడు తన పరివారంతో క్రమంగా రాజమార్గంలోకి వచ్చాడు.

వసుదేవనందనుడైన శ్రీకృష్ణుని ఆగమన వార్తను విని మధురాపుర కాంతలు తమతమ గృహకృత్యాలను విడిచిపెట్టి, శిశువుల్ని వదిలి గబగబా నదులు సాగరంవైపు వెళుతున్నట్లు బయటకు రాసాగారు. కొందరు కాంతలు ఇంటి మిద్దెలపైనుంచి, కొందరు మహిళలు ఇంటి గవాక్షాలనుంచి, కొందరు స్త్రీలు గోడల చాటునుంచి, కొందరు వనితలు ద్వారం తలుపులు తెరుచుకొని అరుగుల మీద నిలబడి

కృష్ణపరమాత్మణ్ణి చూడసాగారు. కృష్ణుడు ఒకచేతిలో విలాసంగా కమలం పట్టుకున్నాడు. మెడలో వైజయంతిమాల మెరిసిపోతున్నది. చెవులకున్న మకరకుండలాలు తళతళలాడుతున్నాయి. అటువంటి కృష్ణుణ్ణి చూచి మధురాపుర కాంతలు ఆనందతన్మయత్వం పొందారు. వారు తమలో తాము "నందనందనుడు నిత్యం నివసించే బృందావనం ఎంత ధన్యమయింది! వీనిని ప్రతిరోజు దర్శనం చేసికొనే గోపికలు ఎంతటి ధన్యలు. కృష్ణునితో రాసక్రీడలో పాల్గొనే ఆ గోపికలు ఎంత పుణ్యం చేసిఉంటారు?" అని భావింపసాగారు.

## రజకుని వృత్తాంతము :

అదే సమయంలో ఒక రజకుడు ఆ మార్గంలో వెళుతున్నాడు. వాడు చాలా గర్వంగా ఉన్మత్తుడుగా కనిపిస్తున్నాడు. అప్పుడు కృష్ణుడు వానితో "మిత్రమా! మాకుకొన్ని మంచి వస్త్రాల నివ్వు. అలా ఇస్తే నీకు శుభం కలుగుతుంది." అన్నాడు. కంసుని సేవకుడైన ఆతడు ఆమాటలువిని ఘృతంచేత అభిషిక్తమయిన అగ్నివలె రోషంతో ప్రజ్వలించి "అరే! నీ తల్లిదండ్రు లెప్పుడైనా ఇటువంటి వస్త్రాలు ధరించారా ఏమిటి? గోవులు కాచుకునే మీ పెద్దలు కౌపీనాలు ధరించిన వారు కారా? జానపదులారా! బ్రతికిఉండదలిస్తే శీఘ్రంగా నగరం విడిచి వెళ్ళండి. ఈ వస్త్రాలు కనుక అపహరించారా మిమ్మల్ని అందర్నీ చెరసాలలో వేయిస్తా" అని పలికాడు. ఆ మాటలు వినటంతోనే కృష్ణుడు ఒక్కసారి అతని తలమీద గ్రుద్దాడు. వాడు ఒక్కసారిగా నేలకూలిపోయి ప్రాణాలు విడిచాడు. ఆతని ఆత్మజ్యోతి శ్రీకృష్ణునిలో లీనమయింది. శరత్కాలంలో గాలివేగానికి మేఘాలు చెల్లాచెదురయినట్లు ఆ రజకుని పరివారం ఆ వస్త్రాలనన్నిటినీ అక్కడ పడవేసి పరుగెత్తుకొని వెళ్ళిపోయారు. వాటిల్లోని అందమైన వస్త్రాలను కృష్ణుడు, బలరాముడు, గోపకులు తీసికొని అలంకరించుకున్నారు. గోపబాలురకు ఆవస్త్రాలను ఎలా ధరించాలో తెలియలేదు. వారు బలరామకృష్ణుల్ని చూచి ఆ వస్త్రాలను ఏదో అస్తవ్యస్తంగా కట్టుకున్నారు.

## వాయకుడు :

ఆ సమయంలో ఒక సాలెవాడు అక్కడకు వచ్చి బలరామకృష్ణులకు విచిత్రమైన రంగురంగుల వస్త్రాలనిచ్చి వాటిని వారికి అందంగా కట్టి, దివ్యవేషంతో వారిని అలంకరించాడు. గోపకులందరిచేత కూడా ఆ నేతవాడు వారి వారికి తగిన

వస్త్రాలను ధరింపచేశాడు. కృష్ణపరమాత్ముడు ఆతని పట్ల కరుణాంతరంగుడై ఆతనికి సారూప్యాన్ని ప్రసాదించాడు. బలరాముడు ఆతనికి ఐశ్వర్య లక్ష్మీ బలములను అనుగ్రహించాడు.

**సుదాముడు :**

అనంతరం బలరామకృష్ణులు గోపకులతో కలిసి సుదాముడను పేరుగల మాలాకారుని ఇంటికి వెళ్ళారు. ఆకస్మికంగా తన యింటికి విచ్చేసిన బలరామకృష్ణు లిద్దరినీ చూచి సుదాముడు ఆశ్చర్యచకితుడై లేచినిలబడి అంజలి ఘటించి పూల సింహాసనం మీద వారిని ఆసీనుల్ని చేసి గద్గద కంఠంతో "స్వామీ! మీ శుభాగమనం వల్ల నా వంశము నా గృహము పావనమయ్యాయి. మా తల్లిదండ్రులు అటు ఏడుతరాలు ఇటు ఏడుతరాలవారు పుణ్యాత్ములయ్యారు. భగవత్స్వరూపులైన మీరు భూభారం తగ్గించటం కోసం భూమిపై అవతరించారు. అటువంటి మీరీనాడు నా జీర్ణకుటీరానికి వచ్చి నన్ను కరుణించారు" అని పలికి సౌందర్యమయమైన పుష్పహారాలను వారి వారి గళసీమలలో అలంకరించి, వారికి తుమ్మెదలు మూగుతున్న మకరందాన్ని నివేదన చేసి నమస్కరించాడు. అప్పుడు కృష్ణుడతనితో "సుదామా! నా చరణారవిందాలపై నీభక్తి నిశ్చలంగా ఉంటుంది. నాభక్తులతోడి సాంగత్యం నీకు లభిస్తుంది. ఈ జన్మలోనే నీకు నా సారూప్యసిద్ధి కలుగుతుంది" అని ఆశీర్వదించి బయలుదేరాడు.

**కుబ్జ :**

ఆ సమయంలో ఆ మార్గంలో ఒక కమలనయనయైన కాంత వెళుతున్నది. ఆమె చేతులలో పరిమళ చందనపాత్ర ఉంది. ఆమె మూడు వంకరలతో పొట్టిగా ఉంది. ఆమెను చూచి మాధవుడు "ఓ సుందరీ! నీవెవరవు? ఏమిచేస్తుంటావు? ఎవరి కోసం ఈ చందనం తీసికొని వెళుతున్నావు? మాకు ఈ హరిచందన మిస్తే నీకు శుభం కలుగుతుంది" అన్నాడు. అప్పుడు ఆ వనిత "అయ్యా! నేను కంసుని దాసిని. నన్ను కుబ్జ అంటారు. భోజరాజైన కంసునకు ఈ సుగంధద్రవ్యాన్ని తీసికొనివెళుతున్నాను. మీవంటి సుందరమూర్తులు త్రిభువనాలలో లేరు. ఈ హరిచందనం తీసికొనటానికి మీకు తప్ప ఎవరికి అర్హత ఉన్నది?" అని అంటూ కుబ్జ వారిద్దరికీ శ్రీగంధాన్ని సమర్పించింది. ఆ అంగరాగం అలదుకొనటం వల్ల వారిద్దరూ మరింత శోభతో ప్రకాశించారు.

అప్పుడు కరుణాంతరంగుడైన శ్రీకృష్ణుడు ఆమె వక్రతను పోగొట్టాలని సంకల్పించాడు. ఆ పరమేశ్వరుడు తన చరణాన్ని ఆమె పాదంపై పెట్టి నొక్కి, చేతి రెండు వేళ్లను ఆమె చుబుకంక్రింద ఉంచి పైకిఎత్తాడు. ఆమె వామనత్వం తోపాటు శరీర వక్రత కూడా అదృశ్యమైపోయింది. ఆ తన్వంగి రూపసౌందర్య సంపన్నతతో ప్రకాశించసాగింది. ఆమెలో శ్రీకృష్ణుని పట్ల రాగం అతిశయించగా ఆమె కృష్ణుని పైవస్త్రం పట్టుకొని "శ్యామసుందరా! ఇప్పుడు శీఘ్రంగా నా యింటికి రా. నిన్ను నేను వదిలిపెట్టను. నీవు సర్వజ్ఞుడవు. నాపై కరుణ చూపు" అని ప్రార్థింపసాగింది. ఆదృశ్యం చూచి గోపకులు ఒకటే నవ్వుకొనసాగారు. బలరాముడు కూడా ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడామెను చూచి "అపరిచితులను కూడా ఇంటికి రమ్మని ఆహ్వానించే సౌమ్య స్వభావంగల వారు నివసించే ఈ మధురానగరం ఎంత ఉత్తమయింది! ఓ సుందరీ! నేను మధురానగరం చూచి తిరిగి వచ్చేటప్పుడు మీ ఇంటికి తప్పక వస్తా"నని చెప్పి ఆమెను ఊరడించి పంపించాడు.

## ధనుర్భంగము :

కంసుని ధనుశ్శాలకు మార్గమడిగి తెలిసికొని కృష్ణుడు సోదరసహితంగా ధనుశ్శాలలో ప్రవేశించాడు. ఆ ధనుస్సు బంగారపు కలంకారీతో చిత్రితమై ఉంది. ఏడు త్రాళ్ళపొడుగున్న ఆ ధనువు ఇంద్రధనుస్సు మాదిరిగా ప్రకాశిస్తున్నది. దాదాపు ఐదువేల మంది కలిస్తే తప్ప ఆ ధనువును ఒకచోట నుంచి మరొకచోటకు కదపలేరు. అష్టధాతువులతో నిర్మితమైన ఆ ధనువును చతుర్దశినాడు పూజించి యజ్ఞమంటపంలో ఉంచారు. పూర్వం భృగువంశీయుడైన పరశురాముడు ఆ ధనువునిచ్చాడు. మాధవుడాధనువును చూశాడు. అది చుట్టచుట్టుకొని ఉన్న శేషనాగమువలె ఉంది. పౌరులంతా నివారిస్తున్నప్పటికీ శ్రీకృష్ణుడు ఆ ధనువును ఎక్కుపెట్టి ఆ నారిని చెవివరకు లాగాడు. ఆ ధనువును కృష్ణుడు మత్తేభం చెఱకుగడను విరిచినట్లుగా విరిచివేశాడు. విరిగిన ధనువు శబ్దం పెద్దగా ఉరుములు ఉరిమినట్లు వినిపించింది. కంసుని హృదయం భయకంపితమయింది. ఆ ధనువును రక్షిస్తున్న వీరులు ఒక్కసారిగా వారి మీదకు విజృంభించేసరికి బలరామకృష్ణులు ఆ విరిచిన వింటి ముక్కలు చేతితో తీసికొని ఆ వీరులను చావమోదారు. ఆ ఐదువేల మంది రాక్షసవీరులు ప్రాణాలు కోల్పోయారు.భోజరాజైన కంసుని సభామంటపంలో ఉన్న ఛత్రం అకస్మాత్తుగా విరిగి నేలపై పడింది.

రజకుని మృతి వృత్తాంతము, ధనుర్భంగము, దైత్యుల వధ విషయములు విన్న కంసునకు అమితమైన భయం కలిగింది. ఆ సమయంలో ఆతనికి అనేక అపశకునాలు కనిపించాయి. ఉదయమే నిద్రలేచి ఆనాడు మల్లక్రీడా మహోత్సవం జరపటానికి ఆజ్ఞాపించాడు. సభామంటపం ఎదుట విశాలమైన ప్రాంగణంలో రంగభూమిని సిద్ధం చేశారు. సుందర సోపానాలతో, మణిమయస్తంభాలతో రంగభూమిని శోభా వహంగా తీర్చిదిద్దారు. మహారాజు కోసం వేదికమీద ఉన్నత సింహాసనం అమర్చారు. దానిపై కూర్చున్న కంసుడు పర్వతశిఖరంపై కూర్చున్న సింహంలా భాసింపసాగాడు. గాయకులు గీతాల నాలపిస్తున్నారు,. మృదంగ పటహ తాళ భేరీ నినాదాలు వినిపింపసాగాయి. నర్తకీమణులు నాట్యం చేస్తున్నారు. జనపదులు, పౌరులు, మండలాధీశులు పందిళ్ళలో కూర్చొని మల్లయుద్ధం చూస్తున్నారు. చాణూర ముష్టిక, కూట, శల,తోశలాది మల్లయుద్ధ ప్రవీణులు తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. కంసునిచేత ఆహ్వానింపబడిన నందాది గోపకులు వచ్చి కంసునకు శిరసువంచి నమస్కరించి తెచ్చిన కానుకలు సమర్పించి ఒక్కొక్కరే వెళ్ళితమ తమ స్థానాలలో ఆసీనులయ్యారు. బాణాసుర, జరాసంధ, నరకాసురులు కూడా కంసునకు కానుకలు పంపారు.

## కువలయా పీడము :

ఆ సమయంలో మాయామానుష వేషధారులైన బలరామకృష్ణులు మల్లుల ప్రదర్శనచూడటానికి రంగశాలలోనికి వచ్చారు. రంగమంటప ద్వారం దగ్గర కువలయాపీడ మత్తేభం నిలబడిఉంది. దాని కుంభస్థలంపై సిందూర కస్తూరికా పత్రరచన లున్నాయి. దాని గండస్థలం నుంచి మదజలం స్రవిస్తున్నది. మార్గానికి అడ్డంగా నిలబడియున్న కువలయాపీడాన్ని చూచి శ్రీకృష్ణుడు దాని మావటివానితో "ఈ ఏనుగును ప్రక్కకు తీసి మాకు దారివ్వు. లేకపోతే నిన్ను ఆ ఏనుగును ఇప్పుడు హతంచేస్తా" నన్నాడు. దానికి కుపితుడైన ఆ మావటివాడు మదించిన ఆ గజాన్ని కృష్ణుని మీదకు ఉసికొల్పాడు. ఆ మదగజం తన తొండంతో కృష్ణుణ్ణి పట్టుకొని పైకి లేపింది. కృష్ణుడు ఒక్కసారిగా తన భారాన్ని పెంచి దాని పట్టునుంచి బయటపడ్డాడు. బృందావన నికుంజాలలో అటుఇటు తిరుగుతూ దాగినట్లుగా కృష్ణుడు అటుఇటు తిరుగుతూ ఆ మత్తేభం కాళ్ళక్రింద దాక్కున్నాడు. ఆ ఏనుగు తొండం పెంచి ఆతనిని పట్టుకున్నది. కృష్ణుడు రెండు చేతులతో ఆ తొండాన్ని వెనుకకు నెట్టి

తాను ఏనుగు వెనుకకు వచ్చేశాడు. వెంటనే ఏనుగు వెనుకకు తిరిగి కృష్ణుణ్ణి పట్టుకొనటానికి ప్రయత్నించింది. కృష్ణుడు దాని మస్తకంపై ఒక్కదెబ్బ కొట్టి ముందుకు పరుగెత్తాడు. అప్పుడు బలరాముడు గరుడుడు సర్పాన్ని పట్టుకున్నట్లుగా ఆ గజరాజు తోకను పట్టుకొని వెనుకకు లాగసాగాడు. కృష్ణుడు మందస్మిత వదనంతో రెండుచేతులతో దాని తొండాన్ని పట్టుకొని ముందుకు గుంజసాగాడు. ఆ యిరువురి మధ్య మత్తేభము నలిగిపోయింది. అప్పుడు నలుగురు మావటివాళ్ళు ఆ ఏనుగుపైకి ఎక్కారు. వారు అంకుశాలతో దాని కుంభస్థలంపై కొడుతుంటే ఆ బాధ భరింపలేక ఆ మదగజం కృష్ణునిపైకి విజృంభించింది. కృష్ణుడు దాని తొండం పట్టుకొని అటుయిటు గిరగిరా త్రిప్పిత్రిప్పి బాలకుడు కమండలువును నేలకేసి కొట్టినట్లు ఆ ఏనుగును నేలకేసి కొట్టి చంపాడు. దానిపై నున్న మావటివాళ్ళు తలొకదారి పట్టి పరుగులు తీశారు. ఆ కువలయాపీడం శరీరం నుంచి ఒక జ్యోతివచ్చి ఘనశ్యామునిలో విలీనమయింది. బలరామకృష్ణులు దాని రెండు దంతాలనుపట్టిలాగారు. సింహకిశోరాలు అరణ్యంలో మిగిలిన జంతువుల్ని వేటాడి నట్లుగా బలరామకృష్ణులు తమపైకి వచ్చిన మావటివాళ్ళను మృత్యుముఖంవైపు పంపించారు. బంధువులు పౌరులు జయజయనాదాలు చేస్తుండగా వారిద్దరూ అగ్నివాయువులవలె వేగంగా రంగస్థలంపైకి వచ్చారు.

మల్లులువారిని మహామల్లులుగా భావించారు. నరులు వారిని చూచి నరేంద్రు లుగా తలచారు. నారీమణులు వారిని మన్మథరూపులుగా చూచారు. వ్రజవాసులు బృందావనాధిపతులుగా భావించారు. తండ్రికివారు తనయులుగా, దుష్టులకు యమధర్మరాజు రూపాలుగా అనిపించారు. కంసునకు వారు తన మత్యురూపాలుగా, జ్ఞానులకు విరాట్బ్రహ్మ స్వరూపులుగా కనిపించారు. ఏయే భావం గలవారు శ్రీహరినిఆ సమయంలో ఆయాభావాన్ననుసరించి దర్శించారు. కువలయాపీడాన్ని సంహరించిన విషయం విని కంసుడు వారిని చూచి భయవిచలితుడౌతున్నాడు. మిగిలినవారు చంద్రుణ్ణి చూచి చకోరాలు సంతసించినట్లుగా కృష్ణుణ్ణిచూచి పరమానందభరితులౌతున్నారు.

**చాణూర ముష్టికులు :**

ఆ సమయంలో చాణూరుడు వచ్చి "బలరామకృష్ణులారా! ఇప్పుడు మీరు

కంసమహారాజు ఎదుట మాతో మల్లయుద్ధం చెయ్యాలి. ఈ ప్రదర్శన చూచి మహారాజు మీకు బహుమానాలు ప్రసాదిస్తారు" అని పలికాడు. అప్పుడు కృష్ణుడు "ఈరాజు అనుగ్రహంవల్లనే మాకు మొదటినుంచి మంచి జరుగుతున్నది. కాని ఒక విషయం. మాతో సమానమైన వారితోనే మాకు పోరాటం యోగ్యంగా ఉంటుంది. అంతేకాని మేము బలవంతులతో యుద్ధం చేయటం సమంజసంకాదు. అధర్మయుద్ధం పద్ధతి కాదుకదా!" అని అన్నాడు. అందుకు చాణూరుడు "మీరు బాలకులుకారు బలవంతులలోకెల్లా బలిష్ఠులు. వేయి ఏనుగుల బలంకలిగిన కువలయాపీడమదగజాన్ని మీరిద్దరు అవలీలగా సంహరించారు" అన్నాడు.

చాణూరుని ఈ మాటలు విని అరిమర్దనుడైన కృష్ణపరమాత్ముడు చాణూరుని తోటి, బలరాముడు ముష్టికునితోటి మల్లయుద్ధానికి దిగారు. ఒకరి భుజదండాలను మరొకరుపట్టుకొని తన పక్షం వైపు లాగుతూ, ఎదుటిపక్షంవైపు నెడుతూ బలరామకృష్ణులు ఇద్దరూరెండు మదగజాలవలె శత్రువులతో పోరాడు తున్నారు. శ్రీకృష్ణుడు చాణూరుని శరీరాన్ని రెండుచేతులతో పైకిఎత్తాడు. చాణూరుడు భగవంతుడైన కృష్ణుణ్ణి అదేవిధంగా ఒక్కచేత్తోపైకి ఎత్తాడు. ఆదృశ్యం ఆదిశేషుడు భూమండలమంతటినీ తన పడగ మీద భరించినట్లుగా అనిపించింది. మాధవుడు వేగంగా వచ్చి తన భుజబలంతో చాణూరుని మెడ ప్రక్కకు, నడుంప్రక్కకు చేతులు పోనిచ్చి ఆకాశానికి ఎత్తి నేలపై విసిరికొట్టాడు. ఒకప్రక్క శ్రీకృష్ణుడు చాణూరుణ్ణి, మరొకప్రక్క బలరాముడు ముష్టికుణ్ణి మల్లయుద్ధంలో ముష్టాముష్టి బాహాబాహి పోరాడి హతమార్చసాగారు.

ఈ దృశ్యాన్ని చూచి మధురాపురకాంతలు తమలోతాము ఇలా అనుకొనసాగారు. "మహారాజు ఎదుటనే ఎంతటి అధర్మ యుద్ధం జరుగుతున్నది? వజ్ర శరీరులైన ఈ మల్ల యుద్ధ ప్రవీణులెక్కడ? వ్రజవాసులైన ఈ సుమసుకుమార శరీరులెక్కడ? ఇన్నేళ్ళ తరువాత కృష్ణుని దర్శనం కలుగుతున్నది కదా అనుకుంటే ఇది ఇలా, ఈ యుద్ధరంగంలోనా? మధుర వాసులమైన మనం ఎంతటి అభాగ్యులం! రాసక్రీడలో కృష్ణుణ్ణి దర్శించే వనవాసులైన గోపకులు ఎంతటి భాగ్యవంతులు! ఓ సఖులారా! దుష్టుడైన ఈ రాజుకు మనం ఏ సలహాను ఇవ్వలేము. అందువల్ల బలరామ కృష్ణులు ఈ మల్లయుద్ధంలో శత్రువులపై విజయం సాధించాటానికి మనం మన పుణ్యఫలాన్ని త్యాగం చేద్దాము."

బలరామకృష్ణుల్ని ఈ స్థితిలో చూచిన నందుని మనస్సు కరుణతో నిండి పోయింది. శ్రీకృష్ణుడు నందుని మనసు నెరిగి, మహిళామణుల భావాన్ని గ్రహించి చాణూరుణ్ణి తుదముట్టించటానికి సంకల్పించి ప్రభంజనం కమలాన్ని విసిరి వేసినట్లు అతనిని ఆకాశంలోకి విసిరివేశాడు. బలరాముడు ముష్టికుణ్ణి ఆకాశంలో గిరగిరా తిప్పి గరుడుడు సర్పాన్ని పట్టినట్లు పట్టుకొని నేలపై విసిరికొట్టాడు. ఆవిధంగా వారిద్దరిని సంహరించిన తరువాత కృష్ణుడు తన మీదకు వచ్చిన శల, తోశలాది మల్లయోధుల్ని తన బాహుబలంతో హతం చేశాడు. ఈ దృశ్యాలను చూచిన పురవాసులు జయజయ నినాదాలు చేశారు. అందుకు క్రుద్ధుడై కంసుడు "బలరామ కృష్ణుల్ని నగరం నుంచి వెళ్ళగొట్టండి. వ్రజవాసుల సంపదలు హరించి వేసి నందుణ్ణి చెరసాలలో బంధించండి. ఈరోజు దుర్బుద్ధియైన నాతండ్రి ఉగ్రసేనుణ్ణి కూడా హతంచేయాలి. ఎక్కడెక్కడ వృష్ణివంశీయులు కనిపిస్తారో వారందర్ని సంహరించి వేయండి! అని ఆజ్ఞాపించాడు.

**కంస హరణం :**

ఆమాటలు వింటూనే క్రోధంతో శ్రీకృష్ణుడు ఒక్కసారిగా సింహాసనంపైకి లంఘించాడు. కంసుడు భయభ్రాంతుడై లేచి నిలబడి కరవాలం చేతపట్టాడు. కృష్ణుడు కంసుణ్ణి రెండుచేతులతో బిగించి పట్టుకొనేసరికి ఆతని చేతిలోని కత్తిదూరంగా వెళ్ళి పడింది. వారిద్దరూ ఆ వేదికపై పర్వత శిఖరంపై సింహాల వలె పోరాడ సాగారు. కృష్ణుడు కంసుణ్ణి ఎత్తి నేలపైకొట్టి హతమార్చాడు. ఒక కీటకం తుమ్మెదను భావించి భావించి దాని రూపాన్ని పొందినట్లు, బలవంతుడైన కంసుడు వైరభావంతో దేవదేవుడైన శ్రీకృష్ణుణ్ణి నిరంతరము స్మరించిన కారణంగా ఆతనికి సారూప్యం ప్రాప్తించింది. కంసుని మృతికి కోపించి ఆతని ఎనిమిదిమంది సోదరులు సుహ్రుతుడు, సృష్టి న్యగ్రోధుడు, తుష్టిమంతుడు, రాష్ట్రపాలకుడు, సునాముడు, కంకుడు, శంకుడు ఆయుధాలు చేతపట్టి అచ్యుతునిపైకి లంఘించారు. వెంటనే బలరాముడు నాగలి చేతపట్టి హుంకరించేసరికి వారంతా సింహ గర్జనవిన్న మృగాలవలె భయభ్రాంతులై పారిపోయారు. తిరిగి కపటంతో చుట్టుముట్టిన కంస సహోదరుల్ని బలరామకృష్ణులు నేలకూల్చివేశారు. దేవతలు పుష్ప వృష్టి కురిపించారు. విద్యాధర గంధర్వ కాంతలు ఆనందంగా నృత్యం చేశారు. బ్రహ్మాది దేవతలు కృష్ణ పరమాత్ముణ్ణి స్తుతించారు. అప్పుడు కంసుని రాణులు అస్తి, ప్రాప్తి అనువారలు వచ్చి కంసుని మృత శరీరంవద్ద

దు:ఖిస్తూ "నీవు నిర్దయతో నీసోదరికి జన్మించిన నవజాత శిశువులను హత్యగావించావు. పదిరోజుల లోపు వయసుగల పసిబిడ్డలను ఎంతమందిని సంహరింపచేశావు! ఆఘోరపాపాల కారణంగానే నీకీనాడు ఇటువంటి దశ ప్రాప్తించింది" అని కుమిలిపోసాగారు. కరుణామయుడైన శ్రీకృష్ణుడు వారిని ఊరడించి, యమునాతీరంలో మేనమామలకు పారలౌకిక క్రియలు జరిపించాడు.

## దేవకీ వసుదేవుల బంధ విముక్తి :

అనంతరం బలరామకృష్ణులు కారాగారంలో ఉన్న దేవకీ వసుదేవుల దగ్గరకు వెళ్ళారు. వీరిద్దరినీ చూడగానే దేవకీవసుదేవుల బంధాలు గరుత్మంతుణ్ణి చూచినప్పుడు నాగపాశ బంధాలు విడిపోయినట్లు వాటంతటవి విడిపోయాయి. వారు ఆనంద బాష్పాలు స్రవిస్తుండగా కుమారులను దగ్గరకు తీసికొని పరమానందాన్ని అనుభవించారు. శ్రీకృష్ణుడు వారిద్దరిని ఊరడించి అనంతరం మాతామహుడైన ఉగ్రసేనుణ్ణి మధురకు మహారాజును గావించాడు.

## గురుదక్షిణ :

ధర్మజ్ఞుడైన వసుదేవుడు యాదవ పురోహితుడైన గర్గాచార్యుని పిలిపించి బలరామకృష్ణులకు యజ్ఞోపవీతసంస్కారాన్ని జరిపించాడు. అనంతరం సమస్త విద్యలను అధ్యయనం చేయటానికి బలరామకృష్ణులు సాధారణ మానవులవలె సాందీపని మహర్షి దగ్గరకు వెళ్ళారు. గురువర్యునకు పరిచర్యచేసి వారిద్దరూ అతికొద్ది సమయంలోనే సమస్త విద్యలను నేర్చి విద్వాంసులలో శిరోమణులయ్యారు. అప్పుడు వారు చేతులు జోడించి గురువుగారిని దక్షిణకోరుకొనుమని ప్రార్థించారు. వారిని చూచి సాందీపని గురుదక్షిణగా మృతుడైన తమ పుత్రుణ్ణి తెచ్చి యిమ్మని కోరాడు. వెంటనే బలరామకృష్ణులు రథాన్ని అధిరోహించి ప్రభాస తీర్థంలో సముద్రం దగ్గరకు వెళ్ళారు. వీరి రాకను చూచి సముద్రుడు భయకంపితుడై, అనేక రత్నాలను కానుకగా యిచ్చి వారి చరణాలను శరణువేడాడు. అప్పుడు కృష్ణుడు "నీవు వెంటనే మాగురుదేవుని పుత్రుని తీసికొనిరా. నీవునీ ప్రచండమైన కెరటాల తాకిడతి ఆ బ్రాహ్మణ బాలుణ్ణి అపహరించావు" అన్నాడు. అందుకు సముద్రుడు "ఓ భగవాన్! దేవ దేవా! నేను ఆ బ్రాహ్మణ బాలుణ్ణి అపహరించలేదు. ఆ అపహరణ చేసింది శంఖరూపధారి అయిన పంచజనుడనే అసురుడు. ఆతడు నాలోపలనే నివసిస్తున్నాడు. మీరు

అతణ్ణిసంహరించి బాలుణ్ణిపొందవచ్చు" అని పలికాడు. ఆమాటలు విని కృష్ణపరమాత్ముడు ఒక్కసారి నడుం బిగించి సముద్రంలోకి దూకాడు.

త్రిలోకాలను ధరించే పరమాత్ముడు ఆవిధంగా విజృంభించేసరికి సముద్రమంతా అల్లకల్లోలమైపోయింది. ఆసన్నివేశం వజ్రకూటపర్వతం సముద్రాన్ని మథించిన దృశ్యాన్ని గుర్తుకు తెస్తున్నది. సముద్ర మధ్యంలో కృష్ణునికి పంచజనుడికి జరిగిన ఘోరయుద్ధంలో పంచజనుడు మృతిచెందాడు. పరమాత్ముడు ఆతని శరీరంలో లభించిన శంఖాన్ని తీసికొని సముద్రంనుంచి వెలువడి రథంపై ఆసీనుడయ్యాడు. అనంతరం వారు రథంపై యమరాజ పురానికి చేరుకున్నారు. అక్కడ గోవిందుడు గావించిన మేఘ గర్జనతో సమానమైన పాంచజన్యధ్వనిని విని యముడు భీతి చెందాడు. యమపురిలో అనేక నరకాలలో పడియున్న లక్షలాదిమంది పాపాత్ములు ఈ ధ్వనిని విని మోక్షం పొందారు. యముడు వచ్చి బలరామకృష్ణులను భక్తితో పూజించి "ఓ కృపాసింధువులారా! పురాణపురుషులారా! మహామహితాత్ములారా! నేను మీకై చేయగల కర్తవ్యాన్ని ఆదేశించండి" అని పలికాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తాము గురుపుత్రుని కొరకై వచ్చిన వృత్తాంతాన్ని వివరించాడు. అంతట యమరాజు గురుపుత్రుణ్ణి తీసికొని వచ్చి కృష్ణపరమాత్మునకు అప్పచెప్పాడు. కృష్ణుడు ఆబాలుణ్ణి తీసికొని అవంతీపురానికి వచ్చి గురువర్యులకు అప్పగించాడు. అనంతరం గురువుగారి ఆశీస్సులను స్వీకరించి బలరామకృష్ణులు రథాన్ని అధిరోహించి మధురాపురికి వచ్చారు.

ఒకనాడు బలరామకృష్ణులు అపారమైన అనుగ్రహంతో అక్రూరుని ఇంటికి వెళ్ళారు. ఆశ్చర్యచకితుడైన అక్రూరుడు ఆనందపారవశ్యంతో పులకించి పోయాడు. ఆతని.మనోరథం నెరవేరింది. ఆతడు అశ్రుపూర్ణ నేత్రుడై "ఓ స్వామీ! మార్గమధ్యంలో నేను పలికిన మాటలను గుర్తుపెట్టుకొని నీవీనాడు నాకోర్కెను నెరవేర్చావు. నీవు పురుషోత్తముడవు. గోబ్రాహ్మణ, వేద ధర్మాలను రక్షించటం కోసం మీరు యదువంశం లో అవతరించారు. రాక్షస సంహారం చేయటానికి గోలోకధామంనుంచి ఈభూమండ లానికి దిగివచ్చారు. మీఇరువురకు హృదయపూర్వక ప్రణామాలు" అనిపలికాడు. అప్పుడు శ్రీకృష్ణుడు "నీవు గురుజనుడవు నీముందు నేను బాలకుణ్ణి. ఓ మహామతీ! సాధుపురుషులు ఎన్నడూ తమ ఆధిక్యమును ప్రకటించరుగదా!" అని పలికి బలరామునితో బయలుదేరాడు.

శ్రీకృష్ణ పరమాత్ముడు అంతకుముందు తానిచ్చిన మాట గుర్తుకువచ్చి ఉద్ధవునితో కలిసి మంగళప్రదమైన కుబ్జ భవనానికి వెళ్ళాడు. రూపవతియైన కుబ్జ తన ఇంటికి విచ్చేసిన శ్రీకృష్ణుణ్ణి చూచి భక్తిభావంతో సకలోపచారాలు చేసి పూజించింది. పరమాత్ముణ్ణి ప్రాణవల్లభుడుగా పొందిన కుబ్జ అదృష్టం పరమా శ్చర్యాన్ని కలిగిస్తుంది. మాయామానుషరూపధారియైన మాధవుడు ఎనిమిదిరోజులు కుబ్జభవనంలో ఉండి తొమ్మిదవనాడు వసుదేవుని గృహానికి చేరుకున్నాడు. ఓ విదేహరాజా! శ్రీకృష్ణుని ఈ మధుర వృత్తాంతం పాపహరమైనది, పుణ్యాదాయకమైనది.

## రజకుని పూర్వజన్మ :

నారదమహర్షి చెప్పిన మాటలను ఆలకించి బహుళాశ్వుడు - ఓ దేవర్షీ! నీవల్ల శ్రీకృష్ణపరమాత్ముని దివ్యచరిత్రను మరింత తెలిసికొనవలెనని ఆసక్తికలుగుతున్నది. మధురానగర మార్గంలో కృష్ణునిచే హతుడైన రజకుని ఆత్మజ్యోతి శ్రీకృష్ణునిలో లీనమయినదన్నావు కదా! ఆరజకుని పూర్వజన్మ వృత్తాంతం ఎటువంటిది? పరమాత్ముడు ఆతనిని ఎందుకు వధించాడు? తెలియజేయవలసిన" దని వేడుకున్నాడు.

అప్పుడు నారదమహర్షి ఇలా చెప్పసాగాడు - ఓరాజా! త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు అయోధ్యానగరాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన రాజ్యకాలంలో ప్రజల మనోభావాలను, సుఖదు:ఖాలను తెలిసికొనటం కోసం గూఢచారులు రాజ్యంలో సంచరిస్తూ ఉండేవారు. ఒకరోజున ఒక గూఢచారి వింటూఉండగా ఒక రజకుడు తన భార్యతో "నీవు దుష్టురాలవు. నీవు పరుని ఇంట ఉండి వస్తున్నావు. ఇందువల్ల నేను నిన్ను స్వీకరింపను. రామచంద్రుడు స్త్రీ లోభం వల్ల సీతను మరల స్వీకరించాడు కాని నేను మాత్రము నిన్ను అంగీకరింపలేను" అన్నాడు. ఈ విషయం తెలిసికొన్న రఘురాముడు లోకాపవాద భయంవల్ల వెంటనే జానకిని అరణ్యాలలో పరిత్యజించాడు. రఘుకులతిలకుడైన శ్రీరామచంద్రునకు ఆ రజకుని దండించాలని అప్పుడు అనిపించలేదు. ఆరజకుడే ద్వాపరయుగాంతంలో మధురాపురంలో మరల రజకుడుగానే జన్మించి భగవన్నిందకు పూనుకున్నాడు. ఆ దోషనివృత్తికై శ్రీహరి స్వయంగా ఆతనిని వధించాడు.

## వాయకుని పూర్వజన్మ :

బహుళాశ్వుడు ఈవృత్తాంతం విని "మునివరా! ఈసన్నివేశం నాకెంతో

ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. మధురానగరంలో బలరామకృష్ణులకు నూతన వస్త్రాలను అందంగా కట్టబెట్టిన నేతవాని పూర్వజన్మ వినాలని ఉన్నది. అనిపలికాడు. అప్పుడు నారదమహర్షి ఇలా చెప్పసాగాడు - ఓరాజా! పూర్వం మిథిలా నగరంలో శ్రీహరిభక్తుడైన ఒక సాలెవాడు ఉండేవాడు. ఆతడు శ్రీరామచంద్రుని వివాహసమయంలో సీరధ్వజుడైన జనకుని ఆజ్ఞప్రకారం రామలక్ష్మణులకు మధు పర్కాలను నెలల తరబడి శ్రద్ధతో నైపుణ్యంగా తయారుచేసి యిచ్చాడు. ఆతడు నేతకళలో కౌశల్యం కలవాడు. సౌందర్య సమన్వితమైన ఆతడు నేసిన ఆవస్త్రాలను రామ లక్ష్మణులు ధరించి కోటిమన్మథుల లావణ్యంతో ప్రకాశించారు. ఆసమయంలో వారిని చూచిన ఆవాయకుడు మోహితుడయ్యాడు. అప్పుడు ఆతని మనస్సులో "నేను ఎప్పుడు నాహస్తాలతో స్వయంగా వీరికి వస్త్రాలను ధరింపచేస్తాను?" అనుకున్నాడు.

సర్వజ్ఞుడైన రఘురాముడు ఆతని మనోరథాన్ని గ్రహించి "ద్వాపరయుగాంతంలో నీకోరిక నెరవేరుతుంది" అని ఆశీర్వదించాడు. రామచంద్రుని అభయ ప్రదానం వల్ల ఆతడే మధురానగరంలో వాయకుడై రామకృష్ణుల దగ్గరకు వచ్చి వారికి తనివితీరా అలంకారం చేసి తనకోరిక నెరవేర్చుకున్నాడు. చివరకు ఆతనికి సారూప్యప్రాప్తి కలిగింది.

## సుదాముని పూర్వజన్మ :

ఈ వృత్తాంతం విని బహుళాశ్వుడు సంతసించి సుదాముని పూర్వజన్మ విషయం తెలుపుమని ప్రార్థించాడు. నారదమహర్షి ఇలా చెప్పసాగాడు - ఓరాజా! రాజరాజైన కుబేరునకు, పరమరమణీయమైన సుందరవనమొకటి ఉన్నది. దానిపేరు చైత్రరథం. అక్కడ హేమమాలి అనుపేరుగల మాలాకారుడున్నాడు. ఆతడు విష్ణుభక్తి తత్పరుడు, శాంతుడు, దానశీలుడు. ఆతడు శ్రీహరిప్రాప్తికోసం దేవతలకు పూజలు చేస్తూ ఉండేవాడు. ప్రతిరోజు మూడు వందల వికసిత పరిమళ పద్మాలు తెచ్చి శంకరున కర్పించి ఆరాధించేవాడు. ఒకసారి కరుణాంతరంగుడైన పరమశివుడు ఆతనికి ప్రసన్నుడై "నీకు ఏమి వరం కావాలో కోరుకొను" మన్నాడు. అప్పుడు హేమమాలి "భగవాన్! శ్రీమహావిష్ణువు నాఇంటికి వచ్చి నన్నునుగ్రహించేలాచూడు. ఆస్వామిని కనులారా చూడాలని నాకోరిక!" అన్నాడు. అప్పుడు మహాదేవుడు "ఓ మహామతీ! ద్వాపరాంతంలో మధురానగరంలో నీమనోరథం నెరవేరుతుంది'

' అని పలికాడు. పరమశివుని వరదానంవల్ల మనస్వియైన ఆహేమమాలి ద్వాపరాంతంలో సుదాముడనే మాలాకారుడుగా జన్మించాడు. బలరామకృష్ణులు పరమశివుని వాక్యాన్ని నిరూపించటానికి అతని గృహానికి విచ్చేశారు.

## కుబ్జ పూర్వజన్మ :

ఈవృత్తాంతం విని బహుళాశ్వుడు పరమానందం పొంది "ఓ దేవర్షీ! సైరంధ్రిగా ఉన్న కుబ్జ దేవతలకు కూడా దుర్లభమైన కృష్ణపరమాత్ముని వలపుచూరగొన టానికిపూర్వజన్మలో ఏతపస్సు చేసింది వివరింపు"మని అడిగాడు. అప్పుడు నారదుడిలా చెప్పసాగాడు "ఓ రాజేంద్రా! కోటిమన్మథ సౌందర్యస్వరూపుడైన శ్రీరామచంద్రుడు పంచవటిలో విహరిస్తున్నప్పుడు, శూర్పణఖ అనేరాక్షసి ఆయనను చూచి అత్యంత మోహితురాలయింది. రఘురాముడు ఏకపత్నీవ్రతం నియమంతో ఉండి అన్యస్త్రీని ఎంతమాత్రం అభిలషించటంలేదని భావించి రావణుని సోదరియైన ఆ శూర్పణఖ క్రోధంతో సీతను తినటం కోసం వేగంగా వెళ్ళింది. ఆ సమయంలో శ్రీరాముని సోదరుడైన లక్ష్మణుడు ఆగ్రహించి పదునైన కత్తితో ఆమె ముక్కుచెవులు కోసి పంపాడు. శూర్పణఖ పెద్దగా రోదిస్తూ లంకకు వెళ్ళి రావణునకు ఈసమాచార మంతా చెప్పి ఖిన్నురాలై పుష్కర తీర్థానికి వెళ్ళింది. అక్కడ నీటిలో నిలబడి శంకర భగవానుణ్ణి ధ్యానిస్తూ అనేక సంవత్సరాలు గడిపింది. ఉమాపతి ప్రసన్నుడై ఆమెకు సాక్షాత్కరించి "నీకు ఏమి వరం కావాల"ని అడిగాడు. అప్పుడు శూర్పణఖ "ఓ దేవదేవా! నీవు భక్తుల మనోరథాలు తీర్చటంలో సమర్థుడవు. నాకు పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు పతిఅయ్యేలాగా వరాన్ని ప్రసాదించు" అని అడిగింది. అప్పుడు శివుడు "ఓ రాక్షసీ! ఈ వరం నీకు ఇప్పుడు నెరవేరేది కాదు. ద్వాపరాంతంలో నీకోరిక నెరవేరుతుంది" అని పలికాడు.

ఓ మహారాజా! కామరూపధారణ చేయగల ఆశూర్పణఖ రాక్షసి మధురానగరంలో కుబ్జఅనే పేరుతో జన్మించింది. మహాదేవుని వరంవల్లనే ఆమె శ్రీకృష్ణుని పతిగా పొందగలిగింది" అని చెప్పి నారదుడు కువలయాపీడ మత్తేభ పురాకృత సుకృత విశేషాన్ని ఇలా వివరింపసాగాడు.

## కువలయాపీడ పూర్వజన్మ :

మహారాజా! బలిచక్రవర్తికి బలవంతుడైన, మహాకాయుడైన మందగతి

అనేకుమారుడున్నాడు. ఆతడు సమస్త శస్త్ర ధారులలో శ్రేష్ఠుడు. ఆతడు అనేక గజముల బలంతో సమానమైన బలశాలి. ఒక పర్యాయం శ్రీరంగనాథుని ఊరేగింపు సమయంలో ఆతడు జనసముద్రంలో దూసుకువెళుతున్నాడు. మదించిన ఏనుగువలె మందగతి భుజబల గర్వితుడై వెళుతుంటే ఆతని భుజముల తాకిడికి జనం నలిగిపోయారు. ఆమార్గంలో పయనిస్తున్న వృద్ధుడైన త్రిత మహర్షి మందమతి బాహువు తగిలి క్రిందపడ్డాడు. ఆయన కుపితుడై బలికుమారుని చూచి "ఓ దుర్మతీ! నీవు మదగజంవలె మదోన్మత్తుడవై శ్రీరంగని యాత్రలో ప్రజల్ని పీడిస్తున్నావు. నీవు గజరూపాన్ని ధరిస్తావుపో" అని శపించాడు. ఆవిధంగా శప్తుడైన ఆదైత్యుడు తేజోభ్రష్టుడై క్రిందపడిపోయాడు. వెంటనే ఆతడు మునిప్రభావాన్ని తెలిసికొని చేతులు జోడించి "ఓ కృపాసింధూ! నాకు గజరూపం నుంచి ఎప్పుడు విముక్తి కలుగుతుంది' ' త్వరగా విన్నవించండి. ఇకనుంచి నేను మీవంటి మహాత్ములను ఎన్నటికీ అవహేళన చేయను. తమరు శపించుటలోను, అనుగ్రహించుటలోను సమర్థులు" అని పలికాడు. ఈ మాటలకు ఆమునిక్రోధం మాయమయింది. ఆతడు మందమతితో "ఓ దైత్యరాజా! నామాట ఎన్నటికీ అబద్ధం కాజాలదు. నేను నీ పశ్చాత్తాపానికి ప్రసన్నుడనయ్యాను. నీవు శోకింపకు. దేవతలకు కూడా దుర్లభమైన వరాన్ని నీకు ప్రసాదిస్తున్నాను. మధురానగరంలో కృష్ణపరమాత్ముని చేతిలో నీకు ముక్తి కలుగు తుంది" అని ఓదార్చాడు.

ఆ మందమతి దైత్యుడే వింధ్య పర్వతంమీద కువలయాపీడ మత్తేభంగా జన్మించాడు. ఆ మత్తేభం పదివేల ఏనుగుల బలం కలది. దానిని మగధరాజు జరాసంధుడు అనేక వేల ఏనుగుల సహాయంతో అరణ్యంలో పట్టుకున్నాడు. ఆతడు ఆ మత్తేభాన్ని కంసునకు వరదక్షిణగా యిచ్చాడు. త్రితముని వాక్యానుసారం అతని ఆత్మతేజస్సు శ్రీకృష్ణునిలో లీనమయింది.

**చాణూర మల్లుల పూర్వజన్మ :**

ఈవృత్తాంతం విని బహుళాశ్వుడు సాక్షాత్తు పరమాత్మునితో మల్లయుద్ధం చేసిన చాణూరాది మల్లుల వృత్తాంతం వివరింపుమనగా నారదమహర్షి ఇలా వివరింపసాగాడు - పూర్వకాలంలో అమరావతి నగరంలో ఉతథ్యుడనే మహర్షి నివసిస్తుండేవాడు. ఆతనికి మన్మథరూపులైన ఐదుగురు కుమారులుండేవారు. వారు

విద్యా, స్వాధ్యాయాదులను విడనాడి ఉన్మత్తులై ప్రతిరోజు బలిదగ్గరకు వెళ్ళి మల్ల యుద్ధం నేర్చుకొనసాగారు. తనపుత్రులు బ్రాహ్మణోచిత కర్మలనుండి భ్రష్టులవటం చూచి ఉతథ్యుడువారితో "శమ దమ తపాదులు బ్రాహ్మణధర్మములు. శౌర్య ధైర్య దాన పరాక్రమాదులు క్షత్రియ ధర్మములు. మీరు బ్రాహ్మణ దర్మములు విడిచి క్షత్రియోచితమైన మల్ల యుద్ధంలో నిమగ్నులయ్యారు. మీరు మల్లులై దుర్జనుల సాంగత్యంలో భ్రష్టులైపోతారు" అన్నాడు.

ఆ ఉతథ్యుని కుమారులే ఈ మల్లులుగా జన్మించారు. చాణూర, ముష్టిక, కూట, శల, తోశలులనే ఈ మల్లులు శ్రీకృష్ణుని దివ్యశరీర స్పర్శను గాఢంగా పొందిన కారణంచేత వారికి మోక్షప్రాప్తి కలిగింది.

## కంస సోదరుల పూర్వజన్మ :

మహారాజా! కంసుని ఎనిమిది మంది సోదరులపూర్వజన్మ వృత్తాంతం విను. పూర్వం కుబేరుని రాజధానియైన అలకానగరంలో దేవయక్షుడనే పేరుగల ఒక యక్షుడుండేవాడు. ఆతడు జ్ఞానపరాయణుడు, శివభక్తి యుతుడు, మహాతేజస్వి. ఆతనికి దేవకూట, మహాగిరి, గండ, దండ, ప్రచండ, ఖండ, అఖండ, పృధు లనే ఎనిమిదిమంది కుమారులున్నారు. ఒకనాడు అరుణోదయసమయంలో శివపూజ కోసం సహస్రపుండరీక పుష్పాలను తీసికొనిరమ్మని దేవయక్షుడు వారిని ఆజ్ఞా పించాడు. వారు మానససరోవరంనుంచి మకరంద సహితమైన పరిమళ భరితమైన సహస్ర కమలాలను తెచ్చి వాటిపరిమళానికి ఆకర్షితులై వాటిని ఆఘ్రాణించి తండ్రికి సమర్పించారు. ఆవిధంగా వారు ఉచ్ఛిష్టాలను శివపూజకు సమర్పించిన కారణంగా వారు మూడు జన్మలు అసురులుగా జన్మించారు. బలరాముని చేత హతంచేయబడి వారుముక్తులై మోక్షం పొందారు.

## పంచజనుని పూర్వజన్మ :

బహుళాశ్వుడు నారదమహర్షితో "ఈ శంఖరూపధారి పంచజన దైత్యుడు పూర్వజన్మలో ఎవరు? అతని అస్థులు శంఖమై కృష్ణపరమాత్ముని కరకమలములలో శోభించటానికి కారణం ఏమిటి?" అని అడిగినప్పుడు మహర్షి ఇలా చెప్పసాగాడు - ఓ విదేహరాజా! పూర్వకాలంలోనే సుదర్శన చక్రాదులు శ్రీహరికి ఉపాంగములుగా

ఉన్నాయి. వీనిలో పాంచజన్యశంఖానికి అత్యున్నతమైన పదవి ప్రాప్తించింది. అది శ్రీహరి మధురాధరామృత పానం చేసి అహంకరించి మనస్సులో "నా కాంతి రాజహంసకాంతితో తులతూగునట్టిది. నన్ను సాక్షాత్తు శ్రీహరి తన హస్తాలతో స్వీకరిస్తాడు. నేను దక్షిణావర్త శంఖాన్ని. యుద్ధంలో విజయం ప్రాప్తించినప్పుడల్లా శ్రీకృష్ణుడు నన్ను పూరిస్తాడు. శ్రీహరి అధరామృతం క్షీరసాగర కన్యయైన లక్ష్మీ దేవికి కూడా దుర్లభమైనట్టిది. అటువంటి అదృష్టాన్ని పొందిన నేను అందరిలో శ్రేష్ఠుణ్ణి" అని భావించింది.

ఓ మహారాజా! ఈవిధంగా గర్వించిన పాంచజన్య శంఖాన్ని చూచి లక్ష్మీదేవి కోపంతో "ఓ దుర్మతీ! నీవు రాక్షసుడవగుదువుగాక!" అని శపించింది. ఆశంఖ రాజమే సముద్రములో పంచజనుడనేరాక్షసుడయింది. అయినప్పటికీ వైరభావంతో సదా భజించిన కారణంచేత మరల అది కృష్ణుని సన్నిధిని పొందగలిగింది.

**ఉద్ధవుడు :**

ఈ వృత్తాంతం విని బహుళాశ్వుడు "ఓ మునీశ్వరా! కృష్ణ పరమాత్ముడు యదువంశీయులను మధురలో నివసింపచేసి తరువాత ఏయేకార్యములు నిర్వహించాడో వివరింపవలసింది" అని అడిగినప్పుడు నారదుడిలా చెప్పసాగాడు. "ఓ రాజా! కరుణాంతరంగుడైన కృష్ణునకు ఆసమయంలో తన ఎడబాటువల్ల విరహవేదన అనుభవిస్తున్న గోకులం గుర్తుకువచ్చింది. ఒకరోజున కృష్ణుడు ఏకాంతంగా తనకు ఆప్తుడైన ఉద్ధవునిపిలిచి ప్రేమతో ఇలా అన్నాడు. "సఖుడా! నీవువెంటనే రమణీయ మైన ప్రకృతితో విలసిల్లే వ్రజమండలానికి వెళ్ళు, గోవర్ధన గిరితో, యమునా నదితో అందగించే బృందావనానికీ, గోప గోపికా జనంతో నిండిన గోకులానికి కూడా వెళ్ళు. మిత్రమా! నేనిచ్చే ఒక లేఖ మాతండ్రి నందునకు, మరొక లేఖ మాతల్లి యశోదకు ఇవ్వు. మూడవ లేఖను రాధాదేవికి ఆమె సుందరమందిరానికి వెళ్ళి ఇవ్వు. నాల్గవ లేఖను నా మిత్రులు గోపాలరకు వారి శుభములను కాంక్షిస్తూ ఇవ్వు. ఇక వందలాది గోపకాంతలకు ఒక్కొక్కరికి ఒక్కొక్క లేఖను ఇవ్వు.

నా తండ్రి నందరాజు కరుణాంతరంగుడు. ఆయన మనస్సు నిరంతరం నాపైనే ఉంటుంది. నా తల్లి యశోద శీఘ్రంగా నన్ను పిలిపించటం కోసం నన్నే స్మరిస్తూ ఉన్నది. నీవు నీతి కుశలుడవు. మంచి మంచి మాటలు చెప్పి

నీవు వారికి ప్రీతిని కలిగించు. నా ప్రాణవల్లభ రాధిక నాకోసం ఆతృతతో ఉన్నది. నేను లేకపోతే ఆమెకు ఈలోకమే శూన్యంగా ఉంటుంది. వారందరు నావియోగం వల్ల వ్యధ చెందుతున్నారు. నా సందేశాన్ని వారి కందించి వారికి శాంతిని చేకూర్చు. నీవు సంభాషణా కుశలుడవు, నా కత్యంత ప్రియమైన సుదాముడు మున్నగు గోపాలకులు అక్కడ ఉన్నారు. నావియోగం వల్ల వారుకూడా ఆత్రుతతో ఉన్నారు. నీవు వారిని కూడ మిత్రులుగా భావించి వారికి సంతోషం కలిగించు. నేను త్వరలోనే వ్రజధామానికి వస్తాను. గోపకాంతలు మిక్కిలి వ్యాకులతతో ఉన్నారు. వారి శరీర ప్రాణములు రెండూ కూడా నాపై లగ్నంచేసి ఉంచారు. వారు నాకోసం ఇహపర సౌఖ్యాలను త్యాగం చేశారు. అటువంటి వారిని నేను ఆదుకొనకుండా ఎలా ఉంటాను!

ఉద్ధవా! నేను వచ్చేటప్పుడు వారు తమ ప్రాణాలను పరిత్యజించటానికి కూడా వెనుకాడలేదు. నా సందేశ వచనాలను వారికి చెప్పి వారి వియోగ దు:ఖాన్ని శాంతింప చెయ్యి. మిత్రమా! నేను మొదట ఏ రథంమీద వ్రజమండలం నుంచి వచ్చానో అదే రథంమీద అవే గుర్రాలతో ఆ సారధితో నీవు ప్రయాణం చేసి వెళ్లు. నీవు నావలెనే అలంకరించుకో. పీతాంబరం ధరించు. వైజయంతి మాలను అలంకరించుకో. దివ్యరత్నమండిత కుండలాలను ధరించు. కోటిసూర్యసమప్రభా భాసురమైన కౌస్తుభహారాన్ని అలంకరించుకో. మనోహరంగా ఆలపించే నామురళిని, పుష్పాలంకృతమైన జగన్మోహనమైన నాదండాన్ని కూడా తీసికొని వెళ్లు. ఉద్ధవా! నావలెనే దివ్యపరిమళాలు విరజిమ్ము హరిచందనం అలదుకో. నెమలి పింఛాన్ని సిగలో తురుముకో. ఆందంగా సవ్వడి చేసే నూపురాలను పాదాలకు ధరించు. కేయూరాలను బాహువులకు ధరించు. ఇక శీఘ్రమే బయలుదేరివెళ్ళు".

శ్రీకృష్ణు డీవిధంగా చెప్పగానే ఉద్ధవుడు అంజలి ఘటించి ఆయనకు ప్రదక్షిణం చేసి రథం అధిరోహించి వ్రజధామం బయలుదేరాడు. వ్రజమండలంలోని కోట్లాది గోవులు దివ్యాభరణాలతో విభూషితమై శ్వేతపర్వతాలవలె కనిపిస్తున్నాయి. ఆగోవులు ప్రతి ఒకటీ తరుణి, సుశీల, సురూప, సద్గుణవతి గా భాసిస్తున్నాయి. వాటివెంట ఉన్న వత్సములు చూడ ముచ్చటగా శోభిస్తున్నాయి. మెడలోమువ్వలు, పాదాల అందెలు మనోహరసంగీతాన్ని వినిపిస్తున్నాయి. కొన్ని గోవులు స్వర్ణ కాంతులతో

మెరిసిపోతున్నాయి. ఆగోవులను కాచే గోపాలకులు పచ్చిక బయళ్ళలో కృష్ణలీలలను మనోహరంగా పాడుకుంటున్నారు.

## గోకులంలో ఉద్ధవుడు

దూరం నుంచి రథంమీదవస్తున్న ఉద్ధవుణ్ని చూచి కృష్ణుడని భావించి వ్రజబాలకులు ఆనందసందోహంతో ఒకరినొకరు పిలుచుకుంటున్నారు. "మిత్రమా! మనప్రియసఖుడు నందనందనుడు వస్తున్నాడు. సందేహంలేదు వచ్చేది అతడే. మేఘంవంటి నీలశరీరం, శరీరంపై పీతాంబరం, మెడలో వైజయంతిమాల, చెవులకు రత్నకుండలాలు ఆహా! ఎంతగా ప్రకాశిస్తున్నాడు వక్షస్థలంపై కౌస్తుభహారంతో, చేతిలో సహస్రదళకమలంతో తేజరిల్లుతున్నాడు. అవేఅశ్వాలు! అదే కింకిణీ శబ్దం కలిగించేరథం! ఈరథంపై బలరాముడు లేకుండగా నందనందనుడు ఒక్కడే కనిపిస్తున్నాడు".

ఓ మహారాజా! ఈవిధంగా సంభాషించుకుంటూ శ్రీదాముడు మొదలైన గోపాలకులు కృష్ణరూపాన్ని ధరించి వస్తున్న ఉద్ధవుని రథం చుట్టూచేరారు. వారు ఆశ్చర్యంతో చూచి ఇతడు కృష్ణుడుకాదు. కాని సాక్షాత్తు కృష్ణునితోసమానంగా ఉన్న ఈతడు ఎవరు?" అని అనుకొంటున్న గోపాలకులను చూచి ఉద్ధవుడు వారికి నమస్కరించి వారితో శ్యామసుందరుని గూర్చి సంభాషించాడు. "శ్రీదామా! ఇది నీసఖుడు శ్రీకృష్ణుడిచ్చిన లేఖ, దీనినినీవు స్వీకరించు. శ్రీకృష్ణుడు కుశలుడై ఉన్నాడు. మీరు కలతచెందవద్దు. బలరామునితో కలిసి త్వరలోనే కృష్ణపరమాత్ముడు ఇక్కడకు వస్తాడు" ఉద్ధవుని మాటలు విని కృష్ణుడిచ్చిన లేఖను చదువుకొని శ్రీదాముడు, వ్రజబాలకులు కంటనీరుపెట్టుకొని గద్గదస్వరంతో ఇలా అన్నారు. "ఓ మహామతీ! మీఅందరి తనువు, వైభవము, ధనము, బలము, అంత:కరణము సమస్తము నందనందనుని తోడిదే అని భావించాము. కృష్ణుడు లేనందువల్ల ఈ వ్రజమేకాదు, మాకీప్రపంచమే శూన్యమైపోయింది. కృష్ణ వియోగ దు:ఖంతో మాకు ఒక్కొక్కక్షణమూ ఒక్కొక్కయుగంగా ఒక్కొక్క ఘడియా ఒక్కొక్క మన్వంతరంగా, ఒక్కొక్క జామూ ఒక్కొక్క కల్పంగా గడుస్తున్నది. ఓ ఉద్ధవా! రాత్రింబవళ్ళు మేము మాధవుణ్ణి మరువలేకపోతున్నాము. శ్యామసుందరుడు ఇక్కడ నుంచి వెళ్ళాడంటే మాజీవితంలో ఏదో దుష్టఘడియవచ్చిందని భావిస్తున్నాము. తపోధనులకు దక్కకుండగా

ఆస్వామిని మాదగ్గర ఉంచుకొని మేము తెలియనితనంతో కృష్ణుని పట్ల అపరాధం చేశాము.''

గోపాలకుల కృష్ణభక్తిని చూచి ఉద్ధవుడు వారితో-ఓ వ్రజవాసులారా! నేను కృష్ణునిసేవకుడను, దాసుడను. శ్రీకృష్ణుడు ఎంతో ఉత్కంఠతతో మీ అందరి క్షేమ సమాచారాలు తెలిసికొని రమ్మని నన్ను ఇక్కడకు పంపించాడు. నేను మధురా నగరం తిరిగి వెళ్ళి మీ విరహవేదన కృష్ణునకు తెలియజేసి, నా నేత్ర జలాలతో ఆయన పాదపద్మములను కడిగి ప్రసన్నుణ్ణి చేసికొని ఇక్కడకుతీసికొని వస్తాను. సంశయించకండి. మీరు ఈ వ్రజంలోనే త్వరలో శ్రీకృష్ణుణ్ణి దర్శిస్తారు- అని వారిని ఆశ్వాసించి ఉద్ధవుడు వారితో సహితంగా రథంపై నందుని గ్రామానికి చేరుకున్నాడు.

ఉద్ధవుని రాక గురించి విని నందరాజు ఆతనిని ప్రేమతో ఆహ్వానించాడు. భోజనభాజనములైన తరువాత నందుడు గద్గద కంఠంతో ఇలా పలికాడు. "ఉద్ధవా! మధురలో నామిత్రుడు వసుదేవుడు కుమారులతో కుశలంగా ఉన్నాడా? కంసుడు మరణించిన తరువాత యాదవ శిరోమణులకు సౌఖ్యంగా ఉన్నది గదా! బలరామ కృష్ణులు ఎన్నడైనా తల్లి యశోదను గుర్తు చేసుకొంటున్నారా? ఇక్కడి గోపాలకులు, గోవర్ధన పర్వతం, గోవుల సముదాయం, వ్రజం, బృందావనం యమునానది ఈ సైకత ప్రదేశాలు ఎప్పుడైనా స్మరిస్తున్నారా? కమలనయనుడైన శ్యామసుందరుడు ఇక్కడ బలరామునితో, గోపబాలకులతో కలిసి ఆడుకొనటం మరల ఎన్నడు చూడగలను. ముకుందుడు లేకుండా ఇక్కడి నదీ పర్వత వృక్ష సముదాయములన్నీ విషతుల్యంగా కనిపిస్తున్నాయి. కృష్ణుడు లేకుండా నా జీవనం శయనం భోజనం కూడా దుర్భరమైపోతున్నాయి. చంద్రుని కోసం చకోరాలు ఎదురు చూస్తున్నట్లు కృష్ణుని ఆగమనం కోసం నేను ప్రాణాలు ధరించి ఉన్నాను'' ఈవిధంగా పలికేటప్పుడు అతని నేత్రకమలాలనుండి అశ్రుధారలు స్రవింపసాగాయి.

ఉద్ధవుడు వచ్చిన విషయం తెలిసికొని యశోద వెంటనే ద్వారం తలుపు దగ్గర నిలబడి తనకుమారుని గూర్చిన విషయాలను వినసాగింది. పుత్రస్నేహంవల్ల ఆమె సిగ్గువిడిచి ఉద్ధవుని దగ్గరకు వచ్చి స్వయంగా క్షేమసమాచారాలను అడిగింది. నేత్రాలనుంచి ఉబుకుతున్న అశ్రుధారలను చీర చెరగుతో ఒత్తుకొంటూ కృష్ణ

స్మరణతో విహ్వాలయై ఇలా పలికింది - ఓ ఉద్ధవా! కన్నయ్య ఎన్నడైనా నన్నుగాని తన తండ్రిని గాని గుర్తు తెచ్చుకుంటున్నాడా? నా జీవితంలో కృష్ణుడు ఒక్కడే కుమారుడు మిగిలాడు. ఆ ఒక్కడుకూడ దీనురాలైన ఈతల్లిని విడిచిపెట్టి వెళ్ళాడు. స్నేహం ఎక్కడ ఉన్నదో అక్కడే కష్టంకూడ ఉంటుందంటారు, ఎంత ఆశ్చర్యకరమైన విషయం! కృష్ణుడు లేకుండా నేను ఎలా జీవించను? "అమ్మా! నాకు పాలు ఇవ్వు అమ్మా! నాకు వెన్నపెట్టు" అంటూ ఎప్పుడూ ఇంట్లో తిరుగుతుండేవాడు. నా కన్నయ్య ఈ వ్రజ వాసులకు .జీవనంగా, ఈ వ్రజానికి ధనంగా, ఈకులానికి దీపంగా ఉండేవాడు. ఆతని లాలన పాలనలో ఎన్నిసంవత్సరాలు క్షణాలుగా గడిచిపోయాయి. గోవిందుడిక్కడ లేకపోతే ఒక్కొక్కరోజు ఒక్కొక్క కల్పంగా గడుస్తున్నది. అయ్యో! ఒకరోజున కృష్ణుడు పెరుగుకుండ పగల కొట్టాడని నేను వాణ్ణి త్రాడుతో కట్టివేశాను. ఆ సన్నివేశం గుర్తుకు వస్తే ఇప్పుడు నాకు అమితమైన దుఃఖం కలుగుతున్నదయ్యా!"

యశోదానందుల అత్యుత్తమమైన ప్రేమను చూచి ఉద్ధవుడుఅత్యంత ఆశ్చర్య చకితుడై "ఓ దంపతులారా! మాధవుని పట్ల మీకున్నప్రేమ అనన్యసామాన్యమైనది. ఇటువంటి ప్రేమనే భక్తి అంటారు. మీరు పొందిన ఈ భక్తి తీర్థాటనము వల్లగాని, తపోదానయోగముల వల్లగాని లభించేదికాదు. మీరు బాధపడకండి. కృష్ణపరమాత్ముడు స్వయంగా యిచ్చిన ఈ లేఖలను స్వీకరించండి. బలరామకృష్ణులిద్దరూ యాదవుల మహత్తరమైన కార్యం సిద్ధంచేసి త్వరలో ఇక్కడకు వస్తారు. కృష్ణుడు పరిపూర్ణుడైన పరమాత్ముడని మరువవద్దు.

ఆయన జన్మించిన నాటినుంచి అద్భుతమైన లీలలను ప్రదర్శిస్తూనే ఉన్నాడు. పూతనప్రాణాలు అపహరించటం, శకటాసురుణ్ణి భంజించటం, తృణావర్తుణ్ణి సంహరించటం, యమళార్జున వృక్షాలను పడవేయటం, తన నోటిలో విశ్వరూపం చూపటం, బకాసుర వత్సాసురులను వధించటం, అఘాసురుణ్ణి హతమార్చటం, ధేనుకాసురుణ్ణి అంతం చేయటం, కాళీయ సర్పాన్ని మర్దించటం, దావానలాన్ని త్రాగివేయటం ఇవన్నీ కృష్ణుడు ప్రదర్శించిన అలౌకికమైన లీలలు కదా! మీరందరూ చూస్తుండగానే గోవర్ధనపర్వతాన్ని ఉద్ధరించాడుగదా! ఆజగదీశ్వరుడు శంఖచూడుని దగ్గర నుంచి చూడామణిని గ్రహించటం, అరిష్టాసురుణ్ణి వధించటం, కేశిని కాలగర్భంలో కలపటం, వ్యోమాసురుణ్ణి యమపురికి పంపటం అతిమానుషమైన

కృత్యాలు కదా! ఇక మధురలో కంసుని రజకుణ్ణి ఒక్కదెబ్బతో పరిమార్చాడు. కంసుడు ప్రచండ ధనుర్దండాన్ని విరిచి వేశాడు. పదివేల ఏనుగుల బలంగల కువలయాపీడ మదగజాన్ని యమునికి కానుకగా పంపాడు. చాణూరముష్టికాదులను మల్లయుద్ధంలో పరిమార్చాడు. మదమత్తుడైన బలశాలియైన కంసుణ్ణి సంహరించాడు. గురుదక్షిణ కొఱకై వెళ్ళి సముద్రంలో దూకి శంఖరూపధారియైన పంచజనుణ్ణి పరలోకానికి పంపాడు. ఈ చర్యలు భగవంతునకు తప్ప ఎవరికి సాధ్యం?

నారదుడిలా చెప్తున్నాడు- రాజేంద్రా! ఈవిధంగా నందుడు, ఉద్ధవుడు కృష్ణ లీలల్ని స్మరించుకొంటూ రాత్రిని ఒక క్షణంవలె గడిపారు. ఆవిధంగా ఆనందం కలిగించేవాడు కాబట్టే ఉద్ధవునకు "క్షణదా" అనే పేరు చరితార్థమయింది. ఇంతలో బ్రాహ్మీముహూర్తం వేళ అయింది. గోపకాంతలంతా లేచి ఇళ్ళువాకిళ్ళు తుడుచుకొని, దీపాలను పెద్దవి చేసి కవ్వాలను సిద్ధంచేసి పెరుగు చిలకటం ఆరంభించారు. అలా మథించే సమయంలో ఆ గోపికల గళసీమలలోని హారాలు కరకంకణాలు సవ్వడి చేయసాగాయి. సిగలోని పువ్వులు నేలపై పడసాగాయి. వారి కర్ణకుండలాలు తళతళలాడుతూ అటుఇటూ కదలాడ సాగాయి. ఆ చంద్రముఖులు, కమల నయనలు మనోహరంగా వివిధ వర్ణాలు గల వస్త్రాలను ధరించి పెరుగు చిలుకుతూ బలరామకృష్ణుల మంగళమయగాథలను ప్రేమపూర్వకంగా గానంచేయసాగా ఎ. ప్రతివీధిలో ప్రతి సందులో పెరుగు చిలుకుతున్న ధ్వనులతో కలిసిన గోపకాంతల గీతాలను విని విస్మితుడై ఉద్ధవుడు "ఆహా! ఈ నందనగరంలో భక్తి కాంత సర్వత్ర ఆనంద నృత్యం చేస్తున్నదికదా!" అనుకొంటూ నందునితో కలిసి యమునానదికి స్నానానికి వెళ్ళాడు.

## ఉద్ధవుని సందేశము :

ఆ సమయంలో గోపికలు ఉద్ధవుని రథాన్ని చూచి "ఓ సఖులారా! ఈరథం ఎవరిది? నందనందనుణ్ణి మధురకు తీసికొని వెళ్ళిన క్రూరుడైన అక్రూరుడు మరల రాలేదుకదా! మానవుల్ని పరిమార్చటం కోసం కద్రువ నాగుల్ని కన్నట్లు, సత్పురుషులను వేధించటం కోసం ఆతనితల్లి ఆతనిని దుర్ముహూర్తంలో కన్నది. అటువంటి నిర్దయుడు ఈ వ్రజమండలానికి మరల ఎందుకు వచ్చాడు?" అని సంభాషించుకొంటూ రథం దగ్గరకు వచ్చి సారధివైపు చేతివ్రేళ్ళు చూపించి బెదిరిస్తూ-

త్వరగాచెప్పు ఇదిఎవరి రథం?" అని అడిగారు. పాపం సారధి భయంతో ఆశ్చర్యంతో వారివైపు చూడసాగాడు. ఇంతలో ఉద్దవుడు రావటం కనిపించింది. ఆతని కాంతి మేఘంవలె శ్యామవర్ణంతో ఉంది. నేత్రాలు వికసిత కమలదళములవలె విశాలంగా ఉన్నాయి. ఆకారం సాక్షాత్తు శ్రీకృష్ణుణ్ణి పోలిఉన్నది. వక్షఃస్థలంపై కౌస్తుభమణి ప్రకాశిస్తున్నది. ఆకృతిలో, ఆకర్షణలో, మందహాసంలో, మధురస్వరంలో, శ్రీకృష్ణుని సారూప్యాన్ని ధరించిన ఉద్దవుణ్ణి చూచి గోపికలంతా ఆశ్చర్య చకితలయ్యారు.

ఆతడు గోవింద సఖుడని,మధురనుంచి సందేశం తీసుకువచ్చాడని తెలిసికొని వారంతా సంతోషించి అతని పట్ల ఎంతో ఆదరం చూపి మధురమధురంగా మాట్లాడ సాగారు. గోవిందుణ్ణి గురించి గూఢంగా కుశలం అడిగి తెలిసికొనాలని ఉద్దవుణ్ణి కదళీవనంలోకి తీసికొని వెళ్ళారు. అక్కడ వృషభానుని కుమార్తె రాధిక యమునాతీరంలో నికుంజమందిరంలో కృష్ణవిరహంతో అలమటించి పోతున్నది. కేవలం కృష్ణుని రాక అనే ఆశతోనే ఆమె శరీరం ధరించి ఉన్నది. ఇప్పుడు కృష్ణ సఖుడైన ఉద్దవుడు వచ్చాడని విని రాధ తన సఖురాండ్రద్వారా ఆతనికి మధుపర్కాదికానుకలను పంపింది. అక్కడకు వచ్చిన ఉద్దవుడు రాధకు అంజలి ఘటించి ఆమెతో ఇలా పలికాడు "శ్రీకృష్ణుడు దైవస్వరూపుడు, నీవు దేవతవు. ఆయన శ్రీమహావిష్ణువు, నీవు వైష్ణవీదేవివి. ఆయన రాముడైనప్పుడు నీవు సీతవైనావు. శ్రీకృష్ణుడు చంద్రుడైతే నీవు చంద్రికవు. శ్రీహరి అవతరించినప్పుడల్లా నీవు ఆతని శక్తిగా అవతరిస్తున్నావు. శ్రీహరి జగత్స్వరూపమైతే నీవు చైతన్య శక్తివి.

ఓ రాధాదేవి! నీకు ప్రణామము. నీకు ప్రాణనాథుడిచ్చిన ఈ లేఖను స్వీకరించు. కృష్ణ పరమాత్ముడు తాను త్వరలోనే ఇక్కడకు వస్తానని సందేశం పంపాడు. మీకందరకు ఇమ్మని వందలాది లేఖలనుయిచ్చాడు స్వీకరించండి."

నారదమహర్షి ఇలా చెప్తున్నాడు- ఓ రాజేంద్రా! రాధాదేవి ఆ లేఖను తీసికొని శిరస్సుపై ఉంచుకొని కనులకద్దుకొని, హృదయానికి హత్తుకున్నది. తరువాత ఆ లేఖను చదివి, శ్రీకృష్ణుని చరణారవిందాలను స్మరించి వియోగ దుఃఖంతో విహ్వలయై ఉద్దవుని ఎదుటనే మూర్ఛపోయింది. అప్పుడు సఖురాండ్రు ఆమెకు శీతలోపచారాలు చేసి సేద తీర్చారు. ఆమె ఉద్దవుని చూచి "ఉద్దవా! కృష్ణుడుఇక్కడకు ఎప్పుడు వస్తాడు? మాకందరకు ఎప్పుడు దర్శనమిస్తాడు? మయూరం మేఘంకోసం చూచినట్లు,

చకోరం చంద్రునికోసం వలె నేను గోవిందుని రాకకోసం ఎదురుచూస్తున్నాను. కృష్ణునితో వియోగం జరిగిన దుర్ముహూర్తం నుంచి నాకు ఒక్కొక్క క్షణం ఒక్కొక్క కల్పంగా గడుస్తున్నది. పూర్వం హనుమంతుణ్ణిచూచి లంకలో నున్న సీత ఆనందం పొందినట్లు నిన్ను చూడగానే నాకు ఆనందం కలుగుతున్నది. నీవు త్వరగా, స్వయంగా మాధవుని ఇక్కడకు తీసికొనిరా" అని పలికింది. ఆ మాటలను విని ఉద్ధవుడు "రాధాదేవీ! నేను మధురాపురం వెళ్ళి నీ విరహదుఃఖంగూర్చి చెప్పి గోవిందుణ్ణి ఇక్కడకు తీసికొని వస్తాను. నీవు దుఃఖించవద్దు" అని ఊరడించాడు. అందుకు ప్రసన్నురాలైన రాధ శ్యామసుందరునకు చంద్రకాంతమణుల్ని ఇవ్వమని ఉద్ధవునకిచ్చింది.

గోపికలు ఉద్ధవుని చుట్టూ చేరి గోవిందుడు ఎవరెవరికి లేఖలు ఇమ్మన్నాడని అడిగి కృష్ణుని సందేశం వినిపించమని ఆసక్తితో అడిగారు. అప్పుడు ఉద్ధవుడు ఓ గోపకాంతలారా! మీరు నిరంతరం మాధవుని స్మరిస్తున్నట్లే మాధవుడు కూడా ప్రతిక్షణం మిమ్మల్ని స్మరిస్తున్నాడు. నేను శ్రీహరికి ఏకాంత సేవకుణ్ణి. ఒకరోజున కృష్ణుడు మిమ్మల్ని స్మరించి మీకు ఇలా సందేశం ఇమ్మని పలికాడు- "మనస్సును విషయముల యందు నిలిపితే బంధకారకం అవుతుంది. ఆ మనస్సును నా యందు నిలిపితే, అది మోక్షకారకమవుతుంది. అందువల్లనే జ్ఞానులు మనస్సే బంధనమునకు, మోక్షమునకు కారణమని అన్నారు. మానవుడు మనస్సును జయించి ఈ లోకంలో సంగరహితుడుగా ఉండాలి. వివేకవంతుడైన పురుషుడు నిర్మలమైన ఆధ్యాత్మ యోగసాధనవల్ల పరబ్రహ్మ స్వరూపుడవైన నన్ను సర్వవ్యాపకునిగా గ్రహించినప్పుడు ఆతని మనస్సు నుండి రాగద్వేషములు దూరమవుతాయి. మేఘం సూర్యుని నుంచి ఉత్పన్నమైనప్పటికీ అది అడ్డు తొలగితేగాని ఏవిధంగా మనం సూర్యుణ్ణి చూడలేమో, అదేవిధంగా మన అంతఃకరణంలో జనించిన రాగద్వేషాలు ఆత్మకు అడ్డుతొలిగితేతప్ప మీరు పరమాత్ముణ్ణి దర్శించలేరు. ఓ వ్రజకాంతలారా! నేను స్థూలదృష్టికి దూరంగా ఉన్నాను. కాని తత్త్వ దృష్టితో చూస్తే మీకు నాకు ఎంతమాత్రము దూరం లేదు. కాబట్టి ఇప్పుడు మీరు ఈవియోగాన్ని నన్ను పొందటానికి సాధనగా చేసికొనండి. సాంఖ్యభావంతో పొందదగినది యోగసాధన చేత కూడా ప్రాప్తిస్తుంది" అన్నాడు.

**గోపికల అధిక్షేపములు :**

అప్పుడు కృష్ణసందేశం విన్న గోలోకవాసినులైన గోపకాంతలు గద్గద కంఠంతో "ఓ ఉద్ధవా! మమ్మల్ని వదిలిపెట్టి శ్రీకృష్ణుడు పరదేశం వెళ్ళాడు. పైగా అక్కడ నుండి వేదాంతం వ్రాసి పంపించాడు" అన్నారు. ద్వారపాలికలైన గోపికలు "ఓ సఖులారా! చంద్రునికి చకోరం మీద, సూర్యునకు కమలంమీద, ఏవిధంగా ఎన్నటికీ ప్రేమ ఉండదో అదేవిధంగా శ్యామసుందరునకు మనమీద ప్రేమలేదు" అన్నారు. శృంగార గోపికా బృందం "స్నేహితలారా! చకోరానికి చంద్రునకు మైత్రి ఉంది కాని అది ఎప్పుడూ విరహాగ్నితో తపించేలా విధాత దానిముఖాన వ్రాశాడు" అనిపలికారు. శయ్యా గోపికా సమూహం "ఓ చెలులారా! బోయవాడు మృగాలను బాణంతో చంపి వెంటనే దాని సంరక్షణను చూస్తాడు. కాని నిర్మోహులైన వారు తమ ప్రియజనుల మనస్సులను బాధించికూడా కనీసం స్మరించనైనా స్మరించరు. ఎంతఆశ్చర్యం!" అన్నారు. ఆమాటలు విని పార్షద గోపికా బృందం "విరహంతో బాధ పడేవారి దుఃఖాన్ని విరహిజనులు మాత్రమే తెలిసికొనగలరు. ఇతరులకు ఆ దుఃఖం ఎలా తెలుస్తుంది? ఒకరి శరీరంలో ముల్లు గుచ్చుకుంటే మరొకరు ఆబాధనెలా తెలిసికొనగలరు?" అన్నారు.

అప్పుడు బృందావన పాలికలైన గోపికలు "నిష్కామప్రేమ మాధుర్యం నిష్కామప్రేమికులకే తెలుస్తుంది. స్వార్థంతో ప్రేమించేవారికి నిష్కామ ప్రేమ మాధుర్యం ఎలా తెలుస్తుంది? ఎక్కడైనా కర్మేంద్రియాలు రసానుభవం పొంద గలవా?" అన్నారు. గోవర్ధన గిరి వాసినులైన గోపికలు ఇలా అన్నారు "నగరకాంతల చేత అభిమానింపబడేవాడు ఇప్పుడు సైరంధ్రికి (కుబ్జ) నాయకుడయ్యాడు. అటువంటి వానికి గిరివాసులమైన, వనవాసులమైన మనవంటి వారితో పనియేముంటుంది? ఈ విషయంలో ఎక్కువ బాధపడటం వ్యర్థం" అన్నారు.

వనపాలికలైన గోపికలు "నెచ్చెలులారా! భ్రమర సమూహాలతో నిండిన మాధవీకుంజ పుంజములలో మాధవుని కన్నులలో కాపురముండే మనం ఈనాడు ఆతనిని గురించి ఎలా భావించవలసివచ్చింది!" అన్నారు. ఇది విని నికుంజ వాసినులైన గోపికలు "ఓ కాంతలారా! బృందావనంలో యమునాతీరకదంబవనంలో గోవులతో, గోపాలకులతో విహరించే నందనందనుణ్ణి ఎలామరువగలము?" అన్నారు.

యమునాతీర గోపికలు "ఓవనితలారా! ఈనాడు మధురాపుర కాంతలు పొందుతున్న ఆనందం రేపు మనం పొందుతాం. మీరు బాధపడకండి. ఎవరికైనా ఎప్పుడూ జయముండదు, ఎప్పుడూ అపజయముండదు. బాలకుడు ఆటబొమ్మలను కలుపుతుంటాడు, వేరుచేస్తుంటాడు. అదేవిధంగా విధాత ప్రాణులకు సంయోగవియోగాలు కలిగిస్తుంటాడు. మొదట కురూపిగానున్న కాంత ఈనాడు రూపవతి అయింది! దాసిగా ఉన్న వనిత కులీనకాంతగామారింది!" అని పలికారు. అది విని విరజా యూథము "ఏ కాంత బాహువూ ఎప్పుడూ ప్రియునిమెడమీద ఉండదు. ఎవ్వరూ ఎప్పుడూ వనంలో నివసించరు. ఎవ్వరూ ఎప్పుడూ యౌవనంతో ఉండరు. ఇంద్రునకు ఆయన సింహాసనమే శాశ్వతంకాదు. నాలుగురోజులకోసం ఎవరైనా మంచినే పాటించాలి" అన్నారు.

లలితాయూథము ఇలా పలికారు "ఆనాడు అయోధ్యలో శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకానికి ఆటంకం కలిగించినది కుబ్జయే. ఈనాడు మధురనుండి మాధవుని రాకకు ఆటంకం కలిగించినదీ కుబ్జయే. కుబ్జలు చేయలేని పనులు ఏముంటాయి?" విశాఖాయూథము ఇలాఅన్నారు "గోవుల్ని మేపుతూ తోటి గోప బాలకులతో వనములకు వెళ్ళి మరల తనవంశీనాదంతో గ్రామస్థులందరికీ తనరాకను ప్రకటిస్తూ సంతసంకలిగించే నందనందనుణ్ణి మనం మరువలేము" అప్పుడు మాయాయూథము ఇలా అన్నారు - "వ్రేపల్లె వీథులలో మాదారికి అడ్డువచ్చి మాకు భయము, ఆనందము కలిగించే నందనందనుడు మరల మాఇళ్ళకు వచ్చేది ఎప్పుడు?"

అష్టసఖీగోపికలు "ఓ ఉద్ధవా! సుందరాంగుడైన నందనందనుణ్ణి నిరంతరము ధ్యానించటం వల్ల మా దృష్టి సంసారం వైపు మరలటంలేదు. ఆతడు మధురలోనే ఉంటే మా పరిస్థితి ఏమిటి?" అన్నారు. షోడశ సఖీ గోపికలు ఇలా అన్నారు "బృందావనంలో ప్రేమపూరితమైన మోహన మురళీ గానం విన్నతరువాత మా చెవులు సంసారగీతాలను విన నుత్సహించటంలేదు, అవి కేవలం కాకి అరుపులవలె అనిపిస్తున్నాయి"

ముప్పదిరెండు మంది గోపికలబృందం ఇలా అన్నారు "మిత్రుల్ని ప్రీతితోటి, శత్రువుల్ని నీతితోటి, లోభుల్ని ధనంతోటి, బ్రాహ్మణుల్ని ఆదరంతోటి, గురువులను

అభివందనములతోటి, రసహృదయులను ప్రేమతోటి వశంలో ఉంచుకోవాలి కాని ప్రేమాభిమానములు లేనివారిని ఎవరు వశం చేసికొనగలరు?"

శ్రుతి రూప గోపికలిలా అన్నారు "జాగ్రదాది అవస్థలలో వ్యాప్తమై ఉండి కూడా పరమాత్ముడు వాటికి అతీతంగా ఉన్నాడు. అలాగే ఈ జగత్తుకు తానే కారణం అయియుండి కూడా వాస్తవంగా జగత్తుకు ఎటువంటి సంబంధం లేకుండా ఉన్నాడు. అగ్నినుండి పట్టిన నిప్పురవ్వలు అందులో ఎలా ప్రవేశింపవో, ఆవిధంగా పరమాత్మనుండి సమస్త గుణములు ఉద్భవించి పలువిషయాలవైపు పరివ్యాప్త మౌతాయి. మనస్సుకు, బుద్ధికి అందనటువంటి ఆ పరమాత్మకు నమస్కారము".

ఋషిరూప గోపికలిలా అన్నారు - "బలవంతులలోకెల్ల బలవత్తరమైన ఈ కాలం ఎవరిపై ప్రభావం చూపలేదో, మాయకూడాఎవరిని వశం చేసికొనలేదో, వేదములు కూడా ఎవరిని వర్ణించటంలో మౌనం వహించాయో అటువంటి అమృతస్వరూపుడు, పరమప్రశాంతశుద్ధరూపుడు, పరాత్పరుడు, పరబ్రహ్మను మేము శరణువేడుతున్నాము."

దేవతాస్వరూపలైన గోపికలిలా అన్నారు "ఏ పరమేశ్వరుని నుండి అంశాంశ, అంశ, కళ, ఆవేశ, పూర్ణ అవతారాలు కలుగుతున్నాయో, ఎవరివల్ల ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయలు ఏర్పడుతున్నాయో, ఆపరిపూర్ణతమ అవతార మూర్తియైన శ్రీకృష్ణునకు మేము ప్రణామాలర్పిస్తున్నాము." యజ్ఞ సీతా స్వరూప గోపికలిలా అన్నారు "ఈ శ్యామసుందరుడు ఈ నికుంజ లతలకు వసంతుడు, రాధకు కంఠాభరణమైన వాడు, వ్రజమండలానికి ఈశ్వరుడు గదా!" రమా వైకుంఠ వాసినీ గోపికలిలా అన్నారు - "సమస్త గోపికా బృందానికి అలంకారమైనవాడు, తన పాదధూళిచేత బృందావనాన్ని, గోవర్ధనగిరిని పావనమొనర్చిన వాడు, లోకోద్ధరణ కోసం భూమండలంపై ఆవిర్భవించిన వాడు అయిన శ్యామసుందరుణ్ణి మేము భజిస్తున్నాము"

శ్వేతద్వీపవాసినులైన గోపికలు ఇలా అన్నారు "మత్తేభం తన తొండంతో అవలీలగా కమలాన్ని పైకిఎత్తినట్లు, లీలావిలాసంగా గోవర్ధనగిరిఎత్తిన వ్రజరాజనందనుణ్ణి మేమెన్నటికీ మరవలేము". ఊర్ధ్వ వైకుంఠవాసినీ గోపికలిలా అన్నారు "మా శ్యామల నేత్రాలకు సమస్తజగము శ్యామమయంగానే కనిపిస్తుంది. ఇందులో ద్వైతం ప్రసక్తేలేదు.

ద్వైతమే లేనప్పుడు ఇవి కృష్ణ సంయోగానికి చేసే సహాయంఏముంటుంది?" లోకాచలవాసినీ గోపికలు "లోకంలో స్నేహబంధం చాలా గొప్పది. దాన్ని శ్రీహరి తప్ప ఎవరు ఛేదించగలరు" అన్నారు. అజితపదాశ్రిత గోపికలు "శ్రీకృష్ణుణ్ణి చూచిన మానేత్రాలు మరొకటి చూడలేకపోతున్నాయి" అన్నారు.

శ్రీసఖీగోపికలు "కపటం ఉన్నచోట స్నేహం ఎలా కుదురుతుంది?" అన్నారు. మిథిలాగోపికలు "ధనం వదిలి శరీరం కాపాడుకోవాలి. ప్రాణం వదిలి అభిమానం కాపాడుకోవాలి. అప్పుడుకదా అని ధనము, మనము, అభిమానములను ఆయనకు మేమిచ్చాము!" అన్నారు. కోసల గోపికలు "ప్రియమైన వస్తువు దూరమైతే కలిగే బాధ అనుభవిస్తేనే తెలుస్తుంది. బాణంవచ్చి గుండెలో గ్రుచ్చుకున్నాసరే ప్రియా వియోగం ఎవరికీ కలిగించకూడదు" అన్నారు. అయోధ్యాపురవాసినీ గోపికలు "నిరాశతో ఉన్న మనకు మరల ఆశ కల్గించటం ఎందుకు? వేదాంతం వ్రాసి పంపటం ఎందుకు? ప్రేమలేనివారి ప్రవృత్తి చిత్రంగా ఉంటుంది" అన్నారు.

పుళిందగోపికలు "పూర్వం దండక వనంలో శూర్పణఖ అత్యంత విహ్వలయై తనను పత్నిగా చేసికొనమని ఈయన దగ్గరకు వచ్చింది. కానీ ఈయన సౌమిత్రిని ప్రేరేపించి బలవంతంగా ఆమెను కురూపిని గావించాడు. అటువంటి పురుషుని నుంచి మీరంతా దయను ఎలా ఆశిస్తున్నారు?" అన్నారు. సుతలవాసినీ గోపికలు "తనకు దానమిచ్చిన బలిని పాతాళానికి అణగద్రొక్కాడు ఈయన" అన్నారు.

జాలంధర గోపికలు "తనభక్తుడు ప్రహ్లాదుడు ఎన్నో బాధలు పడుతుంటే కాపాడటానికి భయంకరమైన నరసింహరూపంలో వెళ్ళాడు ఈయన!" అన్నారు. పృథివీ గోపికలు "ప్రేమాభిమానాలు లేనివారి చరిత్ర విచిత్రంగా ఉంటుంది. వారు చెప్పేది ఒకటి, చేసేది మరొకటి. ఇటువంటివారిని దేవతలు కూడా అర్థం చేసికొనలేరు. అటువంటిది మానవుల మెలా తెలిసికొనగలము?" అన్నారు.

బర్హిష్మతీ పురీ గోపికలు "ప్రళయకాలంలో శ్రీహరి వరాహరూపం ధరించి ఏ భూమిని ఉద్ధరించాడో, ఆ భూమినే ఆయన పృథుమహారాజుగా వచ్చినప్పుడు ఛేదించటానికి పూనుకున్నాడు. ఒకపర్యాయం దయాళువుగా ఉండటం, మరొకపర్యాయం కఠినాత్ముడుగా ఉండటం శ్రీహరికి సహజ లక్షణమే" అన్నారు. లతారూపగోపికలు

"ధన్వంతరి అమృతం తెస్తే శ్రీహరి తాను తీసికొని దేవతలకిచ్చాడు. రాక్షసులకు కేవలం తన రూపం చూపించి మోసగించాడు. గుర్తులేదా?" అన్నారు.

నాగేంద్ర కన్యారూప గోపికలు "సఖులారా! రావణుని సోదరి శూర్పణఖ ఈయన పట్ల ఆసక్తిపొందినప్పుడు ఆమె ముక్కుచెవులు కోయించాడు. అది న్యాయమేనా?" అన్నారు. అప్సరా రూప గోపికలు "శ్రీహరికి నిజంగానే మనమీద కరుణఉంది. లేకపోతే ఈయన మన ముక్కు చెవులు కోయించేవాడు" అన్నారు. సత్త్వవృత్తిరూప గోపికలు "ధ్రువుడైనా ప్రహ్లాదుడైనా మొదట ఇలా కష్టాలు పడ్డవారే. తరువాతనే భక్త వత్సలుడైన శ్రీహరి వారిపై కృప చూపించాడు. ఆవిధంగానే ముందు మనం ఈ కష్టం ఓర్చుకుంటే కృష్ణ పరమాత్ముడు మనపై కరుణ చూపిస్తాడు" అన్నారు.

రజోగుణ వృత్తిరూప కాంతలు "రుక్మాంగద, హరిశ్చంద్ర, అంబరీష మహా రాజుల్ని అనేక విధాలుగా సత్యనియమ పరీక్ష చేసిన తరువాతనే శ్రీహరి వారికి విజయం చేకూర్చాడు. మనం కూడా ఈ వియోగ పరీక్షలో నెగ్గితేనే శ్రీకృష్ణుడు మన మనోరథం నెరవేరుస్తాడు" అన్నారు.

తమోగుణ వృత్తిరూప గోపికలు "కత్తికి ఒకవైపునే వక్రత ఉంటుంది. కాని అనేకమందికి అపకారం చేస్తుంది. కాని కుబ్జకు మూడువైపుల వక్రత ఉంది. పైగా ఆమెకు త్రిభంగి రూపుడైన శ్రీకృష్ణుడు లభించాడు. ఇక ఆమె ఎంతమంది ప్రాణాలు తీస్తుందో ఎవరూ చెప్పలేరు. శ్రీకృష్ణుని కోసం చూచి కళ్లుకాయలు కాచాయి. ఆతడు వచ్చే వ్యవధి వామనుని పాద విక్షేపం వలె అంతులేకుండా పెరిగిపోతున్నది మాఘ మాసంలో మాధవుడు దగ్గర లేకపోవటం వల్ల మన శరీరాలు పాలిపోతున్నాయి. నడక మందగిస్తున్నది. పాదాలు అలసిపోయాయి. మనస్సు వికలమౌతున్నది" అన్నారు.

నారదుడిలా చెప్పసాగాడు - ఓ మహారాజా! ఈవిధంగా శ్రీకృష్ణుణ్ణి స్మరిస్తున్న ప్రేమ విహ్వలలైన గోపికలు ఉత్కంఠితలై ఉద్విగ్నతతో విలపిస్తూ మూర్ఛపోయి నేలపై పడిపోయారు. అప్పుడు నీతినిపుణుడైన ఉద్ధవుడు మంచి మంచి మాటలతో వారిని సాంత్వనపరచి, రాధతో "ఓ కృష్ణస్వరూపిణీ! వృషభాను నందినీ! వ్రజేశ్వరీ! మధురవెళ్ళటానికి నాకు అనుజ్ఞనివ్వు, కృష్ణపరమాత్ముని లేఖకు

నీవు ప్రత్యుత్తరం యిస్తే తీసికొని వెళ్ళి కృష్ణునకిస్తాను" అన్నాడు. అప్పుడు వెంటనే రాధ ఒక పత్రంపై పత్రరసంతో లేఖిని చేతబట్టి వ్రాయటానికి కూర్చొని ఆలోచింప సాగింది. నందనందనుడు గుర్తుకురాగానే ఆమె నేత్రాలు బాష్పాలను వర్షింపసాగాయి. ఆమె వ్రాసిన అక్షరాలు ఆ బాష్పధారాలకు తడిసి కరిగిపోసాగినాయి. కృష్ణ దర్శన కాంక్షవల్ల బాష్పనేత్రయైన రాధను చూచి విస్మితుడై ఉద్ధవుడు "రాధా! నీవు దు:ఖోద్వేగంతో లేఖవ్రాయటం అసాధ్యం. ఈవృత్తాంతమంతా నీవు వ్రాయకుండానే నేను కృష్ణునకు నివేదిస్తాను" అన్నాడు. ఆమాటలకు రాధికకు సాంత్వనంకలిగింది. ఉద్ధవుడు రాసేశ్వరియైన రాధకు, గోపికలందరకు నమస్కరించి రథం అధిరోహించాడు.

తనబుద్ధి, జ్ఞానం గురించి ఇప్పటివరకు గర్వంతో ఉన్న ఉద్ధవునకు ఆగర్వం కాస్తా పటాపంచలయి పోయింది. గోపగోపికా సముదాయము ఉద్ధవుని సాగనంపటానికి ఆతని రథంతోపాటు చాలాదూరం వచ్చారు. ఉద్ధవుడు వారినందరినీ స్నేహ పూర్వకంగా వెనుకకు పంపి మధురకు పయనమయ్యాడు.

శ్రీకృష్ణుడు యమునాతీరంలో అక్షయవటవృక్షంక్రింద ఏకాంతంగా కూర్చొనిఉన్నాడు. ఉద్ధవుడు స్వామిని దర్శించి అనేక ప్రణామాల నాచరించి ప్రేమ గద్గదస్వరంతో "ఓ దేవా! నీవు సర్వసాక్షివి. నేను నీకు చెప్పవలసింది ఏముంది? రాధకు, గోపికలకు నీవు శుభములను ప్రసాదించు, దర్శనం అనుగ్రహించు. "దేవదేవుడైన శ్రీకృష్ణుణ్ణి మీదగ్గరకు తీసుకువస్తా" నని వారికి మాటయిచ్చాను. ఓ కృపానిధీ! నామాటను కాపాడు. ప్రహ్లాదుడు, రుక్మాంగదుడు, బలి, ఖట్వాంగుడు, అంబరీషుడు, ధ్రువుడు మున్నగువారి ప్రతిజ్ఞలు నీవు కాపాడలేదా? అదేవిధంగా భగవాన్! నామాట మన్నించు" అన్నాడు.

## కృష్ణుడు గోకులమునకు రాక :

ఉద్ధవుని మాటలు విని భక్తవత్సలుడైన శ్రీకృష్ణపరమాత్ముడు తానిచ్చినమాట ప్రకారం వ్రజానికి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. అచటి విషయాలను చూడటానికి బలరాముణ్ణి మధురలోనే ఉంచి, జవనాశ్వాలను పూన్చిన, కింకిణీస్వర శోభితమైన, సువర్ణ విరాజితమైన రథంపై ఉద్ధవునితోపాటు అధివసించి కృష్ణభగవానుడు భక్తులకు దర్శనం ఇవ్వటానికి నందగ్రామానికి బయలుదేరాడు.

గోవర్ధనం, గోకులం, బృందావనం వరుసగా చూస్తూ శ్రీకృష్ణుడు యమునాతీరానికి చేరుకున్నాడు. వ్రజేశ్వరుడైన శ్రీకృష్ణుణ్ణి చూడగానే అక్కడి అసంఖ్యాకమైన గోవులు నలువైపుల నుండి పరుగులుతీస్తూ గోపాలుని రథం చుట్టూ చేరాయి. స్నేహమాధుర్యం వల్ల వాటి పొదుగులనుండి పాలుకారసాగాయి. అవి చెవులు నిక్కించి, తోకలు పైకెత్తి అంబారవాలు చేయసాగాయి. వాటి నేత్రాలనుండి ఆనందబాష్పాలు స్రవిస్తున్నాయి. వాటి మనస్సులు చింతారహితంగా పరమప్రశాంతంగా ఉన్నాయి. అప్పుడు గోవిందుడు రథందిగి వాటినన్నిటినీ పేరుపేరున పిలుస్తూ తన శ్రీహస్తంతో వాటిని నిమురుతూ ఎంతో ప్రేమ కురిపించాడు.

గోవులన్నీ వెళ్ళి దూరంగా కనిపిస్తున్న రథం చుట్టూ చేరేసరికి శ్రీదామాది గోపాలకులు విస్మితులై తమలో తాము "వాయువేగంతో పోటీపడుతూ, కాంతి ఛ్చటలు విరజిమ్ముతూ రథం వస్తే ఈ గోవులన్నీ యిలా చుట్టుముట్టాయంటే సందేహంలేదు. అందులో ఉన్నది నందనందనుడే. అదిగో మయూరం ఎగురుతూ వెళ్ళి పురివిప్పి నాట్యమాడుతున్నది!" అనుకొంటూ గోపాలకులక్కడకు చేరుకున్నారు. వారంతా అకస్మాత్తుగా పోయిన వస్తువుతిరిగి లభిస్తే ఆశ్చర్యానందాలతో చూసినట్లు మాధవుణ్ణి తేరిపార చూడసాగారు. గోవిందుడు వారిని దగ్గరకు తీసికొని ప్రేమతో ఆలింగనం చేసుకున్నాడు. లోకంలో భక్తి మాహాత్మ్యాన్ని ఎవరు వర్ణింపగలరు?

ఓ మిథిలేశ్వరా! తమ మిత్రుడు, బంధువు, సర్వస్వమునైన కృష్ణుణ్ణి చూచి ఆ గోపకులు ఆనందంతో తబ్బిబ్బుఅయి, నేత్రాలు బాష్ప పూరితములు కాగా కంఠం రుద్ధమై మాట్లాడలేకపోయారు. అప్పుడు కృష్ణుడు ప్రేమతో వారిని ఆశ్వాసించాడు. కొందరు గోపబాలకులతో కలిసి ఉద్ధవుడు నందగ్రామానికి వెళ్ళి శ్రీకృష్ణుని రాకను తెలియజేశాడు. గోపవల్లభుని ఆగమనవార్తను విని గోపగోపికాజనం అపరిమిత ఆనందసందోహంతో గృహాలలోనుంచి బయటకు వచ్చారు. భేరీ, మృదంగ, పటహాది వాద్యాలు మధురమనోహరంగా మ్రోగాయి. పూర్ణకుంభం తీసికొని వచ్చి బ్రాహ్మణులు వేదమంత్రాలను పఠింపసాగారు. వారి వెనుక లాజలు మొదలైన మంగళ వస్తుసంభారాలతోపాటు, గంధాక్షతలు తీసికొని యశోదానందులు బయలుదేరారు. వివిధ స్వర్ణాభరణాల నలంకరించిన మదగజం ముందు నడుస్తుండగా వృషభానుడు తన రాణి కళావతితో బయలుదేరాడు. నందుడు, ఉపనందుడు, వృషభానుడు, వృద్ధులు, యువకులు, బాలకులు పూలహారాలు పిల్లనగ్రోవులు,

కొమ్ముబూరలు నెమలికన్నుల విసనకర్రలు తీసికొని గోవిందుని గుణగానం చేస్తూ నృత్యం చేస్తూ కదిలివెళ్ళారు.

సఖురాండ్రవల్ల కృష్ణుని శుభాగమన వార్తను విన్న రాద శయ్యపైనుంచి ఒక్కఉదుటున లేచి, అమిత హర్షంతో వారందరికీ తన ఆభరణాలను కానుకలుగా నవవికసిత పద్మం తన పరిమళాలను పంచిపెట్టినట్లుగా పంచిపెట్టింది. కొందరు గోపికలు ఆమె వెంటరాగా ఆమె మనోహరమైన పల్యంకికపై మనోహరుణ్ణి చూడటానికి బయలుదేరింది.

ఈవిధంగా వృక్షాలు, గోవులు, మృగాలు, పక్షులతో సహాసమస్త వ్రజమండలం శ్రీకృష్ణుడు రావటం చూచి ప్రేమతో పరవశించిపోయింది. మాతాపితరులైన యశోదానందులకు కృష్ణుడు ప్రణామం చేశాడు. చాలారోజులక్రితం చూచిన కారణంగా యశోదా నందులు కుమారుణ్ణి దగ్గరకు తీసికొని, కౌగిలించి, ఆనందబాష్పాలతో అతణ్ణి అభిషేకించారు. అనంతరం శ్రీకృష్ణుడు యశోదానందుల్ని ఏనుగుపై కెక్కించి, తాను రథంపై ఆసీనుడై, మిగిలినవారంతా గోసముదాయాలతో కలిసి వెంటరాగా గ్రామంలో ప్రవేశించాడు. ఆసమయంలో దేవతలాయనపై పూలవానకురిపించారు. పురకాంతలు లాజలు చల్లారు. జయజయారావాలు మంగళప్రదంగా వినిపిస్తుండగా వైభవోపేతంగా కృష్ణుడు నందవ్రజంలో ప్రవేశించాడు.

**రాధాకృష్ణులు :**

అనంతరం నందనందనుడు కదళికావనం చేరుకున్నాడు. రాధ ఆనంద పారశ్యంతో ఎదురేగి స్వామికి ఆతిథ్యం ఇచ్చి తన స్థితినంతటినీ విన్నవించింది. అప్పుడు పరమాత్ముడామెతో ఇలా అన్నాడు "రాధా! నీవు శోకింపరాదు. నీప్రేమవల్లనే నేనిక్కడకు మరల వచ్చాను. మన ఇరువురికి తారతమ్యంలేదు. లోకులు మనం ఇరువురం అని భావిస్తున్నారు. పాలు దానితెల్లదనము ఒక్కటే తప్ప అవి వేరువేరుకావు. అదేవిధంగా మనమిరువురము ఒక్కటే. మనకెప్పుడు వియోగం కలుగదు. నేను పరబ్రహ్మస్వరూపాన్ని నీవు నాశక్తివి.

ఆకాశంలో వాయువు సర్వత్ర వ్యాపించి యున్నట్లు, జలం సూక్ష్మరూపంలో సర్వత్ర ఉన్నట్లు, కాష్ఠంలో అగ్ని వ్యాప్తమైయున్నట్లు, బాహ్యాంతరాలలో ఉన్న ఈ భూమి పరమాణురూపంలో సర్వత్ర వ్యాప్తమై యున్నట్లు నేను నిర్వికారభావంతో

సర్వత్ర ఉన్నాను. జలం అనేక వర్ణాలలో కనిపించినా వాటికి భిన్నంగా ఎలా ఉంటుందో అదేవిధంగా నేను త్రిగుణాత్మ భావాల సంపర్కంతో ఉన్నట్లున్నా వాటికి సర్వదా అతీతంగా ఉంటాను. అది నీవు గ్రహించు.

రాధా! నేను, నాది అనే భావాలవల్లనే ద్వైతభావం కలుగుతుంది. సూర్యుని నుంచి ఉత్పన్నమైన మేఘం, సూర్యునికి మన దృష్టికి మధ్యలో ఉంటే, ఏవిధంగా మన దృష్టికి సూర్యుడు కనిపించడో అదేవిధంగా ప్రాకృతగుణాలు అడ్డుగా ఉన్నప్పుడు జీవాత్మ పరమాత్మయొక్క దర్శనం పొందలేదు. సత్త్వాది త్రిగుణములు దూరమైతేనే ఆతడు పరమాత్మ సాక్షాత్కారం పొందుతాడు. మనస్సు గుణముల యెడల ఆసక్తమై ఉంటే అది బంధనకారకమవుతుంది. ఆమనస్సు పరమపురుషుడైన పరమాత్మ యెడల లగ్నమైఉంటే అది మోక్షకారకమవుతుంది. అందువల్ల మనస్సును అధీనం గావించుకోవాలి. నన్ను పొందటానికి ప్రేమతో సమానమైనది ఈ భూతలంలో వేరేదీలేదు."

ఓ మహారాజా! కృష్ణపరమాత్ముడు ఈవిధంగా పలికిన తరువాత గోపికలతో కలిసి రాధ కృష్ణుణ్ణి పూజించింది. అనంతరం కార్తిక పూర్ణమ నాటిరాత్రి వెన్నెలలో గోపికలతో రాధతో రాసమండలంలో ఆసీనుడయిన కృష్ణుడు మోహనమురళీగానం చేశాడు. యమునాతీరంలో రాసరంగభూమిలో రాధాదేవి మొదలైన వ్రజసుంద రీమణులతో శ్రీకృష్ణుడు విహరింపసాగాడు. మొత్తం ఎంతమంది గోపికలున్నారో తాను అన్ని రూపాలను ధరించి శ్రీకృష్ణుడు బృందావనంలో క్రీడిస్తున్నాడు. ఆతని చరణమంజీరనాదం మధురమనోహరంగా రవళిస్తున్నది. వనమాలధరించి, చేతిలో లీలాకమలాన్ని విలాసంగా పూని, మకరకుండలాలతో శోభిస్తూ, వేణువునూదుతూ కృష్ణుడు నటశేఖరునివలె అందగింపసాగాడు.

**ఋభు మహర్షి :**

వారు బృందావనం, యమునాసైకతప్రదేశాలుదాటి గోవర్ధన పర్వతం దగ్గరకు చేరారు. అనంతరం వారు అక్కడకు మూడు యోజనాల దూరం ఉన్న రోహితాచలం మీదకు వెళ్ళారు. అక్కడ చందనపరిమళం విశేషంగా గుబాళిస్తున్నది. అక్కడ రాధాకృష్ణులు ఒక సరోవరతీరంలో కూర్చున్నారు. ఆ సరస్సు తీరం దగ్గర ఋభు అనే మహాముని ఒంటికాలిపై నిలబడి కృష్ణపరమాత్ముని గూర్చి తపస్సు చేస్తున్నాడు.

ఆవిధంగా ఆతడు కొన్ని సంవత్సరాల నుంచి నిరాహారియై శాంతభావంతో తపోదీక్షలో మగ్నుడైయున్నాడు.

ఆతనిని చూచిన రాధ మాధవుణ్ణి అడిగింది "ఆతడెవరు?" అని. అప్పుడు మాధవుడు "రాధా! ఇతడు నాభక్తుడు. ఈమహాముని భక్తిని చూడు" అని "ఋభూ!" "ఋభూ!" అని పెద్దగా పిలిచాడు. ఆ ముని ధ్యానంలో సమాధ్యవస్థలో ఉన్న కారణంచేత మాధవుని పిలుపు ఆతనికి వినిపించలేదు. అప్పుడు శ్రీహరి ఆతని హృదయంలోనుంచి ఆసమయంలో తిరోహితుడయ్యాడు. తన ధ్యానం నుండి పరమాత్ముడు ఆవిధంగా నిర్గతుడయినందుకు కారణం తెలియక ఋభువు అత్యంత విస్మితుడయ్యాడు. కళ్ళుతెరిచి చూశాడు. ఎట్టఎదుట మెరుపు తోడి మేఘంవలె రాధాసమేతుడై కృష్ణుడు కన్పించాడు. వెంటనే ఆ మహర్షి లేచి రాధాకృష్ణులకు ప్రదక్షిణంచేసి, శిరసువంచి ప్రణామంచేసి వారి చరణకమలాలపై పడి గద్గద కంఠంతో ఇలా పలుకసాగాడు "ఓ రాధామాధవులారా! నమస్కారము. రాసేశ్వరీ రాసేశ్వరులారా! అభివందనము. మీరు భూభారాన్ని తగ్గించటం కోసం ఈభువిపై అవతరించారు. నాకు పరమ ప్రశాంతిని ప్రసాదించటం కోసం ఇక్కడకు విచ్చేశారు. మీకు మరల మరల ప్రణామములు!".

ఓ మహారాజా! ఋభుమహర్షి ఇలా పలుకుతూ కృష్ణదర్శన పారవశ్యం వల్ల ఉబికిన ఆనందబాష్పాలతో ఆ పరమాత్ముని పాదముల నభిషేకిస్తూ ప్రాణపరిత్యాగం చేశాడు. ఆతని శరీరం నుంచి వెలువడిన జ్యోతి కాంతుల విరజిమ్ముతూ శ్రీకృష్ణునిలో లీనముయింది. తన భక్తుని భక్తి తత్పరతను చూచి చలించిపోయిన అచ్యుతుడాతనిని పేరుపెట్టి పిలిచాడు. అప్పుడు ఆ ముని శ్రీకృష్ణుని సారూప్యాన్ని పొంది పునర్జీవితుడై లేచి నిలబడ్డాడు. దివ్యకాంతితో తేజరిల్లుతున్న ఆతడు వినమ్రభావంతో శిరసువంచి అంజలిఘటించాడు. కరుణానిధియైన శ్రీకృష్ణుడు ప్రేమపూర్వకంగా ఆతనిని దగ్గరకు తీసికొని ఆతని శిరస్సుపై తన దివ్యహస్తాన్ని ఉంచాడు. అప్పుడాతడు తన దివ్యశరీరకాంతితో దశదిశలను వెలిగిస్తూ దివ్యవిమానంపై అధిరోహించి గోలోకధామానికి వెళ్ళిపోయాడు. ఋభుమహర్షి యొక్క ఈ పరాభక్తిని చూచి వృషభానునందినయైన రాధ ఆశ్చర్యచకితురాలయింది.

రాధ శ్రీకృష్ణునితో "ఓ మాధవా! నిన్ను ప్రగాఢమైన భక్తితో ప్రేమించే ఈ మహర్షి ఎంతటి ధన్యుడు! ఈతడు నీ సారూప్యాన్ని పొందటం, నీవీతనికోసం

కంటనీరుపెట్టడం ఎంత ఆశ్చర్యంగా ఉంది! ఇప్పుడు ఈతని శరీరానికి ఉత్తరక్రియలు కూడా నీవే జరపాలి. ఈతని తపస్సు ప్రభావం వల్ల ఈ శరీరం ఇప్పటికీ ప్రకాశిస్తూనే ఉంది!'' అన్నది. ఇంతలో ఆ ముని శరీరం ఒక నదిగా మారిపోయింది. రోహితాచలంపై ప్రవహిస్తున్న పాపనాశనియైన ఆనదిని ఈనాటికీ చూడవచ్చు. ఆసన్నివేశం చూచి రాధ ఆశ్చర్యపడి కృష్ణపరమాత్మునితో "ఓ శ్యామసుందరా! ఈ మహాముని శరీరం జలరూపాన్ని ఎలా పొందింది? నా యీ సంశయాన్ని తొలగించు'' అని అడిగింది.

అప్పుడు కృష్ణుడు రాధతో "ఈమునీశ్వరుడు ప్రేమలక్షణమైన భక్తితో పరిపక్వం పొందాడు. అందువల్ల ఈతని శరీరం ద్రవీభావాన్ని పొందింది. మన మిరువురం కలిసి సాక్షాత్కరించే సరికి ఈతడు పరమానందభరితుడయ్యాడు. నేను కూడా ఇదివరకు ఇలాగే ద్రవీభావం పొందాను కదా'' అన్నాడు. అప్పుడు రాధ "ఓ దేవదేవా! దయానిధీ! నీవు ఇదివరకు ఎలా ద్రవీభావం పొందావు? ఈ మాట నాకు చాలా విచిత్రంగా అనిపిస్తున్నది. దయతో విన్నవించు'' అని అడిగింది. కృష్ణపరమాత్ముడు ఇలా వివరింపసాగాడు - రాధా! ఈప్రాచీనమైన ఇతిహాసాన్ని వినాలని విజ్ఞులు సయితం కోరుకుంటారు. ఈవిషయం శ్రవణం చేసినంత మాత్రం చేత పాపాలు తొలగిపోతాయి.

## నారదుని వృత్తాంతము :

పూర్వం ప్రజాపతి బ్రహ్మ నా నాభికమలం నుంచి ఉద్భవించి ప్రాకృతమైన ఈ జగత్తును సృష్టింపసాగాడు. తన తపశ్శక్తివల్ల నా వరప్రదానం వల్ల ఆతడు శక్తిశాలి అయ్యాడు. ఒకానొక సమయంలో విధాత ఒడి నుంచి సుందరాకృతితో ఒక పుత్రుడు జన్మించాడు. అతడే నారదుడు! ఆతడు నాపై భక్తిచేత ఉన్మత్తుడై భూమండలమంతా సంచరిస్తూ నాగుణగణాలను కీర్తన చేయసాగాడు.

ఒకరోజున ప్రజాపతి బ్రహ్మ నారదుణ్ణి చూచి "ఓ మహామతీ! వ్యర్థంగా ఇలా తిరుగకుండగా ప్రజాసృష్టిని చేయి'' అన్నాడు. ఆ మాట విని జ్ఞానియైన నారదుడు "జనకా! శోక మోహాలను కలిగించే ఈ సృష్టి, నేను చేయజాలను. నేను శ్రీహరి చరణకమలాలను ధ్యానిస్తూ, ఆ పరమాత్ముని నామస్మరణతో సంచరిస్తుంటాను. నీవు ఈ సృష్టి వ్యాపారంలో నిమగ్నమై దుఃఖాన్ని పొందుతున్నావు

కదా. నీవు కూడా ఈ సృష్టి రచన విడిచిపెట్టు" అన్నాడు. ఈ మాటలకు అత్యంత కుపితుడైన విధాత "ఓ దుర్మతీ! నీవు ఒక కల్పం వరకు గీతగానాలతో ప్రొద్దుపుచ్చే గంధర్వునిగా మారిపో!" అని నారదుణ్ణి శపించాడు. ఆశాప ప్రభావం వల్ల నారదుడు ఉపబర్హణుడనే గంధర్వుడయ్యాడు. ఆతడు ఒక కల్పకాలం దేవలోకంలో గంధర్వరాజ పదవిలో ఉన్నాడు. ఒకనాడు స్త్రీలచేత పరివేష్టితుడైన ఆతడు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అక్కడున్న సుందరీమణులపై ఆతని మనస్సు లగ్నమయిన కారణంగా ఆతడు బేతాళగీతం గానంచేశాడు. అందుకు కోపించిన బ్రహ్మ "నీవు దాసీపుత్రుడవౌదువుగాక!" అని శపించాడు. నారదుడు దాసీపుత్రుడుగా జన్మించాడు. అయినా సత్సంగ ప్రభావం వల్ల నారదుడు మరల బ్రహ్మయొక్క పుత్రుని స్థానం సంపాదించాడు. ఆతడు భక్తిపారవశ్యంతో నా గుణ కీర్తన చేయసాగాడు. ఆతడు నిరంతరం తన మనస్సును నాపై లగ్నం చేసి ఉంటాడు. ఆతడు వైష్ణవ శ్రేష్ఠుడు, జ్ఞానసూర్యుడు! పరమభాగవతుడు.!

ఒకరోజున నారదుడు లోకాలన్నీ సంచరిస్తూ ఇలావృతఖండం చేరాడు. అక్కడ జంబూఫలరసం వల్ల శ్యామవర్ణంలో జంబూనది ఏర్పడి ప్రవహిస్తున్నది. అక్కడ జంబూనదమనే పేరుగల సువర్ణం ఉత్పన్నమౌతుంది. ఆ దేశంలో రత్నమయ ప్రాసాదాలతో దివ్యనరనారీమణులతో కూడిన వేదనగరమనే పేరుగల నగరమొకటి ఉన్నది. దానిని నారదుడు చూశాడు. అక్కడున్న వారిలో కొందరికి కాళ్ళులేవు. మరికొందరికి మోకాళ్ళులేవు. చాలామందికి జఘనభాగం లేదు. వికలాంగులుగా ఉన్నారు. కొందరికి వీపు ఎత్తుగా ఉండి, దంతాలు ఊడిపోయినాయి, మెడపైకిపోయిఉంది, ముఖం వ్రేలాడుతూ ఉంది. ఇటువంటి వారినందరినీ చూచి నారదు డాశ్చర్యపడ్డాడు. "మీరు దేవతలా? ఉపదేవతలా? ఋషులా? మీరంతా వాద్యాలతో గీతగానాలాపనలో లగ్నమైఉన్నారు. మీరంతా శరీరాంగాలు భంగమై ఇలా ఎందుకున్నారు?" అని నారదుడు వారిని అడిగాడు.

వారు నారదునితో ఇలా చెప్పసాగారు - "మమ్మల్ని రాగములని అంటారు. మేము వేదపురంలో నివసిస్తున్నాము. మేమీవిధంగా అంగవైకల్యం పొందటానికి కారణం చెప్తున్నాము. విను, హిరణ్యగర్భుడైన బ్రహ్మకు నారదుడనే కుమారుడు జన్మించాడు. ఆతడు నిరంతరం తాళస్వరాలు లేకుండగా పాడే గానవిగానాలవల్ల మేము అంగభంగ రూపులమైపోయాము".... ఈమాటలు విని నారదుడు ఆశ్చర్యపడ్డాడు.

ఆతని గర్వం మటుమాయమైపోయింది. ఆముని వారిని చూచి "ఓ రాగగణము లారా! నారదుడు స్వరయుక్తంగా గానం చేయాలంటే ఆతని కెటువంటి కాలతాళ పరిజ్ఞానం ఉండాలి?" అని అడిగాడు. అప్పుడు వారు "నారదుడు సాక్షాత్తు సరస్వతీదేవి దగ్గర సంగీతం నేర్చుకొంటే ఏసమయంలో ఏ తాళ స్వరాలతో పాడాలో తెలుస్తుంది" అన్నారు. అప్పుడు నారదుడు సరస్వతీదేవిని ప్రసన్నురాలిని చేసికొనటానికి వెంటనే శుభ్రగిరి మీదకు వెళ్ళి అత్యంత దుష్కరమైన తపస్సు చేయసాగాడు.

ఓ రాధా! ఆ పర్వతమంతా ఆతని తపస్సు వల్ల పవిత్రమయింది. అప్పటినుంచి ఆ పర్వతానికి శుభ్రగిరి అనే పేరుపోయి నారదగిరి అని పేరు వచ్చింది. వాగ్దేవత సరస్వతి ఆతనికి ప్రత్యక్షమయింది. నారదుడా బ్రాహ్మీదేవిని అనేక విధాలుగా స్తుతించాడు.

నవార్కబింబ ద్యుతి ముద్గల జ్వలత్తాటంక కేయూర కిరీట కంకణాం
స్ఫురత్క్వణ న్నూపుర రావ రంజితాం నమామి కోటీందుముఖీ సరస్వతీం!
వందే సదాహం కలహంస ఉద్గతే చలత్పదే చంచల చంచు సంపుటే
నిర్ధౌత ముక్తాఫల హారసంచయం సంధారయంతీం సుభగాం సరస్వతీం!
వరాభయం పుస్తకవల్లకీయుతం పరందధానం విమలే కరద్వయే
నమామ్యహం త్వాం శుభదాం సరస్వతీం జగన్మయీం బ్రహ్మమయీం మనోహరం!
తరంగిత క్షౌమ సితాంబరే పరే దేహి స్వరజ్ఞాన మతీవ మంగళే
ఏనా ద్వితీయో హి భవేయ మక్షరే సర్వోపరిస్యాం పరరాసమండలే!

ప్రసన్నురాలైన వాగ్దేవత నారదమహర్షికి ఒక వీణను ప్రసాదించింది. దానితోపాటు ఆమె నారదునకు తాళలయ స్వర జ్ఞానములను అనుగ్రహించి అంతర్ధానమయింది. కృష్ణపరమాత్ముడు రాధతో "ఓ రాధా! సరస్వతీదేవిని గూర్చిన ఈ నారదదివ్యస్తోత్రాన్ని పఠించినవాడు ఈలోకంలో విద్వాంసుడౌతాడు" అని పలికాడు.

**నారద తుంబురులు :**

కృష్ణపరమాత్ముడు చెప్తున్నాడు - ఓ రాధా! సంగీత విద్యావిశారదుడైన నారదుడు

గంధర్వ నగరానికి వెళ్ళి అక్కడ తుంబురుణ్ణి తన శిష్యుని చేసికొని, హరి కీర్తనతో తన జీవనం పావనం చేసికొనసాగాడు. ఆ సమయంలో నారదుని కొక సందేహం కలిగింది. ఈ మధుర గానాన్ని ఎవరి ఎదుట పాడాలి? ఎవరికి వినిపించాలి? అని. ఆలోచించి నారదుడు మహేంద్రుని దగ్గరకు వెళ్ళాడు. కాని ఇంద్రుడు ఈ విషయంపై శ్రద్ధ చూపకపోవటం గమనించి మిత్రుడైన తుంబురునితో కలిసి సూర్యలోకానికి వెళ్ళాడు. సూర్యుడమిత వేగంతో రథంపై ప్రయాణిస్తుండటం చూచి నారదుడు శివుని దగ్గరకు వెళ్ళాడు. అక్కడ జ్ఞాన తత్వజ్ఞుడైన, భూతనాథుడైన శివుడు ధ్యానముద్రలో ఉండటం చూచి నారదుడు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. సృష్టికర్త సృష్టిరచనలో వ్యగ్రుడై యుండటం చూచి వారు వెంటనే మహావిష్ణువు ఉండే వైకుంఠలోకానికి వచ్చారు. భక్తవత్సలుడైన విష్ణువు ఒక భక్తునిపై అనుగ్రహం చూపే నిమిత్తం వెళ్ళిఉన్నకారణంగా వీరిరువురు అక్కడ నుంచి బహుదూరం ప్రయాణంచేసి గోలోకధామం చేరుకున్నారు. ఉన్నత తరంగాలతో శోభించే విరజా నదిని దాటి, భ్రమర ఝుంకార నినాదాలతో నిండియున్న రమణీయ బృందావనం చేరుకున్నారు. నిత్యవసంతంతో విలసిల్లే బృందావనం దాటి వారు గోవర్ధన పర్వత దర్శనం చేసుకున్నారు.

అక్కడ నికుంజద్వారందగ్గర నిలబడిన సఖురాండ్రు "మీరిద్దరెవరు? ఎక్కడనుంచి వచ్చారు? ఇక్కడ ఏమిపని?" అని అడిగారు. అప్పుడు నారద తుంబురులు "ఓ సుదతులారా! మేమిద్దరం గానవిద్యలో ఆరితేరినవాళ్ళం. మేము వీణాగాన నైపుణ్యాని సాక్షాత్తు భగవంతుడైన మాధవునకు వినిపించాలని వచ్చాము. మారాకను వారికి తెలియజేయ" మని అన్నారు. వారు వచ్చి నాకు ఆవిషయం తెలియజేస్తే వారిద్దరినీ లోపలకు తీసికొనిరమ్మని అన్నాను.

కోటిసూర్యకాంతితో ప్రకాశిస్తున్న ఆనికుంజప్రాంగణం లోపలకు వారు ప్రవేశించారు. కౌస్తుభమణి కాంతులు అన్ని వైపుల ప్రసరిస్తున్నాయి. ముత్యాలగొడుగులతో, మనోహరమైన వింజామరలతో అనేకమంది సఖురాండ్రతో నిండియున్న అచ్చోట మహాపద్మాసనం పైనున్న మనమిరువురను వారు దర్శనం చేసుకున్నారు. అనేక నమస్కృతులొనర్చి, నారదుడు దేవదత్తమైన వీణపై అమృత స్వరాలను పలికించాడు. ఆతని అద్వితీయమైన కళను చూచి నేను ఆతని నభినందించాను. ఆతని గానవిద్య నాకెంతో ఆనందాన్ని కలిగించింది. నేను శిరస్సు వంకిస్తూ ఆ వీణాగానాన్ని

వేవిధాలుగా వినుతించాను. అప్పుడు నేను ప్రేమ వల్ల వశీభూతుడనై నాకు నేను సమర్పించుకొని ద్రవీభావం పొందాను. నా శరీరం నుండి ఉద్భవించిన ఆ స్వేద జలమునే "బ్రహ్మద్రవం" గా పిలుస్తారు. ఆద్రవంలో అనేక బ్రహ్మాండరాసులు దొర్లుతుంటాయి. నేను త్రివిక్రమరూపం ధరించినప్పుడు నా పాదాఘాతానికి పగిలిన బ్రహ్మాండం పృశ్నిగర్భమనే పేరుతో ప్రఖ్యాతమయింది. దాన్ని భేదించుకొని ఇక్కడకు వచ్చిన బ్రహ్మద్రవమే పాపహారిణియైన స్వర్ధునియైన గంగానదిగా పిలువబడు తున్నది. ఈ గంగానది ద్యులోకంలో మందాకినిగా, భూలోకంలో భాగీరథిగా, పాతళలోకంలో భోగవతిగా త్రిపథగామిని అయింది. ఈ గంగానదిలో భక్తిభావంతో స్నానం చేస్తే రాజసూయ అశ్వమేధ యజ్ఞాల ఫలితం దక్కుతుంది. వందల యోజనాల దూరం నుంచి అయినాసరే "గంగా" "గంగా" అని ఉచ్చరించినంత మాత్రంచేత పాపాలు ప్రక్షాళన అవుతాయి.

ఓ రాధా! విరజానది నీభయంచేత ద్రవరూపం పొందినట్లు, విరజా కుమారులు ఏడుగురు సప్తసముద్రాల రూపం పొందినట్లు, విష్ణువు కృష్ణానది అయినట్లు, శివుడు వేణీనది అయినట్లు, బ్రహ్మ కకుద్మినీ గంగానది అయినట్లు, అప్సర గండకీనది అయినట్లు, ఋభు మహర్షి కూడా ద్రవీభావం పొందాడు. అది ఆతని ప్రేమ లక్షణ భక్తివల్ల సాధ్యమయింది" అని పలికాడు.

నారద మహర్షి చెప్తున్నాడు - ఓ బహుళాశ్వమహారాజా! ఆవిధంగా కృష్ణపరమాత్ముడు కొన్నాళ్ళు గోకులంలో గడిపి ఒక శుభముహూర్తంలో రథంపై మధురానగరానికి బయలుదేరాడు. గోపకాంతలందరూ ఆ రథం వెనుక చాలా దూరం వెళ్ళారు. వారు మాధవుని వియోగాన్ని సహించే స్థితిలో లేరు.

యుగపత్ దర్శనం విష్ణో: దుస్సహం భూమిమండలే
ఏషాం నిత్యం హి భవతి తేషాం తు కిము వర్ణనమ్?

భూమండలంపై ఒక్కసారి శ్రీకృష్ణుణ్ణి చూస్తే చాలు, ఆతనికి ఇక విరహం దుస్సహమైపోతుంది. అటువంటిది ప్రతిదినం కృష్ణుణ్ణి దర్శనం చేసికొనేవారు ఆయనకు దూరంగా ఉండవలసి వస్తే ఆ విరహం ఎంతటి దు:ఖాన్ని కలిగిస్తుందో ఎవరైనా వర్ణింపగలరా?

ఆ గోపికలు విహ్వలచిత్తలై "శ్రీకృష్ణా! నీవుత్వరగా వచ్చి మమ్మల్ని రక్షిస్తూ ఉండాలి. పూర్వం నీవు దేవతలకు అమృతం ప్రసాదించినట్లుగా, ఇప్పుడు నీవు మాకందరికీ దర్శనామృతాన్ని అనుగ్రహించు. మేమీజన్మలో కానీ ఇదివరకటి జన్మలలో కానీ ఏమైనా కాస్త పుణ్యం చేసికొనిఉంటే దాని ఫలితమే ఈనాడు మామనస్సులను నీ చరణారవిందాలపై లగ్నమైఉండటం. ఎవరి మనస్సులు నీ చరణకమలాలపై నిలిచియుంటాయో అటువంటి భక్తులే నీ కత్యంత ప్రియమైనవారు కదా. నీవు ప్రకృతి కంటె భిన్నంగా నిర్గుణుడుగా ఉంటావు. అయినప్పటికీ భక్తుల కోసం సగుణుడవుగా కూడా ఉంటాయి. నీకు నీ భక్తులు కంటే బ్రహ్మాదులు కూడా ఎక్కువవారు కారు. బ్రహ్మపదాదులమీద అభిలాషను కూడా విడిచి ఎవరు భగవంతుణ్ణి నిష్కామభావనతో భజిస్తారో, అటువంటి వ్యక్తి శాంత నిరపేక్షసుఖాన్ని అనుభవిస్తాడు" అన్నారు.

అప్పుడు కృష్ణ పరమాత్ముడు "ఓ వ్రజవాసులారా! మీరంటే నాకు ప్రాణం నా హృదయం మీ దగ్గరే ఉంటుంది. కేవలం శరీరమే అక్కడకు వెళుతున్నది. నేను మీకు ప్రతి నెలా దర్శనమిస్తాను. మనస్సుతో నేనెప్పుడూ దూరంగా ఉండను. ఓ గోపగణములారా! యాదవులతో యుద్ధం చేయటానికి జరాసంధుడు వచ్చాడు. అందువల్ల యాదవులకు సహాయం కోసం నేను వెళుతున్నాను. మీరు భయపడకండి' ' అని వారిని మాటమాటకు ఊరడించి, యశోదానందుల్ని వేరే రథంపై ఎక్కించి, శ్రీదామాది స్నేహితులతో, ఉద్ధవునితో రథం అధిరోహించి మధురవైపు పయనమయ్యాడు.

## కోలాసుర సంహారము :

కంసుని మిత్రుడైన కోలాసురుడనే వాడు దుష్టుడు. ఆతడు కౌశాంబీ నగరాన్ని రాజధానిగా చేసికొని పరిపాలించే కౌశారవి అనే రాజును పారద్రోలి ప్రజలను నానావిధాలుగా హింసింపసాగాడు. ఆ ప్రజలు మధురాధిపతికి తమ బాధను చెప్పుకొనటానికి మధురకు బయలుదేరారు. మధురానగరం పొలిమేరలలో వారికి వేటకు వెళుతున్న బలరాముడు కనిపించాడు. వారు బలదేవునికి అభివందనం చేసి కోలాసురుని వృత్తాంతమంతా చెప్పి వారి బారి నుండి తమ్ము రక్షించుమని, కౌశారవికి మరల రాజ్యమిప్పించుమని వేడుకున్నారు.

బలదేవుడు వెంటనే సేనాసమేతుడై కౌశాంబీనగరానికి బయలుదేరాడు. ఈవార్తవిని కోలాసురుడు పది అక్షౌహిణుల సేనతో వచ్చి బలరాముని ఎదిరించాడు. బలదేవుడు తన హలాయుధంతో ఆసేనను హతం చేయసాగాడు. ఆయన భీకరమైన ప్రతాపానికి మిగిలిన సేనలు పలాయనం చిత్తగించాయి. కోలాసురుడు మదగజంపై బలరాముని ఎదుర్కొన్నాడు. బలరాముడు ముసలాయుధంతో ఆ ఏనుగు శిరస్సుపై వేశాడు. కర్రదెబ్బకు మట్టికుండ పగిలినట్లుగా దాని శిరస్సు పగిలిపోయింది. క్రుద్ధుడైన కోలాసురుడు రాక్షస మాయలు పన్నాడు. ఇనుపగద తీసికొని మీదకు రాసాగాడు. బలరాముడు ముసలాయుధంతో వాని శిరస్సు పగులగొట్టి వాని మాయలన్నీ మటుమాయం చేశాడు. దేవతలు పూలవాన కురిపించారు. అనంతరం బలరాముడు గంగానదిలో స్నానం చేశాడు. ఆ ఘట్టానికి రామతీర్థమని పేరువచ్చింది.

పూర్వం ఆప్రాంతంలో దృఢాశ్వుడనే వంగరాజు ఉండేవాడు. ఆతడు ఒకనాడు లోమశ మహర్షిని చూచి పరిహసించిన కారణంగా శప్తుడై వరాహముఖంతో ఈ కోలాసురుడుగా జన్మించి ఈవిధంగా బలరాముని చేతిలో ముక్తి పొందాడు.

**మాండూక మహర్షి :**

బలరాముడు అక్కడ నుంచి ఉద్ధవాదులతో కలిసి జహ్నుతీర్థం వెళ్ళాడు. జహ్నుమహర్షి చెవినుంచి వచ్చి గంగానది అక్కడ జాహ్నవి అని పిలువబడుతున్నది. అక్కడ నుంచి పాండవులకుప్రియమైన ఆహారస్థానమనే చోటకు వెళ్లి ఆరాత్రి అక్కడ ఉన్నారు. అక్కడకు యోజనం దూరంలో మాండూక మహర్షి అనంతదేవుని గూర్చి తపస్సు చేస్తున్నాడు. బలదేవుడు తన బృందంతో అక్కడకు వెళ్ళి ఆమహర్షికి సాక్షాత్ దర్శనం ప్రసాదించటం కోసం ఆయన మనస్సు నుంచి తిరోహితుడయ్యాడు. ఆమహర్షి ఆశ్చర్యపడి కళ్ళుతెరచిచూశాడు. తాళధ్వజంతో, మకరకుండలాలతో, రథంపై ఆసీనుడైన తన ఆరాధ్యదైవమైన బలరాముణ్ణి చూచి మహర్షి పరమానందంపొందాడు. బలదేవుడు మాండూక మహర్షిని వరం కోరుకొనుమన్నాడు. అందుకు మహర్షి "దేవా! నాకు భాగవతవిద్యను ఉపదేశించు" మని అడిగాడు. అందుకు బలరాముడు "మహర్షీ! ఉద్ధవుడు నీ కోరికను తీరుస్తాడు" అన్నాడు.

మహర్షి బలరామునితో "స్వామీ! ఉద్ధవునకు ఆ అధికారమివ్వటానికి కారణమేమిటి? నేనాయనను ఎప్పుడు కలుసుకుంటాను? అని అడిగాడు.

బలరాముడామహర్షితో "అది ఒక విశిష్టమైన విషయం. ఉద్ధవుడిప్పుడు నాతోనే ఉన్నాడు. నీవాయన దర్శనం చేసుకో. ఆయన సంపూర్ణ జ్ఞానస్వరూపుడు. అందుకే శ్రీకృష్ణుడు ఆయనను తన ప్రతినిధిగా వ్రజమండలానికి పంపించాడు. కృష్ణుడు తన అలంకరణలు, ఆయుధములు, రథము సమస్తము ఈ ఉద్ధవునకిచ్చి పంపాడు. పైగా ఆయన రూపం కూడా శ్రీకృష్ణరూపమే. ఉద్ధవుడు సాక్షాత్తు రాధాదేవిని ఊరడించి వచ్చాడు. నందాదులందరూ ఉద్ధవుణ్ణి చూచి "వియోగార్తిహారి" అని ప్రశంసించారు. శ్రీకృష్ణుడీయనకు ముద్రాధికారం ప్రసాదించాడు. శ్రీకృష్ణుని అనంతరం కూడా ఈ మహానుభావుడు ఉంటాడు. ఈ ఉద్ధవుడు బదరికాశ్రమంలో నరనారాయణులకు భగవత్‌రహస్యాన్ని బోధిస్తాడు. జనమేజయుడు గంగాతీరంలో అశ్వమేధయాగం చేసినప్పుడు ఉద్ధవుడు భవరోగవినాశినియైన భాగవత ప్రవచనం చేస్తాడు. అప్పుడు భాగవత శ్రవణం చేసే అదృష్టం నీకు కలుగుతుంది. నీవు నాకై చేసిన తపస్సువల్ల ఈ రహస్యం నీకు తెలియజేశాను" అన్నాడు.

అనంతరం బలరాముడు తన బృందంతో పుష్పవతీ నదీ తీరం నుంచి దక్షిణం వైపుకు వెళ్ళాడు. బలరాముని ఆగమన వార్తవిని ఋషులందరూ అక్కడకు వచ్చి ఆయనను పూజించారు. బలరాముడు వారితో "కలియుగంలో మీకు ఎప్పుడు ఏ కష్టము వచ్చినా నన్ను స్మరించండి. నేను మిమ్మల్ని రక్షిస్తాను" అని అభయప్రదానం చేసి ముందుకు వెళ్ళాడు. ఆ పుణ్యప్రదేశానికి సంకర్షణస్థానం అని పేరువచ్చింది.

## మధురానగరప్రశస్తి :

బహుళాశ్వ మహారాజు నారదునితో "ఓ మహర్షీ! బలరామకృష్ణులు నిరంతరం నివసించే మధురాపురి ఎంతటి ధన్యమైనది! ఆ మధురకు దైవం ఎవరు? అచటి క్షేత్రపాలకు డెవరు? రక్షకు డెవరు? మంత్రి ఎవరు? గూఢచారులెవరు? వివరింపవలసిన' 'దని అడుగగా నారదుడిలా చెప్పసాగాడు.

ఓ మహారాజా! సాక్షాత్తు శ్రీమహావిష్ణువే మధురకు ప్రధాన దైవం. కేశవదేవుడే అక్కడ క్లేశనాశకుడు. ఆస్వామి ఒకనాడు కపిలుడనే బ్రాహ్మణునకు తన వరాహమూర్తి రూపంగల విగ్రహాన్ని ఇచ్చాడు. వేరొకసందర్భంలో కపిలమహర్షి ఆ మూర్తిని ఇంద్రునకిచ్చాడు. ఇంద్రలోకం మీదకు దండెత్తి విజయం సాధించిన రావణుడు

ఆ విగ్రహాన్ని తెచ్చి లంకలో తన యింట ఉంచుకొని పూజింపసాగాడు. తరువాత శ్రీరామచంద్రుడు రావణుని వధించి వచ్చేటప్పుడు ఆ వరాహమూర్తిని అయోధ్యకు తీసికొనివచ్చాడు. ఒకనాడు శతృఘ్నుడు శ్రీరామచంద్రుని ఆజ్ఞానుసారం ఆ వరాహమూర్తిని మధురకు తీసికొనివచ్చి ప్రతిష్ఠచేశాడు. మధురావాసులంతా వరదాయకుడైన ఆ వరాహస్వామిని అర్చిస్తూ ఉంటారు. భూతేశ్వరుడైన శివుడే మధురకు క్షేత్రపాలకుడు. సింహవాహనయైన దుర్గాదేవి మధురాపురిని రక్షిస్తూ ఉంటుంది. ఇక నేనే మధురలో గూఢచారిని. నగరులోని విషయాలను నేను ఎప్పటికప్పుడు కృష్ణునకు నివేదిస్తుంటాను. నగరం మధ్య ఉన్న శుభదాయిని మధురాదేవి అందరికీ అన్నం పెడుతూ అన్నపూర్ణగా విరాజిల్లుతున్నది.

పూర్వకాలం బ్రహ్మ మధురకు వచ్చి పరబ్రహ్మ శ్రీహరిని గూర్చి తపస్సు చేసి స్వాయంభువు వంటి కుమారుణ్ణి పొందాడు. ఇంద్రుడు మధురలో తపముచేసి ఇంద్రపదవిని పొందాడు. సూర్యుడు తపస్సుచేసి వైవస్వత మనువును కుమారునిగా పొందాడు. శంతను డిచ్చటనే తపముచేసి భీష్ముణ్ణి కుమారుడుగా పొందాడు. మానవుడు 'మధుర' అని పలికిన మాత్రంచేతనే భగవన్నామోచ్చారణ చేసిన ఫలితాన్ని పొందవచ్చు.

ఓ మిథిలేశ్వరా! ఒక్కసారి శ్రీకృష్ణపరమాత్ముణ్ణి మనసులో స్మరించి, మధురాపురి గురించిన ఈ మాహాత్మ్యాన్ని వింటే మధురానగరానికి ప్రదక్షిణచేసిన ఫలితం కలుగుతుంది. అపారమైన వైభవాన్ని కోరుకునేవారు ఈ మధురాఖండాన్ని నియమపూర్వకంగా, శ్రద్ధగా ఇరవైయొక్క సార్లు వింటే వారి యింటి ముందు మత్తేభాలు భ్రమర సముదాయాలను చెవులతో తోలుతూ విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. ఈ మధురాఖండం పఠించిన వారికి విఘ్నాలు తొలగిపోయి విజయం సంప్రాప్తిస్తుంది అని నారద మహర్షి బహుళాశ్వునకు తెలియజేశాడు.

## 6. ద్వారకాఖండము

బహుళాశ్వ మహారాజు నారద మహర్షితో "ఓ మహామునీ! మధురాఖండ గాథను మధురమధురంగా వినిపించావు. ఇప్పుడు శ్రీకృష్ణచరితామృతంతో నిండిన ద్వారకాఖండాన్ని చెప్పి మాకు వీనులవిందొనరించు. కృష్ణపరమాత్మునికి ఎన్ని వివాహాలు అయినాయి? ఆయనకు పుత్రులెందరు? పౌత్రులెందరు? ఆ పరమాత్ముడు మధుర నుంచి వెళ్ళి ద్వారకలో ఎందుకని నివసించాడు?" అని అడిగాడు.

**జరాసంధుడు :**

నారదమహర్షి చెప్పసాగాడు - "ఓ మిథిలేశ్వరా! కంసునిమరణానంతరం ఆతని పత్నులు అస్తిప్రాస్తులు దుఃఖితలై తండ్రియైన జరాసంధుని గృహం చేరుకున్నారు. వారి వల్ల కంసుని మృతివార్తవిని జరాసంధుడు పృథ్విని యాదవ రహితం చేయాలని నిశ్చయించాడు. వెంటనే ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో ఆతడు మధురపై దండెత్తాడు. ఆతని రాకను గూర్చివిని మధురాపుర వాసులు భయభ్రాంతులయ్యారు. ఆ సమయంలో సభాసదనంలో ఉన్న శ్రీకృష్ణుడు బలరామునితో "అన్నా! ఈజరాసంధుని సేననంతటినీ హతంచేయాలి. ఈతడు మరల వెళ్ళి పాపాత్ములందరినీ ఇంకా తీసికొనివస్తాడు, అందువల్ల ఈతనిని మాత్రం చంప కూడదు" అని చెప్పాడు. ఇంతలో వైకుంఠధామం నుంచి రెండు రథాలు క్రిందకు దిగి వచ్చి ఆ సభాసదనం ముందు నిలిచాయి. బలరామకృష్ణులు చెరియొక రథంపై అధివసించి కొద్ది యాదవసేనను తీసికొని మధురాపురం దాటి రణభూమికి చేరారు. అక్కడ మాగధులకు యాదవవీరులకు పోరు ఆరంభమయింది. జరాసంధుడు పది అక్షౌహిణులసేనతో కృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. ఆతనికి సహాయంగా దుర్యోధనుడు ఐదక్షౌహిణుల సేనతో వచ్చాడు. వింధ్యరాజు ఐదక్షౌహినుల సేనతో, వంగరాజు మూడక్షౌహిణుల సేనతో జరాసంధునకు తోడ్పడ్డారు. శత్రువుల బాణ వర్షంతో అంధకారం వ్యాపించినట్లయింది. అప్పుడు కృష్ణపరమాత్ముడు శార్ఙ ధనుష్టంకారం చేశాడు. ఆ భీషణటంకారానికి శత్రుసేన తల్లడిల్లిపోయింది. అశ్వాలు రణభూమినుంచి పరుగులు తీశాయి. గజసేన చెల్లాచెదురయింది. శ్రీకృష్ణుడు మెరుపువలె మెరుస్తున్న శార్ఙధనువు నుంచి బాణవర్షం కురిపింపసాగాడు. మగధాధిపతియైన జరాసంధుని సమస్త సైన్యము నాశనమయింది. రథాలు విరిగిపోయాయి.

గజాశ్వయూథాలు నేలకూలిపోయాయి. అశ్వికులు, గజపతులు నిహతులయ్యారు. రక్తం వైతరణివలె ప్రవహించింది. శేషించిన శత్రు సేనను బలరాముడు హలాయుధంతో చీల్చి చెండాడసాగాడు. బలరామకృష్ణుల విజృంభణను చూచి భీతితో దుర్యోధనుడు, వింధ్యనాధుడు, వంగదేశాధిపతి రణభూమిని విడిచి పారిపోయారు. పదివేల ఏనుగుల బలం కలిగిన జరాసంధుడు రథంమీద వెళ్ళి బలరాముణ్ణి ఎదుర్కొన్నాడు. బలదేవుడు నాగలితో రథాన్ని లాగి ముసలంతో దాన్ని చూర్ణం చేశాడు. రథ విహీనుడైన జరాసంధుడు బలదేవుణ్ణి రెండు చేతులతో పట్టుకున్నాడు ఇరువురూ మల్లయుద్ధం చేయసాగారు. ఛాతీఛాతీ, మస్తకం మస్తకం ఢీకొడుతున్నారు. బాహాబాహీ, కచాకచి, ముష్టాముష్టిగా తలపడుతున్నారు. బలరాముడు జరాసంధుణ్ణి పైకిఎత్తి విసిరినేలపై కొట్టి అతని వక్షస్థంలపై కూర్చొని ముసలాయుధంతో హతమార్చటానికి సిద్ధమయ్యాడు. వెంటనే కృష్ణుడాతనిని వారించి జరాసంధుణ్ణి విడిచిపెట్టాడు. లజ్జచేత జరాసంధుడు రణభూమిని వెడిచి వెళ్ళి తపస్సు చేయటానికి పూనుకున్నాడు. కాని ఆతని మంత్రిచెప్పిన హితవును పాటించి తపస్సు విరమించి మగధకు తిరిగివెళ్ళాడు.

ఈవిధంగా కృష్ణ పరమాత్ముడు జరాసంధుణ్ణి పరాభూతునిచేసి మధురకు తిరిగివచ్చాడు. మధురాపుర వాసులు పరమాత్మునకు విశేషంగా స్వాగతసత్కారాలు చేశారు. శంఖాలనునినదించారు. నగారాలను మ్రోగించారు. బ్రాహ్మణులు వేదఘోష వెలయిస్తూ పూర్ణకుంభంతో స్వాగతం పలికారు. ఆ వేడుకల మధ్య గోవిందుడు వస్తుంటే పురకాంత లాతనిపై లాజలను, పువ్వులను చల్లారు. గరుడధ్వజం రథంపై రెపరెపలాడుతుండగా శ్యామసుందరుడు జగన్మోహనమైన రూపంతో చిరునవ్వులు చిందిస్తూ నేత్రపర్వం గావించాడు!

**కాలయవనుడు :**

నారదమహర్షి ఇలా చెప్పసాగాడు - ఓ రాజేంద్రా! మరల కొద్దిరోజులకే జరాసంధుడు ఇరవై మూడు అక్షౌహిణుల సేన తీసికొని యాదవులపై యుద్ధానికి వచ్చాడు. అయినా మరల ఆతడు శ్రీకృష్ణపరమాత్ముని చేతిలో ఘోరంగా పరాజయం పొందాడు. ఈవిధంగా జరాసంధుడు మొత్తం పదిహేడు పర్యాయాలు వచ్చి యాదవుల చేత పరాభవింపబడి వెళ్ళాడు. పద్దెనిమిదవ పర్యాయం ఆతడు మరల మధురపై

దండెత్తటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు నేను ప్రోత్సహించటంవల్ల కాలయవనుడు మ్లేచ్ఛవీరుల్ని తీసికొని మధురను చుట్టముట్టాడు.

అప్పుడు మధురానగరం ఎటువంటి విపత్కర పరిస్థితిలో ఉన్నదో గ్రహించి, శ్రీకృష్ణుడు బలరామునితో సంప్రదించాడు. ఆ ఆప్తుల్ని, బంధువుల్ని రక్షించటం కోసం ఆ రాత్రికిరాత్రి సముద్రం మధ్యలో ద్వారకాదుర్గాన్ని సృష్టించాడు. అది సాక్షాత్తు వైకుంఠం వలెనే ప్రకాశించసాగింది. అప్పుడు కృష్ణపరమాత్ముడు తన యోగంబలంతో సమస్త మధురాపురవాసులను ద్వారకకు చేర్చి మధురకు వచ్చాడు. ఎటువంటి శస్త్రాస్త్రములు ధరించకుండా నడిచి వస్తున్న శ్రీకృష్ణుణ్ణి చూచి కాలయ వనుడు సంతోషించి పోరాటానికి స్దిద్ధమయ్యాడు. యోగీంద్రులకు కూడా అందని ఆ పరమాత్ముడు వెనుదిరిగి పారిపోవటం చూచి కాలయవనుడు శీఘ్రగతితో వెంబడింపసాగాడు. శ్రీకృష్ణుడు వెళ్ళి వెళ్ళి శ్యామల పర్వత పంక్తులలోని ఒక గుహలో దాక్కున్నాడు.

**ముచికుందుడు :**

ఆగుహలో మాంధాత మహారాజు కుమారుడు ముచికుందుడున్నాడు. పూర్వం ఆతడు దేవాసుర సంగ్రామంలో అసురుల్ని ఓడించి దేవతల్ని రక్షించాడు. ఆ సమయంలో అతడు కొన్ని రోజులపాటు నిద్రలేకుండా గడుపవలసి వచ్చింది. ఆతని రక్షాతత్పరతకు మెచ్చి దేవతలు "ఓ రాజా! నీకిష్టమైన వరం కోరుకొను' ' మని అన్నారు. ముచికుందుడు దేవతలకు నమస్కరించి "నాకిప్పుడు మంచి నిద్రకావాలి. "శయనాంతే హరేః సాక్షాత్ దర్శనంమే భవత్వలమ్" నిద్రపూర్తిఅయి లేవగానే నేను సాక్షాత్తు శ్రీహరిని దర్శించాలి. నిదురించే సమయంలో ఎవరైనా అజ్ఞానమానవుడు నాకు నిద్రాభంగం కలిగిస్తే నా చూపుతో ఆతడు భస్మంకావాలి' ' అన్నాడు. ఆమాటలకు దేవతలు 'తథాస్తు' అనిపలికారు. అప్పుడు ఆ సత్యయుగంలో ముచికుందుడీ గుహలోపలకు వచ్చి పడుకున్నాడు. శ్రీకృష్ణుడు వెళ్ళటం గమనించిన కాలయవనుడు వెంటనే తాను కూడా ఆ గుహలోపలకు ప్రవేశించాడు. లోపల చీకట్లో నిద్రపోతున్న పురుషుణ్ణి శ్రీకృష్ణుడుగా భావించి కాలయవనుడు ఒక్క తన్ను తన్నాడు. ఆదెబ్బకు ముచికుందుడు లేచి కూర్చొని, కళ్ళు తెరచి, క్రుద్ధుడై చూచేసరికి కాలయవనుడు భస్మమైపోయాడు.

అప్పుడు కృష్ణపరమాత్ముడు ముచికుందునకు తన దర్శనం ప్రసాదించాడు. కిరీట, కంకణ, నూపుర, కుండల, కేయూరాది ఆభరణాలతో కోటి సూర్యకాంతులతో మెరిసిపోతున్న శ్రీకృష్ణుణ్ణి ముచికుందుడు చూశాడు. శ్రీవత్సచిహ్నంతో, వనమాలతో, నేత్రకమలాలతో శోభిస్తున్న పరమాత్మునకు ముచికుందుడు భక్తితో అభివందనాల నర్పించి స్తుతించాడు.

"ఓస్వామీ! లోకంలో నావంటి పాపాత్ముడు లేడు. నీవంటి పాపాపహారిలేడు. కాన నాపై దయ చూపించు అన్నాడు. శ్రీకృష్ణుడు ముచికుందుని నిర్గుణభక్తికి మెచ్చి ఆతనితో "ఓరాజా! నీవు ఈరోజునే నా బదరికాశ్రమానికి వెళ్ళు. అక్కడ నీవు తపస్సు చేసి ముక్తిపొందు, ఇక నీవు ఈ సంసారబంధా లలో తగుల్కొనవు" అన్నాడు. ముచికుందుడు గుహనుండి బయటకు వచ్చిచూశాడు. ద్వాపరయు గాంతంలోని ఆ మరుగుజ్జు మనుష్యులు తాళవృక్షంవలె దీర్ఘదేహుడై యున్న ముచి కుందుణ్ణి చూచి భయంతో అటుఇటు పరుగెత్త సాగారు. "మీరు భయపడకండి" అని వారికభయమిచ్చి ముచికుందుడు ఉత్తరదిశవైపు ప్రయాణమై వెళ్ళాడు.

శ్రీకృష్ణుడు మధురాపురానికి తిరిగి వచ్చి అక్కడ కాలయవనుని అనుచరులైన మ్లేచ్ఛులను సంహరించాడు. అనంతరం జరాసంధుడు మధురపైకి దండెత్తటానికి బ్రాహ్మణులను పిలిచి ముహూర్తం పెట్టించుకొని వారితో "ఓ విప్రులారా! నేనీ పర్యాయం కృష్ణుణ్ణి జయించి తిరిగి వచ్చినట్లయితే మిమ్మల్ని పూజించి ఆదరిస్తాను. అప్పటివరకు మీరిక్కడే కారాగారంలో ఉండండి. ఒకవేళ నేను ఓడిపోయి తిరిగివస్తే మిమ్మల్నందర్నీ సంహరించివేస్తాను. ఇందులో సందేహం లేదు" అని చెప్పి ఇరవైమూడు అక్షౌహిణుల సేనను తీసికొని వెళ్ళాడు.

బలరామకృష్ణులు సాధారణమానవుల వలె భయపడి నగరం నుండి పారిపోయారు. కాలినడకన అలా వెళుతున్న సోదరుల్ని చూచి జరాసంధుడు నవ్వుకున్నాడు. బ్రహ్మావాక్యం గుర్తుకు తెచ్చుకొని జరాసంధుడు సేనాసమేతుడై వారివెంట బడ్డాడు. బలరామకృష్ణులు జరాసంధుని రాకను చూచి ప్రవకర్షణ పర్వతం మీదకు వెళ్ళారు. పర్వతపు అరణ్యంలో వారిద్దరూ కనిపించకపోయేసరికి జరాసంధుడు ఆ అరణ్యాన్ని అగ్నికి ఆహుతి చేశాడు. అప్పుడు బలరామకృష్ణులు పర్వత శిఖరాలనుంచి దూకి

శత్రువుల కళ్ళుగప్పి ద్వారకకు చేరుకున్నారు. వీరిద్దరూ ఆ అగ్నిలో ఆహుతి అయినారని భావించి జరాసంధుడు విజయగర్వంతో మగధకు వెళ్ళాడు. చెరసాలలో ఉన్న బ్రాహ్మణులను విడిపించి వారిని ఆదరించాడు. శ్రీకృష్ణుడు ద్వారకలో నివసించటానికి కారణమైన వృత్తాంతం ఇది.

**బలరామ వివాహము :**

నారదమహర్షి ఇలా వివరిస్తున్నాడు - ఓ మిథిలేశ్వరా! ముందు బలరాముని వివాహవృత్తాంతం చెప్తావిను. ఇది సకల శుభప్రదమైనది. సూర్యవంశంలో ఆనర్తుడనే పేరుగల ఒకరాజు ఉండేవాడు. ఆతని రాజ్యం సముద్రం మధ్యలో ఉంది. ఆనర్తుని కుమారుడే రేవత మహారాజు. ఆతడు కుశస్థలిని రాజధానిగా చేసికొని పరిపాలిస్తున్నాడు. ఆతనికి నూరుగురు కుమారులు, ఒక కుమార్తె. ఆమెపేరు రేవతి. ఒక పర్యాయం రేవతమహారాజు రత్న ఖచితరథంపై కుమార్తెను కూర్చొనబెట్టుకొని భూమండల సంచారం చేస్తూ తన యోగబలంతో బ్రహ్మలోకం చేరుకున్నాడు. అప్పుడక్కడ పూర్వచిత్తి అనే అప్సర గానం చేస్తున్నది. రేవతుడు భక్తిపూర్వకంగా విధాతకు నమస్కరించి "హే బ్రహ్మన్! నీవు పురాణపురుషుడవు. వేదములు నీవదనము. ధర్మము నీహృదయము. అటువంటి నీకు నమస్కారము. నీవు సర్వద్రష్టవు. అందువల్ల నాకుమార్తె రేవతికి సద్గుణసంపన్నుడు, చిరంజీవి, సుందరుడు అయిన వరుడెవరో తెలుపవలసింది" అన్నాడు.

అప్పుడు సర్వదర్శనుడైన బ్రహ్మ చిరునవ్వు నవ్వి "ఓ రాజా! ఇప్పుడిక్కడ ఒక్క క్షణం గడిచింది. అంటే భూలోకంలో ఇరవైయేడు చతుర్యుగములు గడిచాయి. అక్కడ నీకుమారులు, మనుమలు, బంధువులు ఎవరూ జీవించిలేరు. అందువల్ల నీవు వెంటనే భూలోకం వెళ్ళి నీ కుమార్తెను ఉత్తముడైన బలరామునికిచ్చి వివాహం చెయ్యి. సాక్షాత్తు గోలోక అధిపతియైన భగవంతుడు భూభారం తొలగించటం కోసం బలరామకృష్ణుల రూపాలతో భువిపై అవతరించారు. వసుదేవ తనయులుగా ఉద్భవించి వారిరువురు ప్రస్తుతం ద్వారకలో ఉంటున్నారు" అనితెలిపాడు.

రేవతుడా మాటలు విని బ్రహ్మకు నమస్కరించి కుశస్థలికి వచ్చి బలరామునకు తన కుమార్తె నిచ్చి వివాహం చేశాడు. విశ్వకర్మ చేత తయారుచేయబడిన దివ్యరథాన్ని, విధాత తన కిచ్చిన దివ్యరత్నాన్ని తన కన్యారత్నంతో పాటు రేవతుడు బలరామునకు

కానుకగా సమర్పించాడు. రేవతీ బలదేవులు ద్వారకకు బయలుదేరి వెళ్లగా అక్కడ వీరిరువురి వివాహ సందర్భంగా మహోత్సవం జరిగింది. అనంతరం రేవతుడు తపస్సు చేసికొనటానికి బదరికాశ్రమానికి వెళ్ళాడు.

## రుక్మిణీ కృష్ణులు :

నారదమహర్షి ఇలా పలుకుతున్నాడు - ఓ మిథిలేశ్వరా! సర్వపాపహరమైనదీ, ధర్మార్థకామ మోక్షప్రదాయకమైనదీ అయిన శ్రీకృష్ణుని వివాహగాథను వివరిస్తాను. విదర్భదేశంలో కుండిన నగరాన్ని ప్రతాపవంతుడైన భీష్మకుడనే రాజు పరిపాలిస్తున్నాడు. సాక్షాత్తు లక్ష్మీదేవి అంశతో రుక్మిణి ఆతనికుమార్తెగా జన్మించింది. వేయిచందమామల కాంతితో ఆమె తేజరిల్లుతూ ఉండేది. సర్వసద్గుణవతియైన ఆమె ఒకనాడు నేను శ్రీకృష్ణుని సుగుణములను గురించి చెప్పగా విని ఇక తనకు శ్రీకృష్ణుడే పతియని నిర్ణయించుకున్నది. అదేవిధంగా నేను రుక్మిణి సుగుణ సంపత్తిని గూర్చి చెప్పగా విని శ్రీకృష్ణదేవుడు కూడా రుక్మిణినే పరిణయమాడటానికి నిశ్చయించుకున్నాడు. సర్వధర్మజ్ఞుడైన భీష్మక మహారాజు కూడా శ్రీకృష్ణుని మనోభావాన్ని గ్రహించి తన కుమార్తెను కృష్ణున కివ్వటానికే నిర్ణయించుకున్నాడు.

కానీ భీష్మకుని కుమారుడు రుక్మి మాత్రము తన సోదరి రుక్మిణిని తన మిత్రుడైన శిశుపాలునకివ్వటానికే నిశ్చయించుకున్నాడు. ఈ విషయం విని రుక్మిణి మనస్సులో బాధపడి శ్రీకృష్ణుని దగ్గరకు ఒక బ్రాహ్మణుని దూతగా పంపింది. ఆ విప్రుడు దివ్య ద్వారకానగరం చేరగానే కృష్ణపరమాత్ముడు ఆతనిని ప్రేమతో ఆదరించాడు. ఆవిప్రుడు కృష్ణమందిరంలోనే భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నాడు. కృష్ణపరమాత్ముడు విదర్భవాసులను గూర్చి కుశలప్రశ్నల నడిగినప్పుడు ఆ బ్రాహ్మణు డక్కడి వృత్తాంతాన్ని వివరంగా చెప్పాడు. రుక్మిణి యిచ్చిన లేఖను శ్రీకృష్ణున కిస్తూ ఆ బ్రాహ్మణుడామె సందేశాన్ని ఇలా విన్నవించాడు "శ్రీ సంపన్నుడు, నిత్యానంద స్వరూపుడు, విభూతి సుందరుడు అయిన శ్రీకృష్ణపరమాత్మునకు శతకోటి ప్రణామములు! నారదమహాముని చెప్పిన మాటల వల్ల మీరు ప్రకృతి కంటె భిన్నమైన పరమపురుషులని గ్రహించాను. మీరు సర్వజ్ఞులు. మీకు తెలియనిదేమున్నది? అయినప్పటికీ మీకు నేను ఒక రహస్యమైన విషయం తెలియజేస్తున్నాను. నన్ను వీరభోగ్యగా భావించి మీరు నన్ను పరిగ్రహించండి.

అంతఃపురంలో ఉండే నన్ను ఎలా పరిణయమాడటమా అని సందేహించవద్దు. అందుకు నేను ఉపాయం చెప్తున్నాను. వివాహానికి ముందు రోజు నేను కుల దేవతను పూజించటానికి గౌరీమందిరానికి వస్తాను. అక్కడే మీరు నన్ను వివాహం చేసికొనవచ్చు........"

విప్రుని వల్ల రుక్మిణి మనోభావాలను గ్రహించిన శ్రీకృష్ణుడు వెంటనే రథం సిద్ధం చెయ్యమని దారుకుణ్ణి ఆజ్ఞాపించాడు. రత్నఖచితమైన, రమణీయమైన రథానికి శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహక అశ్వాలను పూన్చి దారుకుడు రథం సిద్ధంచేశాడు. శ్రీకృష్ణపరమాత్ముడు రథం అధిరోహించి చెయ్యి అందించి బ్రాహ్మణుణ్ణి సరసన కూర్చొనబెట్టుకున్నాడు. రథం విదర్భ వైపు కదిలి వెళ్ళింది.

రాజసమూహాల మధ్యనుంచి రుక్మిణిని తీసికొని రావటానికి శ్రీకృష్ణుడు ఒంటరిగా వెళ్ళాడనే విషయం తెలిసి బలరాముడు యాదవ సేనను తీసికొని వెనుకనే బయలుదేరాడు. శ్రీకృష్ణుడు కుండినపుర సమీపంలోని ఉపవనంలో దిగాడు. అక్కడనుంచి దూరంగా కుండినపురం కనిపిస్తున్నది. గుండ్రని కోట గోపురం, దుర్భేద్యమైన కోట గోడలు, శిఖరాలపై పతాకాలు కనులవిందు చేస్తున్నాయి.

అంతఃపురం లోపల భీష్మకుడు తన కుమార్తెను శిశుపాలునకివ్వటానికి రత్నమంటపంలో వైవాహిక సామాగ్రిని సిద్ధం చేశాడు. మహిళామణులు మంగళ గీతాల నాలపిస్తున్నారు. అధర్వవేదజ్ఞులు శాంతి పాఠం చెప్పిరుక్మిణిచేత ఆభరణముల నలంకరింపజేసి మంత్రాలతో రక్షాసూత్రం కట్టారు. భీష్మకమహారాజు బంగారము, ముత్యాలు, వస్త్రాలు, గోవులు, ఏనుగులు, రథాలు, అశ్వాలు, ఆభరణాలు దానం చేశాడు. అదే సమయంలో అక్కడ దమఘోషుని కుమారుడైన శిశుపాలునకు కూడా రక్షాబంధం కట్టి శాంతి చేశారు. మంగళస్నానాలంకృతుడైన శిశుపాలుణ్ణి ఏనుగు మీద కూర్చొనబెట్టి మంగళవాద్యాలతోకుండిన నగరానికి తీసికొని వచ్చారు. జరాసంధుడు, సాలువుడు, దంతవక్త్రుడు, విదూరథుడు, పౌండ్రుడు సేనలతో వెంటవచ్చారు. శ్రీకృష్ణుని ప్రయత్నంగురించి కూడా విని యుండటంవల్ల వీరంతా శిశుపాలునకు సహకరించటానికి విచ్చేశారు. కుండిన నగరంలో ప్రవేశించగానే భీష్మకు డెదురువచ్చి శివపాలుణ్ణి సగౌరవంగా ఆహ్వానించాడు.

నారదమహర్షి బహుళాశ్వునితో చెప్తున్నాడు - ఓ మహారాజా! ఆ సమయంలో

కమలనయనమైన రుక్మిణి శ్రీకృష్ణుని చరణకమలాలను ధ్యానిస్తూ "ఇంక నా వివాహానికి ఒక్క రాత్రి మాత్రమే గడువు ఉన్నది. శ్రీకృష్ణుడింకా రానేలేదు. వార్తను తీసికొనివెళ్ళిన బ్రాహ్మణుడూ రాలేదు. ఒకవేళ గోవిందుడు నా చర్యలో తప్పుపట్టి ఇక్కడకురాకపోతే నాపరిస్థితి ఏమిటి? విధాత నాకుఅనుకూలించటం లేదా?" అని విచారింపసాగింది. శ్రీకృష్ణపరమాత్ముని రాకకోసం ఆమె తన సౌధం పైనుంచి ద్వారకా మార్గంవైపు చూడసాగింది. అదే సమయంలో శుభసూచకంగా ఆమె ఎడమ భుజం అదిరింది. శ్రీకృష్ణుని దగ్గర నుంచి బ్రాహ్మణుడు తిరిగి రావటం కనిపించింది. ఆతడు వచ్చి శ్రీకృష్ణుని రాకను గూర్చిన శుభవర్తమానం తెలియజేశాడు. అందుకు ప్రసన్నురాలైన రుక్మిణి ఆ విప్రునితో "మీ మేలు నేనెన్నటికీ మరువలేన"ని చెప్పింది.

బలరామకృష్ణులు తన కుమార్తె వివాహం చూడటానికి వస్తున్నారని విని భీష్మకుడు గంధ, పుష్ప, అక్షతలు, మణులు, మాణిక్యములు తీసికొని కొందరు బ్రాహ్మణులతో, మంగళ వాద్యములతో ఎదురువెళ్ళాడు. దివ్యసుందర రథాలపై విచ్చేసిన బలరామకృష్ణుల్ని భీష్మకుడు విధివిధానంగా అర్చించి కృష్ణభగవానునకు తన కుమార్తె నివ్వలేకపోయినందుకు ఎంతగానో విచారించాడు. బలరామకృష్ణులకు భీష్మకుడు ఆనందవనం విడిదిగా ఇచ్చాడు. వసుదేవనందనుడు, సాక్షాత్తు భగవంతుడు నైన శ్రీకృష్ణుడు వచ్చిన విషయం తెలిసికొని కుండిన పురవాసులు ఆనందవనానికి తరలివచ్చి కృష్ణుని ముఖ కమలసౌందర్యాన్ని నేత్రపుటాలతో తనివితీర గ్రోల సాగారు. అప్పుడు వారు తమలో తాము "మన రుక్మిణి శ్రీకృష్ణునకు పత్ని కవాటమే యోగ్యము. ఈమె మరొకరి సతి కావటము సమంజము కాదు. మన పూర్వజన్మ పుణ్యం ఏమైనా మిగిలిఉంటే దానికి బదులుగా మనం బ్రహ్మదేవుణ్ణి రుక్మిణీ కృష్ణులకు వివాహం అయ్యేలా చూడమని వరం కోరదాము. అలా జరిగితే కృష్ణుడు అత్తగారి ఇంటికి వచ్చినప్పుడల్లా మనం కృష్ణుణ్ణి దర్శనం చేసికొనవచ్చు, మన జన్మ చరితార్థం చేసికొనవచ్చు" అని అనుకొనసాగారు.

కుండిన నగరకాంతలు ఈవిధంగా పరస్పరం సంభాషించుకొంటున్న సమయంలో గౌరీపూజకై రుక్మిణి చెలికత్తెలతో సహితంగా అంతఃపురం నుంచి బయటకు వచ్చింది. ఆ సమయంలో కూడా రుక్మిణి మనస్సు శ్రీకృష్ణుని మీదనే లగ్నమయి ఉంది. ఒక వంక భేరీ, మృదంగాది ధ్వనులు మారుమ్రోగుతున్నాయి. మరొకవంక మంగళగీతాలు వినిపిస్తున్నాయి. ఆ సమయంలో రుక్మిణి దివ్య సౌందర్యంతో

మెరిసిపోతున్నది. కర్ణకుండలాలు ఆమె వదన కాంతిని మరింత ఇనుమడింప చేస్తున్నాయి. ప్రక్కన చెలికత్తెలు శ్వేత ఛత్రం పట్టుకొని, వింజామరలు వీస్తున్నారు. వారి వెనుక కరవాలను ధరించిన సైనికులు, వారివెనుక అశ్వికదళం, వారి వెనుక గజదళం వస్తున్నాయి. రాణీవాసం నుంచి గౌరీమందిరం వరకు రుక్మిణికి ఈవిధంగా రక్షణ ఏర్పాటుచేయబడింది.

పార్వతీదేవి మందిరంలోపలకు వెళ్ళి రుక్మిణీ దేవి ఆ భవభయహారిణిని ప్రార్థింపసాగింది "ఓ దుర్గా! శివా! భవానీ! తల్లీ! శ్రీకృష్ణుడు నాకు పతి అయ్యేలా అనుగ్రహించు" అన్నది. వెంటనే ప్రక్కనున్న చెలికత్తెలు "ఓ శుభాననా! అలాఅనకు. శిశుపాలుణ్ణి నాకు పతి చెయ్యి అని అడుగు" అన్నారు. రుక్మిణీ దేవి గంధపుష్పాక్షత లతో, ధూపదీప నైవేద్యాలతో భవానీదేవిని అర్చించింది. పుణ్యస్త్రీల శుభాశీస్సులను స్వీకరించి ఆమె ఆలయం బయటకు అడుగుపెట్టింది.

## రుక్మిణీ హరణం :

వేయి చందమామల వెలుగుతో మెరిసిపోతున్న రుక్మిణిని చూచి ఆలయం బయట నిలబడిన వీరులు, యోధులు నిశ్చేష్టులయ్యారు. వారికి తెలియకుండగానే వారిచేతిలోని ఆయుధాలు నేలపై పడిపోయాయి. ఇంతలోనే దివ్యాశ్వాలను పూన్చిన శ్రీకృష్ణుని రథం వచ్చి అక్కడ ఆగింది. పైన గరుడధ్వజం రెపరెపలాడుతున్నది. వాయువేగానికి కమలవనం కల్లోలితమైనట్లుగా ఆరథం రావటంతోనే సేనా వాహినులు చెల్లాచెదురయినాయి. అందరు చూస్తుండగానే ఆ రథం మానినీ బృందం దగ్గరకు వచ్చింది. దానిపై కూర్చున్న శ్రీకృష్ణుడు రుక్మిణిని చెయ్యిపట్టిలాగి రథంపై కూర్చొనబెట్టుకున్నాడు. అది గరుడుడు అమృతకలశం అపహరించినట్లుగా అని పించింది. దేవతలు కూడా కుతూహలంగా ఆ దృశ్యం చూడసాగారు. కృష్ణుడు శార్ఙ్గ ధనుష్టంకారం చేసి శత్రువులను పరాభూతుల గావించి రుక్మిణిని తీసికొనివెళ్ళ సాగాడు. ఇరువైపుల సేనలకు ఘర్షణ చెలరేగింది. జరాసంధునకు, ఆతని అధీనంలో ఉన్న రాజులకు కృష్ణుని ఈ చర్య ఎంతో అవమానమనిపించి యుద్ధానికి సన్నద్ధు లయ్యారు. పాచికలాడుతున్న మరికొందరు రాజులు ఆటను కట్టిపెట్టి సమరానికి సిద్ధమయ్యారు. పౌండ్రకుడు, విదూరథుడు, దంతవక్త్రుడు, సాల్వుడు మున్నగువారు జరాసంధునితో పాటు సేనలతో వచ్చి యాదవుల నెదుర్కొన్నారు. ప్రళయకాల

సముద్రం వలె ఉన్న ఈ సేనను దాటటానికి యాదవుల నావకు శ్రీకృష్ణుడు కర్ణధారిగా ఉన్నాడు. క్రమంగా యుద్ధం ఘోరమయింది. గగనమంతా శస్త్రవర్షంతో నిండి అంధకారమయింది. ఈ పరిణామానికి భయపడుతున్న రుక్మిణిని భయపడ వద్దని శ్రీకృష్ణుడు ఆమె కభయమిచ్చాడు.

అప్పుడు బలరాముని చిన్నతమ్ముడు గదుడు ఒక్కసారిగా ధనుష్టంకారం చేసి శత్రుసేనపై విరుచుకుపడ్డాడు. వాయువేగానికి వృక్షాలు చిన్నాభిన్నమయినట్లుగా గదుని విజృంభణకు శత్రువులు తల్లడిల్లిపోయారు. వెంటనే సాల్వుడు తన గదతో గదుణ్ణి కొట్టాడు. ఆదెబ్బకు మూర్ఛపోబోయికూడా గదుడు నిలద్రొక్కుకొని బలదేవు డిచ్చిన గదను అందుకొని ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతాన్ని కొట్టినట్లు సాల్వుణ్ణి కొట్టాడు. సాల్వుడు నేలకూలిపోగానే పౌండ్రకుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, విదూరథుడు ఒక్కసారిగా గదునిపై విరుచుకుపడ్డారు. పౌండ్రకుడు పదిబాణాలు వేసి గదుని రథధ్వజాన్ని నేలకూల్చాడు. దంతవక్త్రుడు గదతో గదుని రథాన్ని చూర్ణంచేశాడు. జరాసంధుడు గదుని రథాశ్వాలను సంహరించివేశాడు. విదూరథుడు సారథని హతంచేశాడు. అప్పుడు బలరాముడు క్రుద్ధుడై వచ్చి తన ముసలంతో దంతవక్త్రుణ్ణి సంహరించాడు. వెంటనే తన పైకి విజృంభించిన పౌండ్రక, జరాసంధ, విదూరథులను కూడా బలరాముడు ముసలంతో చావమోదాడు. మృత్యువు నుంచి తృటిలో తప్పించుకున్న జరాసంధుడు శిశుపాలుని దగ్గరకు వెళ్ళి "ఓ వీరుడా! ఈ వివాహం కానంతమాత్రంలో ఏమయింది. నీకు నూరు వివాహాలవుతాయి. నేనీరోజునే ద్వారకకు వెళ్ళి బలరామకృష్ణుల్ని బంధించి, ఈభూతలాన్ని యాదవ రహితం చేస్తాను" అన్నాడు. మిత్రులు వచ్చి ఈవిధంగా చెప్పిన తరువాత శిశుపాలుడు తన చంద్రికాపురం తిరిగి వెళ్ళాడు. మృత్యువునుంచి బయటపడ్డ మిగిలిన రాజన్యులు వారి వారి నగరాలకు చేరుకున్నారు.

## రుక్మి పరాభవం

ఇంతజరిగిన తరువాత కూడా భీష్మకతనయుడైన రుక్మి రాజన్యుల సమక్షంలో "నేను శ్రీకృష్ణుణ్ణి సంహరించి రుక్మిణిని వెనుకకు తీసికొని రాలేకపోయినట్లయితే కుండినపురంలో ప్రవేశింపను. ఇది సత్యం" అని ప్రతిజ్ఞచేసి కవచం శిరస్త్రాణం ధరించి వివిధాయుధాలతో బయలుదేరాడు. అక్షౌహిణి సేన అతని ననుసరించింది.

వెనుక మరల సేనావాహిని రావటం బలరాముడు చూచి యాదవసేనను సమాయత్తం చేశాడు. రుక్మి బలదేవుని సమక్షానికి వచ్చి "జీవించాలని ఉంటే నా సోదరిని నాకప్పగించండి. లేదా మిమ్మల్ని యమపురికి పంపిస్తాను. మీరు యయాతి శాపంతో ధర్మ భ్రష్టులైనవారు. జరాసంధుడంటే భయపడి సముద్ర నివాసం ఏర్పరచు కున్నవారు. కాలయవనుడంటే భీతితో పరుగులు తీసినవారు" అంటూ ఒక నిశితమైన బాణాన్ని శ్రీకృష్ణునిపై ప్రయోగించాడు. వెంటనే కృష్ణుడు తన బాణంతో రుక్మి వింటినారిని త్రెంపివేశాడు. మరొక ధనుస్సుతో బాణప్రయోగానికి సిద్ధమవుతున్న రుక్మిని చూచి శ్రీకృష్ణుడు ఒకేసారి నూరుబాణాలను ప్రయోగించి ఆతని ధనువును ముక్కలు చేశాడు. రుక్మి మహాశక్తిని ప్రయోగించాడు. ప్రతిగా శ్రీకృష్ణుడు తన గదనుప్రయోగించగా అది వెళ్ళి ఆశక్తిని తునకలు గావించి, అశ్వసమేతమైన రుక్మి రథాన్ని శిథిలం గావించింది. రుక్మి కూడా కృష్ణునిపై గదను విసిరివేశాడు. కృష్ణుడు ప్రయోగించిన చక్రం ఆతని గదను చూర్ణం చేసింది. అప్పుడు రుక్మి ఘోరంగా గర్జిస్తూ పరిఘను కృష్ణుని మెడమీదకు విసిరి వేశాడు. అది మత్తేభం మీదకు పూలమాల వేసినట్లయింది. ఆ పరిఘను చేతబట్టి కృష్ణుడు దానినే రుక్మిమీదకు విసిరాడు. ఆదెబ్బకు రుక్మి వ్యాకులుడయ్యాడు. కత్తితో కృష్ణుడు రుక్మి కవచాన్ని, శిరస్త్రాణాన్ని ఖండించి వేశాడు. ఆతనిని రెండు చేతులతో పట్టుకొని నేలకై పడవేసి ఆతని ఛాతిపై కెక్కి తన నందక ఖడ్గాన్ని బయటకు తీశాడు. తన సోదరుణ్ని సంహరింపబోవటం చూచిన రుక్మిణి భీతచిత్తురాలై శ్రీకృష్ణుని పాదపద్మాలను పట్టుకొని

అనంత! దేవేశ! జగన్నివాస! యోగేశ్వరాచింత్య జగత్పతేత్వం!
హంతుం న యోగ్యః కరుణాసముద్ర! మద్భ్రాతరం శాలభుజం మహాభుజ!

ఓ స్వామీ! నా సోదరుణ్ణి హతమార్చటం నీకు తగినది కాదు, ఇతడు నీకు బావమరిది అని దీనంగా వేడుకున్నది. కృష్ణుడు కరుణాంతరంగుడై ఆతనిని సంహరించే ఉద్దేశాన్ని విరమించుకొని కత్తితో ఆతని ఒకప్రక్క మీసం, శిరస్సుపై సంగం జుట్టు తీసి వదిలిపెట్టాడు. ఈలోగా రుక్మికి సంబంధించిన రెండక్షౌహిణుల సేనను పరాభూతమొనర్చి బలరాముడక్కడకు వచ్చి విరూపుడుగా ఉన్న రుక్మిని చూచి జాలిపడి "కృష్ణా! బావమరది నిట్లు చేయతగునా? రుక్మిణి ఎంత బాధపడు

తుంది" అంటూ రుక్మిణిని చూచి "ఓ కళ్యాణీ! నీవు బాధపడకు. ప్రియాప్రియ కార్యములు కాలాధీనములు, మేఘాలు వాయువశమై యున్నట్లు, ఈ ప్రపంచ మంతా కాలస్వరూపుడైన ఈశ్వరుని వశమై ఉంటుంది. స్థావర జంగమముల న్నిటికీ ఆయనే ప్రభువు. అహంకార మమకారములే బంధన కారణములు. ఈ రెంటి పరిత్యాగమే మోక్షకారణము. ఇందులో సంశయం లేదు. అప్పుడు సుఖము ఉండదు, దుఃఖము ఉండదు. నేను సుఖం కలిగించేవాడిని, దుఃఖం కలిగించేవాడిని అని అవివేకులు భావిస్తారు. ఇతడు నా మిత్రుడు ఇతడు నా శత్రువు అనే భావాలు కేవలం అజ్ఞానం వల్ల కలిగేవే" అని బలరాముడు పలికిన మాటలు విని రుక్మి, రుక్మిణి ఊరటపొందారు. రుక్మి ఆవిరూపంతో నగరానికి తిరిగి వెళ్ళలేక తపస్సుకై అరణ్యానికి బయలుదేరాడు. కాని మంత్రులు వెళ్ళవద్దని నివారింపగా రుక్మి భోజకటకమనే గ్రామం నిర్మించుకొని అక్కడ నివసింపసాగాడు.

అనంతరం బలరామకృష్ణులు రుక్మిణితో ద్వారకాపురికి చేరుకున్నారు. అక్కడ విజయసూచకంగా దుందుభి ధ్వనులు మారుమ్రోగాయి. వేడుకలు జరిగాయి. కృష్ణపరమాత్ముడు మార్గశీర్షమాసంలో రుక్మిణిని శాస్త్రోక్తంగా మహావైభవోపేతంగా వివాహం చేసుకున్నాడు.

భైష్మీ వివాహస్య కథాం విచిత్రాం శృణోతి యః శ్రావయతేచ భక్త్యా
ఇహైవ భక్తో విభవేన యుక్తః స ఏవ ముక్తిం ప్రతియాతి ముక్తః

ఎవరు విచిత్రమైన, విశిష్టమైన ఈ రుక్మిణీ వివాహవృత్తాంతాన్ని భక్తి పూర్వకంగా వింటారో, వినిపిస్తారో వారు ఇహపర సుఖాలు పొంది చివరకు ముక్తిని పొందుతారు.

**సాత్రాజితి :**

నారదమహర్షి ఇలా వివరిస్తున్నాడు - ఓ బహుళాశ్వమహారాజా! కృష్ణపర మాత్ముడు ఇంకా ఎవరెవరిని వివాహం చేసుకున్నాడో ఆ పుణ్య వృత్తాంతాలను నీకు వినిపిస్తాను. సత్రాజిత్తుకు సాక్షాత్తు సూర్యభగవానుడు స్యమంతకమణిని ప్రసాదించాడు. ఉగ్రసేనుని కోసం శ్రీకృష్ణుడు ఆ మణిని అడిగాడు. కాని లోభ గుణం వల్ల సత్రాజిత్తు ఆ మణిని ఇవ్వటానికి నిరాకరించాడు. ఎందువల్లనంటే ఆ మణి ప్రతిదినము ఎనిమిది బారువుల బంగారం ఇస్తుంది. కొన్నిరోజుల తరువాత ఆతని సోదరుడు ప్రసేనుడామణిని మెడలో ధరించి, అశ్వంపై అడవిలోకి వేటకు

వెళ్ళాడు. అక్కడొక సింహం ఆతనిని సంహరించి ఆ మణిని తీసికొనిపోతుంటే జాంబవంతుడు చూచి ఆ సింహాన్ని చంపి ఆమణిని తీసికొని తన గుహలోకి వెళ్ళాడు.

ఇక్కడ సత్రాజిత్తు యాదవులు నిండియున్న సభలో తన సోదరుడు స్యమంతకమణిని ధరించి అడవికి వెళ్ళి మరల తిరిగిరాలేదని, శ్రీకృష్ణుడే ఆమణి కోసం తన సోదరుణ్ణి చంపియుంటాడని ప్రకటించాడు. ఈవిషయం విన్న కృష్ణుడు కొందరు ద్వారకావాసులను వెంటతీసికొని అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ ఒకచోట ప్రసేనుడు, ఆతని అశ్వము, కొంతదూరంలో సింహం చనిపోయి పడియుండటం చూచి చివరకు కృష్ణుడు జాంబవంతుని గుహలో ప్రవేశించాడు. గుహలోపల పద్దెనిమిది రోజులు పరమాత్మునకు జాంబవంతునకు పోరు జరిగింది. చివరకు జాంబవంతుడు పరాజితుడై పరమాత్మను గుర్తించి స్యమంతకమణితో పాటు, తన కుమార్తె జాంబవతిని కూడా సమర్పించాడు. శ్రీకృష్ణుడు స్యమంతకమణిని తీసికొనివచ్చి సత్రాజిత్తునకీయగా ఆయన లజ్జితుడై ఆమణితో పాటు తన కుమార్తె సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహం చేశాడు.

## కృష్ణుని అష్ట మహిషీమణులు :

కొన్నాళ్ళ తరువాత కృష్ణపరమాత్ముడు పాండవుల కోసం ఇంద్రప్రస్థం వెళ్ళాడు. ఒకనాడు కృష్ణుడు అర్జునునితో పాటు రథంపై యమునానదీ తీరానికి విహారానికి వెళ్ళాడు. అక్కడ కృష్ణుణ్ణి పతిగా పొందాలని తపస్సు చేస్తున్న కాళింది (యమున)ని అర్జునుడు శ్రీకృష్ణునకు చూపించాడు. భగవాను డామెను ద్వారకకు తీసికొనివచ్చి వైభవోపేతంగా వివాహం చేసుకున్నాడు. కొన్నాళ్ళ తరువాత కృష్ణుడు అవంతీపురి (ఉజ్జయిని) రాజకుమార్తెయైన మిత్రవిందను స్వయంవరంలో గెలుచు కొని పరిణయమాడాడు. మరొక పర్యాయం నాగ్నజిత్తు అనే రాజు యొక్క ఏడు వృషభాలను ప్రజల సమక్షంలో లొంగదీసి బహుమానంగా అతని కుమార్తె సత్య (నాగ్నజితి) ను చేపట్టాడు. కేకయరాజకన్య భద్రను వివాహంచేసుకున్నాడు. బృహత్సేనుని కుమార్తె లక్షణను మత్స్యయంత్రాన్ని ఛేదించి పరిగ్రహించాడు. వీరు కృష్ణ పరమాత్ముని అష్ట మహిషీమణులు.

తరువాత పరమాత్ముడు భౌమాసురుని వధించి ఆతని నిర్బంధంలో ఉన్న

పదహారువేలనూరుమంది రాజకుమార్తెలను విడిపించి తీసికొని వచ్చాడు. భగవానుడు తన మాయా విశేషం వల్ల అనేక రూపాలను ధరించి అనేక మందిరాలలో ఉంటున్న ఆ వేలాది కన్యలను ఒకే సుముహూర్తంలో పరిణయమాడాడు. వారి కొక్కొక్కరికి పదిమంది కుమారులు జన్మించారు.

భీష్మకరాజనందనయైన రుక్మిణికి మొదట కుమారుడు కలిగాడు. ఆతడే ప్రద్యుమ్నుడు. ఆతడు సాక్షాత్తు మన్మథుడే. ఆతడు కృష్ణపరమాత్ముని సకల గుణములు పుణికిపుచ్చుకున్నాడు. ఆ ప్రద్యుమ్నుడు భోజరాజైన రుక్మి కుమార్తెను వివాహంచేసుకున్నాడు. వారికి నీలికమలకాంతితో ప్రకాశించే అనిరుద్ధుడు జన్మించాడు. ఆతడు సాక్షాత్తు బ్రహ్మయొక్క అవతారమే నంటారు. ఈవిధంగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు పరిపూర్ణతముడైన భగవానుని చతుర్వ్యూహావతారములుగా పరిగణింపబడుతున్నారు. శ్రీకృష్ణుని వివాహ సంబంధమైన ఈ చరిత్ర అతివిచిత్రము, మంగళమయము. ఇది సర్వపాపనాశకము, పవిత్రాతిపవిత్రము.

**ద్వారకానగరము :**

ఈవృత్తాంతమంతా విని బహుళాశ్వుడు "ఓ మహర్షీ! ముల్లోకాలలోను విఖ్యాతమైన ఈ ద్వారకాపురి ఎంత ధన్యమైనది! సాక్షాత్తు కృష్ణపరమాత్ముడు నివసించటంవల్ల కదా ఈ నగరానికి ఇంత ఘనత కలిగింది! ద్వారకాపురి శ్రీకృష్ణుని శరీరం నుంచి ఏర్పడినదని అంటారు. ఎప్పుడు ఏవిధంగా ఈ ద్వారక ఏర్పడింది?" అని అడిగాడు. అప్పుడు నారదమహర్షి - ఓ రాజా! ద్వారక ఆగమన కారణం వింటే పాపాత్ముడు కూడా పునీతుడౌతాడు. పూర్వం వైవస్వత మనువు కుమారుడు శర్యాతి అనేపేరుగల చక్రవర్తి పదివేల సంవత్సరాలు ధర్మబద్ధంగా రాజ్యం చేశాడు. ఆతనికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిసేనులనే ముగ్గురు ఉత్తములైన కుమారులు కలిగారు. కుమారులు పెద్దవారయిన తరువాత శర్యాతి పూర్వదిక్కుభూమిని ఉత్తానబర్హికి, దక్షిణదిక్కు భూమిని భూరిసేనునకు, పశ్చిమదిశ భూమిని ఆనర్తునకు ఇస్తూ "ఈ భూమి నంతటినీ నేను నా పరాక్రమంతో సంపాదించాను. దీని నంతటిని నేను ధర్మబద్ధంగా పరిపాలించాను. ఇప్పుడు మీరు వీటిని పరిపాలించండి" అన్నాడు. జ్ఞానియైన ఆనర్తుడు ఈమాటలు విని "తండ్రీ! ఈ భూమి అంతా నీది అంటున్నావే. ఇది నీది కాదు. ఇది భగవంతునిది.

దీనిని నేనే పరిపాలించానంటున్నావు. కాదు. దీనిని పాలించినది భగవంతుడే. భగవంతుణ్ణి మించిన బలవంతుడెక్కడా లేడు. సృష్టించేదీ, స్థితిలో ఉంచేదీ,, లయం చేసేది ఆయనే. ఆయన కాలస్వరూపుడు. ఆయన సర్వభూతములకు ఆత్మ. ఆయన భయం వల్లనే వాయువు వీస్తున్నాడు, సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అందువల్ల తండ్రీ! అహంకారాన్ని త్యాగం చేసి ఆ పరమాత్మనే భజించు" అన్నాడు.

శర్యాతి మహారాజు సహజంగా జ్ఞాని అయినప్పటికీ కుమారుడు తనను ఇలా అన్నాడే అని కోపించి "ఓరీ బుద్ధిహీనుడా! ఇది నా రాజ్యం కాదన్నప్పుడు, నా రాజ్యంలో ఉండే హక్కు నీకులేదు. నా రాజ్యం విడిచి నీవు దూరంగా వెళ్ళు. నీవు ఆరాధించే కృష్ణుని దగ్గరకే వెళ్ళు, నీకు రాజ్యం ఇస్తాడు" అన్నాడు. ఆనర్తుడా మాటలు విని అలాగే నని తండ్రి రాజ్యం వదిలిపెట్టి వెళ్ళి సముద్రతీరం చేరుకొని ఆ జలాలలో కూర్చొని పదివేల సంవత్సరాలు కఠోరమైన తపస్సు చేశాడు. ఆతని ప్రేమ లక్షణమైన భక్తికి మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై వరుము కోరుకొనుమని అన్నాడు. ఆ మాటలు విని ఆనర్తుడు భగవంతుణ్ణి దర్శించి పులకితాంగుడై ప్రేమ విహ్వలుడై ఆయన చరణకమలాలకు ప్రణామం చేసి "హే వాసుదేవా! ప్రద్యుమ్నా! సంకర్షణా! నీకు నమస్కారము. తండ్రీ! నన్ను నా తండ్రి తన రాజ్యంనుంచి వెడలగొట్టాడు. నాకు నీవే శరణు. నేను నివసించటానికి నాకు కొంత ప్రదేశం చూపించు. నీ దయవల్లనే ధ్రువుడు సర్వోత్తమమైన స్థానం పొందగలిగాడు. స్వామీ అనుగ్రహించు" అని పలుకగా విష్ణువు సంతోషించి "నాయనా! ఈ విశ్వంలో వేరే భూప్రదేశం ఏమీలేదు. కానీ నీవు భక్తితో అడిగావు కాబట్టి నీకోరిక నెరవేరుస్తాను" అన్నాడు. వెంటనే వైకుంఠ ధామం నుంచి నూరుయోజనముల భాగం తెచ్చి సముద్రంలో సుదర్శన చక్రంపై దానిని నిలిపి ఆ ప్రదేశాన్ని ఆనర్తునకు ప్రసాదించాడు. అదే ద్వారక. ఆ ప్రదేశానికి ఆనర్తదేశమనే పేరు వచ్చింది. శర్యాతి మహారాజు ఈ విషయం విని ఆశ్చర్యం పొందాడు.

ఆనర్తునకు రేవతుడనే కుమారుడు కలిగాడు. ఈ రేవతుడు శ్రీశైల పర్వతరాజు కుమారుణ్ణి తీసికొని వచ్చి ఆనర్తదేశంలో ఉంచాడు. రేవతుని చేత తీసికొనరాబడింది కాబట్టి ఆ పర్వతానికి రైవతగిరి అని పేరువచ్చింది. రేవతుడు కుశస్థలి అనే పట్టణాన్ని నిర్మించి రాజ్యంచేశాడు. ఆయనకు రేవతి అనే కుమార్తె కలిగింది. ఆమె మిక్కిలి సౌందర్యవతి. ఆమెకు వివాహం చేయటం కోసం రేవతుడు ఆమెను

తీసికొని బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుని సూచనపై రేవతుడు తన కుమార్తె రేవతిని బలరామునకిచ్చి వివాహం చేశాడు. ఆ విషయం బలరాముని వివాహ ఘట్టం వివరించేటప్పుడు చెప్పినదే. సరే ఈ కారణం వల్ల ద్వారకను మోక్షద్వారంగా భావిస్తారు. ఇదీ ద్వారక ఏర్పడిన విధం అని అన్నాడు నారదమహర్షి.

బహుళాశ్వుడు నారదునితో ఓ మునిసత్తమా! ద్వారక సర్వతీర్థమయి గదా అక్కడ ఏయే తీర్థాలున్నాయి? వివరించి చెప్పవలసింది - అని అడిగినప్పుడునారద మహర్షి - ఓ రాజా! ద్వారక దగ్గర నుంచి ప్రభాస తీర్థం వరకు ఉన్న నూరు యోజనాల భూమి మోక్షధాత్రిగా, యజ్ఞభూమిగా ప్రఖ్యాతమయింది. ఆ ద్వారకను దర్శించిన నరుడు నారాయణుడౌతాడు. అక్కడ మరణించిన గాడిద కూడా విష్ణుసాయుజ్యం పొందుతుంది. ద్వారకను దర్శించినా, ద్వారకగురించి విన్నా, అక్కడ తృణమంత దానం చేసినా అటువంటివారికి పరమగతి సంప్రాప్తమౌతుంది. ఒకసారి అక్కడ రేవతునకు పరమాత్మ ప్రత్యక్షమయ్యాడు. ఆతని భక్తితత్పరతకు భగవంతుని హృదయం ఆర్ద్రమై, నేత్రముల నుంచి ఆనందబాష్పములు జాలువారాయి. అదే గోమతీనదిగా ఏర్పడింది. గోమతిలో చక్రతీర్థంలో కనిపించే ప్రతిరాయి మీద చక్రచిహ్నం కనిపిస్తుంది. అందువల్ల ఆ సాలగ్రామాలు పూజనీయములయ్యాయి.

బహుళాశ్వుడు నారదమహర్షితో - మహాత్మా! గోమతీ నదిలో చక్రతీర్థం ఇంత ప్రాశస్త్యం ఎలా పొందింది. తెలుపుమని అడిగాడు. అప్పుడు నారదమహర్షి చెప్పసాగాడు - "ఓ మహారాజా! ఈ విషయంలో ఒక పురాతనమైన పవిత్రమైన ఇతిహాసం ఒకటి ఉన్నది.

## మకర మత్తేభముల పూర్వగాథ :

అలకాపట్టణానికి కుబేరుడు ప్రభువుగా ఉన్నాడు. నిధీశ్వరుడైన ఆతడు కైలాసానికి ఉత్తరంవైపున వైష్ణవయజ్ఞచేస్తున్నాడు. ఆయజ్ఞానికి విష్ణుమూర్తి వచ్చాడు. ఆయనతో పాటు సూర్యుడు, చంద్రుడు, దిక్పాలకులు, గంధర్వులు విచ్చేశారు. ఆ యజ్ఞంలో కుబేరుని కొడుకు నలకూబరుడు ధనాగారానికి పాలకుడుగా ఉన్నాడు. వీరభద్రుడు రక్షకుడుగానూ, గణపతి సేవాకార్యమునకు గాను నియోగింపబడ్డారు. ధర్మతత్పరుడైన కార్తికేయుడు సదస్యులకు మర్యాద చేయసాగాడు. కుబేరుని మంత్రులు ఘంటానాధుడు, పార్శ్వమౌళి శాస్త్రకారులకు పెద్దలుగా, దానాధ్యక్షులుగా వ్యవహరింపసాగారు. మహావైభవంగా యజ్ఞం ముగిసింది.

యజ్ఞానంతరం కుబేరుడు అవబృథ స్నానం చేసిన తరువాత దేవతలకు, వేదపండితులకు దానధర్మాలు చేశాడు. ఈవిధంగా శుభావహంగా యజ్ఞం పరిసమాప్తి అవుతున్న దశలో మహర్షి దుర్వాసుడు అక్కడకు వచ్చాడు. ఆయన శరీరం కృశించిఉంది. ముఖం కోపంతో తీక్షణంగా ఉంది ఆయనను చూచి కుబేరుడు భయభక్తులతో పూజించి నమస్కరించి ఓ మహాత్మా! మీ రాక చేత నా జీవనము, ఈ యజ్ఞము పావనములైనాయి అని పలుకగా దుర్వాసుడు సంతోషించి "ఓ రాజరాజా! నీవు ధర్మాత్ముడవు. నీ దాతృత్వము బ్రాహ్మణ భక్తి నిరుపమానము. శ్రీమహావిష్ణువు సంతోషించే విధంగా యజ్ఞం నిర్వహించావు. నేను నిన్ను ఇంతకు పూర్వం ఏమీ అడుగలేదు. నీవు మంచిదాతవని విని ఇప్పుడు వచ్చాను. నేను అడిగినది ఇస్తే నీకు ఒక మంచి వరం ప్రసాదిస్తాను. లేకపోతే శాపం ఇస్తాను. మీ ఇంటనున్న నవనిధులు నాకు ఇస్తే నీకు శుభం కలుగుతుంది. నేనువాటికోసమే వచ్చాను" అన్నాడు. ఆ మాటలు వినగానే దానశీలుడైన కుబేరుడు వెంటనే అంగీకరించాడు.

కానీ ఆ సమయంలో దానాధ్యక్షుడుగా ఉన్న ఘంటానాధుడు, పార్శ్వమౌళి ఇద్దరూ లోభగుణంతో మోహితులై కుబేరునితో ఈ బ్రాహ్మణుడు ఒంటరివాడు. నవనిధులనూ తీసికొని వెళ్ళి ఏంచేసుకుంటాడు. పోనీ ఒక లక్షకాసులు ఇచ్చి మిగిలిన ధనం మీరు దాచుకొనవలసినది అన్నారు. వీరి మాటలు విని దుర్వాసుడు కృద్ధుడయ్యాడు. కళ్ళెర్రజేసి చూశాడు. అప్పుడు కుబేరుడు భయపడి ఆయన చెంత-వినయభావంతో నిలబడ్డాడు. దుర్వాసుడు ఆమంత్రుల వైపు చూచి ఓఘంటా నాధా! నీవు దుష్టబుద్ధివి. లోభుడవు. గ్రాహము వలె ధనగ్రాహివి. అందువల్ల నీవు గ్రాహము (మొసలి) వలె మారిపో. ఓరీ పార్శ్వమౌళీ! నీవు పాపబుద్ధివి, నీవు మత్తేభమువలె మదించి యజమానికి దుష్ట బోధచేశావు. నీవు ఏనుగుగా జీవించు అని శపించాడు. ఆ మహర్షి కుబేరుని వైపు చూచి "ఓరాజరాజా! నీ దాతృత్వానికి ప్రసన్నుడనయ్యాను. నీవు చేసిన ఈ దానం వల్ల నీ నవనిధులు రెండింతలగుగాక!" అని పలికి నిష్క్రమించాడు.

మహర్షి శాపం వల్ల దీనులై దుఃఖిస్తున్న మంత్రులను చూచి కుబేరుడు వారిని రక్షించుమని అక్కడే ఉన్న శ్రీమహావిష్ణువును శరణు వేడాడు. అప్పుడు మహావిష్ణువు ఆయన శాపాన్ని పరిహరించే శక్తి నాకులేదు. మీరిద్దరూ మకర,మదగజాలుగా

మారిన తరువాత మీఇద్దరికీ భీకరమైన పోరు జరుగుతుంది. అప్పుడు నా అనుగ్రహం వల్ల మరలా మీకు మీమీ రూపాలు కలుగుతాయి అన్నాడు. మహావిష్ణువు ఇలా పలికిన తరువాత ఆమంత్రులు ఇద్దరూ మొసలిగా, ఏనుగుగా మారిపోయారు. అయినా వారికి పూర్వజన్మ స్మృతి ఉండేది. ఘంటానాధుడు గోమతీ నదిలో మొసలిగా నూరుసంవత్సరాలు జీవించాడు. పార్శ్వమౌళి రైవతగిరి ప్రాంతంలో గజరాజుగా జీవింపసాగాడు.

**చక్రతీర్థం :**

ఒకపర్యాయం వైశాఖ మాసంలో ఆ గజరాజు తన కొండగుహలోనుంచి బయటకు వచ్చి గోమతీనదిలో స్నానం చేయటం కోసం తన బృందంతో పాటు భీషణ గర్జన చేస్తూ వచ్చాడు. మొదట చాలాసేపటి వరకూ ఆగజరాజు స్నానం చేశాడు. తరువాత మిగిలిన ఆడు ఏనుగుల బృందమంతా నదిలోకి దిగి క్రీడిస్తూ ఒకదానిపై ఒకటి తొండములతో నీళ్ళు చల్లుకొనసాగాయి. ఆసమయంలో దేవప్రేరితమై ఒక మొసలి కోపంతో వచ్చి ఆ గజరాజు కాలు పట్టుకొని నీటిలోపలకు లాగసాగింది. గజేంద్రుడు ఆ మొసలిని బయటకు లాగటానికి ఎంతో ప్రయత్నించాడు. కానీ ఆ మొసలి తన పట్టువిడవలేదు. ఆ గజేంద్రుణ్ణి విడిపించటానికి మిగిలిన ఏనుగుల వశంకాలేదు. ఈవిధంగా కొన్ని సంవత్సరాలు వాటి పోరుకొనసాగింది. క్రమంగా ఆ ఏనుగు నీరసించింది.

అప్పుడు దానికి పూర్వజన్మ స్ఫురణ కలుగసాగింది. అది భక్తిపూర్వకంగా శ్రీమహావిష్ణువును "ఓ పరమపావనా! పరమేశ్వరా! నన్ను ఈ పాపపాశం నుంచి రక్షించు! రక్షించు!" అని ప్రార్థింపసాగింది. దీనవత్సలుడైన భగవానుడు గజేంద్రుని మొరవిని గరుత్మంతుని అధిరోహించి వేగంగా వస్తూ తరువాత ఆ గరుత్మంతుని కూడా వదిలిపెట్టి మరింత వేగంగా ముందుకు వచ్చి తన చక్రాన్ని విసిరి వేశాడు. ఆ చక్రం వచ్చి తగలక ముందే ఆశ్చర్యకరంగా ఆ మొసలి తన శరీరంనుంచి వేరయిపోయింది. అప్పుడా చక్రం వృథాపోకుండగా ఆ గోమతీనదిలోని రాళ్ళను చక్రచిహ్నితముల నొనర్చింది. మహావిష్ణువు చక్రం ప్రవర్తిల్లిన స్థలం. కాబట్టి అది చక్రతీర్థం అయింది. ఆ పరమాత్ముని అనుగ్రహం వల్ల మకర మదగజములు ఆ రూపాలను వదలి తమ పూర్వరూపాలను పొందాయి. ఆ కుబేరుని మంత్రులిద్దరూ

భగవానునకు నమస్కరించి ఆ స్వామిని స్తుతించి తమ నివాసాలకు వెళ్ళిపోయారు. దేవతలు భగవానునిపై పూలవర్షం కురిపించి జయజయ నినాదాలు చేశారు. ఈ చక్రతీర్థగాథను విన్నవారికి చక్రతీర్థంలో స్నానం చేసిన ఫలం లభిస్తుంది.

## శంఖోద్ధార తీర్థము :

నారదమహర్షి ఇలా చెప్పసాగాడు - ఓ మిథిలేశ్వరా! తీర్థములలో శంఖోద్ధార తీర్థం చాలా ముఖ్యమయినది. పూర్వం త్రితుడనే మహర్షి ఉండేవాడు. ఆయన కృష్ణ భక్తుడు. త్రితుడు తీర్థయాత్రలు చేస్తూ ఆనర్త దేశం చేరుకున్నాడు. అక్కడ ఒక దివ్య సరోవరంలో స్నానం చేసి భగవానుని పూజకు ఉపక్రమించాడు. ఆయన పూజా సామగ్రిలో సుందర లక్షణ సమన్వితమయిన ఒక శంఖం ఉన్నది. ఆయన శిష్యుడైన కక్షీమంతుడు లోభవశం వల్ల ఆ శంఖాన్ని దొంగిలించాడు. తన పూజా శంఖం పోయినందుకు కోపించి త్రితమహర్షి నా శంఖాన్ని తీసుకొన్నవాడు శంఖంగా మారిపోవు గాక అన్నాడు. ఆ మాట విని కక్షీమంతుడు మహర్షి చరణములపై పడి "ప్రభూ! శాంతించి నన్ను రక్షించండి" అని వేడాడు. అప్పుడు త్రితుడు శాంతుడై ఓరి దుర్బుద్ధీ! నీవు ఎలా దొంగతం చేశావు. నీవు వెళ్ళి ఆ పాపఫలాన్ని అనుభవించు. నా మాట ఎన్నటికీ వృథాపోదు. శ్రీకృష్ణుని చరణ కమలాలను భజిస్తే ఆయనే నిన్ను ఉద్ధరిస్తాడు అని మహర్షి వెళ్ళిపోయాడు. కక్షీమంతుడు శంఖరూపుడై ఒక సరోవరంలో పడిపోయాడు. అక్కడ "కృష్ణా! కృష్ణా!" అంటూ నూరు సంవత్సరాలు గడిపాడు. అప్పుడు భక్తవత్సలుడైన భగవానుడు ఆ సరోవరతీరంలో కనిపించి కక్షీమంతుణ్ణి అనుగ్రహపూర్వకంగా చూశాడు. కక్షీమంతుడు పరమాత్మణ్ణి అనేక విధాలుగా ప్రార్థించాడు. అప్పుడు ఆతనికి శంఖరూపం పోయి దివ్యరూపం కలిగింది. అప్పుడు కక్షీమంతుడు దివ్య విమానం అధిరోహించి యాదవుల సమక్షంలో వైకుంఠధామానికి వెళ్ళాడు. ఓ మిథిలేశ్వరా! భగవానుడు ఈ తీర్థంలో శంఖుని ఉద్ధరించాడు కాబట్టి ఈ పవిత్ర తీర్థానికి శంఖోద్ధార తీర్థమనే పేరు వచ్చింది.

ఇక ఈ ప్రభాస క్షేత్రంలో పశ్చిమ వాహినియైన సర్వతీనది ప్రవహిస్తున్నది. ఆ నదీ తీరంలో బోధిపిప్పలమనే రావి చెట్టు ఉన్నది. అక్కడే కృష్ణపరమాత్ముడు ఉద్ధవునకు భాగవత విద్యను ప్రబోధించాడు. ఆ నదిలో స్నానం చేసి ఆ చెట్టుక్రింద వేదతుల్యమైన భాగవత పురాణాన్ని శ్రవణం చేస్తే వారికి పరమ పదం లభిస్తుంది.

ద్వారకామండలం మొత్తం రచించింది శ్రీకృష్ణపరమాత్ముడే. అది నాలుగువందల క్రోసుల విస్తృతితో ఉంది. దాని చుట్టూ మూడు దుర్గములున్నాయి. మొదటి దుర్గంలో లీలాసరోవరం, కృష్ణకుండం, దానతీర్థం, మాయాతీర్థములున్నాయి. ఆ కృష్ణ కుండ్‌లో స్నానంచేసి జాంబవతీ నందనుడైన సాంబుడు కుష్ఠురోగం నుంచి విముక్తుడయ్యాడు. శ్రీకృష్ణుడు నిత్యము దానధర్మములు చేసేచోటును దాన తీర్థమంటారు. దుర్గమ్మ కొలువుదీరియుండే చోటు మాయాతీర్థం. కృష్ణుడు జాంబవంతునితో గుహలో యుద్ధం చేస్తున్నప్పుడు రుక్మిణి పూజించింది ఈ దుర్గాదేవినే. రెండవ దుర్గంలో ఇంద్రతీర్థ, సూర్యకుండము, బ్రహ్మతీర్థము లున్నాయి. మూడవ దుర్గంలో పిండారక తీర్థమున్నది. ఉగ్రసేనుడు రాజసూయయాగం చేసింది ఇచ్చటనే. ఆ సమయంలో సకలనదీజలాలలను ఇచట పిండీకృతం చేసిన కారణంగా దీనిని పిండారక తీర్థమన్నారు.

ఈ మూడు దుర్గములు దాటిన తరువాత మధ్యలో పరమాద్భుతమైన మాధవుని మందిరం ఉంది. దానిని దర్శించినవారు జీవన్ముక్తులౌతారు. మందిరం చుట్టూ ఉన్న దుర్గానికి తూర్పు ద్వారం దగ్గర ఆంజనేయస్వామి రక్షకుడుగా ఉంటాడు. దక్షిణ ద్వారం దగ్గర సుదర్శన చక్రం పరిభ్రమిస్తూ ఉంటుంది. పశ్చిమ ద్వారం దగ్గర జాంబవంతుడు రక్షకుడుగా ఉంటాడు. ఉత్తర ద్వారం దగ్గర విష్వక్సేనుడు పహరా కాస్తుంటాడు. వీరంతా ప్రతిక్షణం కృష్ణస్మరణతో తమ విధులు నిర్వర్తిస్తుంటారు.

## రాధ భక్తితత్పరత :

ఒకనాటి రాత్రి కృష్ణపరమాత్ముడు చాలాసేపటి వరకు నిద్రపోలేదు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన రుక్మిణి పరమాత్మణ్ణి చూచి "స్వామీ! మీరిప్పటివరకు ఎందుకని నిద్రపోలేదు?" అని అడిగింది. అప్పుడు శ్రీకృష్ణుడామెతో "వ్రజేశ్వరియైన రాధను నీవెంతో అభిమానంతో ఆదరించావు. కానీ ఆమెకు ప్రతిరోజు నిద్రించేముందు పాలుత్రాగటం అలవాటు. ఆమెకీరోజున ఎవ్వరూ పాలివ్వలేదు, అందువల్ల ఆమెకు నిద్రపట్టలేదు. అందువల్ల నాకు నిద్రపట్టలేదు" అన్నాడు. ఈమాటలువిని రుక్మిణి మిక్కలి బాధపడి వెంటనే ఒక బంగరుపాత్రలో వేడివేడి పాలను తీసికొని వెళ్ళి రాధకు ఇచ్చింది. శ్రీకృష్ణ స్మరణలో ఉన్న రాధ ఆ పాలవేడిని గమనింపకుండగనే త్రాగివేసింది. తరువాత రుక్మిణి అక్కడనుండి తన మందిరానికి వచ్చి "రాధకు

పాలిచ్చివచ్చిన విషయం పరమాత్మతో చెప్పి ఆయన సుకుమార సుందరములైన పాదపద్మాలను ఒత్తటం ఆరంభించింది.

శ్రీకృష్ణుని పాదములు బొబ్బలెక్కి ఉండటం రుక్మిణి చూచి ఆశ్చర్యపడి "ప్రభూ! తమ పాదములపై ఈ బొబ్బలేమిటి ఇలా ఉన్నాయి? ఈరోజే ఇవి వచ్చినట్లున్నాయి. ఎందువల్ల ఇలా కలిగాయి?" అని అడిగింది. అప్పుడు పరమాత్ముడు రాధ భక్తితత్పరతను తెలిపే నిమిత్తమై ఇలా అన్నాడు - "రుక్మిణీ! రాధ తన హృదయ పద్మంలో నా పాదపద్మాలను భక్తితో భజిస్తూ ఉంటుంది. నీవు ఈనాడు బాగా కాగిన వేడివేడి పాలను ఆమెకు త్రాగటానికి ఇచ్చావు. ఆమె నా స్మరణలో ఉండి ఆ వేడిపాలను త్రాగివేసింది. ఆమె హృదయంలో ఉన్న నా పాదములు ఆ వేడి భరింపలేక బొబ్బలెక్కాయి. అని పలుకగానే రుక్మిణి జరిగిన సన్నివేశానికి ఎంతో బాధపడి రాధ భక్తితత్పరతకు ఆశ్చర్యచకితురాలయింది.

## సిద్ధాశ్రమంలో రాసోత్సవం :

శ్రీకృష్ణుని అష్టమహిషీమణులు సిద్ధాశ్రమానికి విచ్చేసినప్పుడు వారు పరమాత్మునితో "ప్రభూ! మీయందపరిమితిమైన భక్తిగల గోపికలు ధన్యులు. అందువల్లనే వారు మీతో బృందావనంలో రాసక్రీడలో పాల్గొనగలిగారు. వారు చేసుకున్న పుణ్యం ఎటువంటిదో ఎవరు వర్ణింపగలరు? స్వామీ! బృందావనంలో నీవు గావించిన రాసక్రీడను మేమీనాడిచ్చట చూడాలనుకుంటున్నాము. మాకోరిక సమంజసమైనదైతే మేము కూడా రాసోత్సవంలో పాల్గొనాలని ఉంది. పైగా ఈసమయంలో రాధిక ఇక్కడే ఉన్నది. గోపికలు ఇక్కడే ఉన్నారు. కాబట్టి జగన్నాథా! ఇప్పుడు రాసోత్సవం జరపటం సముచితంగా ఉంటుంది. నీవు మా మనోరథం నెరవేర్చు" అన్నారు.

వారికోరిక ప్రకారం ఆ పవిత్ర సిద్ధాశ్రమంలో వైశాఖ పూర్ణిమనాడు సంధ్యాసమయంలో రాసోత్సవం ఆరంభమయింది. రాధామాధవులు రాసక్రీడ సలుపసాగారు. లలిత లావణ్య లహరిగా రాధిక, కోటి మన్మథుల కాంతితో మాధవుడు ప్రకాశింపసాగారు. ఆ సమయంలో ఆశ్రమవనంలో ఎందరు గోపికలున్నారో ఎందరు పట్టమహిషులున్నారో అన్ని రూపాలను ధరించాడు కృష్ణపరమాత్ముడు. నారీనారీనడుమ మురారి ముగ్ధమనోహరంగా కనిపింపసాగాడు. మృదంగ, మంజీర, వీణా నినాదములతో పాటు సుందరీమణుల కలకంఠాలనుండి వెలువడిన మధుర

మంగళ గీతాలు వీనులవిందు గావించాయి. జగదేకసుందరుడైన పరమాత్మ వనమాలను గళసీమలో అలంకరించుకొని, పీతాంబరం ధరించి, మకరకుండలాలతో, కిరీట, కంకణ, నూపురాది అలంకారాలతో మనోహరుడై భాసిస్తున్నాడు.

రాసేశ్వరియైన రాధతోపాటు గానంచేస్తున్న కృష్ణపరమాత్ముడు తారకల మధ్య చంద్రుని విధంగా మెరిసిపోతూ ఆహ్లాదం కలిగింపసాగాడు. ఈవిధంగా రాసోత్సవం జరిగిన ఆనందప్రదమైన శుభప్రదమైన ఆరాత్రి అంతా ఒక క్షణంవలె గడిచిపోయింది. ఆ రాసమండలాన్ని చూచి రుక్మిణి వంటి కాంతామణులు పరమానంద భరితలయ్యారు. వారి చిరకాలమనోరథం నెరవేరింది. రాసక్రీడ ముగిసిన తరువాత పట్టమహిషులు పరమాత్ముని చేరి "స్వామీ! ఈ రాసోత్సవంలో మీ అపురూపమైన సౌందర్యం చూచినప్పుడు మునీశ్వరులకు కలిగే బ్రహ్మానందం వంటిది మాకు కలిగింది. ఇటువంటి రాసోత్సవం ఇంతకుముందు జరుగలేదు, ఇకముందు జరుగబోదు" అన్నారు.

**కుచేలోపాఖ్యానము :**

కృష్ణపరమాత్మకు సుదాముడనే పేరుగల ఒక బ్రాహ్మణుడు సహాధ్యాయుడుగా ఉండేవాడు. అతని భార్య సత్య. సుదాముడు వేదవేదాంగ పారంగతుడు. కాని నిర్ధనుడు అయినా విరక్తహృదయుడు. అనుకూలవతియైన తన భార్యతో కలిసి, ఆయన అయాచితవృత్తితో జీవనం గడుపసాగాడు. ఒకసారి సుదాముడు తన భార్యతో "ద్వారకాధీశుడు శ్రీకృష్ణుడు నాకు మిత్రుడు. మేమిద్దరము సాందీపని మహర్షి దగ్గర విద్య నభ్యసించాము. శ్రీకృష్ణుడు భోజ వృష్ణి అంధకులకు అధీశ్వరుడయిన తరువాత కలిసికొనలేదు. ఆయన త్రిలోకనాథుడు, ఆపద్బాంధవుడు, దీనవత్సలుడు!" అని పలికాడు.

ఆతని భార్య సత్య ఉత్తమురాలు. ఆమె చిరిగిన వస్త్రాలను ధరించి దీనంగా ఉన్నది. సరియైన ఆహారం లేకపోవటం వల్ల ఆకలితో ఉన్న ఆమె తన పతి మాటలను విని "ఆర్యా! సాక్షాత్తు శ్రీహరి మీ స్నేహితుడయినప్పుడు మనం ఈ చిరిగిన వస్త్రాలతో ఆకలితో అలమటించిపోతూ ఉన్నాము ఎందువల్ల? చాలామంది ద్వారక వెళ్ళి పరమాత్ముణ్ణి దర్శించి ధనవంతులై తిరిగి వస్తున్నారు. మీరూ వెళ్ళి శ్రీకృష్ణుని దర్శించుకొని రండి" అన్నది.

అప్పుడు సుదాముడు "నేనందరికీ హితవులు చెప్తుంటే నీవు నాకే హితవు చెప్తున్నావే? నీవు ఒక విద్వాంసుడైన బ్రాహ్మణునితో ఒకరిని అర్థించి ధనం తెమ్మని చెప్తున్నావా?" అన్నాడు. అప్పుడు ఆతని భార్య "మీ సఖుడు సాక్షాత్తు లక్ష్మీపతి. మీరొక్క పర్యాయం ఆయనను దర్శిస్తే మనదు:ఖము దారిద్ర్యము తొలగిపోతాయి. కష్టాలు సహించి సహించి మన వయస్సులు గడిచిపోతున్నాయి. స్వామీ! కృపానిధి మిత్రుడయినందుకు మనకు ఇదేనా ఫలం!" అన్నది.

సుదాముడామెతో "విధాత ఏది వ్రాస్తే అదే లభిస్తుంది. అంతేకాని వెళ్ళటం రావటం వల్ల ఏమి ప్రయోజనం? ఇంట్లోనే ఉండి శ్రీహరిని ధ్యానించటం మంచిది. ఆ పరమాత్ముని ఆస్థానంలోనికి రాజులు, దేవతలు, గంధర్వులు, కిన్నరులు ఎవరైనా సరే అనుమతిలేకుండగా ప్రవేశింపలేరు. అటువంటిది అక్కడ ఈ దీనుణ్ణి నిర్భాగ్యుణ్ణి ఎవరు పలుకరిస్తారు?" అన్నాడు. అప్పుడు సత్య తన భర్తతో "ఆ పరమాత్ముని అనుమతిలేకుండా ఆ స్వామి సన్నిధికి ఎవరూ చేరలేరనేమాట సత్యం. కాని శ్రీహరి సర్వాంతర్యామి. ఆయన సర్వజ్ఞుడు. ఆయన మిమ్మల్ని ఆదరిస్తారు" అన్నది.

అప్పుడు సుదాముడు "ఓ ప్రియతమా! నామాట విను. శ్రీకృష్ణుడు నిజంగానే అంతటి దయాళువు. కాని కష్టాలలో ఉన్నప్పుడు ధనవంతుడైన మిత్రుని ఇంటికి వెళ్ళటం ఉచితం కాదు. విశేషించి చాలా రోజుల తరువాత ఆత్మీయుడు, ప్రేమాస్పదుడు అయిన సఖుని దర్శించి నన్ను యాచించమంటావా? యాచిస్తే ప్రేమ అదృశ్యమ యిపోతుంది." అన్నాడు. అప్పుడామె "మీరు దు:ఖహరుడైన పరమాత్ముణ్ణి దర్శిస్తే అది యాచించటం కాదు. మీరు వెళ్ళి శ్రీకృష్ణుని దర్శించి రండి" అన్నది.

భార్య అనేక విధాలుగా నచ్చజెప్పిన తరువాత సుదాముడు ద్వారకకు వెళ్ళటానికి నిశ్చయించుకొని "ఆ పరమాత్మునకు నేను ఏమి కానుకను తీసికొని వెళ్ళను? దారిద్ర్య కారణం వల్ల ఏమి ఇవ్వటానికీ ఇంటలేదు. నాకు సిగ్గుగా ఉన్నది" అన్నప్పుడు సత్య పొరుగింటికి వెళ్ళి నాలుగు పిడికిళ్ళ అటుకులు అడిగి తీసికొనివచ్చి ఒక పాత గుడ్డలో మూటకట్టి భర్తకు ఇచ్చింది. సుదాముడు వాటిని తీసికొని బ్రహ్మణ్యుడైన పరమాత్ముని స్మరిస్తూ ద్వారక వైపుకు పయనమయ్యాడు. పడవలో సముద్రాన్ని దాటి ద్వారకకు చేరుకున్నాడు.

ఆ నగరం స్వర్ణమయంగా ప్రకాశిస్తున్నది. పతాకలు రెపరెపలాడుతూ కనిపించాయి. భవనాలన్నీ సుశోభితములై ఉన్నాయి. బలవంతులైన యాదవవీరులు ఆ భవనాలకు రక్షకులుగా వ్యవహరిస్తున్నారు. సుదాముడు వారిని చూచి "వీటిల్లో శ్రీకృష్ణుని భవనం ఏది చెప్పండి?" అని అడిగాడు. ఈ మాట విని ఆ రక్షకులు "అన్ని భవనాలలోను శ్రీకృష్ణుడు ఉంటాడు" అన్నారు. సుదాముడు నిదానంగా ఒక ప్రాసాదంలోకి ప్రవేశించి చూశాడు. లోపల శ్రీకృష్ణపరమాత్ముడు వైభవోపేతంగా కనిపించేసరికి సుదామున కొక్కసారిగా బ్రహ్మానందం కలిగింది. తన బాల్యసఖుడైన సుదాముడు రావటం చూచి మాధవుడు వెంటనే లేచివెళ్ళి ఆతనిని తన బాహువులతో బంధించి హృదయానికి హత్తుకున్నాడు. పరమాత్మునకు, సుదామునకు ఆనందబాష్పాలు పొంగిపొరలాయి.

కృష్ణపరమాత్ముడు బంగరు పాత్రలో నీరు తెప్పించి సుదాముని చరణాలను కడిగి ఆ నీటిని తన శిరస్సుపై చల్లుకున్నాడు. తరువాత ఆతనిని తన శయ్యపై ఆసీనుని జేసి హరిచందనం ఆతని శరీరానికి అలది అగరు కుంకుమాలంకరణ చేసి, పరిమళ పుష్పాలతో పూజించి మధుపర్కాల నిచ్చి విందారగింపచేశాడు. అనంతరం తెల్లనిజుట్టుతో, బక్కచిక్కిన దేహంతో ఉన్న సుదాముణ్ణి కృష్ణ పరమాత్ముడు తన శయ్యపై కూర్చొనబెట్టుకొని కుశలప్రశ్నల నడిగాడు. ప్రక్కనే మిత్రవిందచిరునవ్వులు నవ్వుతూ సుదామునకు వింజామర వీచసాగింది. మిగిలిన పట్టపురాణులు ఈ దృశ్యం చూచి ఆశ్చర్యంతో నవ్వుకుంటూ వారిలో వారు "ఈ బికారి ఎటువంటి తపస్సు చేశాడు? సాక్షాత్తు త్రిలోకనాథుడు తన అన్నగారికి వలె ఈయనకు సేవ చేస్తున్నాడే?" అనుకున్నారు.

శ్రీకృష్ణ సుదాము లిద్దరూ ఒకరిచేతుల నొకరు పట్టుకొని తమ చిన్ననాటి గురుకులంలోని విషయాలను గుర్తుతెచ్చుకొనసాగారు. కృష్ణుడు మిత్రునితో "సఖుడా! మన మిద్దరం సకల విద్యలను వెంటవెంటనే నేర్చుకున్నాము. గురుదక్షిణ ఇచ్చిన తరువాత మనము మరల కలిసికొననేలేదు. నేను జరాసంధుడికి భయపడి ద్వారకలో ఉంటున్నాను. నీవు ఎక్కడ ఉంటున్నావు? ఎలా ఉంటున్నావు? మిత్రమా! నీకు గుర్తుండే ఉంటుంది. ఒకరోజు మన గురుపత్ని కట్టెల కోసమై మనల్ని పంపితే మనం భయంకరమైన అరణ్యానికి వెళ్ళాము. అక్కడకు వెళ్ళిన తరువాత పెద్దగాలివాన వచ్చి మనం చిక్కుకుపోయాము. ఎటుచూచినా నీళ్ళు సూర్యాస్తమయం అయింది.

చీకటి పడింది. ఆ ఘోరమైన అంధకారంలో మనం ఒకరి చేతులు ఒకరు పట్టుకొని మెరుపులు మెరిసినప్పుడు ఆ వెలుగులో అటు ఇటు తిరిగాము. రాత్రి అంతా గడిచి సూర్యోదయం కాగానే సాందీపని గురువర్యులు అరణ్యానికి వచ్చి ఆ వాననీటిలో కూరుకుపోయి దారితెన్ను తెలియక అవస్థపడుతున్న మనల్ని చూశారు. అప్పుడు గురువుగారి నేత్రాలు కన్నీటితో నిండిపోయాయి. మన ఇద్దరినీ ఆ నీటిలో నుంచి బయటకు తెచ్చి "నాయనలారా! మీరు నా ఆజ్ఞను హృదయ పూర్వకంగా పాలించే శిష్యులు. మీరు మీ సుఖం పాటించకుండగా నాకోసం ఇలా శ్రమించారు. మీ త్యాగం నాకెంతో సంతుష్టిని కలిగించింది. నేను మీకు దుర్లభమైన వరమిస్తున్నాను "మీ సకల మనోరథములు నెరవేరుగాక! వేద పురాణశాస్త్రాలు మీకు కంఠగతమగుగాక!" అన్నారు. "మిత్రమా! గురువర్యుల శుభాశీస్సుల వల్ల మనం ఈనాడు పరిపూర్ణమైన సుఖసంతోషాలతో ఉన్నాము" అన్నాడు.

అప్పుడు ఆనందపరవశుడైన సుదాముడు శ్రీకృష్ణునితో "నీవు దేవదేవుడవు! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడవు. నీవు గురుకులంలో విద్యాభ్యాసం చేయటం కేవలం నటన కదా!" అన్నాడు. అప్పటివరకు సుదాముడు తాను తెచ్చిన ముతక అటుకులను పరమాత్మునకు సమర్పింపనేలేదు. అప్పుడు సర్వజ్ఞుడైన కృష్ణపరమాత్ముడు "ఈ బ్రాహ్మణుడు తనదగ్గరకు. ధనం కోసం రాలేదు, కేవలం ముక్తి కోసమే తనను ఆరాధిస్తున్నాడు కాని ఈతని పత్ని దు:ఖితురాలై ధనం కోసం పంపింది. కాని వీరికి నేను ధనం ఎట్లా ఇవ్వగలను?" అని ఆలోచించాడు. సుదాముడు తన కోసం అటుకులు తీసికొనివచ్చి సిగ్గుతో ఇవ్వలేకపోతున్నాడని కృష్ణుడు గ్రహించి "మిత్రమా! నాకోసం ఇంటిదగ్గర నుంచి ఏమితీసికొనివాచ్చావు? ప్రేమతో అణుమాత్రం ఇచ్చినా అది మహత్తరమౌతుంది. భక్తితో పత్రం పుష్పం ఫలం తోయం ఏది ఇచ్చినా నేను ఎంతో ఆదరంతో స్వీకరిస్తాను" అన్నాడు. భగవానుడీ విధంగా పలికి అటుకుల మూటను చూచి "ఏమిటిది? అని అంటూనే "సఖుడా! నీవు నాకోసం అత్యంత ప్రీతికరమైన పదార్థమును తీసికొనివచ్చావు. ఈ అటుకులతో నాకెంతో తృప్తి కలుగుతుంది. నేను గోకులంలో ఉన్నప్పుడు యశోద ఇటువంటి మంచి అటుకులనే పెట్టేది. మరల ఇప్పటివరకు నేను ఇటువంటి వాటిని చూడనేలేదు' ' అని అంటూ ఒక గుప్పెడు అటుకులు నోటిలో వేసుకున్నాడు. దానితో భూలోక సంపత్తి సుదామునకు అమరింది. కృష్ణుడు రెండవసారి గుప్పెడు అటుకులు

స్వీకరించాడు. పాతాళలోక సంపత్తి సుదామునకు చేకూరింది. అప్పుడు రుక్మిణి కృష్ణుని చేయి పట్టుకొని "నాథా! ఇప్పటికే ఈయనకు అపారమైన సంపదను ప్రసాదించావు. దీనితో ఈయన ఇంద్రసమానుడయ్యాడు" అని పలికింది. కాని సుదామునకు ఆ ఐశ్వర్యం తనకు ప్రాప్తించిన చిహ్నాలేవీ కనిపించలేదు.

ఆరోజు రాత్రి సుదాముడు కృష్ణమందిరంలో సుఖంగా గడిపి మరునాడు ఇంటికి తిరిగి వెళ్ళటానికి పరమాత్ముని అనుమతిని వేడాడు. భగవానుడు ప్రేమ పూర్వకంగా ఆలింగనం చేసికొని అనుమతినిచ్చాడు. ఆ బ్రాహ్మణుడు లజ్జ వల్ల స్వామిని ఏమీ అడుగకుండగనే తన గ్రామానికి బయలుదేరి తన పట్ల భగవానుడు చూపిన ఆదరానికి మనస్సులో ఆశ్చర్యచకితుడుకాసాగాడు. 'నేను నిర్భాగ్యుడనయి నప్పటికీ నన్ను కృష్ణపరమాత్ముడు ప్రేమతో పరిష్వంగంలోనికి తీసుకున్నాడు. చిరుగువస్త్రాలతో చిక్కిపోయియున్న నన్ను తన హంసతూలికా తల్పంపై సోదరునివలె కూర్చొనబెట్టుకున్నాడు. రుక్మిణీ సత్యభామలు నాకు సేవలు చేశారు. నిర్ధనుడనైన నేను ధనవంతుడనయితే రమాపతియైన భగవానుణ్ణి విస్మరిస్తానని తలచి ఆ కరుణాంతరంగుడు నాకు ధనం ఇవ్వలేదు. నేను ఇంటికి వెళ్ళి భార్యతో చెప్తాను "ఇదిగో శ్రీకృష్ణుడు బ్రహ్మణ్యదేవుడు. కాని నీపట్ల కరుణ చూపలేదు. ధనలోభం వల్లనేను మిత్రుణ్ణి ఏమనగలను? ఆయన నన్ను ఎంత ప్రేమపూర్వకంగా ఆదరించాడు! తన ఇంట ధనం ఉన్నప్పటికీ హృదయంలో ధనం లేని నాకు ఆయన ఎలా ఇస్తాడు? ప్రక్కవారింటిలో రత్నరాసులున్నప్పటికీ మనం ఎంతమాత్రము కోరకూడదు. విధి మన లలాటంపై ఏది వ్రాస్తే అదే జరుగుతుంది తప్ప మరొకవిధంగా జరగదు" ఈ విధంగా సుదాముడు మనస్సులో భావిస్తూ తన నగరానికి చేరుకున్నాడు. ఆ నగరాన్ని చూచి ఆతడు ఆశ్చర్య చకితుడయ్యాడు. పెద్ద పెద్ద ప్రాసాదాలతో వైభవోపేతంగా పతాకలతో తోరణాలతో నగరమంతా కళకళలాడుతూ ద్వారకాపురిని తలపింపచేయసాగింది.

సుదాముడది చూచి "ఏమిటిది? ఇది ఎవరి నగరం?" అనుకొంటుండగా కొందరు నారీమణులు ఆయనను దివ్యభవనం లోనికి తీసికొని వెళ్ళటానికి వచ్చారు. కాని ఆయన అంగీకరింపలేదు. అప్పుడు దాస దాసీజనులు సుదాముని పత్ని దగ్గరకు వెళ్ళి సుదాముని రాక గూర్చి తెలియజేశారు. అప్పుడు సాక్షాత్తు లక్ష్మీదేవివలె ఉన్న ఆమె ఆనందంతో పల్లకీ ఎక్కి సఖురాండ్రతో బయటకు వచ్చింది. సుదాముడు

అటుయిటు తిరుగుతున్నాడు. ఆమె దగ్గరకు వచ్చి ఆతనికి విశ్వాసం కలిగించింది. స్వర్ణ రత్నాభరణాలను అలంకరించుకొని, రూపవతిగా, తేజోమూర్తిగా, లక్ష్మీదేవిగా వెలిగిపోతున్న తన భార్యను చూచి సుదాముడు దిగ్భ్రాంతి చెందాడు. "ఓహో! ఇదంతా కృష్ణపరమాత్ముని అనుగ్రహంగదా!" అనుకున్నాడు. సర్ణపాత్రలతో, అందమైన శయ్యతో, రత్నరాసులతో, సింహాసనాలతో, వింజామరలతో, తోరణాలతో వైభవోపేతంగా ఉన్న తన మందిరంలోకి సుదాముడు భార్యతో ప్రవేశించాడు. కృష్ణమందిరానికి తన గృహానికి ఎటువంటి తారతమ్యము ఆతనికి కనిపింపలేదు. కృష్ణపరమాత్ముని అనుగ్రహం వల్ల ఆతడు తరుణవయస్కుడయ్యాడు. అయినప్పటికీ విషయ సుఖముల పట్ల అనాసక్తిని ఏర్పరచుకొని, అనాయాసంగా ప్రాప్తించిన ఆ భోగములను అనుభవింపసాగాడు.

సుదాముడు తన భార్యతో కలిసి భక్తి జ్ఞాన వైరాగ్యములతో భగవంతుని అపారమైన అనుగ్రహం గురించి ఆలోచన చేయసాగాడు "ఇంత సంపద నాకే విధంగా వచ్చింది? దేవతలు కూడా పొందలేని ఈ సంపద నాకు కేవలం కృష్ణపరమాత్ముడు ప్రసాదించినదేగదా. ఇంత సంపదనిచ్చి కూడా ఆ స్వామి నాతో ఒక్కమాట కూడా చెప్పలేదు. నేనిచ్చిన గుప్పెడు అటుకులను తీసికొని కృష్ణుడు ఎంత ఆనందించాడు! జన్మజన్మలకు నాకు కృష్ణుడే సఖుడగును గాక! ఆస్వామి దాస్యమే నాకు ప్రాప్తించును గాక! నేను ఆ స్వామి చరణకమలాలను స్మరిస్తూ ఈ సంసార సాగరాన్ని తరించాలి" అని నిశ్చయం చేసుకున్నాడు. సుదాముడు, ఆతని భార్య శ్రీకృష్ణ పరమాత్ముని చరణారవిందాలను తమ హృదయారవిందాలలో నిలుపుకున్నారు. భగవానుడు ప్రసాదించిన ఐశ్వర్యాన్ని త్యాగ గుణంతో వేదవిదులకు దానధర్మాలను చేసి వారు చివరకు విష్ణుధామం చేరుకున్నారు. ఈకృష్ణ కుచేల గాథను విన్నవారు దారిద్ర్యబాధను తొలగించుకొని ముక్తులై ఉత్తమ భగవద్భక్తులౌతారు. అని పలికాడు నారదమహర్షి.

# 7. విశ్వజిత్ ఖండము

**మరుతోపాఖ్యానము :**

సత్యయుగంలో సూర్యవంశంలో మరుత్ అనే పేరుగల రాజు ఉండేవాడు. ఆతడు హిమాలయపర్వతములకు ఉత్తరదిశలో ఒకచోట విధిపూర్వకంగా విశ్వజిత్ యజ్ఞం నిర్వహించాడు. అందుకు మహర్షులలో మేటియైన సంవర్తక మహర్షిని ఆచార్యునిగా నియమించాడు. ఐదు యోజనములు విస్తీర్ణంగల యజ్ఞకుండం యోజనం విస్తీర్ణం గల బ్రహ్మకుండం, రెండు యోజనములు విస్తీర్ణంగల పంచకుండములను నిర్మించారు. పదిలక్షల మంది హోతలు, ఐదులక్షలమంది అధ్వర్యులు, ఉద్గాతలు, సకల శాస్త్ర మర్మజ్ఞులు ఆయజ్ఞమును నిర్వహించారు. ఏనుగు తొండములంతటి ఆజ్యధారలు అగ్నిహోత్రములో ఆహుతి చేశారు. ఫలితంగా అగ్నిహోత్రునకు అజీర్ణవ్యాధి కలిగింది. ఆ యజ్ఞం ఫలితంగా ముల్లోకాలలోను ఏజీవి ఆకలితో ఉండలేదు. సకల జీవరాశికి అపరిమితమైన సంతృప్తి కలిగించింది ఆ యజ్ఞం. ఆచార్యుడైన సంవర్తక మహర్షికి మరుత్ చక్రవర్తి జంబూద్వీపం కానుకగా సమర్పించాడు. పదునాల్గు లక్షల ఏనుగులను, సువర్ణాభరణములను, కోట్లాది నవరత్నములను దక్షిణగా అర్పించాడు. హోతలకు, అధ్వర్యులకు ఉద్గాతలకు మరుత్ చక్రవర్తి అనేక బంగరు పాత్రలను బహూకరించాడు. వారందరూ చివరకు వాటిని తీసికొని వెళ్ళలేక ఆ పాత్రలను అక్కడే విడిచివెళ్ళిపోయారు. అవన్నీపెద్దగుట్టలుగా ఏర్పడి బంగారపు కొండల వలె ప్రకాశింపసాగాయి. మరుత్ చక్రవర్తి చేసిన యజ్ఞంతో సాటి వచ్చే యజ్ఞం మరొకటి లోకంలో లేనేలేదు.

యజ్ఞాంతంలో హవనకుండంలో నుంచి పరమాత్ముడు ప్రత్యక్షమై అద్భుత దర్శనం ప్రసాదించాడు. పరమాత్ముణ్ణి చూచి ఆనంద వివశుడై మరుత్ చక్రవర్తి ఆస్వామి పాదపద్మములపై ప్రణమిల్లాడు. అప్పుడు భగవానుడు "ఓ రాజా! నీవు చేసిన విధిపూర్వకమైన నిష్కామయజ్ఞం వల్ల నాకు ఆనందం కలిగింది. నీకు ఇష్టమైన వరం కోరుకో. దేవతలకు కూడా దుర్లభమైన వరమునైనా నీకు ప్రసాదిస్తాను" అన్నాడు. అప్పుడు మరుత్ చక్రవర్తి చేతులు జోడించి, భక్తితో "పురుషోత్తమా! నీ పాదపద్మముల కంటె నాకు వేరే వరమెందుకు? అయినా నీ మాట కాదనలేక వరము నడుగుతున్నాను.

మాచే తవ వాక్య గౌరవత్ పాదారవిందం హృదయార విందాత్
౦ మా వ్రజతు వ్రజేశ్వర! మూలం చతుర్ణాం విదురర్థ సంపదామ్!

శ్వరా! నా హృదయం కమలం నుండి చతుర్విధ పురుషార్థములకు దములైన నీ చరణకమలాలు ఎన్నడూ దూరము కాకుండు గాక" అన్నాడు.

రమాత్ముడా మాటలను విని "రాజా! నీవు ఉత్తముడవు కాబట్టి ఎటువంటి అపేక్షించలేదు. మరల నేను అనుగ్రహంతో అడుగుతున్నాను నీకేమి వాలో కోరుకో "తథాపి మత్తో వరయేప్సితం వరమ్ వినా ఫలం భక్త మే సుఖం" భక్తులకు వరంఇవ్వకపోతే నాకు సంతృప్తిగాఉండదు" అన్నాడు.

ప్పుడు మరుత్ చక్రవర్తి "ఓ ప్రభూ! మీరు నాకు వరం ప్రసాదింపదలచుకొంటే మను ఈ భూమి మీదకు దింపండి. అందులో నీ భక్తులతో పాటు వసిస్తాను. ఇదే నేను కోరుకొనే వరం" అన్నాడు. అప్పుడు భగవానుడు డై "ఈ మన్వంతరంలో ఇరవై ఎనిమిదవ మహాయుగం చివర నీ కోరిక కుంది. అప్పటివరకు నీవు స్వర్గ సుఖము లనుభవించి అప్పటికి భూమి మ్మిస్తావు. అప్పుడు నీవు నా సన్నిధిలో నీ కోరికను సఫలం చేసికొంటావు' పలికి అంతర్ధానమయ్యాడు. తరువాత కాలంలో ఆ మరుత్ మహారాజ మహారాజుగా జన్మించాడు. ఆ పరమాత్ముడు ఈ ఉగ్రసేనుని చేత య యాగం చేయించాడు.

## సని రాజసూయము :

సుధర్మ అనే దివ్యమైన సభాసదనంలో సింహాసనాసీనుడైన శ్రీకృష్ణ పరమా ఉగ్రసేన మహారాజు పూజించి "ఓ భగవంతుడా! నారదమహర్షి వల్ల య యాగ విశిష్టతను తెలుసుకున్నాను. నీవు అనుమతిస్తే నాకు రాజసూయ చేయాలని ఉంది. నీ పాదపద్మాలను సేవించి ఎందరో భక్తులు తమ గాలను అవలీలగా నెరవేర్చుకున్నారు గదా" అని పలికాడు.

అప్పుడు కృష్ణ భగవానుడు "యాదవేశ్వరా! నీ ఆలోచన చాలా బాగుంది. గాగంవల్ల నీకీర్తి ముల్లోకాలకు వ్యాపిస్తుంది. సమస్త యాదవులను పిలిపించి సమావేశ పరచి వీరుడయిన వానికి కర్పూరతాంబూలం బహూకరించు.

యాదవులందరూ నా అంశతో జనించినవారే. వారు రెండు లోకాలను జయించాలనే కాంక్షతో ఉన్నారు" అని పలికాడు.

ఉగ్రసేనుడు వెంటనే అంధకాది యాదవుల నందరినీ పిలిపించి సమావేశం ఏర్పాటు చేశాడు. కర్పూరతాంబూల పళ్ళెరం పట్టుకొని "వీరులారా! మీలో ఎవరు జంబూద్వీపంలోని రాజుల నందరినీ జయించగలరో వారు ముందుకు వచ్చి ఈ తాంబూలం స్వీకరించవలసింది" అని ప్రకటించాడు. ఉగ్రసేనుని మాటలను విని రాజులందరూ మౌనం వహించారు. అప్పుడు రుక్మిణి కుమారుడైన ప్రద్యుమ్నుడు లేచి "నేను జంబూద్వీపంలోని రాజుల నందరినీ జయించి మీకు రాజ్యం నిష్కంటకం చేస్తాను. మీ యజ్ఞానికి ఎటువంటి ఆటంకము లేకుండా చేస్తాను" అని పలికాడు. ప్రద్యుమ్నుని మాటలను విని యాదవ వీరులందరూ "సాధు! సాధు!" అని పలికారు. అప్పుడు ప్రద్యుమ్నుడు వచ్చి అందరి సమక్షంలో కర్పూరతాంబూలం స్వీకరించాడు. అప్పుడు యాదవ పురోహితుడైన గర్గమహర్షి ముహూర్తం నిర్ణయించాడు.

## ప్రద్యుమ్నుని దిగ్విజయ యాత్ర :

దిగ్విజయార్థమై బయలుదేరుతున్న ప్రద్యుమ్నునకు ఉగ్రసేనుడు ఖడ్గం బహూకరించాడు. బలరాముడు కవచం అందించాడు. కృష్ణపరమాత్ముడు అక్షయ బాణ తూణీరముల నొసగాడు. శూరసేనుడు దివ్యకిరీట, కుండల, ఛత్ర, చామరము లను ప్రసాదించాడు. వసుదేవుడు శతచంద్ర అనే డాలును, ఉద్ధవుడు వాడని పువ్వులమాలను, అక్రూరుడు దక్షిణావర్త శంఖమును, గర్గమహర్షి శ్రీకృష్ణకవచమును సమర్పించారు. విజయభేరీ నినాదములు మ్రోగసాగాయి. వేదఘోష వినిపింపసాగింది. పుణ్యస్త్రీలు పేలాలు అక్షతలు చల్లసాగారు. దేవతలు పూల వాన కురిపించారు.

ప్రద్యుమ్నుడు శ్రీకృష్ణునకు బలరామునకు, ఉగ్రసేనునకు నమస్కరించి దిగ్విజయార్థమై బయలుదేరాడు. ఆతని వెనుక ఉద్ధవుడు మున్నగు యాదవులు, భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దాశార్హ వంశీయులైన వీరులు అనుసరించారు. శ్రీకృష్ణుని సూచనపై గదుడు, సాంబుడు మున్నగువారు తమ సేనలతో ప్రద్యుమ్నునకు సహకారంగా బయలుదేరాడు. యాదవ వీరులందరూ కిరీట కుండలములతో లోహ కంచుకములతో ప్రకాశిస్తున్నారు. హంసధ్వజాలు, గరుడధ్వజాలు, తాళధ్వజాలు తమ తమ రథములపై పతాకములు రెపరెపలాడుతుండగా కనులవిందుగా కనిపింపసాగారు.

ఇక భద్రగజములు వింధ్యపర్వత ప్రాంతములోనివి కొన్ని, మలయపర్వత ప్రాంతములోనివి కొన్ని, హిమాలయ పరిసరములలోనివి కొన్ని, కైలాసవనములలోనివి కొన్ని, ఐరావతకులమునకు సంబంధించినవి కొన్ని, నాలుగు దంతములున్నవి కొన్ని, నేలపైన కాక ఆకాశగమనము గలవి కొన్ని ఆ సేనా వాహినిలో ఉన్నాయి. అవి దారిలోని వృక్షములను తొండములతో పట్టి పెకలించి పారవేస్తూ ముందుకు వెళుతున్నాయి. ఇక అశ్వరాజములు మత్స్య, కళింగ, ఉశీనర, కోసల, విదర్భ, కురుజాంగల, కాంభోజ, కేకయ, కుంతల, కేరళ, అంగ, వంగ దేశాల నుంచి వచ్చినవి వాయువేగ మనోవేగములతో సంచరిస్తున్నాయి. వీనిలోని కొన్ని దివ్యాశ్యములకు రెక్కలు కూడా ఉన్నాయి.

ప్రద్యుమ్నునితో ఉగ్రసేన మహారాజు "నాయనా! ప్రద్యుమ్నా! శ్రీకృష్ణపరమాత్మని దయవల్ల నీవు రాజులనందరినీ జయించి త్వరలోనే ద్వారకకు తిరిగి రాగలవు. నీవు శిష్టులను రక్షించటము, దుష్టులను శిక్షించటము కర్తవ్యముగా భావించు. ఉన్మత్తులను, బాలకులను, స్త్రీలను, జడులను, శరణాగతులను సంహరింపకు. వేదము భగవంతుని వాక్కు. గోవు పరమాత్మని శరీరం. బ్రాహ్మణుడు పరమాత్మని ముఖం. సాధువు పరమాత్మని ప్రాణం. అందువల్ల నీవు వీటిని రక్షించు" అని పలికాడు.

పెద్దలకు అందరికీ అభివాదములు తెలిపి ప్రద్యుమ్నుడు అఖండ సేనా సమేతంగా బయలుదేరాడు. నాలుగు యోజనముల విస్తీర్ణంతో సేనావాహిని బయలుదేరింది. అగ్రభాగమున మహాబలుడైన కృతవర్మ, తరువాత ధనుర్ధారియైన అక్రూరుడు, తరువాత మంత్రి ఉద్ధవుడు, సేనాసమేతులై అనుసరించారు. ఆతరువాత ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మధు, బృహద్భానుడు, చిత్రభానుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, వేదబాహువు, శ్రుతదేవుడు, సునందనుడు, చిత్రభానుడు, విరూపుడు, కవి, న్యగ్రోధుడు అనే శ్రీకృష్ణపరమాత్మని పద్దెనిమిది మంది కుమారులు మహారథులై బయలుదేరారు. వారి వెనుక గదుడు మొదలైన వారు ఉన్నారు. మొత్తం భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దాశార్హ మొదలైన వంశీయులైన యాదవ వీరులు ఏభైఆరుకోట్ల మంది తరలివెళ్ళారు. ఆ అనంత సేనావాహిని మత్తేభ విక్రీడితాలతో, విజయభేరీ నినాదాలతో విజృంభించటం చూచి దిగ్గజాలు నివ్వెరపోయినాయి. శత్రువులు అంతఃపురాలు విడిచి పలాయనం చిత్తగించారు.

దుష్టులుదుర్మార్గులు ప్రద్యుమ్నుని చేతిలో హతమైపోసాగారు. దీనికి కారణమేమిటి? యజ్ఞేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్ముడు తానే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధాది చతుర్వ్యూహములను ధరించి భూభారముతొలగింప సిద్ధం కావటమే.

ఆ దిగ్విజయ యాత్ర సమయంలో ప్రద్యుమ్నుని శ్వేతచ్ఛత్రం నీడ నాలుగు యోజనముల దూరం వరకు పడింది. ముందుగా కచ్ఛదేశంపై దండయాత్ర సాగింది. ఆసమయంలో ఆ దేశాధీశుడు వేటకై అరణ్యానికి వెళ్ళాడు. ప్రద్యుమ్నుని ముట్టడి గురించి విని ఆయన వెంటనే తన రాజధాని యైన హేలాపురికి తిరిగివచ్చాడు. ఇంతలో సేనావాహినిలోని మదగజములు కనిపించిన చెట్లనన్నింటినీ కూల్చివేశాయి. ఆకాశమంతా ధూళితో నిండిపోయింది. ఈ దృశ్యం చూచి భయపడిన కచ్ఛదేశాధీశ్వరుడు ఐదువందల గజములను, పదివేల అశ్వములను, ఇరవై మణుగుల బంగారమును ప్రద్యుమ్నునకు కానుకగా సమర్పించాడు. ఈవిధంగా ప్రద్యుమ్నునకు యుద్ధం లేకుండానే విజయం సిద్ధించింది.

తరువాత ప్రద్యుమ్నుడు సేనావాహినితో కళింగ దేశంపైకి తరలివెళ్ళాడు. కళింగ రాజు సేనాసమేతంగా వచ్చి ప్రద్యుమ్నుణ్ణి ఎదిరించాడు. ఇరువైపుల భీకరపోరాటం ఆరంభమయింది. ఒక సందర్భంలో కళింగరాజు కోపంతో తన గదను అనిరుద్ధుని మీదకు విసిరివేశాడు. ఆ దెబ్బవల్ల అనిరుద్ధునకు బాధకలగటం చూచి యాదవులందరూ క్రుద్ధులై శత్రువీరుల మీద బాణవర్షం కురిపించారు. బలరాముని చిన్న సోదరుడు గదుడు తన గదను విసిరివేసి కళింగరాజు ఏనుగును హతమార్చాడు. చివరకు కళింగరాజు భీతుడై ప్రద్యుమ్నుని శరణువేడి కానుకలను సమర్పించుకున్నాడు.

అక్కడ నుంచి ప్రద్యుమ్నుడు మరుదేశం వెళ్ళాడు. అక్కడి రాజు గయుడు ఒక పర్వతదుర్గంలో నివసిస్తున్నాడు. ప్రద్యుమ్నుడాతని వద్దకు ఉద్ధవుణ్ణి పంపించాడు. ఉద్ధవుడాతని దగ్గరకు వెళ్ళి - ఉగ్రసేనుడు జంబూద్వీపంలోని రాజుల నందరినీ జయించి రాజసూయం చేయాలని భావిస్తున్నాడని, సాక్షాత్తు పరమాత్ముడైన శ్రీకృష్ణు డాయనకు హితవులు చెప్తూఉన్నాడని, ధనుర్ధరులలో మేటియైన ప్రద్యుమ్నుడు దండెత్తి వచ్చాడని రాజ్యక్షేమంకోసం నీవు వారితో సంధి చేసుకుంటే బాగుంటుందని హితవు చెప్పాడు. కాని గయుడా మాటలకు అంగీకరింపక పోరుకే సిద్ధపడ్డాడు. ఆ యుద్ధంలో శ్రీకృష్ణుని కుమారుడైన దీప్తిమంతు డాతని నెదుర్కొని ఓడించాడు. గయుడు ప్రద్యుమ్నుని శరణువేడాడు.

అనంతరం ప్రద్యుమ్నుడు అవంతీపురానికి వెళ్ళాడు. అక్కడి రాజు జయసేనుడు ప్రద్యుమ్నుని ఆగమనవార్తను విని ఆనందంతో ఎదురేగి ఆహ్వానించాడు. అక్కడనే ప్రద్యుమ్నుడు తన మేనత్తయైన రాజాధిదేవిని సందర్శించాడు. ఆమె కుమారులైన విందానువిందులతో కలిసి ఆ మాళవ నగరమంతా దర్శించాడు.

ఆ తరువాత ప్రద్యుమ్నుడు సేనాసమేతంగా మాహిష్మతీ పురమునకు బయలుదేరి ఆ నగరం ముందున్న నర్మదా తీరంలో విడిది దిగాడు. అక్కడ నుంచి అచటిరాజైన ఇంద్రనీలునకు కబురుపంపాడు. ఇంద్రనీలుని దగ్గర నుండి దూత వచ్చి ప్రద్యుమ్నునితో "అయ్యా! హస్తనాపుర ప్రభువు ధృతరాష్ట్రమహారాజు మా ఇంద్రనీల మహారాజును ఈ సింహాసనంపై కూర్చొనబెట్టాడు. కాబట్టి మేము ఎవరికీ కప్పము కట్ట నవసరము లేదని మా మహారాజు చెప్పమన్నా"రని తెలియజేశాడు. ప్రద్యుమ్నుడందుకు ఆగ్రహించి యుద్ధసన్నద్ధుడుకాగా ఇంద్రనీలుడు భయపడి అపారమైన గజ అశ్వ సేనలను కానుకగా సమర్పించి ప్రద్యుమ్నుని శరణువేడాడు. ఆ తరువాత ప్రద్యుమ్నుడు ఘూర్జర దేశం వెళ్ళి తన సేన సహాయంతో అచటి రాజగు ఋష్యణ్ణి పట్టుకున్నాడు. ఆతడు ప్రద్యుమ్నుని శరణువేడి విలువైన కానుకలను సమర్పించుకున్నాడు.

ఆ తరువాత ప్రద్యుమ్నుడు చేదిదేశం వుళ్ళాడు. చేదిరాజు దమఘోషుడు వసుదేవుని సోదరి భర్తయే. ఆతని కుమారుడు శిశుపాలుడు కృష్ణవిరోధి. బుద్ధిమంతుడైన ఉద్ధవుడు వెళ్ళి దమఘోషునితో "ఉగ్రసేనమహారాజు రాజుల నందరినీ జయించి రాజసూయయాగం చేయాలనుకుంటున్నాడు" అని విషయమును వివరించిచెప్పాడు. ఆమాటలకు ఆగ్రహించి శిశుపాలుడు ఉద్ధవునితో "కాలం ఎంత ఆశ్చర్యకరంగా ఉంది. హంస ఎక్కడ? కాకి ఎక్కడ? పండితుడెక్కడ? మూర్ఖుడెక్కడ? చక్రవర్తులమైన మమ్మల్ని సేవకులు జయించాలనుకుంటున్నారా? యయాతి శాపం వల్ల యాదవులకు రాజ్యార్హత ఏనాడో పోయింది. ఇప్పుడు కొంచం రాజ్యం సంపాదించి మిడిసిపడుతున్నారు. ఉగ్రసేనుడు రాజు ఎప్పుడయ్యాడు? కృష్ణుడే ఆతనిని బలవంతంగా రాజును చేశాడు. ఆతని దగ్గర కృష్ణుడు మంత్రిగా ఉంటున్నాడు. ఆ కృష్ణుడు జరాసంధునకు భయపడి మధురానగరం విడిచిపెట్టి సముద్రంలోకి వెళ్ళి దాక్కున్నాడు. వాస్తవంగా కృష్ణుడు నందునికుమారుడైయుండి, వాసుదేవుని కుమారుడుగా అనిపించుకొనటానికి ఎంతమాత్రము సిగ్గుపడటం లేదు. వసుదేవుడు

గౌరవర్ణంతో ఉంటాడు. ఆతని తండ్రి కూడా గౌరవర్ణమే. అటువంటిది ఈ నల్లనివాడు ఆతనికి కుమారుడు కావటం ఎలా? ఎంత అపహాస్యంగా ఉంది. నేను ప్రద్యుమ్నుణ్ణి జయించి ద్వారకను వశపరచుకొని యాదవులకు భూభాగం లేకుండా చేస్తాను" అని ఆయుధములను తీసికొని బయలుదేరాడు.

అప్పుడు దమఘోషుడు శిశుపాలునితో "నాయనా! యాదవులకు చేది వంశీయులకు పూర్వం నుంచి బంధుత్వం ఉంది. ఇప్పుడు నీవల్ల ఈ రెండు వంశాలకు కలహం రావటం నాకు ఇష్టంలేదు" అన్నాడు. ఇంతలో దమఘోషుని భార్య, వసుదేవుని సోదరియైన శ్రుతిశ్రవ వచ్చి "కుమారా! వసుదేవుడు నీకు మామ, కృష్ణుడు నీకు బావ. కృష్ణనందనుడైన ప్రద్యుమ్నాదులు నీచేత సత్కారము లందు కొనటం కోసం వచ్చారు. యుద్ధానికి కాదు. నేను నీతోవచ్చి వారినందరిని ఆహ్వానిస్తాను. ఇటువంటి అవకాశం మరల మనకు లభించదు" అని పలికింది. అప్పుడు శిశుపాలుడు తల్లితో "కృష్ణుడు, బలరాముడు యాదవులందరూ నాకు శత్రువులు. కుండిన నగరంలో నా వివాహం సమయంలో బలరామకృష్ణులు నన్నెంతో అవమానం చేశారు. నీవు వారి పక్షంలో ఉన్నట్లయితే మీ ఇద్దరినీ కారాగారంలో బంధించివేస్తాను. అప్పటికీ వినకపోతే మీ ఇద్దర్నీ హతమారుస్తాను" అని పలికి శిశుపాలుడు సేనతో చంద్రికాపురం నుంచి బయటకు వెళ్ళాడు. ప్రద్యుమ్నుని సేనకు శిశుపాలుని సేనకు భీకర పోరాటం జరిగింది. గాందినీ నందనుడైన అక్రూరుడు, సాత్యకి, కృష్ణనందనుడైన భానుడు విశేషపరాక్రమం చూపారు. తన మంత్రులు రంగపింగ నామకులు హతమయ్యేసరికి శిశుపాలుడు అఖండ సేనావాహినితో ముందుకు వెళ్ళాడు. మహేంద్ర పర్వతంపై పరశురాముని దగ్గర నేర్చుకొన్న ఆగ్నే యాస్త్రాన్ని ప్రద్యుమ్నునిసేనపై ప్రయోగించాడు. వెంటనే ప్రద్యుమ్నుడు పర్జన్యాస్త్రాన్ని ప్రయోగించి ఆ మంటల నార్పివేశాడు. అప్పుడు శిశుపాలుడు గజాస్త్రమును ప్రయోగించాడు. దీనిని శిశుపాలుడు మలయపర్వతంపై అగస్త్యముని దగ్గర అభ్య సించాడు. అది ప్రయోగించటంవల్ల అసంఖ్యాకంగా గజములు ఆవిర్భవించి ప్రద్యుమ్నుని సేనపై పడసాగాయి. అప్పుడు ప్రద్యుమ్నుడు నారసింహాస్త్రమును ప్రయోగించాడు. వెంటనే నృసింహరూపములు అసంఖ్యాకంగా ఆవిర్భవించి గజములను చీల్చి చెండాడసాగాయి. చివరకు ప్రద్యుమ్నుడు తనకు వరుణుడిచ్చిన పాశంతో శిశు పాలుని బంధించి కత్తితో నరకబోయాడు. అప్పుడు గదుడు వారించి "సోదరా!

వీని మృత్యువు కృష్ణపరమాత్ముని చేతిలో ఉన్నది. దయతో ఈతనిని విడిచి పెట్టు" మని పలికాడు. అప్పుడే శిశుపాలుని తండ్రి దమఘోషుడు కానుకలను తెచ్చి ప్రద్యుమ్ననకు సమర్పించి తన కుమారుణ్ణి క్షమించుమని ప్రార్థించాడు. ప్రద్యుమ్నుడు దమఘోషుని మాటలను ఆదరించి శిశుపాలుణ్ణి విడిచిపెట్టాడు.

అక్కడ నుంచి ప్రద్యుమ్నుడు సేనాసమేతంగా కొంకణదేశమునకు వెళ్ళాడు. అక్కడి రాజు మేధావి గదాయుద్ధ నిపుణుడు. అతనిని గదుడు తన గదతో చావమోది విజయం పొందాడు. కుటక దేశాధిపతిని జాంబవతీసుతుడైన సాంబుడు పరాజితుణ్ణి చేశాడు. అక్కడ నుంచి దండకారణ్యం దాటి నిర్వింధ్య, పయోష్ణి తపతి నదులలో స్నానం చేసి శూర్పారక మహాక్షేత్రం వెళ్ళాడు. అక్కడ నుంచి ద్వైపాయన దేవీధామమును చేరుకున్నాడు. ఆ తరువాత ఋష్యమూక పర్వతం చూచి ప్రవర్షణ గిరిపైకి చేరుకున్నాడు. అక్కడనే పర్జన్యదేవతలు నిత్యం నివసించేది. అక్కడ నుంచి గోకర్ణమనే శివక్షేత్రం చూచి కేరళదేశం చేరుకున్నాడు. అక్కడి రాజు అంబష్టుడు కానుకలనిచ్చి ప్రద్యుమ్నుని ఆదరించాడు. ఆ తరువాత వేణీ కృష్ణా నదులను దాటి తెలుగు దేశంలోకి వచ్చాడు. అక్కడి రాజు విశాలాక్షుడు తన భార్యయైన మందారమాలిని హితవు ననుసరించి ప్రద్యుమ్ననకు కానుకల నొసగి సత్కరించాడు. ఆ తరువాత ప్రద్యుమ్నుడు పంపానదిని దాటి మహారాష్ట్ర దేశం చేరుకున్నాడు. అక్కడి రాజు విమలుడు వైష్ణవుడు. ఆయన భక్తిభావంతో ప్రద్యుమ్నుణ్ణి ఆహ్వానించి ఆదరించాడు. తరువాత కర్ణాటక దేశాధిపతి సహస్రజిత్ స్వయంగా ప్రద్యుమ్నుణ్ణి తన దేశానికి ఆహ్వానించి గౌరవించాడు. తరువాత ప్రద్యు మ్నుడు కరూషదేశం చేరుకున్నాడు. అక్కడ మహారంగపురంలో ఉన్న వృద్ధశర్మ అనే మహారాజు వసుదేవుని మరొక సోదరియైన శ్రుతదేవ భర్తయే. ఆతని కుమారుడు దంతవక్త్రుడు కృష్ణవిరోధి. భయంకరమైన ఆకారంతో, అతివేలమైన బలంతో దంతవక్త్రుడు ప్రద్యుమ్నుని సేనపైపడి విజృంభింపసాగాడు. అక్రూరుడు, కృతవర్మ, యుయుధానుడు, సారణుడు, సాంబుడు మొదలైన వీరులందరూ కలిసి కూడా దంతవక్త్రుణ్ణి పరాజితుణ్ణి చెయ్యలేకపోయారు. అప్పుడు ప్రద్యుమ్నుడు స్వయంగా దంతవక్త్రునితో తలపడ్డాడు. దంతవక్త్రుడు ప్రద్యుమ్నుణ్ణి చూచి "నిన్న మొన్నటి వరకు గోపాలుర దగ్గర పాలు, పెరుగు, వెన్న దొంగతనం చేసి తిన్న కృష్ణుడు ఇప్పుడు యాదవుల రాజు అయ్యాడా? దొంగతనం ఒక వంక, మరొకవంక గోపికలతో రాసక్రీడలా? జరాసంధునకు

భయపడి వెళ్లి సముద్రములో దాగుకొనటమా? కాలయవనునకు భయపడి పరుగులు పెట్టటమా? అటువంటి వానికి కొంచం రాజ్యం ఇస్తే ఉగ్రసేనుణ్ణి రాజును చేసి ఇప్పుడు రాజసూయయాగం చేయటానికి సిద్ధపడ్డారా? నక్కల వంటి యాదవులెక్కడ? సింహములవంటి మేమెక్కడ?" అని పరుషంగా పలికాడు.

అందుకు ప్రద్యుమ్నుడు దంతవక్త్రునితో "ఇన్నాళ్ళు నీవు మా బంధున వని నీతో తలపడి యుద్ధం చెయ్యలేదు. లజ్జావిహీనుడవై పరవిందతో యాదవుల ఔన్నత్యం గుర్తింపలేకుండా ఉన్నావు. కుండినపురంలో యాదవుల పరాక్రమం నీవు చూచినట్లుగా లేదు. గోకులంలో జన్మించిన నందుడు సాక్షాత్తు ద్రోణుడనే వసువు. వ్రజంలో ఉన్న గోపాలకులందరూ కృష్ణపరమాత్ముని రోమకూపములనుండి జన్మించిన గోలోకవాసులు. రాధాదేవి గోలోకవాసిని. శ్రీకృష్ణుడు పరిపూర్ణతమ పరబ్రహ్మము. ఉగ్రసేనుడు పూర్వజన్మలో మరుత్ అను పేరుగల మహారాజు. ఈ పరమార్థములను గ్రహింపలేక నీవు అవివేకుడవై ప్రవర్తిస్తున్నావు" అని పలుకగా దంతవక్త్రుడు తన భీకరమైన గదతో సేనావాహినితో ప్రద్యుమ్నునిపై తలపడ్డాడు. ఆ మహా సంగ్రామంలో చివరకు ప్రద్యుమ్నుడు దంతవక్త్రునిపై ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించినట్లు ఒక్క దెబ్బ కొట్టాడు. ఆతడు మూర్ఛపోయాడు. అప్పుడు కరూషదేశాధిపతి వృద్ధశర్మ తన భార్య శ్రుతదేవతో పాటు వచ్చి కానుకల నొసగి యాదవ వీరులతో సంధి చేసికొని తన కుమారుడైన దంతవక్త్రుణ్ణి వెంటబెట్టుకొని ఇంటికి వెళ్ళాడు.

అనంతరం ప్రద్యుమ్నుడు దక్షిణ సముద్రంలో స్నానం చేసి సేనాసమేతుడై ఉశీనర దేశంపైకి వెళ్ళాడు. అచటి రాజ్యం గోసముదాయాలతో కనులపండుగగా ఉంది. ఆ రాజు వెన్నను ప్రద్యుమ్నునకు కానుకగా సమర్పించి తన భక్తిని చాటుకున్నాడు. అదేవిధంగా చంపాధిపతి కానుకలను అర్పించి ప్రద్యుమ్నుని ఆధిపత్యమును అంగీకరించాడు. ఆ తరువాత కృష్ణనందనుడైన ప్రద్యుమ్నుడు విదర్భదేశం వెళ్ళి తన తాతగారగు కుండినపురాధిపతి భీష్మకుని దర్శించి కుంతల, దరద దేశముల వైపుకు వెళ్ళాడు.

**అగస్త్యునితో ఆధ్యాత్మిక సంవాదము :**

మార్గమధ్యంలో చందన పరిమళ భరితమైన మలయపర్వతంపై ప్రద్యుమ్నుడు అగస్త్యమహర్షిని సందర్శించాడు. సముద్రమునవపోశన పట్టిన ఆ మహర్షిని చూచి

ప్రద్యుమ్నుడు భక్తి పూర్వకంగా నమస్కరించి ఆశీస్సులను పొందాడు. అప్పుడు ప్రద్యుమ్నుడు అగస్త్యునితో "స్వామీ! దృశ్యమానమైన ఈ జగత్తు సత్యపదార్థమువలె కనిపించటానికి కారణమేమిటి? జీవుడు దేవుని అంశమై ముక్తుడుగా ఉంటున్నప్పుడు ఆతడు గుణములచేత ఏవిధంగా బంధింపబడి ఉంటున్నాడు? మీరు సర్వజ్ఞులు, దివ్యదృష్టిగల మహాత్ములు కాబట్టి నా సంశయములు తొలగించండి" అని అడిగాడు.

అప్పుడు అగస్త్యుడు ప్రద్యుమ్నునితో "నాయనా! నీవు సాక్షాత్తు భగవంతుడైన శ్రీకృష్ణుని కుమారుడవై యుండి నన్నీవిధంగా అడగటం కేవలం నీ లీల తప్ప మరొకటి కాదు. భగవంతుని కార్యములవలెనే నీ కార్యములు కూడా కేవలం లోక సంగ్రహం నిమిత్తమే తప్ప మరొకవిధంకాదు. నిజమైన సూర్యుని ప్రతిబింబము నీటిలో పడి అది సత్యమైన సూర్యునివలెనే కనిపిస్తుంది. అదేవిధంగా ఆ పరమాత్మ యొక్క ఈ ప్రపంచం సత్యమువలెనే కనిపిస్తుంది. అద్దంలో ముఖం, త్రాడులో సర్పం, ఎండమావులలో నీరు సత్యం అనిపిస్తున్నవిధంగా ఈ మిథ్యా ప్రపంచం కూడా సత్యమనిపిస్తుంది. అదేవిధంగా ఈ జీవుడు వివిధములైన అహంకారాది గుణాలచేత ఈ శరీరంలో బంధింపబడి ఉన్నాడు" అని పలికాడు.

అప్పుడు ప్రద్యుమ్నుడు "మహర్షీ! దేహధారియైన ఈ జీవుడు ఏ ఉపాయంతో బంధముల నుండి విముక్తుడౌతాడు? దృఢవైరాగ్యం వల్ల జీవుడు బంధములలో చిక్కుకొనకుండగా ఉండగలడా?" అని అడిగాడు. అందుకు అగస్త్యమహర్షి "ఎవడు వివేకంతో ఈ జగత్తును కేవలం భ్రాంతిగా భావించి సనాతన బ్రహ్మమును భజిస్తాడో ఆతడు పరమపదం పొందుతాడు. జన్మ, మృత్యు, శోక,మోహ, బాల్య, వార్ధక, యౌవన దశలు, అహంత, మమత, మద, రోగ, భయ, సుఖ, దుఃఖ, క్షుత్, పిపాస, రతి, ఆధివ్యాధులు ఇవన్నీ ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మ నిరీహమైనది. దానికి కర్తృత్వం లేదు, దానికి శరీరంలేదు, అది సర్వవ్యాపి, అహంకార రహితమైనది. శుద్ధమైనది, గుణాశ్రయమైనది, సాక్షాత్తు పరబ్రహ్మమైనది, మాయకు అతీతమైనది, నిష్కళంకమైనది. అది ఆత్మదృక్. పరమాత్ముడు జ్ఞాన స్వరూపుడు, సదా పరిపూర్ణుడు. ఆయన మునీశ్వరుల చేత తెలిసికొనబడుతుంటాడు. అటువంటి పరబ్రహ్మమును గ్రహించి ఆనందముగా విహరించు. ఎప్పుడు జగత్తు నిద్రిస్తుంటుందో అప్పుడు ఆ పరమపురుషుడు మేల్కొని చూస్తుంటాడు. ఎవరు ఆతని వైపు చూస్తారో అప్పుడు ఆతడు జగత్తువైపు చూడక అగమ్యగోచరుడుగా ఉంటాడు.

ఆకాశం కడవలో, అగ్ని కాష్ఠంలో, వాయువు రేణువులలో, స్ఫటికము వర్ణములలో ఏవిధంగా బంధింపబడి ఉండదో అదేవిధంగా ఆత్మగుణములలో బంధింపబడి ఉండదు.

ఆ పరబ్రహ్మమునే కొందరు కర్మయని, కొందరు కర్తయని, కొందరు యోగమని, కొందరు జ్ఞానమని, కొందరు పరమాత్మయని పిలుస్తూ ఉంటారు. కొందరు ప్రత్యక్ష ప్రమాణములతో, కొందరు అనుమాన ప్రమాణములతో, కొందరు వేదములతో కొందరు యోగములతో ఆ పరబ్రహ్మ అస్తిత్వమును గూర్చి ప్రతిపాదనలు చేస్తారు. ఈవిధంగా బ్రహ్మమును గూర్చి విచారణ చేసి నిస్సంగులై వర్తిస్తుంటారు. ప్రవహించే నీటిలో చెట్లనీడలుపడి చెట్లు కదులుతున్నట్లు కనిపించే విధంగా, కళ్ళు తిరిగినప్పుడు భూమి తిరిగిపోతున్నట్లు అనిపించే విధంగా గుణాలచేత భ్రమించే మనస్సువల్ల ఆత్మకు కూడా జననమరణాది వికారములున్నట్లు దృష్టిగోచరమౌతుంది. చేతితో త్రిప్పినప్పుడు కర్ర ఎలా తిరుగుతుంటుందో ఆ విధంగా "నేను ఇది చేస్తాను", "నేను దీనిని చేస్తున్నాను" "ఇది నాది" "ఇది నీది" "నీవు సుఖంగా ఉన్నావు", "నేను సుఖంగా ఉన్నాను" అని ఈవిధంగా మాట్లాడుతూ మానవుడు అజ్ఞాన మోహంలో తిరుగుతుంటాడు.

సత్వరజస్తమో గుణములు మూడు కూడా మాయతో కూడినవే. అవి ఆత్మకు సంబంధించినవి కావు. దారములతో వస్త్రము నిండి ఉన్నట్లుగా ఈ మూడు గుణములతో యావత్ ప్రపంచం నిండిపోయి ఉంది. సత్వగుణంగలవారు స్వర్గాది లోకములకు వెళతారు. రజోగుణంగలవారు మానవలోకంలో నివసిస్తారు. తమోగుణంగలవారు నరకాది లోకములకు వెళతారు.

కృష్ణనందనా! అంధకారములో త్రాటియందు సర్ప భ్రమ కలిగినట్లుగా, ఎండమావులలో నీటి భ్రమ కలిగినట్లుగా ఈ మిథ్యాజగత్తు సత్యమనే భ్రమ కలుగుతుంది. చిన్నచిన్న రాజులకు రాజ్యాలు వస్తూ పోతూ ఉన్నట్లు మానవునకు సుఖదు:ఖాలు వస్తూ పోతూ ఉంటాయి. మేఘములవలెనే మానవ దేహములు కూడా స్థిరములు కావు. గాలివీస్తున్నప్పుడు విసనికర్రలతో ఏవిధంగా పనిలేదో, తీరమునకు చేరిన తరువాత తెప్పతో ఏవిధంగా అవసరము లేదో అదేవిధంగా జ్ఞానం ప్రాప్తించిన తరువాత దర్పణదృశ్యం వంటి ఈ ప్రపంచంతో పనిలేదు.

జలపాత్రలో చంద్రబింబము, కాష్ఠంలో అగ్ని ఉన్నట్లుగా భగవంతుడు విశ్వమంతటా నిండిఉన్నాడు. ఘటమునకు లోపల బయట ఆకాశము ఉన్నట్లుగా భగవంతుడు తాను తయారుచేసిన ఈ దేహములందు నిర్లిప్తుడై ఉంటున్నాడు. పద్మపత్రములపై నీరు నిలువనట్లుగా కృష్ణభక్తుడు, శాంతచిత్తుడు, జ్ఞానమూర్తి, వైరాగ్యజీవనుడు అయిన వారికి గుణములు అంటవు. జ్ఞాని అయినవాడు సదా ఆనందమయుడై బాలకునివలె విహరిస్తుంటాడు. మదిరాపాన మత్తుడైనవాడు తన వస్త్రములను గూర్చి ఎరుగనట్లుగా జ్ఞానియైనవాడు తన శరీరమును గూర్చి పట్టించు కొనడు. సూర్యోదయము కాగానే ఇంటిలోని వస్తువులన్నీ స్పష్టముగా కనిపించి నట్లుగా జ్ఞానవంతుడైనవానికి అన్నింటి తత్త్వము స్వత: తెలిసిఉంటుంది. ఒకే వస్తువును గూర్చి మాటిమాటికి ఇంద్రియములు అనేకప్రకారములుగా ఏవిధంగా చెప్తూ ఉంటాయో అదేవిధంగా ఒకే ఒక్క పరబ్రహ్మమును గురించి అనేక శాస్త్రములు విభిన్నములైన విధములుగా చెప్తున్నాయి.

పాలను చూచి కళ్ళు తెల్లదనమును గుర్తిస్తాయి. వేళ్ళు వెచ్చదనమును చల్లదనమును తెలుసుకుంటాయి. నాలుక తీపి, చప్పదనములను గ్రహిస్తుంది. నాసిక సుగంధ దుర్గంధములను గమనిస్తుంది. బుద్ధి ఇది స్వీకరింపదగునా లేదా అని నిర్ణయిస్తుంది. అదేవిధంగా పరబ్రహ్మమును గురించి కొందరు పరంధాముడని, కొందరు పరమాత్ముడని, కొందరు శాంతుడని, కొందరు బ్రహ్మఅని, కొందరు అవ్యయుడని, కొందరు అక్షరుడని అభివర్ణిస్తుంటారు.ఆపరమపదము కేవలము భక్తిజ్ఞాన వైరాగ్యముల చేతనే ప్రాప్తిస్తుంది తప్ప మరొకవిధంగా ప్రాప్తించదు. ఆ కృష్ణపరమాత్ముని, కైవల్య నాథుని, పురుషోత్తముని పొందిన వాడు మరల భవ సాగరము లోనికి ప్రవేశింపడు." అని వివరించాడు. భగవత్ జ్ఞానవిషయకమైన ఈ భాషణ విని ప్రద్యుమ్నుడు ప్రమోదంతో అగస్త్యమహర్షిని భక్తితో పూజించి బయలుదేరాడు.

ఆ తరువాత ప్రద్యుమ్నుడు తామ్రపర్ణి నదిలో స్నానంచేసి సేనాసమేతంగా రాజపురం వెళ్ళాడు. అక్కడిరాజు శాల్వుడు ద్వివిదునితో కలిసి ప్రద్యుమ్నునితో తలపడ్డాడు. ప్రద్యుమ్నుడు వారిని పరాభూతులచేసి మత్సర దేశమునకు వెళ్ళి ఆరాజును జయించి సేతుబంధం వెళ్ళాడు. అక్కడ సముద్రములో నూరు యోజనముల అవతలగల లంకను పరిపాలిస్తున్న విభీషణునికి తమ ఆగమన వార్తను తెలియజేశాడు.

రామభక్తుడైన విభీషణుడు గగనమార్గంలో కృష్ణతనయుడైన ప్రద్యుమ్నుని సన్నిధికి వచ్చి కానుకలను బహూకరించి తన అభిమానమును చాటుకున్నాడు.

అనంతరం ప్రద్యుమ్నుడు ఋషభాద్రిని దర్శించి శ్రీరంగము, కాంచీ పురముల మీదుగా పయనించి కావేరీనదిని దాటి సహ్యాపర్వతముల మీదగల అవధూతను దర్శించాడు. దత్తాత్రేయుడు అవధూతగా కన్పించి ప్రద్యుమ్ననకు తత్వబోధ గావించాడు. తరువాత అక్కడ నుంచి ప్రద్యుమ్నుడు ద్రవిడదేశం లోని వైకుంఠపర్వతంపైకి వెళ్ళాడు. అక్కడ ద్రవిడదేశాధిపతి సత్యవాక్ అనురాజు ప్రద్యుముని ఆదరించాడు. తరువాత ప్రద్యుమ్నుడు శ్రీశైల పర్వతమును దర్శించి పంపాసరోవరం చేరుకున్నాడు. అనంతరం మహేంద్రాచలంపై పరశురాముణ్ణి దర్శించాడు. పరశురాముడు కృష్ణనందనుణ్ణి చూచి పరమానందభరితుడై తన యోగబలం చేత యాదవుల సేనావాహిని కంతటికి షడ్రసోపేతమైన భోజనం ఏర్పాటుచేశాడు.

ఆ తరువాత ప్రద్యుమ్నుడు అంగ, వంగ, ఓఢ్ర, కేకయ దేశాలను జయించి మిథిలానగరం చేరుకున్నాడు. అక్కడ కృష్ణభక్తుడైన ధృతి కుమారుడు బహుళాశ్వుడు పరిపాలిస్తున్నాడు. ఆనగరమును, అచటి ప్రజల కృష్ణభక్తిని చూచి ప్రద్యుమ్నుడు ఆశ్చర్యానందములను పొందాడు. ఆ తరువాత ప్రద్యుమ్నుడు గిరివ్రజపురము వెళ్ళి జరాసంధునితో తలపడ్డాడు. అనంతమైన సేనతో జరాసంధుడు ప్రద్యుమ్నునితో పోరు సలుపసాగాడు. అదే సమయంలో ద్వారక నుంచి బలరాముడు కూడా వచ్చి ప్రద్యుమ్ననకు సహాయంగా ఉండి జరాసంధుణ్ణి పరాజితుని గావించాడు. జరాసంధుని కుమారుడు సహదేవుడు వచ్చి అనేక రథ గజ అశ్వములను బహూకరించాడు.

ఆ పిమ్మట ప్రద్యుమ్నుడు హస్తినాపురమునకు వెళ్ళి కౌరవులతో తలపడ్డాడు. దుర్యోధన, భీష్మ, ద్రోణాదులు యుద్ధరంగానికి వచ్చారు. పోరు భీకరంగా సాగుతున్న సమయంలో అక్కడకు బలరామకృష్ణులు వచ్చి ఇరుపక్షములవారిని శాంతింపచేశారు. మరొక సమయంలో గంధర్వులు సాంబుణ్ణి తీసికొనివెళ్ళి హస్తినాపురంలో దాగినప్పుడు క్రుద్ధుడైన బలరాముడు తన హలాయుధంతో హస్తినాపురమును పెకలించి గంగలో కలపటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు వారు సాంబుణ్ణి విడిచిపెట్టి బలరాముణ్ణి శరణువేడారు. అనంతరం ప్రద్యుమ్నుడు సోదరులతో, సేనతో త్రిగర్తదేశం వెళ్ళాడు. యుధిష్ఠిరుడు ప్రద్యుముని సహాయార్థం అర్జునుణ్ణి పంపించాడు. అర్జునుని సహకారంతో ప్రద్యుమ్నుడు వచ్చిన వార్తవిని త్రిగర్తాధిపతి సుశర్మ ఎదురేగి కానుకలను బహూకరించాడు.

అలాగే విరాటరాజు కూడా ప్రద్యుమునకు సముచితమైన సత్కారము గావించాడు. అక్కడ నుంచి ప్రద్యుమ్నుడు సేనా సమేతంగా కురుక్షేత్రం వెళ్ళి సరస్వతీనదిలో స్నానం చేసి సారస్వత దేశంలోని కౌశాంబీ నగరం చేరుకున్నాడు. అక్కడిరాజు కుశాంబుడు ప్రద్యుమ్నుని ఎదిరించి ఓడిపోయి కానుకలను అర్పించాడు. అదేవిధంగా సౌవీర దేవాధిపతి సుదేవుడు, ఆభీరదేశాధిపతి విచిత్రుడు, సింధుభూపాలుడు చిత్రాంగదుడు, కాశ్మీర భూపాలుడు మహౌజుడు, జాంగల రాజు సుమేరుడు, లక్షద్వీపాధిపతి ధర్మపతి, గాంధారరాజు బిడౌజుడు ప్రద్యుమ్నుని ఆధిపత్యమును అంగీకరించారు.

తరువాత ప్రద్యుమ్నుడు అర్బుద, మ్లేచ్ఛ దేశములను జయించటానికి ముందుకు వెళ్ళాడు. అక్కడ కాలయవనుని కుమారుడు చండుడు వీరిని ప్రతిఘటించాడు. తన తండ్రిని కృష్ణుడు చంపినందువల్ల కృష్ణుని కుమారుణ్ణి తాను చంపవలెనని భావించి చండుడు ప్రచండ బలంతో వీరిని ఎదుర్కొన్నాడు. ఆ భీకర సంగ్రామంలో గాండీవియైన అర్జునుడు చండుడిని సంహరించివేశాడు. ప్రద్యుమ్నుడు అర్జునుణ్ణి తనకు సేనాధిపతిగా నియమించుకున్నాడు. ఈవిధంగా భరతఖండమును జయించిన తరువాత యాదవేశ్వరుడైన ప్రద్యుమ్నుడు హిమాలయములను దాటి ఈశాన్యదిశవైపు బయలుదేరాడు.

కైలాసపర్వతమునకు సమీపములో నున్న బాణాసురుని శోణితపురము వెళ్ళాడు. పరమశివుని హితవును పాటించి బాణాసురుడు వచ్చి ప్రద్యుమ్నునకు రథగజ సంపత్తిని కానుకగా ప్రసాదించి ఆదరించాడు. తరువాత ప్రద్యుమ్నుడు యక్ష, కింపురుష, గంధర్వ, హరివర్షఖండ, ఉత్తర కురుఖండ, హిరణ్మయఖండ దశావర్ణవ, మన్మథ ఇలావృత దేశములను జయించి ముందకు వెళ్ళాడు. వృకాసుర, కాలనాభ, మహానాభులను సంహరించాడు.

## సుందరీ స్వయంవరము :

ఈవిధంగా ప్రద్యుమ్నుడు విజయ పరంపరలను సాధించి, ఆనందంగా పయనిస్తున్న సమయంలో గగన మార్గంలో ఐరావతము పై వెళుతున్న మహేంద్రుడు చూచి భువికి దిగివచ్చాడు. ప్రద్యుమ్నుడు, తన పరివారంలోని రాజన్యులు మహేంద్రుని రాకకు మహదానందము నొందారు. అప్పుడు ఇంద్రుడు ప్రద్యుమ్నునితో "ఓ

మహాబాహూ! నరేశ్వరా! సువర్ణగిరి శిఖరములపై లీలావతీపురము అని ఒక పురము ఉన్నది. అక్కడ విద్యాధరుల రాజైన సుకృతి రాజ్యం చేస్తున్నాడు. ఆతనికి సుందరి అనే పేరుగల కుమార్తె ఉన్నది. ఆమె వందచందమామల సౌందర్యంతో రూపలావణ్యా సుశోభితయై ఉన్నది. ఆమె స్వయంవరం సందర్భంగా సమస్త లోకపాలురు, దేవతలు దివ్యరూపములను ధరించి వెళుతున్నారు. ఆరాజకుమార్తె ఒక నియమం పెట్టుకున్నది. ఆమె ఎవరి సౌందర్యం చూచి తాను మూర్ఛపోతుందో ఆతనినే తాను భర్తగా స్వీకరించ దలచుకున్నది" నీవు నీ సోదరుల నందరినీ తీసికొని అక్కడకు వెళ్ళు. దేవబృందంతో కూడిన ఆ సుందరీ స్వయంవరం చూడు" అని పలికాడు.

ఆ మాటలను విని ప్రద్యుమ్నుడు తన సోదరులను తీసికొని, దేవేంద్ర సహితుడై లీలావతీపురమునకు వెళ్ళాడు. స్వయంవర ప్రాంగణము సువిశాలమై, దివ్య సౌందర్యసమన్వితమై, కస్తూరి, అగరు, చందనాది పరిమళ విలసితమై అపరఇంద్రలోకమా అన్నట్లున్నది. ప్రద్యుమ్నుడు వెళ్ళి ఒక సింహాసనం పై ఆసీను డయ్యాడు. ఆ సభలో ప్రజాపతులు, దేవతలు, రుద్రగణములు, దిక్పాలకులు, సిద్ధ, విద్యాధర, కిన్నరాదులు నిండిఉన్నారు. వారు ప్రద్యుమ్నుని చూడగానే తమకు స్వయంవరంపై ఆశను వదులుకున్నారు.

ఆ సమయంలో సుకృతి కుమార్తె సుందరి రత్నమాలను చేత ధరించి నిదానంగా సభా సదనంలోకి అడుగుపెట్టింది. ఆమె వరుని కోసం అన్వేషిస్తున్న విధం చూస్తుంటే మెరుపుతీగ మేఘం కోసం వెదుకుతున్నట్లుగా ఉంది. ఆమె వచ్చి దివ్యాంబరధారి, కమలదళాక్షుడు, నరలోక సుందరుడు అయిన ప్రద్యుమ్నుని చూచి మూర్ఛితురాలయింది. మెల్లగా ఆమె తేరుకొని తన కరకమలములలో ఉన్న రత్నమాలను ప్రద్యుమ్నుని మంగళ గళసీమలో అలంకరించింది.

విద్యాధర ప్రభువైన సుకృతి మహారాజు తన కుమార్తె సుందరిని ప్రద్యుమ్నుని చేతిలో ఉంచాడు. మంగళ వాద్యములు మారుమ్రోగాయి. ఆ కళ్యాణఘట్టం సకల శుభాస్పదమై అలరారింది. ఇది సహింపలేని కొందరు ప్రద్యుమ్నునిపై ఆగ్రహించి పోరుకు సిద్ధమాయ్యరు. ప్రద్యుమ్నుడు తనకు కృష్ణపరమాత్ముడు ప్రసాదించిన ధనుర్బాణములతో ప్రతిపక్షమువారి అస్త్రశస్త్రములను ఛిన్నాభిన్నం చేశాడు. వారంతా పరాజితులై నిష్క్రమించారు.

ఈవిధంగా ప్రద్యుమ్నుడు స్వయంవరంలో విజయుడై సోదరులు, యాదవులు, సైనికులు, మంత్రులతో సహితంగా విజయోత్సాహంలో భరతఖండములోనికి ప్రవేశించాడు. కృష్ణనందనుడు మార్గమధ్యంలో అనేక దేశములు చూస్తూ ఆనర్త ప్రదేశంలోని ద్వారకకు చేరుకున్నాడు.

**పునరాగమనము :**

అంతకు ముందుగానే ప్రద్యుమ్నుని చేత పంపబడిన ఉద్ధవుడు ద్వారకకు వచ్చి జంబూద్వీపము నంతటిని ప్రద్యుమ్నుడు జయించిన విజయ గాథలను వివరించి చెప్పాడు. ఉగ్రసేనుడు, బలరామకృష్ణులు ఎదురేగి ప్రద్యుమ్నుని సముచిత సుంద రంగా ఆహ్వానించారు. వేదఘోష, గీతవాద్యధ్వని శ్రుతిహితములై అల రారినాయి. అప్సరసల నాట్యం మనసులను అలరించింది. మత్తేభంపై అధివసింప చేసి ప్రద్యు మ్నుణ్ణి ద్వారకానగంలోనికి ప్రవేశపెట్టారు. మీన కేతనుడైన ప్రద్యు మ్నుడు ఉగ్రసేన, బలరామకృష్ణులకు అభివందనం గావించాడు. గర్గాచార్యులకు ప్రణామములు చేశాడు. ఉగ్రసేనుడు ప్రద్యుముని పరాక్రమమును అనేక విధములుగా ప్రశంసించాడు. ద్వారకా నగరమంతటా ఆనందోత్సాహములు వెల్లివిరిశాయి.

అనంతరము ధర్మాత్ముడైన ఉగ్రసేనుడు కృష్ణపరమాత్ముని అను గ్రహంతో రాజసూయ యాగమును ఆరంభింప సంకల్పించాడు. యదుకుల ఆచార్యుడు గర్గమహర్షి ముహూర్తమును నిర్ణయించాడు. ఆ యజ్ఞమునకు ఋషులు, మునులు, బ్రాహ్మణులు పుత్రులతో శిష్యులతో విచ్చేశారు. వేదవ్యాసుడు, శుకదేవుడు, పరాశరుడు, మైత్రేయుడు, పైలుడు, సుమంతుడు, దుర్వాసుడు, వైశంపాయనుడు జైమిని, పరశురాముడు, దత్తాత్రేయుడు, అసిత, అంగిరా, వామదేవ, అత్రి, వసిష్ఠ, కణ్వ, విశ్వామిత్ర, శతానంద, భరద్వాజ, గౌతమ, కపిల, సనకాదులు, విభాండ, పతంజలి, ద్రోణ, కృప,శాండిత్యాదులు, బ్రహ్మ, శివ, ఇంద్రా దులు, హనుమంతుడు, జాంబవంతాదులు విచ్చేశారు.

ఉగ్రసేన మహారాజు ద్వారకామండలంలోని పిండారక క్షేత్రంలో పంచ యోజన విస్తీర్ణమగు యజ్ఞకుండమును, ఒక యోజన విస్తీర్ణమగు బ్రహ్మ

కుండమును నిర్మింప జేసి గర్గాచార్యులవారి అధ్వర్యవములో రాజసూయ యాగమును ఆరంభించాడు. భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దాశార్హ వంశీయులలోని యాదవులతో ఉగ్రసేనుడు దేవతల మధ్య మహేంద్రుని వలె ప్రకాశింపసాగాడు. పరమాత్మ తన విభూతులతో విలసిల్లుతున్నాడా అన్నట్లుగా యజ్ఞేశ్వరుడైన శ్రీకృష్ణ పరమాత్మ ఆ యజ్ఞంలో తన కుమారులతో, మనుమలతో వైభవోపేతుడై తేజరిల్లుతున్నాడు.

తన ధర్మపత్ని రుచిమతితో కలిసి ఉగ్రసేనుడు పిండారక తీర్థంలో అవభృథ స్నానం చేశాడు. అంతరిక్షంలో దుందుభులు మ్రోగాయి. దేవతలు వారిపై పూలవాన కురిపించారు. స్వర్ణాలంకార విభూషితములైన లక్షలాది మదగజములను, అశ్వ రాజములను, స్వర్ణాభరణములను ఉగ్రసేనుడు దానధర్మములు గావించాడు. గర్గాచార్యులవారికి విలువైన హారములు, వస్త్రములు, గృహోపకరణములను ప్రసాదించాడు. దేవతలు తమ యజ్ఞభాగములను పొంది సంతుష్టులయ్యారు. ఆవాహన గావింపబడిన తీర్థరాజములు, సముద్రములు తృప్తిపొంది మరల తమ తమ స్థానముల కేగినాయి.

కృష్ణపరమాత్ముడు నందాది ముఖ్య గోపకులను స్వయంగా పూజించాడు. రాజసూయ యజ్ఞం మంగళ ప్రదంగా నెరవేరింది. "యత్ర శ్రీకృష్ణచంద్రోస్తి తత్రకిం సఫలం నహి?" శ్రీకృష్ణచంద్రుడు ఉన్నచోట కార్యము సఫలముకాకుండా ఎలా ఉంటుంది?



# 8. బలభద్ర ఖండము

**బలరాముని అవతారము :**

బహుళాశ్వమహారాజు నారదునితో "ఓ మహర్షీ! అమృతతుల్యమైన విశ్వజిత్ ఖండమును వీనులారా విన్నాను. శ్రీకృష్ణపరమాత్మకు అష్టమహిషీ మణులయందు, పదహారువేల గోపికల యందు తనయులు, మనుమలు జనించినారు గాని మహాత్ముడైన బలరామునకు రేవతీసతియందు కుమారులు ఎందువల్ల కలుగలేదో తెలుపవలసినది" అని అడిగాడు. అప్పుడు నారదమహర్షి "మహారాజా! ఇదివరకు ఒక పర్యాయము దుర్యోధనుడు తన అంతఃపురమునకు విచ్చేసిన ప్రాడ్విపాక మహర్షిని ఆదరించి "మహాత్మా! సంకర్షణుడైన బలరాముడు ఏ కారణం వల్ల ఈ భూమండలంపై అవతరింపవలసి వచ్చింది? ఆయన నాకు గదాయుద్ధమును నేర్పిన గురువు. వారి ప్రభావమును నాకు వివరింపుమని" అడిగినప్పుడు ఆమహర్షి చెప్పిన సమాధానమును ఇప్పుడు నీకు వివరిస్తాను విను" అని ఈవిధంగా చెప్పసాగాడు - యదువీరుడైన బలరాముని దివ్య చరిత్ర పాపహరమైనది. ద్వాపరాంతములో బ్రహ్మాది దేవతల ప్రార్థనపై గోలోకనాథుడు తాను యదువంశంలో కృష్ణుడుగా అవతరింప నిశ్చయించుకున్నాడు.

అనంతరము పరమాత్మ సహస్ర ఫణి ఫణ విరాజితుడైన అనంతునిచూచి "ఓ అనంతా! నీవు ముందుగా వసుదేవుని పత్నియైన దేవకి గర్భములో ప్రవేశించు. తరువాత రోహిణి గర్భములోనికి ఆకర్షింపబడి రోహిణీ తనయుడుగా ఆవిర్భవించు. తరువాత నేను దేవకి కుమారునిగా అవతరిస్తాను" అని పలికాడు. వైకుంఠనాధుని మాటను విని అనంతుడు భువికి వెళ్ళటానికి సిద్ధమౌతున్నాడు. అప్పుడు తాళ ధ్వజముతో కూడిన దివ్యరథమును సుమతి అనే సారధి సిద్ధపరచాడు. ముసలాయుధము, హలాయుధము, దివ్యకవచములు వచ్చినిలిచాయి. రమావైకుంఠ ధామం నుంచి శేషుడు వచ్చి సంకర్షణునిలో విలీనమయ్యాడు. అజితవైకుంఠ పదం నుంచి శేషుడువచ్చి సంకర్షణునిలో విలీనమయ్యాడు. అదేవిధంగా శ్వేతద్వీపం నుంచి, ఇలావృత వర్షం నుంచి, పాతాళ లోకంనుంచి శేషనాగులు వచ్చి సంకర్షణునిలో ఐక్యమయ్యారు.

సహస్ర ఫణములుగల అనంతుడైన ఆ సంకర్షణుడు సిద్ధ పార్షదులను చూచి "భూభారం తొలగించటానికి నేను భూమండలమునకు వెళుతున్నాను. అందువల్ల మీరంతా వెళ్ళి యదువంశంలో జన్మించండి. ఓ సుమతీ! సారధీ! నీవు బలవంతుడవు. శూరుడవు. నీవు ఇచటనే ఉండు. ఎంతమాత్రము బాధపడవద్దు. యుద్ధ సమయంలో నేను ఎప్పుడు నిన్ను స్మరిస్తానో అప్పుడు తాళధ్వజ సమన్వితమైన దివ్యరథంతో నీవు భూమండలమునకు రా. ఓ హలాయుధమా! ఓ ముసలాయుధమా! నేను మిమ్మల్ని తలచుకొన్నప్పుడు నా సన్నిధికి రండి" అనిపలికాడు.

ఆ తరువాత అనంతుడు నాగకన్యాయూథమును చూచి "మీ అభిప్రాయం నాకు తెలుసు. మీరు తపస్సు చేసి గోపకుల గృహములలో జన్మించి నా దర్శనం పొందండి. కాళిందీ నదీ తీరంలో మనోహర రాసమండలంలో మీతో రాసనృత్యం చేసి మీ మనోరథం నెరవేరుస్తాను" అని పలికాడు. ఆ పిమ్మట నివాతకవచుల అధిపతియైన కలి మహారాజు వచ్చి అనంతునకు పాదాభివందనం చేసి "ప్రభూ! నేనేకార్యమును నెరవేర్చవలసియున్నదో ఆజ్ఞాపించండి. మీరు ఎక్కడకు వెళితే నేను కూడా అక్కడకే వస్తాను. మీరు లేకుండా నేనిక్కడ ఉండలేను" అని ప్రార్థించినప్పుడు అనంతుడు కలిరాజుతో "నీవు కూడా నాతో భారతవర్షమునకురా. నీవు అక్కడ కౌరవకులంలో ధృతరాష్ట్రుని కుమారునిగా జన్మించి దుర్యోధనుడనే పేరుతో పిలువబడతావు. అప్పుడు నేను నీకు గదాయుద్ధం నేర్పుతాను" అని చెప్పిపంపాడు. ఆ కలియే తరువాత దుర్యోధనుడుగా జన్మించాడు. కాని ఆ విష్ణుమాయ వల్ల దుర్యోధనునకు ఆవిషయం గుర్తులేదు.

ఆసమయంలో ఆ సభలోనికి నాగలక్ష్మి వచ్చి "ప్రాణనాథా! నేను మిమ్ములను విడిచి ఉండలేను. నేను కూడా మీతో భూమండలమునకు వస్తాను" అని ప్రార్థించింది. అప్పుడు అనంతుడు ఆమెతో "ప్రాణసఖీ! బాధపడకు. నీవు భూలోకము వెళ్ళి రేవతి అనే కన్యలో విలీనమవ్వు. అప్పుడు నీవు నన్ను పొందగలవు" అని ఆమెను ఊరడించాడు. నాగలక్ష్మి ఆమాటలను విని "రేవతి ఎవరు? ఆమె వృత్తాంతం ఏమిటి?" అని అడిగింది.

### జ్యోతిష్మతి ఉపాఖ్యానము

అప్పుడు అనంతుడు ఈవిధంగా వివరింపసాగాడు పూర్వము సృష్టి ఆరంభములో

కద్రువకు కశ్యపప్రజాపతి వల్ల నేను కుమారునిగా జన్మించాను. అప్పుడు వైకుంఠాధిపతి ఆజ్ఞవల్ల నేను నా వేయిపడగలలో ఒక పడగపైన ఈ విశ్వము నంతటినీ భరించాను. ఆరోజులలో చక్షుషుని కుమారుడు అతిబలవంతుడు అయిన చాక్షుషుడనే మనువుసప్తద్వీపమయ అఖండ పృథ్వీస్థలికి సమ్రాట్టు అయినాడు. ఆయనకు సుద్యుమ్నాది అనేకులు కుమారులు జన్మించారు. ఆ మనువు చేసిన ఒక యజ్ఞంలో యజ్ఞకుండంనుంచి జ్యోతిష్మతీ అనే పేరుగల కుమార్తె ఆవిర్భవించింది. ఆమె యుక్తవయస్కురాలయిన తరువాత తండ్రి స్నేహవశంవల్ల కుమార్తెను "నీకు ఎటువంటి వరుడు కావాలి చెప్పు" అని అడిగాడు. అప్పుడు ఆమె "విశ్వమంతటిలోను బలాఢ్యుడైనవాడు నాకు వరుడు కావాలి" అని చెప్పింది.

మనువు వెంటనే దేవతల అధిపతియైన ఇంద్రుడు సర్వశక్తిమంతుడని భావించి ఇంద్రుని పిలిపించి ఆదరంతో "లోకంలో నీకన్నా వేరెవరైనా బలవంతుడు ఉన్నాడా? నిజంచెప్పు" అని అడిగాడు. అప్పుడు ఇంద్రుడు "నాకన్నా వాయుదేవుడు బలవంతుడు. నేను ఆతని సహాయంతోనే కార్యములు నెరవేరుస్తుంటాను" అని పలికి వెళ్ళిపోయాడు. మనువు వాయుదేవుని పిలిచి అడిగాడు. అప్పుడు వాయుదేవుడు "నాకన్నా పర్వతరాజు అధికుడు. నేనెంత బలవంతుడనయినా పర్వతమును ఎంతమాత్రము కదపలేనుగదా' ' అన్నాడు. మనువు పర్వతుని పిలిచి అడిగితే ఆతడు "నాకన్నా భూమండలము బలవత్తరమైనది" అన్నాడు. మనుమహారాజు భూమిని పిలిచి అడుగగా "నన్ను భరించే ఆదిశేషుడు నాకన్నా బలవంతుడు. ఆతడు అనంత గుణములచేత విరాజిల్లుతూ అనంతుడని కూడా పిలువబడుతున్నాడు. ఆయనకు సహస్రముఖములు. ఆయన ఒక పడగపై అఖండ భూమండలం నిలిచిఉన్నది. ఆయనకు సాటి వేరొకరు లేరు" అని పలికాడు.

తరువాత జ్యోతిష్మతి నా (అనంతుని) ప్రభావం గ్రహించి, తండ్రి ఆజ్ఞతో నన్ను పొందటం కోసం వింధ్య పర్వతం పై తపస్సు చేయటం ఆరంభించింది. యువతి, సౌందర్యవతియైన జ్యోతిష్మతిని చూచి ఇంద్రాది దిక్పాలకులచటకు వచ్చారు. ఆమె సహస్రవదనుడనైన నన్ను వరునిగా కోరుకున్నదని తెలిసి వారు హేళన చేసి ఆమె పట్ల తమకుగల వలపును వ్యక్తపరచారు. ఆమాటలను విని జ్యోతిష్మతి అగ్రహావేశయై వారి క్కొక్కరికి ఒక్కొక్క శాపమిచ్చింది. శప్తుడైన ఇంద్రుడు క్రోధంతో

"జ్యోతిష్మతీ! నీవు సంకర్షణుణ్ణి పతిగా పొందినప్పటికీ నీకు కుమారులు కలుగ కుండుగాక" అని ప్రతిశాపమిచ్చి వెళ్ళిపోయాడు. జ్యోతిష్మతి మరల తపస్సులో మునిగిపోయింది. అప్పుడు విధాతవచ్చి "నీ తపస్సుకు మెచ్చుకున్నాను. నీకు ఏవరం కావాలో చెప్పు" అని అడిగాడు. అప్పుడామె "భగవాన్! నాపై దయతో నాకు సహస్రవదనుడైన అనంతుణ్ణి వరునిగా ప్రసాదించు" అని వేడుకున్నది. అందుకు విధాత "పుత్రీ! నీకోరిక దుర్లభమైనది, అయినా నేను తప్పక నెరవేరుస్తాను. ఈరోజునుంచే వైవస్వత మన్వంతరం ఆరంభమయింది. ఇక ఇరువదియేడు చతుర్యుగములు గడిచిపోయిన తరువాత సంకర్షణుడు నీకు పతికాగలడు" అని పలికాడు. జ్యోతిష్మతి ఆమాటలను విని విధాతతో "స్వామీ! మీరు సర్వసమర్థులు, అందువల్ల అంతటి సమయంకాకుండగా శీఘ్రంగా నా మనోరథం నెరవేర్చండి లేకపోతే దేవతలను శపించినట్లు మిమ్మల్ని కూడా శపింపవలసివస్తుంది" అని పలికేటప్పటికి ఆమె శాపమునకు విధాత భయపడి "ఓ రాజకుమారీ! నీవు ఆనర్త దేశంలో కుశస్థలిలో ఉన్న రేవతుడనే రాజుకు కుమార్తెగా జన్మించు. ఈజన్మలోనే నీ కోరిక నెరవేరుతుంది. ఇరవై ఏడు చతుర్యుగములు నా ప్రభావంవల్ల ఒక్క ఘడియగా గడిచిపోతాయి" అని పలికి అదృశ్యమయ్యాడు.

అనంతరం జ్యోతిష్మతి ఆనర్తదేశంలోని కుశస్థిలిలో రేవత మహారాజు కుమార్తెగా జన్మించి రేవతి అని పేరుపొందింది. ఆమె యుక్తవయస్కురాలయిన తరువాత తండ్రి ఆమెతో "నీవు ఎటువంటి వరుని కోరుకొంటున్నావు?" అని అడిగాడు. రేవతితండ్రితో "ఈవిశ్వమంతటిలోను బలవంతుడు నాకువరుడు కావాలి" అని పలికింది. అప్పుడు రేవతుడు భార్యతో, కుమార్తెతో కలిసి దీర్ఘాయులైన, బలవంతువైన వరుని కోసం అన్వేషిస్తూ బ్రహ్మలోకం చేరుకున్నాడు. అక్కడ ఒక ఘడియసేపు గడిపాడు. ఇంతలో భూలోకంలో ఇరవైఏడు చతుర్యుగములు పరిసమాప్తమయినాయి అని ఈవిధంగా అనంతుడు నాగలక్ష్మితో చెప్తూ" ఆ రేవతి ఇప్పుడు కూడా బ్రహ్మలోకంలోనే ఉన్నది. నీవు ఆమెలో ప్రవేశించు. తరువాత ద్వారకలో నాతో సుఖంగా ఉండవచ్చు" అని ధైర్యం కలిగించాడు. అప్పుడు నాగలక్ష్మి సంకర్షణుని మాటలను విని బ్రహ్మలోకం వెళ్ళి రేవతీ విగ్రహంలో ప్రవేశించింది. తరువాత సంకర్షణుడు గోలోకధామం నుంచి వచ్చి బలరాముడుగా భువిమీద అవతరించాడు.

ఒక పర్యాయం గర్గమహర్షి యమునాతీరంలో ఒక నికుంజం క్రింద ఏకాంతంగా కూర్చొని బలరామకృష్ణులను ధ్యానింపసాగాడు. అదేసమయంలో కొందరు గోపికలు వచ్చి మహర్షికి ప్రణామం చేశారు. అప్పుడు వారికి తాము పూర్వజన్మలో నాగకన్యలమనే అద్భుతస్ఫురణ కలిగింది. అప్పుడు వారు బలరాముని అనుగ్రహం పొందటం కోసం ఏయే సాధనలు చేయవలెనని గర్గమహర్షిని అడిగారు. వారి అనుపమానమైన భక్తిని చూచి వారి మనోరథసిద్ధి కోసం గర్గమహర్షి వారికి బలభద్ర పూజాపద్ధతి, పటలము, స్తోత్రము, కవచము, సహస్రనామములను పంచాంగములను ప్రబోధించాడు. వారు మంత్రసిద్ధిని పొందారు.

## బలరాముని రాసక్రీడ

ఒకపర్యాయం వ్రజంలోని సుహృద్ బాంధవుల నందరినీ చూడవలె ననిపించి బలరాముడు తాళధ్వజంతో విలసిల్లే రథంపై ద్వారకనుంచి బయలుదేరి వచ్చాడు. గోవులతో, గోపాలకులతో, గోపికలతో నిండియున్న గోకులంలో ప్రవేశించాడు. యశోదానందులు కూడా చాలా కాలంగా బలరాముణ్ణి చూడవలెననే కాంక్షతో ఉన్నారు. బలరాముణ్ణి చూసీ చూడటం తోనే యశోదానందులు వచ్చి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు. తరువాత బలరాముడు గోవులను, గోపకాంతలను, గోపాలకులను కలిసి కొని వసంతకాలం రెండునెలలూ అక్కడే ఉండటానికి నిశ్చయించుకున్నాడు.

ఆరోజు చైత్రపూర్ణిమ. అరుణరాగరంజితుడై చంద్రుడు ఆ వనమునంతటినీ రాగ రంజితం చేయసాగాడు. శీతలపవనములు వీస్తున్నాయి. పద్మపరాగములు సర్వత్ర వ్యాపించినాయి. యమునా తరంగములు సన్నని సవ్వడులు చేస్తున్నాయి. కోకిలల మధురస్వరములు, తుమ్మెద ఝంకారములు, నెమళ్ళ క్రేంకారములు వీనుల విందొనరిస్తున్నాయి. ఆసమయంలో నీలాంబరం ధరించి నూపుర, కంకణ, కేయూర, హార, కిరీటాలంకృతుడైన బలరాముడు మనోహరంగా నృత్యం చేయసాగాడు. పూర్వం తాను ఏ నాగకన్యలకు అభయమిచ్చిన ఫలితంగా వారు గోపికలుగా అవతరించారో ఆ గోపకాంతలు బలరాముని చెంతచేరి రాస నృత్యం

చేయసాగారు. ఆ సమయంలో గోపికలతో ఉన్న బలరాముడు యక్షిణులతో నున్న యక్షరాజు వలె విలసిల్లినాడు. ఆనందమయమైన ఆనృత్యంలో అందరూ తన్మయులయ్యారు.

యమునా తీర వనంలో ఈవిధంగా రాసనృత్యోత్సవంలో ఉన్న బలరాముని ముఖ పద్మంపై స్వేద బిందువులు ఉద్భవించాయి. అప్పుడాయన జలక్రీడ చేయ దలచి యమునను పెద్దగా పిలిచాడు. కాని యమున వినిపించుకొనలేదు. అప్పుడు బలరాముడు క్రోధంతో హలాగ్రంతో యమునను ఒక్కసారిగా లాగి "నేను నిన్ను పిలిచినప్పుడు ఎందుకు రాలేదు? నామాటను ధిక్కరించిన నిన్ను ఈ ముసలా యుధంతో ముక్కలు ముక్కలు చేస్తాను" అన్నాడు. ఆ మాటవిని భయకంపితురాలై యమున "ఓ లోకాభిరామా! రామా! సంకర్షణా! బలభద్రా! మహాబాహూ! నీ అనంతమైన బలపరాక్రమములు నేనెరుగనిదానిని. నీవు ఈ భూమండలము నంతటినీ ఆవగింజనువలె శిరసున ధరించిన మహాత్ముడవు. నీపరమప్రభావం ఎరుగని నన్నుక్షమించు" మని ప్రార్థించింది. భక్తవత్సలుడైన బలరాముడు యమునను వెంటనే క్షమించాడు.

గోపకాంతలతో బలరాముడు యమునలో క్రీడించిన అనంతరం తీరము నకు రాగానే యమున బలరామునకు నీలివస్త్రములను, స్వర్ణాభరణములను రత్న మాలను బహూకరించింది. బలరాముడు గోపకాంతలకు స్వర్ణాభరణాలను పంచిపెట్టి తాను నూత్నవస్త్రములను, రత్నమాలను ధరించాడు. హస్తినాపురం వీక్షించినా, వ్రజం దగ్గర మలుపు తిరిగిన యమునానదిని దర్శించినా బలరాముని పరాక్రమం ప్రకటితమౌతూనే ఉంటుంది అని నారదమహర్షి బహుళాశ్వునకు తెలియజేశాడు.

# 9. విజ్ఞాన ఖండము

## సుధర్మ మందిరము

శ్రీకృష్ణ పరమాత్ముడు ద్వారకలో సుధర్మ అనే పేరుగల సభాభవనమును ప్రతిష్ఠించాడు. విశ్వకర్మ వైఢూర్యమణుల స్తంభాలతో అక్కడ పెద్ద మంటపం నిర్మించాడు. అక్కడి నేల పద్మరాగములతో పరిఢవిల్లుతున్నది: అందాలను విరజిమ్ముతున్న ఆ మందిరంలో గంధర్వ కాంతలు గీతాలాపన చేస్తున్నారు. విద్యాధరకాంతలు వాద్యములను శ్రుతిహితంగా పలికిస్తూ నృత్యం చేస్తున్నారు. ఆ మందిరం నాలుగువైపులా దేవతావృక్షాలతో నందన, సర్వతోభద్ర, ధ్రౌవ్య, చైత్రరథ వనములున్నాయి. ఆసభాసదనంలో ప్రవేశించిన వ్యక్తి తనను తాను సర్వశ్రేష్ఠునిగా భావించుకుంటాడు. అక్కడి సింహాసనంపై కూర్చున్నవాడు తనను ఇంద్రసమునిగా తలచుకుంటాడు. అక్కడ ఎంత సమయుండుంటే అంతసమయం ఆకలి, దాహం, శోకం, మోహం, జరా, మృత్యువులనే షడ్విధ వికారాలు ఉండవు. అందులో ప్రవేశించిన వ్యక్తుల సంఖ్యను బట్టి ఆ సభాసదనం పరిమాణం రూపొందుతూ ఉంటుంది. యాదవులు మొత్తం అరవైకోట్లమంది. వారు తమ పరివారంతో సహితంగా ఆ సభలోకి వెళ్ళి కూర్చుంటే ఆసభాసదనంలో నాల్గవ వంతు మాత్రమే నిండినట్లవుతుంది. సాక్షాత్తు కృష్ణపరమాత్ముడు కొలువుదీరే ఆ సభా సదనమును వర్ణించటం ఎవరికి సాధ్యమౌతుంది?

## వ్యాస ఉగ్రసేనుల సంభాషణ

ఒకనాడు ఉగ్రసేన మహారాజు ఆసభలో కొలువుదీరి ఉన్నాడు. అదే సమయంలో మేఘ వర్ణపు శరీర కాంతితో, మెరుపు రంగు శిరోజాలతో ఉన్న వేదవ్యాసుడు ఆకాశమార్గంలో పయనిస్తూ వచ్చి ద్వారకలోని రాజమందిరంలో ప్రవేశించాడు. ఉగ్రసేనుడు అమితానందంతో మహర్షిని ఆహ్వానించి ఆదరించాడు "మహాత్మా! ఈనాడు మీరాక వల్ల నాజన్మ, నా గృహము, నా ధర్మాచరణములు సఫలములయి నాయి. మీవంటి మహాత్ముల క్షేమసమాచారాలే కదా కృష్ణ పరమాత్మ నకు ఆనందం కలిగించేవి. మీరు అడుగుపెట్టిన చోట లౌకిక పారమార్థిక సిద్ధులు వాటంతటవే సిద్ధమై ఉంటాయి. ఎక్కడ మీరు క్షణం సేపు ఉంటారో అక్కడ సాక్షాత్తు శ్రీహరి వచ్చి ఉంటాడు. మహాత్మా! నేనీనాడు ద్వారకానగరా

ధీశునిగా ఉండటానికి పూర్వజన్మలో నేను చేసిన పుణ్యమేమిటి?" అని అడిగాడు ఉగ్రసేన మహారాజు.

అప్పుడు వ్యాసమహర్షి "ఓ మహారాజా! నీవు ధన్యుడవు. పూర్వజన్మలో నీవు మరుత్ మహారాజువి. అప్పుడు నీవు నిష్కామ భావంతో విశ్వజిత్ యజ్ఞం చేశావు. అందువల్లనే నీకీనాడు ఇంతటి సౌభాగ్యం చేకూరింది. శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువే. అనేక బ్రహ్మాండములకు ఆయన అధిపతి. ఆయన సర్వస్వతంత్రు డైనప్పటికీ భక్తికి వశీభూతుడై నీ మందిరంలో నివసిస్తున్నాడు. విచిత్రమైన విషయమేమంటే తనను భజించే వారికి ఆయన ముక్తినిస్తాడు, కాని భక్తిసాధనమును మాత్రము ఇవ్వడు. అందువల్ల భక్తి యోగం చాలా కష్టసాధ్యమైనదని తెలిసికో" అన్నాడు.

అప్పుడు ఉగ్రసేనుడు వ్యాసమహర్షిని చూచి "మహాత్మా! నా సందేహములు కొన్ని మీరు తొలగించండి. సకామ కర్మలవల్ల ఎటువంటి గతి కలుగుతుంది. వాటి లక్షణములేమిటి? అవి ఎన్ని విధాలు? దయతో వివరింపు" మని అడిగాడు. అప్పుడు వ్యాసమహర్షి "మహారాజా! గుణములతో సంబంధం ఉన్న కర్మలన్నీ సకామకర్మలు. ఫలత్యాగం చేస్తే అవే నిష్కామ కర్మలు అవుతాయి. సకామ కర్మలన్నీ బంధాలే. నిష్కామకర్మలన్నీ మోక్ష కారకములే. అందువల్లనే అవి మంగళమయములుగా పరిగణింపబడుతున్నాయి.

ప్రకృతి నుంచి సత్వ రజ స్తమో గుణములు జనిస్తున్నాయి. విష్ణువుతో సమస్తము వ్యాప్తమయి ఉన్నట్లుగా, గుణములతో విశ్వమంతా వ్యాపించిఉన్నది. సత్వగుణస్థితిలో ప్రాణ పరిత్యాగం చేసిన వారు స్వర్లోకమునకు వెళతారు. రజోగుణ స్థితిలో ప్రాణం వదిలినవారు భూలోకమునకు వస్తారు. తమోగుణస్థితిలో శరీరం వదిలినవారు నరకలోకమునకు వెళతారు. చివర సమయంలో గుణ రహిత స్థితిలో ఉంటే వారు శ్రీకృష్ణపరమాత్మునిలో లీనమౌతారు.

సకామకర్ములు ఈవిధంగా వివిధ లోకములలో తిరుగుతూ ఉంటారు. జీవుడు పుణ్యం ఉన్నంతవరకు స్వర్గలోకంలో విహరిస్తాడు. పుణ్యం పూర్తి కాగానే ఆతడు కోరకపోయినప్పటికీ మరల భూలోకమునకు వచ్చి పడతాడు. అందువల్ల ఓ యాదవేంద్రా! కర్మఫలత్యాగం చేయాలి. జ్ఞాన వైరాగ్యాల వల్ల మనుష్యుడు నిష్కామభక్తుడుగా మారాలి. ప్రేమలక్షణమైన భక్తివల్ల భక్తులకు ప్రీతపాత్రుడై శ్రీకృష్ణుని

చరణకమలాలను ఆరాధించాలి. సమస్త లోకాలను సంహరించే మృత్యువు కూడా భగవద్ధామంలో ప్రవేశింపగానే శాంత మౌతుంది" అని పలికాడు.

అప్పుడు ఉగ్రసేనుడు "మహానుభావా! పునరావృత్తి చెప్పబడిన లోకముల గురించి నాకు ఎంతమాత్రము ఆసక్తిలేదు. కానీ జీవుడు ఏలోకమునకు వెళ్ళి తిరిగి రాడో అది అన్నింటికంటె ఉత్తమమైన స్థానం గదా. కృష్ణపరమాత్ముని ఆ పరంధామం ఎక్కడ ఉంది. నాకు తెలియజేయు"మని ప్రశ్నించాడు. అప్పుడు వ్యాసమహర్షి పునరావృత్తి చెప్పబడని ఆ పరంధామం బ్రహ్మాండముల కన్నింటికీ అవతల ఉన్నది. విజ్ఞులు దానినే గోలోకధామమని అంటారు. ఏబది కోట్ల యోజనముల విస్తీర్ణంగల ఈ బ్రహ్మాండమునకు అవతల బ్రహ్మద్రవమనే పేరుగల అనంత జలరాశి ఉన్నది. ఆ జలరాశిలో ఈబ్రహ్మాండం పరమాణువంతటి పరిమాణంగలది. ఇటువంటి బ్రహ్మాండములు ఆ జలారాశిలో కోట్లకొలది దొర్లుతుంటాయి. ఆ జలరాశి అవతలి తీరంలో గోలోకం ఉంది. అక్కడ సూర్యప్రకాశము కాని, చంద్రుని కాంతి గాని, అగ్ని వెలుగుగాని పనిచేయవు. కామ క్రోధ లోభ మోహములకు అక్కడ స్థానం లేదు. శోకము, జరా మృత్యుపీడలు అక్కడ కనిపింపవు. అక్కడ ప్రకృతిలేదు, కాలము లేదు. ఇంక గుణములక్కడకు ఎలా ప్రవేశింపగలవు? అనిర్వచనీయమైన వేదములు కూడా ఆ లోకమును వర్ణింప సమర్థములు కావు. శ్రీకృష్ణభగవానుని తేజస్సుతో వెలుగొందే అనేకులు పార్షదులు అక్కడ ఉన్నారు. జితేంద్రియులైనవారు, అచంచల భక్తి తత్పరులు, మమతానురాగాలు విడిచిన వారు, సమదర్శనం గలవారు, శ్రీకృష్ణ చరణకమల మకరంద రసపాన నిమగ్నులు మాత్రమే ఆ భగవద్ధామంలో ప్రవేశింపగలరు. ఇందులో సందేహంలేదు" అని పలికాడు.

## భక్తి యోగం

అప్పుడు ఉగ్రసేన మహారాజు "మహాత్మా! భక్తవత్సలుడైన భగవంతుణ్ణి ప్రసన్నం చేసికొనటం ఎలా? భక్తియోగం ఎలా ఉంటుంది?" అని అడిగాడు. అందుకు వ్యాసమహర్షి "ఓ ద్వారకాధీశా! నీవు శ్రీహరిని ఆరాధిస్తుంటావు. శ్రీకృష్ణుడు నీయిష్టదైవము. అందువల్లనే భక్తియోగం గురించి చెప్పమని చక్కని ప్రశ్నను అడిగావు. భక్తియోగం సగుణమని, నిర్గుణమని ప్రధానంగా రెండు విధములు. మరల సగుణం

అనేక భేదాలతో ఉన్నది. నిర్గుణం లక్షణం మాత్రం ఒక్కటే. జీవుల గుణాలను బట్టి సగుణభక్తి వివిధ విధములుగా ఉంటుంది. అందులో మొదటివారు తామసభక్తులు. వీరు భేదభావంతో ఉంటూ, క్రోధంతో, హింసచేసే గుణంతో, దంభమాత్సర్యాలను ఆశ్రయించి శ్రీహరిని ఆరాధిస్తుంటారు. రెండవవారు రాజసభక్తులు. వీరు యశస్సు, ఐశ్వర్యాది వాంఛలతో యత్న పూర్వకంగా శ్రీహరిని ఆరాధిస్తుంటారు. మూడవవారు సాత్త్విక భక్తులు. వీరు కర్మక్షయం కోసం, అభేదదృష్టితో మోక్షం కోసం విష్ణువును ఉపాసిస్తారు. వీరుకాక ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు విష్ణువును భజిస్తుంటారు. భక్తియోగం అనేక ప్రకారములుగా ఉన్నది. భక్తియోగం ద్వారా శ్రీకృష్ణుణ్ణి పూజిస్తే అటువంటి సకామభక్తులు కూడా ఎంతో సుకృతులు, పుణ్యాత్ములు అవుతారు.

ఇక నిర్గుణభక్తి యోగం గురించి విను. గంగా ప్రవాహం సహజంగా సముద్రం వైపు పయనిస్తున్నట్లుగా కేవలం శ్రవణ మాత్రం చేతనే ఎవరి మనస్సులు శ్రీకృష్ణుని వైపు మరలుతాయో అటువంటి వారి భక్తిని నిర్గుణ భక్తి అంటారు. నిర్గుణభక్తుల లక్షణములను విను. అటువంటి భక్తులు రాజ్యములను గానీ, బ్రహ్మపదములను గానీ, ఇంద్రాసనములను గానీ, ఎటువంటి సిద్ధులనుగానీ కాంక్షింపరు. భగవదనురాగమనే ఆనందంతో వారు నిండి ఉండటం వల్ల వారు భగవంతుని చేత ఇవ్వబడిన సాలోక్యముక్తిని కూడా స్వీకరింపరు.

దూరంగా ఉంటే ప్రేమ ఉంటుంది. దగ్గరగా ఉంటే ప్రేమ ఉండదు అంటారు. ఆ విధంగా నిష్కామభక్తులు భగవంతుని విరహంలోనే ఆనందంగా ఉంటారు. అందువల్ల వారు సామీప్యముక్తినీ వాంఛింపరు. భగవంతుడు వారికి సారూప్య ముక్తిని ప్రసాదిస్తే నిరపేక్షులై ఉండటం వల్ల ఆ భక్తులు దానిని కూడా స్వీకరింపరు. భగవంతుడు సాయుజ్యముక్తిని ప్రసాదిస్తే ఆ భక్తులు స్వామికి సేవలకునకు అంతరం లేకుండా పోతుందని భావించి దానిని కూడా స్వీకరింపరు.

పుష్పముల పరిమళం నాసికకే తప్ప కళ్ళకు తెలియదు కదా. అదేవిధంగా నిరపేక్షతా రూపమైన మహానందమును నిష్కామభక్తులు మాత్రమే గ్రహింపగలరు. రసము లను తయారుచేసేవాని హస్తములు రసముల రుచిని గ్రహింపలేనట్లే, సకామభక్తులు ఆ ఆనందమును ఎన్నటికీ గ్రహింపలేరు. ఈ భక్తి యోగము సర్వశ్రేష్ఠమైనది.

## భక్తుని విశిష్టత

శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనము లనే నవవిధ మార్గములలో భగవంతుని ఉపాసన చేయ వచ్చును. నిరంతరం భక్తితో భగవంతుణ్ణి భావిస్తూ ఉండేవాడు జగత్తులో సాధారణంగా లభింపడు. పెద్దలయెడ ఆదరం, పిన్నలయెడ ఆప్యాయత, సమవయస్కుల యెడల మైత్రి, సర్వజీవరాసుల యెడల దయగలవాడు, భగవంతుని స్మరించినంతమాత్రం చేతనే పులకితాంగుడై ఆనందాశ్రువులను రాల్చేవాడు, భగవద్విరహంతో చిక్కిపోయి అనుక్షణం ఆ దైవాన్ని పిలుస్తూ తపించేవాడు భాగవతోత్తముడు. అంటువంటి వారే భగవంతునికి ఇష్టమైన ఉత్తమ భక్తులు.

భూమి, నీరు తేజస్సు, వాయువు, ఆకాశము, నక్షత్రగణములు, సమస్త చరాచరజీవకోటిలో శ్రీకృష్ణుణ్ణి దర్శిస్తూ మాటిమాటికి హర్షం పొందుతూ ఉండేవాడు పిలిచినంతమాత్రంతోనే ఆ పరమాత్ముడు ఆతని ఎదుట సాక్షాత్కరిస్తాడు. ఆనందస్వరూపుడైన ఆ భగవంతుణ్ణి దర్శనం చేసికొని వారు పరమానందంతో చిందులు వేస్తుంటారు. పాటలు పాడుతుంటారు, మౌనంగా ఉంటూ ఉంటారు. అటువంటివాడు భగవంతుని స్వరూపములే. వారిని దర్శించినంతనే మానవులు కృతార్థులౌతారు. కాలము, మృత్యువు కూడా వారిని ఏమీ చేయజాలవు. అటువంటి భక్తులను రక్షిస్తూ సుదర్శనము, గద, శార్ఙ్గధనువు, పాంచజన్యము, నందన మనే కరవాలము, శతచంద్రమనే డాలు, బాణములు అన్నీ రాత్రింబవళ్ళు జాగరూకతతో ఉంటాయి. ఆ భక్తుల శ్రమను గరుడుడు తన రెక్కల గాలితో దూరంచేస్తూ ఉంటాడు. వారు నివసించిన ప్రదేశము తీర్థ స్థలమై ఒప్పారుతుంది. అటువంటి చోటకు ఒక పాపాత్ముడు ప్రవేశించినా ఆతనికీ పరమపదం ప్రాప్తిస్తుంది.

ఎవరికి కృష్ణపరమాత్ముడు ఇష్టుడో, అటువంటి వారి దగ్గరకు ఆధివ్యాధులు, భూతప్రేత పిశాచములు చేరలేవు. అటువంటివారికి నదీనదములు, పర్వత సముద్రములు ఏవైనా దారినిస్తాయి. సాధువులు, జ్ఞానులు, విషయదూరులు, అజాత శత్రువులు అయిన మహాత్ముల దర్శనం పుణ్యాత్ములకు మాత్రమే లభ్యమవుతుంది. అటువంటి వారు ఏకులంలో పుట్టినా ఆ కులం నిర్మలమైతుంది" అన్నాడు వ్యాసమహర్షి.

## మోహ ప్రభావము

అప్పుడు ఉగ్రసేన మహారాజు వ్యాసమహర్షితో "తమరు భగవత్ స్వరూపులు. అర్యా! జీవులన్నిటి యందు పెద్ద మూర్ఖత్వం ఉన్నది. లోభ మోహ మదముల వల్ల జీవులు వివేకం కోల్పోతున్నారు. ఈ జీవులలో వైరాగ్యం కలుగటంలేదు, అందువల్ల వీరు భగవంతుని భజించటంలేదు. జగత్తులోని ఈ మోహశక్తి చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఓ ప్రభూ! ఈ మోహం ఏవిధంగా ఉత్పన్నమయింది? ఇది ఏవిధంగా తొలగిపోతుంది? దయతో తెలియజేయు"మని అడిగాడు.

అందుకు వ్యాసమహర్షి ఇలా చెప్పసాగాడు "ఏవిధంగా చంద్రబింబం నీటిలో ప్రతిఫలిస్తూ చంచలంగా కనిపిస్తుందో అదేవిధంగా వాస్తవంగా పరమప్రభువు యొక్క ప్రతిబింబమే ఈ మాయామయమైన జగమంతా. మాయ, కాలము, అంతఃకరణము, దేహములవల్ల గుణములు ఉత్పన్నమౌతాయి. వీటి ద్వారా మానవుడు వ్యతిరేక కర్మలనాచరించి బంధనంలో పడిపోతాడు. ఇంద్రియాల ప్రభావం వల్ల త్రాడు పాముగా భ్రాంతి గొలుపుతూ ఉంటుంది. ఓ మహారాజా! ఈ జగత్తు మోహమయమై. తమోరజోగుణములతో నిండిపోయి ఉన్నది. అప్పుడప్పుడు సత్త్వగుణం కూడా ఉద్భవిస్తూ ఉంటుంది. ఇది కేవలము మనస్సు యొక్క విలాసము, వికారము, భ్రమ మాత్రమే. ఈ జగత్తంతా పరివతమయ్యే గుణం కలది. "నేనిది చేశాను, నేనది చేశాను. ఇది నాది, ఇది నీది, నేను సుఖంగా ఉన్నాను. నేను దుఃఖంగా ఉన్నాను" అని మానవుడు పలుకుతుంటాడు. ఇది కేవలం మానవుని అహంకార ప్రవృత్తి తప్ప మరొకటి కాదు" అని తెలియజేశాడు.

## పరమాత్మ తత్త్వము

అప్పుడు ఉగ్రసేనుడు "మహాత్మా! ఆ పరమాత్ముని లక్షణములను ఎన్ని విధాలుగా చెప్పవచ్చును?" అని అడిగినప్పుడు వేదవ్యాసుడు "మహారాజా! సనాతనుడైన పరమాత్ముడు జనన మరణములు లేనివాడు. శోక మోహములు ఆయన దరికి కూడా చేరలేవు. ఆయనకు వయః పరిణామం ఉండదు. ఆకలి దాహము, సుఖము, దుఃఖము, భయము రోగము అహంకారము, కామన మొదలైనవి భగవంతునకు సుదూరములైన విషయములు. మునీశ్వరులు గుర్తించిన ఆత్మకు ఆకృతిలేదు, అది నిరీహము, అది సర్వవ్యాప్తము. అది దేహరహితము, అహంకార రహితము.

దానిలో అన్నిగుణములుంటాయి కాని అది గుణాతీతము, నిష్కళంకము, మంగళస్వరూపము, జ్ఞాన స్వరూపము. ఆత్మ జగమంతా నిద్రించిన తరువాత కూడా మెలకువగా ఉంటుంది. దేహధారియైన మానవుడు దానిని గ్రహింపలేడు, కాని ఆత్మకు తెలియనిది లేదు. అదే భగవత్స్వరూపము!

ఆ భగవంతుడు అందరినీ చూస్తుంటాడు. కానీ ఏ ప్రాణీ ఆయనను చూడలేదు. ఆయన గుణములలో ఉన్నాడు, కానీ గుణములాయనకు అంటవు. ఆయన "సత్" శబ్దవాచ్యుడు, ఆయనను కొందరు కర్త అని, కొందరు కర్మ అని, కొందరు కాలమని, కొందరు సౌందర్యమని, కొందరు ఆలోచన అని అంటారు. కానీ వేదవిదులు ఆయనను బ్రహ్మమని అంటారు. ఆ పరబ్రహ్మాను మాయ, ఇంద్రియములు, చిత్తము, మనస్సు, బుద్ధి, మహత్తు ఏదీ గ్రహింపలేదు. వేదములు ఆ పరబ్రహ్మమును సమగ్రముగా వర్ణింపలేవు. అగ్నిలో రవ్వలవలె సమస్త ప్రాణులు ఆ పరబ్రహ్మలో విలీనమవుతాయి.

ఆ పరమాత్ముడు అన్నింటికి పైస్థానములో విరాజిల్లుతుంటాడు. ఆయనను జ్ఞానులు హిరణ్యాగర్భుడని, పరమాత్ముడని, వాసుదేవుడని పిలుస్తుంటారు. ఒకే చంద్రుడు అనేక జలపాత్రలలో వేరువేరుగా కనిపించినట్లు, ఒకే అగ్ని అనేక కాష్ఠములలో నిక్షిప్తమై ఉన్నట్లు, ఒకే ఒక్క పరమప్రభువు తన చేత తయారు చేయబడిన విభిన్న జీవుల లోపల, బయట కూడా విలసిల్లుతున్నాడు. సూర్యోదయం కాగానే అంధకారం పటాపంచలై, ఇంటిలోని వస్తువులన్నీ కనిపించినట్లు జ్ఞానం కలుగగానే అజ్ఞానం అదృశ్యమైపోయి తనలోనే భగవంతుణ్ణి దర్శింప గలుగుతాడు.

ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్క లక్షణము ఉండి ఒక వస్తువు యొక్క గుణమును ఒక్కొక్కటి ఒక్కొక్క విధంగా తెలుపుతాయి. అదేవిధంగా అనంతుడైన పరమప్రభువైన భగవంతుని తేజోమయస్వరూపం ఒక్కటే. మహర్షులు ఆ భగవంతుణ్ణి అనేక శాస్త్రములలో అనేక విధములుగా వర్ణించారు. ఆపురుషోత్తముడే ఈశ్రీకృష్ణుడు! ఈయన సాక్షాత్తు శ్రీహరి!" అని ఈవిధంగా చెప్పి వేదవ్యాస మహర్షి యాదవులందరూ చూస్తూ ఉండగానే అంతర్ధానమయ్యాడు అని నారదమహర్షి బహుళాశ్వునకు తెలియజేశాడు.

# 10. అశ్వమేధ ఖండము

గర్గమహర్షి మొదట ఈ గ్రంథమును తొమ్మిది ఖండములతోనే రచించాడు. ఆతరువాత ఉగ్రసేనుడు వైభవంగా నిర్వహించిన అశ్వమేధయాగం చూచినప్పుడు, ఆయనకు దానిని గురించి చెప్పాలనిపించింది. అనంతరకాలంలో మధురను పరిపాలించిన వజ్రనాభునితో సమావేశమైనప్పుడు ఆ మహారాజు అడుగగా గర్గమహర్షి ఆవృత్తాంతమును, మరికొన్ని సన్నివేశములను వివరించిచెప్పాడు. అదే ఈ అశ్వమేధఖండము.

**వజ్రనాభుడు :**

యాదవ పురోహితుడు, బుద్ధి విశారదుడు అయిన గర్గమహర్షి ఒకసారి మధురానగరం పరిపాలిస్తున్న వజ్రనాభుని దగ్గరకు వెళ్ళాడు. గర్గమహర్షిని చూడటంతోటే వజ్రనాభుడు ఆదరంతో ఆహ్వానించాడు. పదహారు సంవత్సరాల ప్రాయంతో నూరు సింహముల పరాక్రమంతో తేజరిల్లుతున్న వజ్రనాభుడు గర్గమహర్షిని చూచి "గురువర్యా! తమ దర్శనం వల్ల నేను ధన్యుడనయ్యాను. మీరు భగవత్స్వరూపులు. మీ దర్శనం సామాన్యులకు దుర్లభమయినటువంటిది. అటువంటిది విషయాసక్తుడనైన నావంటి వానికి మరింత దుర్లభం కదా" అని పలికాడు. గర్గమహర్షి యదుశ్రేష్ఠుడైన వజ్రనాభునితో "ఓ మహారాజా! యదువంశ శిరోమణీ! నీవు భూతలమునంతటినీ చక్కగా ధర్మ సమ్మతంగా పరిపాలిస్తున్నావు. విష్ణురాతుడైన పరీక్షిత్తు నీకు మిత్రుడు. రాజులందరూ నీకు వశమై ఉన్నారు. నీవు ధన్యుడవు, నీ మధురాపురి ధన్యమైనది, నీ ప్రజమండలం ధన్యమైనది, నీ ప్రజలు ధన్యులు. శ్రీకృష్ణ, బలరామ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను భజిస్తూ నిర్భయంగా రాజ్యపరిపాలన చెయ్యి" అని చెప్తున్న సమయంలో తన తండ్రి శ్రీకృష్ణుడు, తాత వసుదేవుడు, పెదతండ్రి బలరాముడు గుర్తుకువచ్చి వజ్రనాభునకు దుఃఖాశ్రువులు పొంగిపొరలాయి. అశ్రుముఖుడైన మహారాజును చూచి గర్గమహర్షి నెమ్మదితో ఊరడించాడు.

వజ్రనాభుడు గర్గమహర్షితో "శ్రీకృష్ణుడు, సంకర్షణుడు యాదవప్రముఖులు నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయారు. ఈ ప్రభుత్వము, ధనాగారము, సేన, కోటలు వీటితో నాకెంత మాత్రము ఆనందం కలుగటం లేదు. నేను కృష్ణపరమాత్ముని చరిత్రను చూడలేదు. వినలేదు. నేను కేవలం యాదవుల వినాశమును మాత్రమే చూశాను. ఆ విచారం నా మనస్సు నుంచి తొలగిపోవటం లేదు. పరమాత్మునితో

శోభిల్లిన ద్వారకాపురి కూడా సముద్రంలో మునిగిపోయింది. ద్వారకాధీశుడు నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. నేను ఎందుకోసం ఎవరికోసం జీవించాలి? సమస్తం పరిత్యజించి ఏ వనముకైనా వెళ్ళాలనిపిస్తున్నది" అని పలుకగా గర్గమహర్షి వజ్రనాభునితో "ఓ వృష్ణి వంశ మహారాజా! శోకవినాశకమైన, పాపహరమైన నామాట విను. శ్రీకృష్ణ పరమాత్ముడు పూర్వం ద్వారకాపురిలో విరాజిల్లేవాడు, కాని ఇప్పుడు ఆ పరమాత్ముడు సర్వత్ర నిండిఉన్నాడు! నీవు భక్తి దృష్టితో చూడు. నీకు భక్తి ముక్తి ప్రదాయకమైన కృష్ణకథామృతము నందిస్తాను" అని పలికి గర్గమహర్షి వజ్రనాభునకు తాను రచించిన ఈ గర్గసంహితలోని తొమ్మిది ఖండములను తొమ్మిది రోజులలో వినిపించాడు.

## పారిజాత వృత్తాంతము:

ఆ సందర్భంలో వజ్రనాభుడు పారిజాతాపహరణ వృత్తాంతమును విశదంగా చెప్పుమనగా గర్గమహర్షి ఇలా పలుకసాగాడు - ఒకరోజున నారదమహర్షి వచ్చి కృష్ణపరమాత్మునకు ఒక పారిజాతపుష్పం సమర్పించాడు. ఆయన దానిని రుక్మిణికి బహూకరించాడు. అందువల్ల సత్యభామకు చాలా దు:ఖం కలిగింది. ఆమె కుపితురాలై వెళ్ళి కోపభవనంలో కూర్చున్నది. అప్పుడు శ్రీకృష్ణుడామె మందిరమునకు వెళ్ళి "ప్రియా! దు:ఖించవద్దు. నేను నీ కోసం పారిజాత వృక్షమునే తెచ్చిఇస్తాను" అని ఊరడించాడు.

అదే సమయంలో ఇంద్రుడు వచ్చి కృష్ణపరమాత్మునితో భౌమాసురుని (నరకాసురుని) దుష్కృత్యములనన్నింటినీ వివరించి చెప్పాడు. అప్పుడు పరమాత్ముడు ఇంద్రునకు అభయమిచ్చి తాను వచ్చి ఆ నరకాసురుని సంహరిస్తానని మాట ఇచ్చాడు. ప్రస్తావ వశముగా సత్యభామ పారిజాత వృక్షమును తనను అడిగినదని అన్నాడు. ఆమాటను విని ఇంద్రుడు "పరమాత్మా! నీవు ఆ నరకాసురుని సంహరించి నందనవనంలోని పారిజాతవృక్షములనన్నింటినీ స్వీకరించు" అని అన్నాడు. శ్రీకృష్ణుడు సత్యభామతో గరుడవాహనంపై బయలుదేరి నరకాసురుడు నివసించే ప్రాగ్జ్యోతిష పురంవెళ్ళాడు. అక్కడ అగ్ని, జల, వాయు సంబంధములైన సప్త దుర్గములను శ్రీకృష్ణుడు తన ఆయుధములతో ధ్వంసమొనరించాడు. తనను ఎదిరించిన మురాసురుణ్ణి, అతని కుమారులను సంహరించివేశాడు. ఆతరువాత సేనాసమేతంగా శస్త్రాస్త్రములతో వచ్చిన నరకాసురుణ్ణి శ్రీకృష్ణుడు తన చక్రంతో ఖండించివేశాడు. ఈలోపునే

వనపాలకులు వెళ్ళి ఇంద్రాణికి తెలియజేశారు. ఇంద్రాణి ఆగ్రహించి ఇంద్రుణ్ణి వెళ్ళి అడ్డగించమని పురికొల్పింది. కాని ఇంద్రుడు శ్రీకృష్ణునితో పోరుకు సుముఖత చూపలేదు. చివరకు ఇంద్రాణి బోధకు తలయొగ్గి ఇంద్రుడు వజ్రపాణియై, ఐరావతంపై బయలుదేరాడు. దేవతల లంతా ఆయుధపాణులై వచ్చారు. వారిని చూచి శ్రీకృష్ణుడు పాంచజన్యము నూది, వారిపై శరవర్షమును కురిపించాడు. గరుడుడు తన ముక్కుతో, రెక్కలతో, కాలిగోళ్ళతో శత్రువులను పీడింపసాగాడు. ఇంద్ర ఉపేంద్రుల సంగ్రామం క్రమంగా తీక్ష్ణమయింది. చివరకు మహేంద్రుడు శ్రీకృష్ణునిపై వజ్రాయుధమును ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు దానిని తన ఎడమ చేతితో పట్టుకున్నాడు. ఇంద్రుడు భీతుడై రణరంగంనుంచి పారిపోసాగాడు. ఇంద్రాణి ఆగ్రహంతో రణస్థలికి రావటం చూచి బృహస్పతి ఆమెతో "శ్రీకృష్ణుడు సాక్షాత్తు నారాయణుడు, పరాత్పరుడు, పరమాత్ముడు. నీవు వెంటనే వారడిగిన పారిజాత వృక్షమును వారికిచ్చి శరణువేడి వెనుకకు తిరిగి వెళ్ళటం క్షేమం" అని హితవు పలికాడు. అప్పుడామె సిగ్గుపడి పశ్చాత్తాపంతో సత్యాకృష్ణులకు ప్రణామం చేసింది.

శ్రీకృష్ణుడు ఇంద్రునితో "నేను కేవలం మానవుణ్ణి. పారిజాతమును సత్యభామ కోరిందని ఈ విధంగా వచ్చి నీతో యుద్ధం చేశాను. నీవు దేవతలకు అధిపతివి. నీవు నన్ను క్షమించు" అన్నాడు. అప్పుడు ఇంద్రుడు "పరమాత్మా! నీవు ఎందుకు నన్ను మాయలో పడవేస్తావు? నీవు జగద్రక్షకుడవు. నీవు ఈ పారిజాతమును ద్వారకకు తీసికొనివెళ్ళు. నీవు భూలోకములో ఉన్నంత కాలం ఈ వృక్షం భూలోకంలో ఉంటుంది. తరువాత ఇది స్వర్లోకమునకు వస్తుంది" అని పలికాడు. శ్రీకృష్ణుడు సత్యభామతో పారిజాతంతో సహా ద్వారకకు విచ్చేశాడు అని తెలియజేశాడు గర్గమహర్షి.

## అశ్వమేధ యాగము

గర్గమహర్షి వజ్రనాభునితో ఇలా చెప్పసాగాడు - మహారాజా! ఒకసారి నారదమహర్షి ద్వారకలోని ఉగ్రసేన మహారాజు కొలువుకూటానికి వచ్చాడు. ఉగ్రసేనుడు నారదమహర్షిని ఎంతో భక్తితో ఆదరించాడు. అప్పుడు శ్రీకృష్ణప్రేరితుడై నారదుడు ఉగ్రసేనునితో - ఓ యాదవేంద్రా! నీభక్తికి అధీనమై బలరామకృష్ణులు వచ్చి ఈ భువిపై నివసిస్తున్నారు. నీవు పూర్వం శ్రీకృష్ణుని అనుగ్రహం వల్ల రాజసూయ యాగం పూర్తి చేశావు. రాజసూయ, అశ్వమేధయాగములు పెద్దపెద్ద మండలేశ్వరులు

కూడా నిర్వహింపలేరు. అవి కేవలం భగవద్భక్తి గలవారికి మాత్రమే సాధ్యమయ్యేవి. వాటిల్లో నీవు రాజసూయ యాగం చేశావు. తరువాత శ్రీకృష్ణుని ఆనతిపై ధర్మరాజు కూడా రాజసూయయాగం చేశాడు. కానీ ద్వాపరాంతంలో భారతవర్షంలో అశ్వమేధయాగం చేసినవారు లేరు. అశ్వమేధము సర్వశ్రేష్ఠమైన యజ్ఞము. దానిని శ్రీకృష్ణుని అనుగ్రహంతో నీవు నిర్వహించు'' మని పలికాడు. దేవర్షి మాటలను విని ఉగ్రసేనుడు అశ్వమేధయాగం చేయాలని సంకల్పించాడు. అదేసమయంలో అక్కడకు బలరామకృష్ణులు రావటం చూచి ఉగ్రసేనుడు ఆనందభరితుడై ఎదురేగి వారిని ఆహ్వానించి ఆదరించాడు.

ఉగ్రసేనుడు శ్రీకృష్ణుని చెంతచేరి "దేవదేవా! జగన్నాథా! జగదీశా! నాదొక సందేహము. నాకుమారుడైన కంసుడు వేలాది బాలకులను సంహరింపజేశాడు. వాడు చేసిన పాపములవల్ల నేనెటువంటి నరకలోకములకు వెళ్లవలసివస్తుందోనని బాధకలుగుతున్నది. కుమారులు చేసిన పాపములవల్ల తండ్రికి నరకం ప్రాప్తిస్తుందనీ, తండ్రి చేసిన పాపఫలితమును కుమారులనుభవించాలనీ అంటారు. అందువల్ల నా కర్తవ్యమేమిటి? అశ్వమేధ యాగం చేస్తే సకల పాపములు నివృత్తి అవుతాయని నారద మహర్షి అంటున్నాడు. నీవు అనుగ్రహంతో అనుమతిస్తే నేను అశ్వమేధ యజ్ఞం చేయాలని భావిస్తున్నాను'' అన్నాడు. అందుకు శ్రీకృష్ణుడు సంతసించి "నేను అనేకపర్యాయములు భూభారమును తొలగించాను. కానీ ఇంకా ఆకార్యక్రమమును నిర్వహించవలసిన అవసరము ఉండనే ఉన్నది. నేను విదూరథుణ్ణి సంహరించే సమయంలో ఇకపై నేను రణరంగములో స్వయంగా ఎవరినీ చంపకూడదని నిర్ణయించుకున్నాను. అందువల్ల నీవు చేసే అశ్వమేధ యాగం నాకుమారులచేత, యాదవ వీరుల చేత దుష్ట సంహారమును చేయించవచ్చును'' అని అంటూ "మహారాజా! నాచేతులలో మృతి పొందిన నీ కుమారుడైన కంసునకు వైకుంఠలోకం ప్రాప్తించింది. అదేవిధంగా నాదర్శనం వల్ల నీవు కూడా పాపరహితుడవయ్యావు. ఇప్పుడు నీవు యశస్సు కోసమై అశ్వమేధయాగం నిర్వహించు'' మని ఆశీర్వదించాడు.

## అనిరుద్ధుని ఆధిపత్యము

ఉగ్రసేనుడు పరమానందభరితుడయ్యాడు. నారదమహర్షి అశ్వమేధ విధిని విశదీకరించాడు. శ్రీకృష్ణుని అశ్వశాలలోని శ్యామకర్ణములు గల ఒక అశ్వమును యజ్ఞాశ్వంగా స్వీకరించారు. అశ్వసంరక్షకునిగా ఉండటానికి ప్రద్యుమ్నతనయుడైన

అనిరుద్ధుడు ముందుకు వచ్చి వీరోచితమైన ప్రతిన చేసి కర్పూర తాంబూలమును స్వీకరించాడు. పిండారక క్షేత్రంలో ఉగ్రసేనుడు రాణి రుచిమతితోపాటు యజ్ఞదీక్షను స్వీకరించాడు. యజ్ఞాశ్వమునకు శ్వేత ఛత్రము పట్టారు. స్వర్ణాలంకారములను తీర్చారు. ఉగ్రసేనుడు ఆ దివ్యాశ్వమును విధి విధానంగా పూజించాడు. శ్రీకృష్ణనందనులు ఆ గుఱ్ఱం ముందు, వెనుక, ప్రక్కల రక్షగా నిలిచారు. ఆ వెనుక మండలేశ్వరులున్నారు. యాదవ పురోహితుడనైన నేను (గర్గమహర్షి) ఆచార్యులను నియమించాను. దానధర్మములు కొనసాగాయి. ఉగ్రసేనుడు యజ్ఞాశ్వమునకు తిలకముపెట్టి నుదుట స్వర్ణపత్రమును కట్టాడు. విప్రుల వేద ఘోష మధ్య ఆ యజ్ఞాశ్వమును విడిచిపెట్టాడు. శ్రీకృష్ణుని ఆశీస్సుల నందుకొని అనిరుద్ధుడు సేనా సమేతుడై బయలుదేరాడు.

మాహిష్మతి, చంపావతి, స్త్రీరాజ్యముల మీదుగా యజ్ఞాశ్వం ప్రయాణిస్తున్నది. ఆరాజ్యములన్నీ అనిరుద్ధుని వశమయినాయి. ఉపలంక, భద్రావతి, దేశాలలో కూడా యాదవవీరులు జయకేతనం ఎగురవేశారు. యాగాశ్వం క్రమంగా క్షిప్రానదిని దాటి అవంతీపురం చేరింది. అవంతీపురాన్ని రాజాధిదేవి కుమారులైన విందానువిందులు పరిపాలిస్తున్నారు. సాందీపని మహర్షి సూచనపై వారు అభిమానంతో శ్రీకృష్ణనందనుల్ని ఆహ్వానించి ఆదరించారు. అనిరుద్ధుడు సాందీపని మహర్షిని చూచి గౌరవంతో ప్రణామం చేసి ఉగ్రసేన మహారాజు ద్వారకలో అశ్వమేధయాగం చేస్తున్న విషయం చెప్పి ఆయనను కూడా వచ్చి యజ్ఞంలో పాల్గొనుమని ఆహ్వానించాడు. సాందీపని ఆమాటను విని ఆవిధంగానైనా శ్రీకృష్ణపరమాత్ముని దర్శనం చేసికొనవచ్చును కదా అని భావించి ద్వారకకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.

## సాందీపని అనిరుద్ధుల సంభాషణ :

అప్పుడు అనిరుద్ధుడు సాందీపనితో "మహాత్మా! నాసందేహం నివృత్తి చేయండి నేను ఆనందంగా ఉండాలి అంటే ఏమి చేయాలి? స్వప్నతుల్యమైన ఈ సాంసారిక సుఖములను త్యాగం చేయటం ఎలా?" అని అడిగాడు. ఈ మాటలను విని పృథుమహారాజు ప్రశ్నలకు సనత్కుమారుడు సమాధానం చెప్పినట్లుగా అనిరుద్ధునితో సాందీపని మహర్షి ఇలా పలికాడు - ప్రభూ! నీవు నారాయణుని నాభికమలం నుంచి ఆవిర్భవించిన బ్రహ్మవు. నీకు నేను సందేహ నివృత్తి చేయటమా? కేవలం నా సమాధానం ద్వారా సామాన్యులకు హితం జరుగుతుందని నన్నడిగావు. విను.

నీరెండు ప్రశ్నలకు సమాధానం ఒక్కటే. అది - శ్రీకృష్ణపరమాత్ముని చరణ సేవ చేయటము ఈ పరమాత్ముని చరణముల శరణు వేడటంవల్లనే కదా ధ్రువునకు ధ్రువపదం ప్రాప్తించిందీ, ప్రహ్లాదుడు, అంబరీషుడు, గయుడు, యదువు కృతార్థులయిందీ. అందువల్ల ఓ మహారాజా! నీవు కూడా ప్రయత్నపూర్వకంగా మనస్సును లగ్నం చేసి శ్రీకృష్ణుని సేవ చెయ్యి. అన్ని ఉపదేశముల సారం ఇదే. మీరంతా శ్రీకృష్ణుని వంశంలో జన్మించిన అదృష్టవంతులు. ఆ బాంధవ్యం వల్ల మీరు పరమాత్మునకు ఇష్టులుగా జీవన్ముక్తులుగా ఉంటారు. మీలో కొందరికి శ్రీకృష్ణుడు పుత్రుడు, కొందరికి సోదరుడు, కొందరికి తండ్రి, కొందరికి మిత్రుడు. అటువంటప్పుడు మీరింక చేయవలసింది ఏమి ఉంటుంది?" అని పలికాడు.

అప్పుడు అనిరుద్ధుడు సాందీపనితో "గురువర్యా! మొదట ఈ జగత్తును రచించిన సనాతన పురుషుడు ఎవరు? పూర్వం ఈ జగమంతా ఎవరి నుంచి ఉత్పన్న మయింది? జగదీశ్వరుడైన శ్రీకృష్ణుడు ఏయే యుగాలలో ఏయే రూపాలలో ధర్మ సంస్థాపన చేశాడు? తెలియజేయండి?" అని అడిగాడు. ఆ ప్రశ్నలను విని సాందీపని మహర్షి అనిరుద్ధునితో "ఎవరివల్ల ఈ జగత్తు సృష్టింపబడుతున్నదో, ఎవరివల్ల స్థితిలో ఉంటున్నదో, ఎవరి యందు లయమవుతున్నదో ఆ పరబ్రహ్మ స్వరూపుడే ఈకృష్ణుడు. ఈ చరాచర జగత్తు బ్రహ్మము కంటె వేరు కాదు. బ్రహ్మము మూల ప్రకృతి. జగత్తు వ్యక్తరూపము. ఆ పరమాత్మ సత్యయుగంలో కపిలమహర్షి గావచ్చి లోకమునకు జ్ఞానమును ప్రసాదించాడు. త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా వచ్చి దుష్టసంహారం చేశాడు. ఆమహాత్ముడే వేదవ్యాసునిగా అవతరించి వేదవిభజన గావించాడు. కలియుగాంతంలో ఆయనే కల్కిగా వచ్చి దుష్టశిక్షణ గావిస్తాడు. వాస్తవంగా ఆయన ఈ జగత్తునకు అతీతుడు. ఆయనే లోకముల కన్నింటికీ ఆత్మస్వరూపుడు. అందువల్ల మనమంతా ఆ కృష్ణపరమాత్ముణ్ణి ధ్యానించాలి" అని పలికాడు.

సాందీపని చెప్పిన మాటలను విని అనిరుద్ధుడు ఆనందించి శ్రీకృష్ణునిస్మరించి జైత్రయాత్రకు ముందుకు సాగాడు. అనిరుద్ధుని మాట ప్రకారం సాందీపని తన కుమారునితో సహా ద్వారకకు వెళ్ళాడు. బలరామకృష్ణులు ఎదురువచ్చి సాందీపనిని ఆదరంగా ఆహ్వానించారు.

## యాగాశ్వము వ్రజమునకు రాక

అనంతరము ఉగ్రసేనుని యాగాశ్వం దేశదేశములను చూచి ముందుకు సాగింది. ఒకనాడు ఆ యాగాశ్వం యమునానదిని దాటి వెళ్ళి బృందావనంలోని ఒక తమాల వృక్ష చ్ఛాయలో నిలబడింది. అక్కడ గోవులను మేపుతున్న గోపాలబాలకులు ఠీవిగా సౌందర్యంతో వెలిగిపోతున్న ఈ యాగాశ్వమును చూచి గోవులను విడిచిపెట్టి దగ్గరకు వచ్చి చూశారు. వారిలో శ్రీదాముడనే గోపకుడు నిదానంగా దగ్గరకు వచ్చి ఆ అశ్వరాజమును పట్టుకున్నాడు. వారంతా ఆ గుఱ్ఱమును నందరాజు దగ్గరకు తీసికొనివెళ్ళారు. నందుడు ఆ అశ్వము నుదుట కట్టబడిన పత్రమును చదివి ఆనందాతిశయంతో గద్గదకంఠంతో "సోదరులారా! ఈ అశ్వము ఉగ్రసేన మహారాజుది. నా మునిమనుమడు అనిరుద్ధుడు దీని రక్షకుడుగా వస్తున్నాడు. దీనిని పట్టి ఉంచితే అనిరుద్ధుడు, నా బంధువులు మిత్రులు ఇటే వస్తారు. కృష్ణుని ఆకృతితో ఉండే అనిరుద్ధుణ్ణి చూచి చాలా కాలమయింది" అంటుయశోదకు చెప్పి నందుడు సపరివారంగా వ్రజం ఊరిబయటకు వెళ్ళాడు.

అదే సమయంలో యాగాశ్వం వెనుక వస్తున్న భోజ, వృష్ణి, అంధక వంశీయులైన యాదవులంతా అక్కడకు చేరుకున్నారు. వారు నేపాల తీర్థం, మిథిలాపురి, అయోధ్య, మాహిష్మతి, మధురలు చూసుకుంటూ యమునానదిని దాటి యాగాశ్వం వెనుకనే నందవ్రజంలోకి ప్రవేశించారు. యాదవ రాజులందరూ నందరాజుకు నమస్కరించారు. ఉద్ధవుడు మున్నగు వారి నేత్రములు బాష్పములతో నిండిపోయాయి. ఆసమయంలో నందుని కుడిభుజం అదిరింది. ఈశుభశకునం వల్ల నాకు శ్రీకృష్ణుని దర్శనమైతే బాగుండునని ఆర్తితో అనుకున్నాడు నందుడు. మంగళ వాద్యములు మ్రోగుతున్నాయి. నందుడు గద్గద కంఠంతో "కృష్ణా! కృష్ణా! ఎక్కడకు వెళ్ళావు. తండ్రీ! ఈ దీనులను చూడటానికి రావా నాయనా!" అని అనుకుంటున్నాడు. అదే సమయంలో అక్కడకు వచ్చిన శ్రీకృష్ణుడు నందుణ్ణి చూచి రథం మీదనుంచి దూకి నందుని పాదములపై పడ్డాడు. నందుని నేత్రములు కన్నీటిధారలను స్రవిస్తున్నాయి. నందుడు కృష్ణుణ్ణి లేవదీసి హృదయానికి హత్తుకున్నాడు. నందుడు ఆనందంతో ఉద్విగ్నుడయ్యాడు. శ్రీకృష్ణుని పరిస్థితి కూడా అదేవిధంగా ఉంది.

తరువాత శ్రీకృష్ణుడు తన చిన్ననాటి మిత్రులనందరినీ ఒక్కొక్కరినీ కలిసికొని

తన ప్రేమామృతమును పంచిపెట్టాడు. అందరి కనులవెంట అశ్రుధారలు స్రవింపసాగాయి. ఎవరికీ నోటమాటలేదు. గోపాలకుల కందరికీ కృష్ణుడు పూర్వం వ్రేపల్లెనుంచి మధుర వెళుతున్నప్పటి కృష్ణుని వలెనే కనిపించాడు. నల్లనివాడు, పద్మనయనముల వాడు, లావణ్యసంపన్నుడు, మురళీధరుడు, పీతాంబరుడు, మకరకుండల శోభితుడు వనమాలాధరుడు అయిన శ్రీకృష్ణుని రూపసుధను వారు పరమానందంగా గ్రోలసాగారు.

నందరాజు పుత్రులతో, పౌత్రులతో వేడుకగా వ్రజంలో ప్రవేశించాడు. ద్వారంలో అశ్రునయనాలతో నిలబడి ఉన్న యశోదను చూచి శ్రీకృష్ణుని నయనములు సజలములయినాయి. తనకు నమస్కరించిన గోపాలుణ్ణి ఆతల్లి అక్కున జేర్చుకొని గద్గద కంఠంతో ఆశీస్సుల నొసగింది. అప్పుడు నందులు, ఉపనందులు, వృషభానులు శ్రీకృష్ణుని దర్శనార్థం అక్కడకు వచ్చారు. ఒకరినొకరు ప్రేమగా ఆప్యాయంగా పలుకరించుకున్నారు. దీక్షాబద్ధుడైన అనిరుద్ధుడు యమునాతీరంలో విడిది ఏర్పాటు చేసుకున్నాడు. సాంబుడు, ఉద్ధవుడు మొదలైన వారు కూడా ఆవిడుదులలోనే ఉన్నారు. కృష్ణపరమాత్ముడు మాత్రం నందుని ఇంటనే నివసించాడు.

వృషభానునందినియైన రాధ కృష్ణ విరహంవల్ల కదళీవనంలో మేఘమందిరంలో ఉంటున్నది. శ్రీకృష్ణుడు వ్రజమునకు వచ్చాడని విని ఆమె కృష్ణునికై వర్తమానం చేసింది. కృష్ణునికి స్వాగత సత్కారాలను ఏర్పాటు చేసింది. కృష్ణ విరహం వల్ల తపింపబడియున్న ఆమె పరమాత్ముణ్ణి అమితమైన భక్తి పారవశ్యంతో ఆహ్వానించింది. రాధ కృష్ణుణ్ణి చూచి "హృషీకేశా! నీవు గోకులం విడిచిపెట్టి మధుర ఎందుకు వెళ్ళావు? నీ వియోగం వల్ల నాకు క్షణమొక యుగంగా గడుస్తున్నది. నీ పదసన్నిధి నాకు ఎందుకు లభించలేదు? నీవు సర్వజ్ఞుడవు. నీకు తెలియనిది లేదు. చెప్పు. నీ వియోగంతో ఇప్పటికి నూరు సంవత్సరాలు గడిచిపోయాయి" అని ఆమె గడిచిపోయిన వియోగమును గుర్తుచేసికొని దు:ఖింపసాగింది.

తన ప్రియతమ రాధ దు:ఖించటం సహింపలేక కరుణాంతరంగుడైన మాధవుడు ఆమెను ఊరడింపసాగాడు - రాధా! నీవు ఇలా బాధపడకూడదు. నీవూ, నేనూ ఒక్కటే అని మహర్షులు చెప్తుంటారు వినలేదా. వాస్తవంగా ఒకరమే రెండు రూపాలుగా కనిపిస్తుంటాము. మనము ప్రకృతి పురుషులము, నేనెక్కడ ఉంటానో అక్కడే నీవూ ఉంటావు. మనకు వియోగమన్నది లేదు. కొద్ది కాలంలోనే నేను నిన్నూ,

గోపకులను అక్షర బ్రహ్మస్థానమైన గోలోకమునకు తీసికొని వెళతాను" అని మాధవుడు పలికిన పలుకులను విని రాధ ప్రసన్నురాలయింది.

## రాసలీల

చిన్నతనంలో హేమంత ఋతువులో కార్తిక పౌర్ణమినాడు గోపాలుడు ఏవిధంగా మురళీగానం చేశాడో, అదేవిధంగా ఈనాడు శ్రీకృష్ణుడు మోహన మురళీగానం ఆలపించాడు. ఆ గానం విని - గోపికల మనస్సులు మరులుగొన్నాయి, సముద్ర ఘోష ఆగిపోయింది, ఆకాశంలో వివిధ చమత్కారములు కనిపింపసాగాయి. సనకాది మునులకు ధ్యానం భంగమయింది. విధాతకు ఆశ్చర్యం కలిగింది. దేవపూజ చేసే బలికి ఏకాగ్రత పోయింది. శేషనాగము చలింపసాగింది. ఆ వంశీధ్వనితో బ్రహ్మాండమంతా సమ్మోహితమయింది. చంద్రుడు వెన్నెలలు కురిపిస్తున్నాడు.

ఆసమయంలో యమున దివ్యశరీరం ధరించి వచ్చింది. బృందావనం, గోవర్ధనం, వ్రజభూమి దివ్యరూపములను ధరించాయి. ఆ వనమంతా వసంత శోభతో విరాజిల్లసాగింది. దివ్యసౌందర్యంతో విలసిల్లుతూ శ్రీకృష్ణపరమాత్ముడు అక్కడకు ప్రవేశించాడు. మందస్మిత వదనార విందుడైన మాధవుని చూచి గోపికలు మైమరచిపోయారు. జాహ్నవి, యమున, మధుమాధవి, శీల, రమ, శశిముఖి, విరజ, సుశీల, చంద్రానన, లలిత, అచల, విశాఖ, మాయా ఇంకా అసంఖ్యాకమైన గోపకాంతలు అక్కడ విహరింపసాగారు. కొందరు కృష్ణరూపం ధరించి నృత్యం చేస్తున్నారు. కొందరు వీణాగానం చేస్తున్నారు. మరికొందరు మృదంగమును మ్రోగిస్తున్నారు. కొందరు మురళిని చేపట్టారు. ఝుంకారయుక్తంగా నూపురముల సవ్వడి వినిపిస్తున్నది.

శ్రీకృష్ణుని వేణుగానం విని రాధ విహ్వలచిత్తయై మాధవునకు మరింత సన్నిహితంగా వచ్చింది. శ్రీకృష్ణునితో నృత్యకేళిలో రాధ బ్రహ్మానందం పొందసాగింది. ఆ సమయంలో వందలాది గోపికా యూథములన్నీ శ్రీకృష్ణుణ్ణి చుట్టుముట్టాయి. మొత్తము ఎందరు గోపికలున్నారో అన్ని రూపాలను ధరించి శ్రీకృష్ణుడు అందరితో రాసనృత్యం చేయసాగాడు. పరమాత్ముడు వారినందరినీ తన హృదయంలో నిలుపుకున్నాడు. గోపికలందరూ భక్తితో గోవిందుణ్ణి తమ వశం చేసుకున్నారు. "వినా సాంఖ్యేన యోగేన, తపసా శ్రవణేనచ వినా తీర్థేన దానేన ప్రాప్త: కామేన తా హరిం" సాంఖ్య, యోగ, తప, శ్రవణ, తీర్థ, దాన క్రియాదులేవీ లేకుండగా కేవలం ప్రేమ భావనతో ఆ గోపికలు శ్రీకృష్ణుణ్ణి పొందగలిగారు!

## గోపికల అహంభావము

అటువంటి గోపికలు ఆనంద పారవశ్యంతో ఇలా పలుకసాగారు - పూర్వము ఈ కృష్ణుడు మనలను విడిచిపెట్టి క్రొత్త క్రొత్త సుందరీమణులను చూడటం కోసం మధురానగరానికి వెళ్ళాడు. అక్కడెవ్వరూ సుందరీమణులు కనిపించకపోయే సరికి ద్వారకానగరానికి వెళ్ళాడు. అక్కడ కూడా ఎవరూ లభించకపోయేసరికి భీష్మకరాజనందనయైన రుక్మిణిని వివాహం చేసుకున్నాడు. కాని ఆమె కూడా సుందరి కాదని తెలిసికొని పదహారువేల వందమంది కన్యలను వివాహమాడాడు. వారు కూడా సుందరాంగులు కారని గ్రహించి మనకోసం బృందావనానికి తిరిగివచ్చాడు. సర్వదర్శనుడైన శ్రీకృష్ణుడు ఇప్పుడు మన రూపసౌందర్యాలను చూచి పూర్వం రాసకేళిలో వలెనే ఎంతో ప్రసన్నుడయ్యాడు. కాబట్టి గోపికలమైన మనమంతా అందరిలోకి సుందరాంగులము. మన నేత్రములు సుందరములు. మన వదనములు చంద్రవదనములు. మనము మన కటాక్షములతో శ్రీకృష్ణుణ్ణి వశం చేసుకున్నాము. కాబట్టి మనము దేవకాంతలను మించిన రూపవతులము. రాజహంసకు ముత్యములు మానస సరోవరంలో తప్ప ఎక్కడా లభింపవు. అదేవిధంగా సుందరీమణులు వ్రజంలో తప్ప ఎక్కడా లేరు - ఈ మాటలు వినగానే సర్వాంతరాత్మయైన శ్రీకృష్ణపరమాత్ముడు రాధతో అంతర్ధానమయ్యాడు. "నిర్ధనోపి ధనం లబ్ధ్వా మానం ప్రకురుతే నృప! యస్య నారాయణః ప్రాప్తో తస్య కిం కథయామ్యహమ్?" ఒక నిర్ధనుడు ధనం సంపాదించి గర్వితుడౌతుంటాడు. అటువంటిది సాక్షాత్తు నారాయణుణ్ణి పొందిన వ్రజబాలల అహంకారమును ఏమనాలి?

శ్రీకృష్ణుడు అదృశ్యమయ్యేసరికి గోపికలందరూ విహ్వలచిత్తలయ్యారు. వారు వనమంతా కలియతిరుగుతూ చెట్లుచేమలను చూచి "ఓ వృక్షములారా! నందనందనుడు మమ్మల్ని తన కటాక్షములతో హతం చేసి ఎక్కడకు వెళ్ళాడు? ఓ వనదేవతలారా! యమునాతటమున గోవులను కాస్తూ నిత్యము నూతనమైన లీలలను చూపే కృష్ణుడు ఎక్కడకు వెళ్ళాడు? ఓ గోవర్ధన గిరిరాజమా! నిన్ను అంగుళిపై పైకెత్తిన మాధవుడు ఎక్కడకు వెళ్ళాడు? ఓ మయూరములారా! ఓ హరిణములారా! ఓ గోవులారా! ఓ విహంగములారా! శ్యామసుందరుణ్ణి మీరు చూశారా? మా చిత్తచోరుడైన శ్రీకృష్ణుడు ఎక్కడ దాగాడో చెప్పండి" అని అడుగసాగారు.

ఈవిధంగా ప్రతివనములోను కృష్ణుణ్ణి గురించి అడిగిఅడిగి, కృష్ణనామ స్మరణ చేసి చేసి వారు కృష్ణమయంఅయ్యారు. కృష్ణ ప్రేమోన్మత్తులై కృష్ణ లీలలను గానం చేయసాగారు. ఆసమయంలో అకస్మాత్తుగా వారు యమునా తీరంలో శ్రీకృష్ణుని చరణ చిహ్నములను చూశారు. వజ్ర, ధ్వజ, అంకుశాది చిహ్నములతో కూడిన శ్రీపద చిహ్నములను బట్టి వారు క్రమంగా ముందుకు వెళ్ళారు. అప్పుడు వారు పరస్పరము "ఓ సఖులారా! మన కృష్ణుడు ఒంటరిగా వెళ్ళలేదు, తన ప్రియతమమైన రాధను కూడా వెంట తీసికొని వెళ్ళాడు" అని అనుకొంటూ తాళవనంలో ప్రవేశించారు. రాధాకృష్ణులు బృందావనం, గోవర్ధనం, యమునాతటం, నందీశ్వర పర్వతం, రోహిణీ పర్వతం, పన్నెండు వనముల పుణ్యప్రదేశములలోను విహరించి మరల బృందావనంలోని వటవృక్షం నీడకు చేరుకున్నారు. అప్పుడు రాధ తాను సర్వోత్తమురాలనని భావించింది. గోపికలందరి కంటె తాను చక్కనిదానినని తలంచింది. అంతలోనే శ్రీకృష్ణుడు అంతర్ధానమయ్యాడు. రాధకు అభిమానం దెబ్బతిన్నది. అహంకారం పటాపంచలయింది. ఆమె విరహార్తయై విలపించసాగింది. రాధాదేవి విలాపమును విని గోపికలందరూ వటవృక్షం దగ్గరకు వచ్చారు. యమునా జలములతో ఆమెకు సేదదీర్చి చందన చర్చ గావించారు. కృష్ణుడు అప్పుడే అంతర్ధానమైన విషయం విని గోపికలంతా ఆశ్చర్యపడ్డారు. గోపికలందరూ అహంకారం విడిచిపెట్టి యమునా తీరానికి వెళ్లి ఆ పరమాత్ముణ్ణి ప్రసన్నం చేసికొనటం కోసం స్వామి గుణకీర్తన చేయటం ఆరంభించారు.

## రాసక్రీడా సంపూర్తి

గోపికలందరూ తదేక ధ్యానతో, భక్తి పారవశ్యంతో ప్రార్థించేటప్పటికి శ్రీకృష్ణపరమాత్ముడు వారి భక్తి చేత విశేషంగా ఆకర్షింపబడి వచ్చి వారి మధ్య నిలిచాడు. శ్రీకృష్ణుని మధుర మనోహరమైన వేణుగీతం విని రాధ మెల్లగా కనులు తెరచింది. అప్పుడు చంద్రానన రాధ చెంతకు వచ్చి కృష్ణపరమాత్ముడు కరుణాంతరంగుడై మరల విచ్చేసిన విషయం వివరించింది. రాధ ఆనందంతో శ్రీకృష్ణుని చేరింది.

రాధా మాధవులు ఆవనంలో విహరింపసాగారు. గోపికలందరూ శ్రీకృష్ణుని చుట్టుముట్టటం మెరుపుతీగలు మేఘాన్ని చుట్టుముట్టినట్లుగా ఉంది. అప్పుడు శ్రీకృష్ణుడు ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క మాధవునిగా రూపుదాల్చి విహరించాడు. యమునాతటంలో

శ్రీకృష్ణుడు ఆసీనుడు కావటం కోసం గోపికలు తమ వస్త్రములతో ఆసనం తయారుచేశారు. గోపికల భక్తి తత్పరతను చూచి ప్రసన్నుడై మాధవుడు రాధాదేవితో సహా వచ్చి అక్కడ ఆసీనుడయ్యాడు. అప్పుడు భగవానుడు గోలోకములోని తన అద్భుతమైన రూపమును వారికి చూపించాడు. ఆదివ్యదర్శనమును పొంది గోపికలందరూ బ్రహ్మానందము ననుభవించారు. ఆసమయంలో వారు తమ్ము తాము మరచిపోయారు. వారంతా ఆ పరమాత్ముని ఎదుట ఆనంద నృత్యం చేయటం ఆరంభించారు. కృష్ణపరమాత్ముడు కూడా వారి మధ్యకు వెళ్ళి మురళీగానం చేస్తూ నృత్యం చేయటం చూచి ముల్లోకములు మోహితములయ్యాయి. వివిధ వాద్యములు, కింకిణీ, కంకణ, నూపురముల నినాదములతో రాసమండలం తన్మయమై భాసించింది. హేమంత ఋతువులోని ఆ దీర్ఘరాత్రి రాసవిలాసములోని ఆనందం వల్ల క్షణం వలె గడిచిపోయింది. శ్రీకృష్ణుడు నందగృహం చేరాడు. రాధ వృషభాను గృహం చేరింది. గోపికలు తమ తమ ఇళ్ళకు చేరుకున్నారు. వ్రజంలో ఉన్న గోపకులకు ఈ రాసలీల వార్త కూడా తెలియలేదు. కారణం ఆ గోపాలకులకు తమ తమ గోపకాంతలు ఇంట్లో తమ దగ్గరనే ఉన్నట్లు అనిపించిది!

## వ్రజం నుంచి ప్రయాణం

ఈవిధంగా శ్రీకృష్ణుడు ఆనందామృతం పంచిపెడుతూ ఎనిమిది రోజులు బృందావనంలో గడిపాడు. ఇక ప్రయాణానికి సిద్ధపడుతున్న కుమారుణ్ణి చూచి యశోద దు:ఖింపసాగింది. గోపికలు విలపింపసాగారు. రాధ ఆవేదనకు అంతులేదు. శ్రీకృష్ణుడు ప్రతి ఒక్కరికి ఒక్కొక్క కృష్ణుడుగా కన్పించి వారిని సాంత్వనపరచాడు.

వాత్సల్యమూర్తియైన యశోదను చూచి కృష్ణుడు "అమ్మా! నీవు దు:ఖింపకు. యజ్ఞం పూర్తి కాగానే నేను వెంటనే ఇక్కడకు వస్తాను. అలా నీవు సమ్మతింపని పక్షంలో ధైర్యంగా ఉండటానికి పుత్రరూపంలో ఇక్కడనే ఉంటానని ఊరడించి రథం అధిరోహించి సేన సాగటానికి అనుజ్ఞనిచ్చాడు. అనిరుద్ధాది యాదవ వీరులు వచ్చి బాష్పనేత్రాలతో నందునకు నమస్కరించి అశ్వముల నధిరోహించారు.

శ్రీకృష్ణుడు నందాదులను చూచి "రేపు చైత్రమాసంలో ద్వారకలో జరగబోయే యజ్ఞానికి మిమ్మల్ని అందరినీ పిలిపిస్తాను. ఓ గోపకులారా! మీరు నిత్యము గోకులంలో నేను గోపాలునిగా సంచరిస్తూ ఉండటం స్మరిస్తూ ఈ వ్రజంలో

'ఆనందంగా ఉండండి" అంటూ నిదానంగా ముందుకు ప్రయాణమయ్యాడు. నందాది గోపకులు కూడా శ్రీకృష్ణచరణాయత్తమైన చిత్తములను మరల్చుకొనలేక కష్టంపై గోకులంలో ప్రవేశించారు. ఇప్పుడు వ్రజంలోని గోపకులు గోపికలు తమ మనస్సులనిండా ప్రేమనింపుకొని ఉన్న కారణంగా యోగులకు కూడా దుర్లభుడైన శ్రీకృష్ణుడు సదా తమ సమీపంలోనే కనిపింపసాగాడు!

యజ్ఞాశ్వం యమునా నదిని దాటి అనేక దేశాల మీదుగా హస్తినాపురం చేరుకున్నది. అక్కడ విచిత్రవీర్యతనయుడైన ధృతరాష్ట్రుడు రాజ్యం చేస్తున్నాడు. ఆతని కుమారుడైన దుర్యోధనుడు ఈ దివ్యాశ్వమును పట్టుకొని, ముఖఫలకంపై నున్న విషయమును చదివి యాదవులపై ఆగ్రహించి సమరసన్నాహాలు ఆరంభించాడు. శ్రీకృష్ణుడు సాంబుణ్ణి ముందు వెళ్లమని సూచించగా సాంబుడు సాత్యకి అక్రూరులతో ముందు వెళ్ళి కౌరవులు యుద్ధ సన్నద్ధులై యుండటం చూచి తాను కూడా యాదవసేనను సమరానికి సమాయత్తం చేశాడు. ఇరుపక్షములవారికి పోరు తీవ్రంగా జరిగింది. కౌరవ యాదవ సంగ్రామ వృత్తాంతములను విని ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి ఆలోచన అడిగాడు. అప్పుడు విదురుడు "మహారాజా! పూర్వం బలరాముడు ఆగ్రహించి హస్తినాపురమును పెకలించి గంగలో కలపటానికి సిద్ధమయ్యాడు. ఇప్పుడు ఆబలరాముని సోదరుడు శ్రీకృష్ణుడు వచ్చాడు. ఈయన సాక్షాత్తు పరమేశ్వరుడు. ఈయనతో పోరు సలపటం మనకు క్షేమం కాదు. వారి యాగాశ్వం వారికిచ్చి సత్కరించి పంపటం మంచిది" అని హితవు పలికాడు. ధృతరాష్ట్రుడు తన వారిని పిలిచి శ్రీకృష్ణుణ్ణి ఆదరించి, యాగాశ్వమునిచ్చి పంపవలసినదిగా ఆజ్ఞాపించాడు. శ్రీకృష్ణుడు వారి ప్రవర్తనకు మెచ్చుకొని యాగాశ్వంతో యాదవులతో ముందుకు వెళ్ళాడు.

అనంతరం శ్రీకృష్ణుడు ద్వారకకు పయనమయ్యాడు. యాగాశ్వం ద్వైతవనంలో ప్రవేశించింది. అక్కడ పాండవులు అరణ్యావాసం చేస్తున్నారు. భీమసేనుడీ అశ్వం చూచి పట్టుకున్నాడు. తరువాత యాదవవీరులు భీమసేనుని, యుధిష్ఠిరుని గుర్తించి సంతసించారు. ధర్మరాజు ఆనాడు వారి కందరికీ సూర్యదత్తమైన పాత్రనుంచి అక్షయపదార్థములతో భోజనం సమకూర్చాడు. మరునాడు యాదవేశ్వరుల నందరినీ సాగనంపుతూ భీమసేనుడు సరస్వతీ నదీతీరం వరకు వచ్చాడు. తరువాత యజ్ఞాశ్వం కుంతలదేశం చేరింది. కుంతలాధిపతి చంద్రహాసుడు కృష్ణభక్తుడు. యజ్ఞాశ్వముఖ

ఫలకము పైనున్న విషయం చదివి ఆతడు కృష్ణకుమారులను సందర్శించటానికై పూజాసామగ్రిని చేతపూని ఎదురు చూడసాగాడు. మంత్రియైన ఉద్ధవుని వల్ల ఈ రాజు వృత్తాంతమంతా విని అనిరుద్ధుడాతని యెడల ప్రసన్నుడై ఆరోజు సేనాసమేతంగా ఆతిథ్యం స్వీకరించి మరునాడు చంద్రహాసుని కూడా ద్వారకకు తమతో తీసికొని బయలుదేరాడు. మార్గమధ్యంలో సప్తవతీ నదిని దాటి యజ్ఞాశ్వం నారాయణ సరోవరం చేరింది.

అప్పుడు ఫాల్గుణ మాసంవచ్చింది. చైత్రమాసంలో ఉగ్రసేనుడు అశ్వమేధ యజ్ఞం చేయవలసిఉంది. ఆవిషయం మనసులో పెట్టుకొని అనిరుద్ధుడు ఉద్ధవునితో "మహామంత్రీ! మనం ఇంకా ఎవరెవరిని జయింపవలసి ఉన్నదీ తెలియజేస్తే అటువైపు ప్రయాణమై వెళదాము" అన్నాడు. ఉద్ధవుడా మాటవిని ఇంకా మన చేత జయింప బడవలసిన రాజులు లేరు. మనము ద్వారకకు వెళదాము" అన్నాడు. అనిరుద్ధుడు "ఓ అశ్వరాజమా! ద్వారకవైపు నీ గమనం కొనసాగించు" అని చెప్పాడు. వివేకంగల ఆ యాగాశ్వం ద్వారకవైపు ప్రయాణం కొనసాగించింది.

ఆ సమయంలో కలహప్రియుడైన నారదమహర్షి వెళ్ళి ఇంద్రునితో ఈ యాగాశ్వమును హరించుమని చెప్పాడు. ఇంద్రుడందుకై భువికి దిగి వచ్చాడు. కాని శ్రీకృష్ణుని మాయ వల్ల మోహితుడై భూమిమీద ప్రళయకాలసముద్రము పొంగి వస్తున్నట్లుగా యాదవసేన వస్తూ ఉండటం చూచి ఇంద్రుడు భయపడి ఇంద్రలోకం వెళ్ళిపోయాడు. ద్వారకానగర సమీపం చేరటంతోటే ఉద్ధవుణ్ణి పల్లకీలో ముందు పంపించారు.

ఆ సమయంలో ద్వారకలోని పిండారక క్షేత్రంలో ఉగ్రసేన మహారాజు ముని మండలి మధ్య ఆసీనుడై యున్నాడు. వసుదేవుడు, బలరాముడు, కృష్ణుడు, అనిరుద్ధాదుల చేత యజ్ఞం రక్షింపబడుతున్నది. అప్పుడు ఉద్ధవుడు వచ్చి సభాసదనంలో ఉగ్రసేనునితో శ్రీకృష్ణపరమాత్ముని అనుగ్రహం వల్ల అనిరుద్ధుడు భూమండలంలోని రాజుల నందరినీ ఏవిధంగా జయించినదీ వివరించి, యాగాశ్వసహితుడై అనిరుద్ధాది వీరులు వస్తున్న వార్తను తెలియజేశాడు.

ఉగ్రసేనుని అనుజ్ఞతో యాదవులందరూ వేడుకగా అనిరుద్ధుణ్ణి ఆహ్వానించటానికి ఊరి పొలిమేరలలోకి వెళ్ళారు. మంగళ వాద్యఘోష మిన్నుముట్టింది. రుక్మిణి

సత్యభామ మున్నగువారు పల్లకీలలో బయలుదేరారు. విప్రకాంతలు గంధపుష్పాక్షతలు పూని నిలిచారు. శంఖ, దుందుభుల నినాదములు వేదఘోషతో మేళవింపగా ఒక గజరాజును ముందుంచుకొని నేను (గర్గమహర్షి) ఎదురువెళ్ళాను. అనిరుద్ధునితో పాటు వచ్చిన రాజన్యులందరూ బలరామకృష్ణులకు అభివాదములు గావించారు. అనిరుద్ధుణ్ణి ఏనుగుపై కూర్చొనబెట్టి వేడుకగా నగరంలోనికి తీసికొనివచ్చారు. అందరూ ద్వారకానగర శోభను తిలకిస్తూ పిండారక తీర్థం చేరుకున్నారు. అక్కడ యజ్ఞదీక్షలో ఉన్న ఉగ్రసేనుణ్ణి చూచి అందరూ ప్రణామం చేశారు. అనిరుద్ధునితో పాటు వచ్చిన ఇంద్రనీలుడు, హేమాంగదుడు, బిందుడు, చంద్రహాసుడు, భీష్ముడు ఉగ్రసేనునకు అభివాదములొనర్చారు. ఉగ్రసేనుడు ఆవీరుల్ని యథోచితంగా ఆదరించాడు. భీష్ముణ్ణి దగ్గరకు తీసికొని ఆలింగనం చేసుకున్నాడు. దేవకి, రోహిణి, రుక్మిణి, రుక్మవతి మొదలైన స్త్రీలు అనురుద్ధుణ్ణి అక్కున జేర్చుకున్నారు. సురూప, రోచన, ఉష మొదలైన వారు చాలా సంతోషించారు. దుర్యోధనుని కుమార్తెయైన లక్షణ సాంబుని గూర్చిన ప్రశంస విని ప్రమోదం పొందింది. అనిరుద్ధుని రాకవల్ల ద్వారకానగరం లోని ప్రతి ఇంటా ఆనందం పొంగిపొరలింది.

అశ్వమేధ యజ్ఞానికి రమ్మని శ్రీకృష్ణుడు వర్తమానం చేయటం వల్ల నందాదులు, వృషభాను, శ్రీదామాదులైన గోపకులంతా విచ్చేశారు. యశోద, రాధ, వ్రజబాలలు పల్లకీలపై, రథములపై ద్వారకకు చేరుకున్నారు. దేవతలు, గంధర్వులు, అప్సరలు శ్రీకృష్ణ దర్శనలాలసలై ద్వారకకు వచ్చారు. పృథివి గోరూపం ధరించి గోవులతో విచ్చేసింది. హిమవంతుడు, వటవృక్షం, సముద్రుడు, గంగానది, ప్రయాగ, పుష్కరతీర్థములు యజ్ఞోత్సవం చూడటానికి వచ్చినాయి. శ్రీకృష్ణుని పిలుపుపై వ్రజమండలం కూడా వచ్చింది. ఆ యజ్ఞశాలలో శ్రీకృష్ణుని సంకల్పం వల్ల అనిరుద్ధుడు మూడు రూపములతో చంద్రుడుగా, బ్రహ్మగా, అనిరుద్ధుడుగా కనిపింపసాగాడు. ఈదృశ్యం చూచి దేవతలు, యాదవులు, రాజన్యులు ఆశ్చర్యపడ్డారు.

## కృష్ణలీల

వ్యాసమహర్షి, ఉగ్రసేన మహారాజు అచట ఆసీనులైన యాదవరాజులను, విప్రవర్యులను చూచి "మీలో డెబ్బైనాలుగు మంది దంపతులు గోమతీనదికి వెళ్ళి ఆ పుణ్యాజలములను తీసికొనిరండి. అదితి కశ్యపులు, అరుంధతీ వసిష్ఠులు, కృపీ

ద్రోణాచార్యులు, అనసూయా అత్రిమహర్షులు, రుక్మిణీకృష్ణులు, రేవతీ బలరాములతో కలిసి మిగిలిన దంపతులు వెళ్ళిరండి" అని పలికారు. ఆమాటలనువిని యాదవదంపతులు, విప్రదంపతులు కలశములను చేతపట్టి గోమతీనదికి బయులుదేరారు. అందరికన్నముందుగా రుక్మిణీకృష్ణులు వెళ్ళటం చూచిన కలహప్రియుడైన నారదమహర్షికి ఒక ఉపాయం తోచింది. వెంటనే నారదమహర్షి సత్యభామ మందిరమునకు వెళ్ళాడు. ఆసమయంలో ఆమె ఒంటరిగా ఉన్నది. ఆమె నారదమహర్షిని ఆహ్వానించి ఆయన వచ్చిన కారణమును అడిగింది. అప్పుడు నారదుడు సత్యభామతో "శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితో గోమతీనదీ జలములను తీసికొని రావటానికి వెళ్ళాడు. శ్రీకృష్ణునితో వెళ్ళవలసినదినీవు గదా. నీకెంత అనాదరం కలిగింది! స్వర్గం నుంచి పారిజాతము నీవల్లనే కదా వచ్చింది! స్యమంతకమణి తెచ్చింది నీవుకదా! నిన్ను గాక శ్రీకృష్ణుడు రుక్మిణిని తనతో తీసికొని వెళ్లటమా!" అన్నాడు. ఈమాటలను విని సత్యభామ కుపితురాలై దు:ఖింపసాగింది.

ఆసమయంలో శ్రీకృష్ణునకు నారదుని ఉపాయం అర్థమయింది. వెంటనే పరమాత్ముడు రెండు రూపాలను ధరించాడు. ఒకరూపం రుక్మిణితో వెళ్ళింది. ఒక రూపం సత్యభామ దగ్గరకు వచ్చింది. కృష్ణుడు వస్తూనే "నేను గోమతికి వెళ్ళటం మానుకున్నాను. బలరాముడు భార్యతో వెళ్ళాడు. నాకు ఆకలిగా ఉన్నదని నీదగ్గరకు వచ్చాను" అన్నాడు. వెంటనే నారదుడు అక్కడ నుంచి బయటపడి జాంబవతి మందిరమునకు వెళ్ళి ఇలాగే చెప్పాడు. ఆమె ఒకటే నవ్వుతూ "ఓ మునివరా! అబద్ధాలు ఎందుకు చెప్తారు. ఆయన ఇప్పుడే భోజనం చేసి లోపల పవ్వళించారు" అని పలికింది. నారదునకు అర్థంకాక బయటకు వచ్చి మిత్రవింద దగ్గరకు వెళ్ళి కూడా ఇలాగే పలికాడు. ఆమె "మహాత్మా! కృష్ణపరమాత్మునకు మేమంతా సమానమే. ఆయన విడిచిపెట్టి వెళితే ఎవరూ బ్రతికిఉండరు. శ్రీకృష్ణుడు నాఇంట్లోనే కూర్చొని మనుమలతో ఆడుకుంటున్నారు" అన్నది. నారదుడు ఆవిధంగా ఏ పట్టమహిషి ఇంటికి వెళ్ళినా కృష్ణుడు తమతోనే ఉంటున్నాడని ఎవరికివారు పలుకసాగారు.

అప్పుడు నారదుడు మెల్లగా రాధ నివాసానికి వెళ్ళాడు. తీరా చూస్తే అక్కడ కృష్ణపరమాత్ముడు రాధతో, గోపికలతో చదరంగమాడుతున్నాడు. ఇక నారదుడు అక్కడ నుంచి బయలుదేరబోతుంటే కృష్ణుడు నారదుణ్ణి కూర్చొనబెట్టి

"మహర్షీ ! మరల ఎక్కడకు బయలుదేరుతున్నారు. మోహవశులై వ్యర్థంగా ఎందుకు తిరుగుతారు? నేను ప్రతి సతి ఇంట్లోను మిమ్మల్ని చూశాను. మీ భయంతోనే నేను అనేక రూపాలను ధరించవలసివచ్చింది" అని వచించాడు. అప్పుడు నారదమహర్షి నిశ్శబ్దంగా వెళ్ళి యజ్ఞశాలలో ఆసీనుడయ్యాడు.

అక్కడ శ్రీకృష్ణుడు, యాదవశ్రేష్ఠులు, విప్రవర్యులు సతీసమేతంగా గోమతీనదీ దగ్గరకు చేరుకున్నారు. ఆ పుణ్యస్త్రీలు విధి పూర్వకంగా గోమతీనది నీటితో బిందెలను నింపారు. కాని సుకుమారులు కావటం వల్ల వారు ఆ బిందెలను పైకి ఎత్తలేక పోయారు. అప్పుడు వారంతా శ్రీకృష్ణుణ్ణి హృదయపూర్వకంగా స్మరించేసరికి ఆ బిందెలు తేలికగా అనిపించాయి. వారందరూ జలపాత్రలు ధరించి తమ పతులతో యజ్ఞమంటపానికి తిరిగి వచ్చారు.

ఉగ్రసేనుడు వచ్చిన బంధుజనులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క పని పురమాయిస్తూ శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చాడు. అప్పుడు కృష్ణుడు ఉగ్రసేనునితో "ఇంద్రప్రస్థంలో నేను బ్రాహ్మణుల కాళ్ళు కడిగాను. ఇక్కడ కూడా అదే పని చేస్తాను" అని సాక్షాత్తు పరమాత్ముడు తపస్వులకు, మునులకు కాళ్ళు కడిగి, నూతన వస్త్రములను, చందనాది వస్తువులను సమర్పించాడు.

శ్రీకృష్ణుని అనుగ్రహం వల్ల అశ్వమేధయాగం ఎటువంటి ఆక్షేపణ లేకుండగా పరిసమాప్తమయింది. ఉగ్రసేన మహారాజు యజ్ఞమునకు వచ్చిన ఆబాలగోపాలమునకు విరివిగా దానధర్మాలు చేశాడు. అప్పుడు శ్రీకృష్ణపరమాత్ముడు ఉగ్రసేనునితో "మహారాజా! అందరకూ అన్నీ ఇచ్చావు. నాకేమీ ఇవ్వలేదేమిటి?" అని అన్నాడు. అప్పుడు ఉగ్రసేనుడు "జగదీశ్వరా! నేను చేసిన రాజసూయ, అశ్వమేధ యజ్ఞముల పుణ్యం నీకు సమర్పిస్తున్నాను" అని హృదయపూర్వకంగా ప్రేమ విహ్వలుడై పలికాడు. దేవతలు వారిపై పూలవాన కురిపించారు.

## ఉగ్రసేనునకు కంసాది పుత్రులను చూపుట :

ఒకరోజున శ్రీకృష్ణపరమాత్ముడు సుధర్మ పీఠంపై కూర్చొని ఉన్నప్పుడు ఉగ్రసేనుని కంసాది మృతపుత్రులను పిలిపించాడు. వారు వైకుంఠలోకం నుంచి వచ్చి అక్కడ నిలిచారు. ఉగ్రసేనుడు రాణి రుచిమతితో పాటు తన తొమ్మిది మంది కుమారులను తనివితీర చూశాడు. వారందరూ చతుర్భుజ రూపులై కృష్ణుని

ఆకారంతో విలసిల్లుతున్నారు. వారిని చూచి శ్రీకృష్ణుడు "మిమ్మల్ని చూడటానికి మీ తల్లిదండ్రులు ఉత్కంఠతో ఉన్నారు. వారి దగ్గరకు వెళ్ళండి" అన్నాడు. అప్పుడు కంసుడు, న్యగ్రోధుడు మున్నగువారు "ఓ పరమాత్మా! నీమాయలోపడి పరిభ్రమిస్తూ ఇప్పటివరకు ఎందరినో తల్లిదండ్రులను చూశాము. వాస్తవంగా శ్రీహరి ఒక్కడే జీవకోటి కంతటికి మూల కారణుడు. అందువల్ల నీవు తప్ప మిగిలిన వారెవ్వరూ మాకు తెలియదు. నిన్ను, బలరాముణ్ణి పూర్వం చూశాము. మేము వైకుంఠం వెళ్ళిన తరువాత ప్రద్యుమ్న అనిరుద్ధులు జన్మించారు. వారిని మేము చూడలేదు. నీ చతుర్వ్యూహ రూపం చూడటం కోసమే మేము ఇప్పుడు వచ్చాము. శ్రీకృష్ణ, బలరామ, ప్రద్యుమ్న, అనిరుద్ధులారా! మూఢులమైన మా అపరాధములను క్షమించండి" అని వారికి ప్రణామములు చేసి అందరూ చూస్తుండగానే వారు వైకుంఠమునకు వెళ్ళారు. ఈదృశ్యం చూచి రుచిమతీ ఉగ్రసేనులు చాలా ఆశ్చర్యపడ్డారు. తరువాత ఉగ్రసేనుడు పుత్రవాంఛను వదిలి శ్రీకృష్ణుని దయవల్ల సమస్త విశ్వము మనోమయము అని గ్రహించాడు.

## కృష్ణ సహస్రనామములు

ఒకరోజున ఉగ్రసేనుడు వ్యాసమహర్షితో "మహాత్మా! ఐహిక సుఖములను పరిత్యజించి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీకృష్ణపరమాత్మున్ణి ఏవిధంగా భజించాలి?' ' అని అడిగాడు. అందుకు వ్యాసమహర్షి "మహారాజా! నీవు నిత్యము రాధాకృష్ణుల సహస్రనామములను ఏకాగ్రచిత్తంతో పఠించు. అదే సరియైన మార్గము" అన్నాడు. ఆమాటకు ఉగ్రసేనుడు "కురుక్షేత్రంలో ఒక శిబిరంలో ఒకనాడు నారదమహర్షి చెప్పగా రాధా సహస్రనామములు విన్నాను. కాని ఇప్పటి వరకు కృష్ణ సహస్రనామములు విననేలేదు" అని అనగా వ్యాసమహర్షి ఉగ్రసేనునితో "మహారాజా! కృష్ణసహస్రనామములను కృష్ణపరమాత్ముడే స్వయంగా రాధకు చెప్పాడు. శ్రీకృష్ణుడు రాధతో - రాధా! ఈ సహస్రనామములు రహస్యమైనవి. ఇవి మోక్షదాయకములు, కల్యాణ కారకములు, పురుషార్థ ప్రదాయకములు. ఇవి సాక్షాత్తు నా స్వరూపము. వీటిని పఠించిన వారు నా రూపమును పొందగలరు. అందువల్ల వీటిని ఉత్తములకు మాత్రమే తెలియపరచాలి.

కృష్ణసహస్రనామములను ఆరంభించే ముందు చేతిలోకి నీటిని తీసికొని

"ఓం శ్రీకృష్ణ సహస్రనామ స్తోత్ర మంత్రములకు నారాయణుడు ఋషి, ఛందము భుజంగప్రయాతము, దేవత శ్రీకృష్ణుడు, వాసుదేవుడు బీజము, రాధ శక్తి, మన్మథుడు కీలకము, శ్రీ పూర్ణ పరబ్రహ్మ శ్రీకృష్ణ పరమాత్మని భక్తితో జన్మము సఫలం చేసికొనటం కోసం ఈ జపము వినియోగమగుగాక!" అని పలికి నీటిని ఒక పాత్రలో విడిచిపెట్టాలి.

## ధ్యానం

శిఖిముకుట విశేషం నీల పద్మాంగ దేశం విధుముఖకృత కేశం కౌస్తుభాపీత వేశమ్
మధుర రవ కలేశం శం భజే భ్రాతృశేషం వ్రజజన వనితేశం మాధవం రాధికేశం!

హరి ర్దేవకీనందన: కంసహంతా పరాత్మాచ పీతాంబర: పూర్ణదేవ:
రమేశస్తు కృష్ణ: పరేశ: పురాణ: సురేశోఽచ్యుతో వాసుదేవశ్చ దేవ:

ధరాభారహర్తా కృతీ రాధికేశ: పరో భూవరో దివ్యగోలోకనాథ:
సుదామ్నస్తథా రాధికాశాపహేతుర్ఘృణీ మానినీమానదో దివ్యలోక:

లసద్గోపవేషో హ్యజో రాధికాత్మా చలత్కుండల: కుంతలీ కుంతలస్రక్
రథస్థ: కదా రాధయా దివ్యరత్న: సుధాసౌధ భూచారణో దివ్యవాసా:

కదా బృందకారణ్యచారీ స్వలోకే మహారత్నసింహాసనస్థ: ప్రశాంత:
మహా హంసభై శ్చామరై ర్వీజ్యమాన శ్చలచ్ఛత్రముక్తావలీ శోభమాన:

సుఖీ కోటికందర్పలీలాభిరామ: క్వణన్నూపురాలంకృతాంఘ్రి: శుభాంఘ్రి:
సుజానుశ్చ రంభాశుభోరుః కృశాంగ: ప్రతాపీ భుశుండా సుదోర్దండ ఖండ:

జపాపుష్పహస్తశ్చ శాతోదరశ్రీ ర్మహాపద్మ వక్షస్థల శ్చంద్రహాస:
లసత్ కుందదంతశ్చ బింబాధరశ్రీ: శరత్పద్మనేత్ర: కిరీటోజ్జ్వలాభ:

సఖీకోటిభిర్వర్తమానో నికుంజే ప్రియారాధయా రాససక్తో నవాంగ:
ధరాబ్రహ్మరుద్రాదిభి: ప్రార్థిత: సద్ధరాభార దూరీకృతేర్థం ప్రజాత:

